# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 15 సంచిక : 8 హైదరాబాద్ 193 ఆగస్టు 2017 పేజీలు : 68 రు. 20

* ఇసుక మాఫియా కోసం ప్రజలపై దాడులు
* తెలంగాణలో భూకుంభకోణాలు
* గాడితప్పిన చంద్రబాబు పాలన
* కార్పొరేట్‌ల సేవలో విశాఖ భూకబ్జాలు
* గిట్టుబాటు ధరల కోసం రైతు ఉద్యమాలు
* బూటకపు స్వాతంత్ర్యానికి 70 ఏళ్లు
* ఖతార్ దిగ్బంధం - గల్ఫ్ సంక్షోభం

# వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం

## జూలై 9, 2017 ఆదివారం, మహబూబ్‌నగర్


















193

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఆగస్టు 2017
సంపుటి : 15
సంచిక : 08

ఎడిటోరియల్ కలెక్టివ్ : **బి.ఎస్. రాజు, ఎ. నర్సింహారెడ్డి, బి. రామకృష్ణ, వై. భాస్కర్, కె. బాల్‌రెడ్డి, ఎ. రాజేంద్రబాబు, బైరెడ్డి సతీష్, డా. ఎ. పున్నయ్య, వై. రామచంద్రం, ఎన్. వేణుగోపాల్**

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | సహాయ సంపాదకులు: | కంపోజింగ్: | సర్క్యులేషన్ మేనేజర్: |
|---|---|---|---|---|
| **వి. హనుమంతరావు** (1925-2016) | **ఎన్. వేణుగోపాల్** | **వై. రామచంద్రం** | **సి. రాజశేఖర్** | **ఎస్. వెంకటేష్** |



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
**VEEKSHANAM**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2017 జూన్ నెలలో వచ్చిన విరాళాలు - విత్తనాల లక్ష్మణరావు, గోపాలరావుపేట, తూర్పుగోదావరి - రు. 1,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

జూలై సంచికలో 'రాష్ట్రపతి ఎన్నికల అవకాశవాద రాజకీయాలు' అన్న సంపాదకీయం ఆలోచనాత్మకంగా ఉండి అమూలాగ్రం చదివింపజేసింది. కార్పొరేట్ల కోసమే 'ఒక దేశం – ఒకే పన్ను' వ్యాసం వాస్తవికతకు అద్దం పట్టింది. పశువధ చట్టం అమలు సాధ్యమవుతుందా? ముసలి పశువులను ఏం చేయాలి? చట్టంలో ఏముంది? విషయాలు 'పశువధ నిషేధ చట్టం పూర్వాపరాలు'లో తెలుసుకున్నాము. 'పరువు కోసం హత్యలు' చదువుతుంటే దేశం ఎటు వెళ్తుందో అర్థం కావట్లేదు. కులాంతరాలను నిర్మూలించినప్పుడే పరువు హత్యలు ఆగుతాయి.

**– బిక్కునూరు రాజేశ్వర్**
పొన్కల్, నిర్మల్

అంబేద్కర్ విగ్రహాన్ని చూసి భయపడుతున్నారు. అంబేద్కర్ ఓ అగ్నిప్రవాహం. పీడిత జన భాంధవుడు. మానవీయ దార్శనికుడు. మానవ హక్కుల ప్రేమికుడు. అతని చూపుడు వేలు అసమ సమాజంపై ఎక్కు పెట్టిన బాణం. అతని చేతిలోని పుస్తకం అనగారిన ప్రజల కోసం లిఖించబడిన విజ్ఞాన దర్శిని. అందుకే పశ్చిమ గోదావరి జిల్లా పాలకోడేరు మండలం గరగపర్రు గ్రామ అగ్ర కులస్తులు భయపడుతున్నారు. గ్రామంలోని 3 వేల ఎకరాల వ్యవసాయ భూములలో 2,500 ఎకరాలు క్షత్రియులవే. గ్రామ జనాభా సుమారు 6,500 మంది. 400 దళిత కుటుంబాలలో 20 మందికి మాత్రమే భూములున్నాయి. 60 కుటుంబాలకు కౌలు భూమి ఆధారం. మిగిలిన వారు వ్యవసాయ కూలీలు. దళిత స్త్రీలు ఎక్కువ మంది అరబ్ దేశాలకు వలస వెళ్లారు. చదువుకున్న వారు చాలా తక్కువ. గత రెండు నెలలుగా సాంఘిక బహిష్కరణ జరిగినా వెలుగు చూడలేదు. జిల్లా కలెక్టర్, అధికారులు వాస్తవాన్ని వక్రీకరించారు. భీమవరం – తాడేపల్లిగూడెం రహదారి మీద ఉన్న గరగపర్రు గ్రామం సాంఘిక బహిష్కరణ వలన వెలుగు చూసింది. నేటికి సాంఘిక బహిష్కరణ పాక్షికంగా కొనసాగుతున్నది. దళితుల జీవనోపాధికి కుటుంబానికి మూడు ఎకరాల చొప్పున భూమి కేటాయించాలి. ఉపాధి హామీ పథకం కింద పని కల్పించాలి. వారిది జీవించే హక్కు కోసం, ఆత్మగౌరవం పోరాటం.

**– టి. శ్రీరామమూర్తి**
విశాఖపట్నం

వీక్షణం జూలై సంచికలో ఎన్. వేణుగోపాల్ రాసిన 'కార్పొరేట్ల కోసమే ఒకే దేశం ఒకే పన్ను' వ్యాసం వస్తు సేవల పన్ను(జిఎస్‌టి) సమగ్రమైన పన్ను విధానం కాదని తెలిపారు. పెట్రోలియం, ఆల్కహాల్ లాంటి అధికంగా రాబడి వచ్చే వాటిని జిఎస్‌టి నుండి ఎందుకు మినహాయించారో కూలంకషంగా వివరించారు. ప్రభుత్వం ఆడుతున్న అబద్ధాలను, అలాగే జిఎస్‌టి కౌన్సిల్ అనైతికతను ఈ వ్యాసంలో బట్టబయలు చేశారు. సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలు, కార్పొరేట్ కంపెనీలను ఎదుర్కోలేక చితికిపోయి నిరుద్యోగం పెరిగే అవకాశం ఉందనే హెచ్చరిక చేశారు. జిఎస్‌టి వల్ల చిన్న ఉత్పత్తిదారులు, వ్యాపారస్తులు తమ మనుగడను కొనసాగించలేరు అన్న విషయాన్ని సూటిగా చెప్పారు. జిఎస్‌టి ఒకే జాతి, ఒకే పన్ను, ఒకే విపణి అనే నినాదంలో సంఘ్‌పరివార్ ఒకే జాతి అనే తన భావజాలంతో భిన్నత్వంలో ఏకత్వానికి తూట్లు పొడుస్తూ, కేవలం తన రాజకీయ అస్తిత్వాన్ని నిలుపుకోవాలనే కాంక్షతోనే ఒకే దేశం ఒకే విపణి అని బహుళజాతి కార్పొరేట్లకు మరింత సులభంగా దేశ ఆర్థిక వ్యవస్థని అప్పగించి విధ్వంసానికి పాల్పడే అవకాశం ఉందనే విషయాన్ని చాలా సరళంగా వివరించారు. విభిన్న ఆచార వ్యవహారాలు, సంస్కృతులు, సంప్రదాయాలు, ఆర్థిక పరిస్థితులు, అలవాట్లు గల దేశంలో ఒకే రకమైన పన్ను ఏ విధంగా హేతుబద్ధమైనది కాదో ఉదాహరణలతో తెలిపారు. అలాగే అది దేశ సమాఖ్య వ్యవస్థకు కూడా విఘాతమైందని వివరించడం బాగుంది. డిమానిటైజేషన్ ద్వారా ఆర్థిక వ్యవస్థకు బయట బతికేవాళ్లను బలవంతంగా కూడా ఇందులోకి లాగడంలోని ఉద్దేశం నగదు రహిత డిజిటల్ వ్యవస్థను ఏర్పాటుచేయడమే. తద్వారా ఇప్పుడు అమలు చేస్తున్న జిఎస్‌టి విధానం ద్వారా దేశ ప్రజలందరిని బహుళజాతి కంపెనీలకు దాసోహం చేయడమే అవుతుంది అనే విషయాన్ని అర్థమయ్యేట్లు చెప్పారు. రోజు దినపత్రికల్లో జిఎస్‌టిపై వస్తున్న వ్యాసాలకు భిన్నంగా, చాలా వివరాలతో రాసిన ఈ వ్యాసాన్ని అందించిన వీక్షణానికి, రాసిన రచయితకు కృతజ్ఞతలు.

**– మహేష్**
పాలకొల్లు

వీక్షణం జూలై సంచికలో 'కార్పొరేట్ల కోసమే ఒకే దేశం ఒకే పన్ను' వ్యాసం బాగుంది. ప్రజాధనం దోపిడీకి బహుళజాతి సంస్థలు చేస్తున్న నిరంతర కుట్రలకు అతి పెద్ద ప్రతిరూపం జిఎస్‌టి. బహుళజాతి సంస్థల లక్ష్యాలను అతివేగంగా నెరవేర్చడం కోసం సమాఖ్య స్ఫూర్తికి విరుద్ధంగా ప్రభుత్వం అందిస్తున్న సహాయ సహకారాలను ఈ వ్యాసంలో వివరించారు. ఇక సమీప భవిష్యత్తు నుంచి చట్ట సభలలో కార్పొరేట్ సంస్థల పెద్దల సంఖ్య అనూహ్యంగా పెరిగే ప్రమాదం కూడా ఉందేమోననిపిస్తుంది.

**– ఎస్. కిశోర్ కుమార్**
హైదరాబాద్

వీక్షణం జూలై 2017 సంచికలో కొండూరు వీరయ్య గారు రాసిన 'ప్రజాతంత్ర – మతోన్మాద జాతీయత' వ్యాసం చదివాను. శీర్షిక కాస్త గందరగోళంగా ఉంది. శీర్షికలో జాతీయత బదులు జాతీయవాదం అని ఉండవలసిందనుకుంటాను. లేదా 'జాతీయవాదంలో రెండు ధోరణులు' అన్నా సరిపోయేదేమో. ఇవాళ సంఘ్ పరివార్ నాయకత్వంలో భారత జాతీయవాదం గురించి జరుగుతున్న చర్చ సందర్భంలో సంఘ్ పరివార్ చెప్పే జాతీయవాదానికీ, ప్రజల, ప్రగతిశీల జాతీయవాదానికీ మధ్య తేడా ఏమిటో చెప్పడం చాల అవసరమైన పనే. అటువంటి ముఖ్యమైన విషయం మీద తన ఆలోచనలు పంచుకున్నందుకు రచయితకు కృతజ్ఞతలు. అయితే, వ్యాస క్రమంలో ఆయన ప్రస్తావించని అంశం ఒకటి, నా దృష్టిలో తప్పుగా ప్రస్తావించిన అంశం ఒకటి పాఠకుల దృష్టికి తేదలచుకున్నాను. ఒకటి, అసలు భారత సమాజం ఒక్క జాతి అవుతుందా అనే అంశం ఆయన ప్రస్తావనలోకి కూడ రాలేదు. ఆ పునాది లేకుండా జాతీయత గురించి పెద్ద

(మిగతా 58వ పేజీలో...)

**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ముత్తనగారి రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్;

**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

*(ఈ సంచికలోని హైదరాబాద్, రంగారెడ్డి, నిజామాబాద్, వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్నవారు ఎస్. వెంకటేశ్)*

# భూస్వామ్య, మతోన్మాద పార్లమెంటరీ ప్రజాస్వామ్యం

వీక్షణం

రాజనీతి శాస్త్ర చరిత్రలో భారత పాలకులు ఒక కొత్త ప్రమాణాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నిస్తున్నట్టున్నారు. యూరప్ లో పారిశ్రామిక విప్లవాల, భూస్వామ్య వ్యతిరేక, బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల ఫలితంగా ఆవిర్భవించి, విస్తరించిన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మౌలిక లక్షణాలను వదిలించి, దానికి కొత్త లక్షణాలను ఆపాదించ దలచినట్టున్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి భూస్వామ్య వ్యతిరేకత, మతజోక్యం లేని పౌరజీవనం, అతీతశక్తి కన్న మానవశక్తి మీద నమ్మకం, హేతుబద్ధత నిర్వచనప్రాయమైన లక్షణాలు. యూరప్ లో తలెత్తుతున్న పెట్టుబడిదారీ వర్గం అప్పటిదాకా ఇష్టారాజ్యంగా పాలించిన రాచరికాన్ని, అతీతశక్తి బూచి చూపుతూ రాజ్యానికి వత్తాసు పలికిన మతాన్ని, ప్రజల కళ్లు కప్పిన మూఢ విశ్వాసాల బంధనాలను కూలదోయదలచింది. తాను దైవాంశ సంభూతుడైన రాజును తొలగించి ప్రజాస్వామ్యాన్ని, ప్రజా ప్రాతినిధ్య పాలనను అమలు చేస్తానని పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టింది. కాలక్రమంలో ఆ పెట్టుబడిదారీ వర్గమే ఈ ప్రగతిశీలత నుంచి గుత్తాధిపత్య, ద్రవ్యపెట్టుబడి దశకు, సామ్రాజ్యవాదానికి ఎదిగి కుళ్లిపోయి, తన తొలినాళ్ల ఆదర్శాలన్నీ వదిలివేసిందనేది, అభివృద్ధి నిరోధక శక్తులతోనే జట్టు కట్టిందనేది వేరే కథ. ఆ వికృత దశలో వలసవాదం భారతదేశంలో విచిత్రంగా బూర్జువా ప్రజాస్వామిక విప్లవమేదీ జరగకుండానే పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని అంటు కట్టింది. ఈ బోన్సాయి మొక్క ఇప్పటిదాకా ఎన్ని గుంటపూలు పూసినా, ఫలాలు ఇవ్వకపోయినా తనను తాను అసలు వృక్షానికి నమూనానే అని చెప్పుకుంటున్నది. ఇప్పుడు నరేంద్ర మోడీ నాయకత్వంలోని సంఘ పరివార్ పాలకవర్గాలు ఆ బోన్సాయి మొక్కకు కాషాయ రంగులు అద్ది దాని మౌలిక లక్షణాల జాడే లేకుండా చేయదలచినట్టున్నాయి.

గత మూడు సంవత్సరాలుగా జరుగుతున్న ఈ పరిణామాలు రాష్ట్రపతిగా రామ్ నాథ్ కోవింద్ ప్రమాణస్వీకారం సందర్భంగా పార్లమెంటులో జైశ్రీరాం నినాదాలతో వాటి తార్కిక ముగింపుకు చేరుకున్నాయి. రాష్ట్రపతి పదవిని స్వీకరిస్తూ నిరాజ్యాంగాన్ని, చట్టాన్ని కాపాడతానని, పరిరక్షిస్తానని, సమర్థిస్తాననిు ఆయన చేసిన ప్రమాణం ప్రతిధ్వనులు కూడ ముగియకముందే సభలోని భాజపా సభ్యులు జైశ్రీరామ్ నినాదాలతో ఆ ప్రమాణాన్ని ఉల్లంఘించారు. అసలు ఆ ప్రమాణస్వీకార ఉపన్యాసంలో ఆయనే స్వయంగా జాతీయోద్యమంతో ఏ సంబంధమూ లేని, రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ కార్యకర్తగా సంఘ్ పరివార్ రాజకీయ రూపమూ, ప్రస్తుత భారతీయ జనతా పార్టీ పూర్వ రూపమూ అయిన భారతీయ జనసంఘ్ స్థాపకుడు దీన్ దయాళ్ ఉపాధ్యాయను తాత్వికుడిగా ప్రస్తావించాడు. జై శ్రీరామ్ నినాదాలు ఎవరైనా వ్యక్తిగత స్థాయిలో, వ్యక్తిగత జీవితాలలో ఇచ్చుకోవచ్చు గాని రాజ్యాంగబద్ధమైన చట్టసభలో చేయడానికి వీలులేదు. తమ భవిష్యత్తును, తమ పాలనను తామే రూపు దిద్దుకోగలమని, దానికి మానవాతీతశక్తో, దైవాంశ సంభూతులో అవసరం లేదని మనుషులు చేసిన ప్రకటన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం. అక్కడ ఒక మానవాతీత శక్తిని కీర్తించడానికి వీలు లేదు. రాష్ట్రపతి పదవికి ఎన్నికైన వారు తమకు ఆరాధ్యులైనవారి పేరు చెప్పుకోవచ్చు గాని ఈ దేశానికి ప్రజాస్వామ్యం, సామ్యవాదం వంటి విదేశీ భావనలు పనికి రావని సిద్ధాంతం చేసిన వ్యక్తిని ఆ ప్రజాస్వామ్యాన్ని, సామ్యవాదాన్ని హామీ ఇచ్చిన రాజ్యాంగ పదవిలో స్మరించడానికి వీలు లేదు.

ఈ దేశం, ఈ సమాజం బహుళత్వంతో నిండినది గనుక ఏ ఒక్క మత విశ్వాసానికీ రాజ్యం ప్రాధాన్యత ఇవ్వగూడదనే ఆదర్శంతో, జాతీయోద్యమం యూరపియన్ పార్లమెంటరీ ప్రజాస్వామ్యాల నమూనాను స్వీకరించి, అక్కడి లాగనే లౌకికవాదాన్ని ఆదర్శంగా తీసుకుని, దాన్ని రాజ్యాంగంలో చేర్చుకుంది. అయితే, జాతీయోద్యమ నాయకత్వంలో కూడ హిందూ మత భావనలు ఉన్నవారిది పైచేయి అయింది గనుక హిందూ మత విశ్వాసాలకు ప్రాచుర్యం దొరకడం మొదలయింది. అసలు లౌకికవాదానికే యూరపియన్ అర్థాన్ని మార్చివేసి, దానికి సర్వమత సమానత్వం, సర్వభావ సమభావ, అన్ని మతాలకూ సమానదూరం అనే తప్పుడు నిర్వచనాలు ఇచ్చారు. అన్ని మతాలూ ఒకటే, అన్ని మతాలూ సమానమే అనుకుంటే ఒక మతాన్ని పాటించడమే అర్థరహితం అవుతుంది. సర్వమత సమానత్వం అనేది అసాధ్యమైన ఆదర్శం. యూరపియన్ లౌకికవాదానికి అర్థం సర్వభావ సమభావం కాదు, అన్ని మతాలకూ సమానదూరం కాదు. దాని అర్థం మతాన్ని రాజ్య వ్యవహారాలలో భాగం చేయకూడదని. మతం రాజ్యరహితంగా ఉండాలని. మతం కేవలం మనుషుల వ్యక్తిగత జీవితంలోనే ఉండాలని. అలాగే అన్ని మతాలకూ సమానదూరం అనేది వాస్తవాచరణలో అత్యధికుల మతానికి దగ్గర కావడంగా, అల్పసంఖ్యాకుల మతాలకు మరింత దూరం కావడంగా మారుతుంది. మారింది. జాతీయోద్యమకాలంలో, వలసపాలనానంతరం తొలిదశలో, రాజ్యాంగ రచనలో ప్రారంభమైన ఈ తప్పుడు ధోరణి, చివరికి సంఘ్ పరివార్ రాజ్యాధికారానికి, బహిరంగంగా పార్లమెంటులో ఒక మతవిశ్వాస ప్రకటనకు చేరింది.

ఈ బహుళత్వ దేశాన్ని హిందూ రాష్ట్రంగా, చాతుర్వర్ణ వ్యవస్థను కాపాడే రామరాజ్యంగా, ఆదివాసులనూ, దళితులనూ, శూద్రులనూ, స్త్రీలనూ, ఇతర మతస్తులనూ అణచివేసి మొత్తంగా హైందవ బ్రాహ్మణ్య దుర్గంగా మార్చాలని కలలు కంటున్న సంఘ్ పరివార్ నానాటికీ దూకుడుగా ముందుకు సాగుతున్నదనడానికి ఈ పరిణామాలు సూచికలు. దేశం, దేశ రాజకీయాలు ఎటువైపు పయనిస్తున్నాయో అర్థం చేసుకోనివాళ్లు, అర్థం చేసుకుని కూడ ఆ పయనాన్ని అరికట్టే కృషికి పూనుకోనివాళ్లు ఇప్పటికైనా మేలుకోవలసిన అనివార్యతను ఈ పరిణామాలు చూపుతున్నాయి. ఫాసిజమా ఉ ప్రజాస్వామ్యమా అనే ప్రశ్న గత శతాబ్ది మధ్య భాగంలో ఆ నాటి ప్రపంచ సమాజం ముందు నిలిచింది. రెండు కోట్ల మంది సోవియట్ ప్రజలు తమ ప్రాణాలు బలిపెట్టి ఫాసిజాన్ని ఓడించారు. ఇవాళ భారతదేశంలో మళ్లీ ఒకసారి ఆ ప్రశ్న ముందుకు వస్తున్నది. ఈ హిందూ బ్రాహ్మణీయ ఫాసిజాన్ని ఓడించి ప్రజాస్వామ్యాన్ని, బహుళత్వాన్ని నిలుపుకుంటామా, భవిష్యత్ భారతాన్ని సమానత్వ పునాదిపై తీర్చి దిద్దుకుంటామా లేదా అనేదే ఇవాళ ప్రధానమైన సవాల్. వీ

సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# దళితుల మీద హింస, ఇసుక మాఫియాకు ప్రశంస

రాజన్న సిరిసిల్ల జిల్లా నేరెళ్లలో ఇసుక లారీలను తగులబెట్టారనే ఆరోపణతో పోలీసులు దళిత, వెనుకబడిన కులాల యువకులను చిత్రహింసలు పెట్టి, కేసు పెట్టి వేధిస్తున్న పరిణామం రాష్ట్రంలో సంచలనం రేపుతున్నది. ఆ ఇసుక లారీలు విచ్చలవిడిగా తిరుగుతూ ప్రమాదాలకు కారణమవుతూ ఎంతో మందిని చంపడం, గాయపరచడం చేసిన నేపథ్యంలో ప్రజలు ఆగ్రహంతో ఆ లారీలను తగులబెట్టారని బైటపడింది. క్రమంగా రాష్ట్రంలో బలపడుతున్న ఇసుక మాఫియా, దానికి పాలకవర్గపు, అధికార యంత్రాంగపు మద్దతు కూడ బైటికి వస్తున్నాయి. ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షలో నీటి పారుదల సౌకర్యాల పెంపు, జలవనరుల సక్రమ వినియోగం అనే కోరికలు ఉన్నాయి గనుక నీళ్లు తెస్తామనే పగటికలలు అమ్ముతూ జనాన్ని మోసం చేయవచ్చునని, ఆ పేరుతో ఎన్ని అక్రమాలకైనా పాల్పడవచ్చునని తెలంగాణ పాలకులు అనుకుంటున్నట్టున్నారు. తాము పెద్ద ఎత్తున నీటి పారుదల పథకాలు, గృహ నిర్మాణ పథకాలు, భవనాల, రహదారుల నిర్మాణాలు చేపడుతున్నందువల్ల భారీగా ఇసుక అవసరం అవుతుందనే పేరుతో రాష్ట్రంలో ఇసుక మాఫియా అక్రమాలకు తలుపులు బార్లా తెరిచారు. అధికారంలోకి వచ్చిన కొద్ది నెలల్లోనే కొత్త ఇసుక విధానాన్ని ప్రవేశపెట్టి రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థ చేతికి గుత్తాధికారం ఇచ్చారు. ఈ సంస్థ వేలం పాటల ద్వారా ఇసుక తవ్వకం ప్రాంతాలను కాంట్రాక్టర్లకు ఇస్తుందని ప్రకటించారు. గోదావరి, కృష్ణ వంటి పెద్ద నదులతో పాటు ఎన్నో చిన్న నదులు, ఏరులు, వాగులు అన్నిచోట్లా ఇసుక క్వారీలను నిర్ధారించారు. న్యాయస్థానాలు, గ్రీన్ ట్రిబ్యునల్, పర్యావరణ శాఖ, ప్రజలు చేసిన హెచ్చరికలన్నిటినీ పక్కన పెట్టి ఇష్టారాజ్యంగా తవ్వుకుపోవడానికి కాంట్రాక్టర్లకు అవకాశం ఇచ్చారు. ప్రభుత్వానికి ఎనిమిది వేల రూపాయలు చెల్లించి తవ్వుకు వచ్చిన లారీ ఇసుకను కాంట్రాక్టర్లు డెబ్బై, ఎనభై వేల రూపాయలకు అమ్ముతున్నారంటే, రోజూ కొన్ని వేల లారీల ఇసుక తరలుతున్నదంటే కాంట్రాక్టర్ల మాఫియా ఎంతగా ఆర్థిక వనరులను సంపాదించుకుందో, ఎంతగా బలపడిందో అర్థమవుతుంది. అక్రమ ఇసుక వ్యాపారాన్ని అరికట్టడానికే కొత్త నిబంధనలు అమలులోకి తెచ్చామని ప్రభుత్వం అంటున్నప్పటికీ, అక్రమ ఇసుక వ్యాపారం అగలేదని, ఏడాదికి కనీసం వెయ్యి కోట్ల రూపాయల అక్రమ ఇసుక వ్యాపారం సాగుతున్నదని వార్తలు వస్తున్నాయి. గత ఆంధ్రప్రదేశ్‌లో కూడ ఇటువంటి పద్ధతులలోనే ఇసుక మాఫియా బలపడి వేల కోట్ల రూపాయలు ఆర్జించి ప్రభుత్వాలను శాసించ గలిగిన స్థితికి చేరింది. నేరెళ్ల ఘటనలకు కారణమైన గోల్డ్ మైన్ మినరల్స్ అనే వ్యాపార సంస్థకు అసలు కాంట్రాక్టే అక్రమంగా సమకూరిందని, ఆ సంస్థ యజమానులలో ఇద్దరు స్వయంగా ముఖ్యమంత్రి సమీప బంధువులని వివరాలు బైటపడుతున్నాయి. అంటే గ్రామీణ యువకుల మీద పోలీసు హింసగా మొదలైన ఘటన తీగలాగితే డొంక కదిలినట్టు, ప్రజలకు ప్రాణాంతకంగా మారిన ఇసుకలారీల ప్రమాదాలు, అక్రమ ఇసుక వ్యాపారం, ప్రభుత్వ ఇసుక విధానపు అక్రమాలు, ఆశ్రిత పక్షపాతం, అత్యున్నత అధికారవర్గం చేతులకు కూడ అంటిన మసి దాకా అనేక మలుపులు తిరిగింది. తెలంగాణ మీద, తెలంగాణ ప్రజల మీద నిజమైన ప్రేమ ఉన్నవారు ఇప్పటికైనా ఈ అక్రమాల మీద మాట్లాడక తప్పని స్థితి వస్తున్నది. వీ

సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# ప్రజాస్వామిక నిరసనకు కూడ అవకాశం లేదా?

ప్రజల సమస్యలను లేవనెత్తేవారి పట్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అసహనం పెరిగిపోతున్నదనడానికి కొత్త నిదర్శనం కాపు ఉద్యమనేత ముద్రగడ పద్మనాభం తలపెట్టిన పాదయాత్ర పట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరి. గతంలో కూడ ప్రభుత్వాలు ప్రజల మీద, వ్యవస్థను మార్చదలచిన ఉద్యమాల మీద తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించినవే కాని, పార్లమెంటరీ రాజకీయ వ్యవస్థలోనే ఉన్న ప్రత్యర్థుల మీద, ప్రతిపక్షాల మీద ఇచ్చిపుచ్చుకునే ధోరణి ఉండేది. ఘర్షణలు కూడ ప్రణయకలహాల స్థాయిలోనే ఉండేవి. అధికార పక్షంలో ఉన్నవారికి ఏదో ఒకరోజు తాము కూడ ప్రతిపక్ష స్థానంలోకి వెళ్లే అవకాశం ఉందనే స్పృహ ఉండేది. పోలీసు యంత్రాంగం కూడ ఈ వ్యవస్థలోని ప్రతిపక్షాల పట్ల గౌరవంతోనే నిర్బంధం ప్రయోగించేవి. అటూ ఇటూ ఉన్నవారు ఒక్క తాను లోని ముక్కలే అనే ఎరుక అందరికీ ఉండేది. కాని ప్రజల ప్రశ్నల పట్ల, ప్రజాసమీకరణల పట్ల, ప్రజల తరఫున నిలబడుతున్నవారి పట్ల అధికారంలో ఉన్నవారి అసహనం, ఆగ్రహం క్రమక్రమంగా ఏ స్థాయికి చేరుతున్నాయంటే హద్దుల లోపలి, ప్రజాస్వామికమైన, న్యాయమైన ఆందోళనలను కూడ, వ్యవస్థలోపలి ప్రత్యర్థులు నాయకత్వం వహించే ఆందోళనలను కూడ బలప్రయోగంతో అణచివేయక తప్పదనే స్థితికి చేరుతున్నారు. ముద్రగడ పద్మనాభం, కాపు రిజర్వేషన్ పోరాట సమితి వ్యవస్థను మార్చాలని కోరడం లేదు, మార్చాలనుకోవడం లేదు. చివరికి అధికారపక్షాన్ని దిగిపోవాలని కూడ కోరడం లేదు. కాపు, బలిజ, తెలగ, ఒంటరి కులాలను వెనుకబడిన కులాల జాబితాలో చేర్చాలనే తమ చిరకాల వాంఛను ఆమోదించి, ఆగస్టు లోగా పరిష్కరిస్తామని హామీ కూడ ఇచ్చిన ప్రభుత్వానికి ఆ హామీని గుర్తు చేయడానికే ఆయన రాష్ట్ర రాజధానికి పాదయాత్ర తలపెట్టారు. అసలు ఆ నాలుగు కులాలను బీసీలుగా గుర్తించాలనే డిమాండ్ సరైనది కాదని అనుకునేవారు కూడ ఉన్నారు గాని కనీసం ప్రభుత్వం ఆ మాట అనలేదు. ఆ డిమాండ్‌ను అంగీకరిస్తున్నానని, పరిష్కరిస్తానని వాగ్దానం చేసింది. అవకాశవాద రాజకీయాలలో నిండా మునిగిన, గతంలో పదవులు అనుభవించిన నాయకుడుగా ముద్రగడ పద్మనాభం నిజంగా ఆ నాలుగు కులాల ప్రజల నాయకుడేనా, ఆయన ఈ డిమాండ్ ను ముందుకు తేవడం వెనుక స్వార్థ ప్రయోజనాలు లేవా అనే ప్రశ్నలు కూడ ఎవరైనా వేయవచ్చు. ఆయన విషయం అలా ఉంచి, ఆ డిమాండ్ పై ప్రజలు కదులుతున్నారు గనుక సమస్యను పరిష్కరించడం, తన వాగ్దానాన్ని నిలబెట్టుకోవడం ప్రభుత్వ బాధ్యత. ఆ బాధ్యత గుర్తు చేస్తేనే పోలీసులను ప్రయోగించి అణచివేయాలని, ప్రాథమిక హక్కులను కాలరాయాలని, నేరం అని ప్రభుత్వం భావించడం దుర్మార్గం. ఇక ఇంకా విస్తృతమైన రాజకీయార్థిక, చారిత్రక, సామాజిక సమస్యల పరిష్కారాల కోసం ప్రశ్నించే ప్రజల పట్ల ఎట్లా ప్రవర్తిస్తుందో ఊహించవలసిందే. ప్రజాస్వామిక నిరసనకు కూడ అవకాశాలు ఇవ్వబోము అని ప్రకటించడం, తమ అధికార అహంకారాన్ని ప్రదర్శించడం తాత్కాలికంగా ఏలినవారికి శాంతి భద్రతలు నెలకొల్పిన సంతృప్తిని ఇస్తుందేమో గాని, ప్రజలలో మసలుతున్న ఆగ్రహాన్ని మూసివేసి, ఆగ్రహం చల్లారిందనుకోవడం భ్రమ. మూతలను పెటిల్లున తన్నుకుని ఆ ఆగ్రహం ఎగసి పడుతుంది. వీ

# డోకా-లా లో వ్యక్తమవుతున్న ఇరుపక్షాల యుద్ధకాంక్ష

**జూ**న్ చివరి వారం నుంచీ భారత తూర్పు సరిహద్దులలో హిమాలయ మంచుకొండలు భారత ఉ చైనా సైన్యాల మధ్య ఉద్రిక్తతతో క్రమంగా వేడెక్కుతున్నాయి. యుద్ధరంగంలో మొట్టమొదట మరణించేది సత్యం అని సామెత చెప్పినట్టు ఈ ఘర్షణలు ఎక్కడ ప్రారంభమయ్యాయనే దానికి ప్రత్యర్థులలో ఎవరి కథనాలు వారికి ఉన్నాయి. సిక్కిం నుంచి భారత సైనికులు సరిహద్దు దాటి వచ్చి, తాము నిర్మిస్తున్న రహదారి పనులను అడ్డుకున్నారని చైనా ప్రభుత్వం ఆరోపిస్తుండగా, చైనా సైనికులు సరిహద్దు దాటి వచ్చి సిక్కిం లోని ఒక సైనిక బంకర్ ను ధ్వంసం చేశారని భారత ప్రభుత్వం ఆరోపిస్తున్నది. ఈ ఉద్రిక్తత నెలకొన్న డోకా-లా (లేదా డోక్లామ్ లేదా డోంగ్ లాంగ్) భారత్, భూటాన్, చైనా మూడు దేశాల సరిహద్దులోని ప్రాంతం. ఈ ప్రాంతం మీదుగా చైనా నిర్మిస్తున్న రహదారిని భారత ప్రభుత్వం గతంలోనే వ్యతిరేకించింది. ఇరు ప్రభుత్వాలూ ఆమోదించిన 1890 నాటి ఆంగ్లో ఉ చైనీస్ ఒడంబడిక ప్రకారం ఆ భూభాగం తమదేనని, తమ భూభాగంలో రహదారి నిర్మించుకోవడానికి తమకు పూర్తి అధికారం ఉందని చైనా ప్రభుత్వం వాదించింది. ఈ ఉద్రిక్తతతో నాథూలా పాస్ ద్వారా సాగే మానస సరోవర్ యాత్రికులను వెనుకకు పంపించాలని చైనా ప్రభుత్వం నిర్ణయించింది. తదుపరి యాత్రలను భారత ప్రభుత్వం రద్దు చేసింది. ఇరు దేశాల మధ్య మాటల, ప్రకటనల యుద్ధం, ఇరు వైపుల ఉన్నత సైనికాధికారుల పర్యటనలు, ఉన్నతస్థాయి సమావేశాలు, దౌత్య అధికారుల సంభాషణలు ఎన్నో జరిగాయి, జరుగుతున్నాయి. ఈ ఉద్రిక్త వాతావరణం 1962 నాటి భారత – చైనా యుద్ధాన్ని తలపిస్తున్నదని, ఐదున్నర దశాబ్దాల తర్వాత మళ్లీ ఒకసారి యుద్ధం జరిగే అవకాశాలు కనబడుతున్నాయని కూడ పరిశీలకులు రాస్తున్నారు. 1962 ఓటమి గుర్తు లేద్దా అని చైనా ప్రభుత్వం భారత ప్రభుత్వాన్ని వెటకరించగా, 2017 భారత్ 1962 నాటి భారత్ కాదు సుమ్మా అని భారత ప్రభుత్వం జవాబిచ్చింది. అధికారికంగానే 1962 ప్రస్తావన వచ్చింది గనుక, ఇరువైపులా సైనిక మోహరింపులు కూడ మొదలయ్యాయి గనుక యుద్ధమేఘాలు కమ్ముకుంటున్నట్టేనని చాల మంది భావిస్తున్నారు. చైనా నిర్మించతలపెట్టిన రహదారి పూర్తయితే సిలిగురి సంధి చైనాకు అందుబాటులోకి వస్తుందని, భారతదేశానికీ ఈశాన్యరాష్ట్రాలకూ మధ్య దారి అయిన ఈ ఇరవై కిమీ సంధి మీద చైనా దాడి చేసి ఆక్రమించుకుంటే, భారత్ నుంచి ఈశాన్యరాష్ట్రాలు వేరయిపోతాయని భారత ప్రభుత్వం భావిస్తున్నది. యుద్ధం నిజంగా జరిగినా జరగకపోయినా రెండు దేశాల పాలకవర్గాలకూ తమ తమ ప్రజలలో యుద్ధ భయాన్ని, కుహనా దేశభక్తిని రెచ్చగొట్టవలసిన పరిస్థితి ఏర్పడిందని ఈ పరిణామాలు ప్రకటిస్తున్నాయి. సామ్రాజ్యవాద శక్తిగా ఎదుగుతున్న చైనా పాలకవర్గాలు అమెరికాను కూడ మించిపోగల మొనగాడుగా తమను తాము నిరూపించుకోవాలంటే తక్షణమే ఒక యుద్ధంలో తమ ప్రతాపాన్ని చూపుకోవలసి ఉంది. దేశంలో పెరుగుతున్న అసంతృప్తి నుంచి బైటపడి, జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడం 2019 ఎన్నికల్లో గెలుపుకు అవసరమని భారత పాలకవర్గాలు భావిస్తున్నాయి. ఈ రెండు పాలకవర్గాల ప్రయోజనాల కోసమే తప్ప యుద్ధ మేఘాలు, ప్రకటనలు, నిజంగా యుద్ధం కూడ ఇరుదేశాల ప్రజల కోసం అవసరమైనవి కావు. వీ




**తిరిగి వచ్చిన పాత నోట్ల లెక్క ఇంకా తేలలేదని ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ పార్లమెంటరీ కమిటీకి చెప్పారు - వార్త**



❖ **బొజ్జా తారకం - నలుపు సంపాదకీయాలు** - బొజ్జా తారకం ట్రస్ట్ - హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణలు - 182 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 120



❖ **బొజ్జా తారకం - నలుపు వ్యాసాలు** - బొజ్జా తారకం ట్రస్ట్ - హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణలు - 282 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 200

పై రెండు పుస్తక ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ - 500006; ఫోన్: 040 - 23521849



❖ **భిన్నకాలం** - కవిత్వం - డాక్టర్ దామెర రాములు - పాలపిట్ట బుక్స్ ప్రచురణ - 159 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 100, ప్రతులకు: పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయ సాయి రెసిడెన్సీ, సలీమ్‌నగర్, మలక్‌పేట్, హైదరాబాద్ - 500036; ఫోన్: 040-27678430



❖ **షితాబుఖాను - అను సీతాపతిరాజు** - ఆదిరాజు వీరభద్రరావు- నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ - 86 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జీవిఎస్ఐ పోస్టు, బండ్లగూడ (నాగోల్), హైదరాబాద్ - 500068; ఫోన్: 24224453/54



❖ **శ్రీశ్రీ మన సంగీతం** - మహాకవి శ్రీశ్రీపై పాటలు - సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణలు - 31 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30,



❖ **మానవుడి పాట్లు** - మిహాయిల్ షోలొహోవ్ - అనువాదం శ్రీశ్రీ - శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణలు - 31 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30



❖ **మే మే** - శ్రీశ్రీ వరద ఆరుద్ర - సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణలు - 39 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 35



❖ **శ్రీశ్రీ రేఖా చిత్రాలు** - సింగంపల్లి అశోక్‌కుమార్ - శ్రీశ్రీ సాహిత్యనిధి ప్రచురణలు - 47 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60,

పై నాలుగు పుస్తక ప్రతులకు: శ్రీశ్రీ సాహిత్యనిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతీనగర్, విజయవాడ - 520004; ఫోన్: 0866 - 6617375



❖ **షహర్‌నామా** - (హైదరాబాద్ వీధులు-గాథలు) -పరవస్తు లోకేశ్వర్ - గాంధి ప్రచురణలు - 206 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 110, ప్రతులకు: పి. లోకేశ్వర్, ఇ. నెం. 12-2-709/5/1/సి, నవోదయ కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాద్ - 500028; ఫోన్: 9160680847, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **త్యాగాల దారి** - రాంగూడ అమరుల జీవనరేఖలు - అమరుల బంధుమిత్రుల సంఘం ప్రచురణ - 191 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80



❖ **తూర్పు కనుమల ఎర్ర మందారాలు** - అమరుల జీవిత చరిత్రలు - అమరుల బంధు మిత్రుల సంఘం ప్రచురణ - 40 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 20



❖ **అమరత్వపు జాడ** - తెలంగాణ, దండకారణ్య అమరుల స్మృతిలో - అమరుల బంధు మిత్రుల సంఘం ప్రచురణ - 64 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 40,
పై మూడు పుస్తక ప్రతులకు: కొడకంచి నర్సన్న, డోర్ నెం: 2-6-82-1, మాదిగ బస్తీ, మచ్చబొల్లారం, సికింద్రాబాద్



❖ **ఉట్నూరు సాహితీ కెరటాలు** - కవితలు - పాటలు - వ్యాసాలు - ఉట్నూరు సాహితీ వేదిక ప్రచురణ - 101 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 80, ప్రతులకు: గోపగాని రమణశ్రీ, ఇం. నెం. 9-76/2, ఫకీర్‌గుట్ట, ఉట్నూర్, ఆదిలాబాద్ జిల్లా - 504311; ఫోన్: 9440979882, ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **రణస్థలి** - కతలు వెతలు - బమ్మిడి జగదీశ్వరరావు - మాతృక ప్రచురణలు - 200 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 120, ప్రతులకు: కామ్రేడ్ సి.పి. భవన్, ఇం. నెం. 2-1-594 (బి-34, ఎఫ్-1), రైల్వే స్టేషన్ రోడ్, విజ్ఞానపురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్ - 500004; ఫోన్: 040 - 27668471



❖ **సబ్బండనాదం** - ప్రజల పాటలు - వద్దె ముద్దంగుల ఎల్లన్న - రచనల చెరువు-సాహిత్య వేదిక ప్రచురణ - 86 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 60, ప్రతులకు: వద్దె ముద్దంగుల భాగ్యలక్ష్మి, ఇ. నెం. 3-12, గ్రామం బొంతపల్లి, మండలం గుమ్మడిదల, జిల్లా సంగారెడ్డి - 502313; ఫోన్: 9985356963,



❖ **జాన్తానై** - పెసర రవీందర్ రెడ్డి - 63 పేజీలు, 1/8 డెమీ, వెల రు. 30, ప్రతులకు: పి. రవీందర్ రెడ్డి, ఫోన్: 9290740123

# తెలంగాణలో భూకుంభకోణాలు

***ఇటీవల బైటపడిన మియాపూర్ భూకుంభకోణం దగ్గర ప్రారంభించి మొత్తంగా తెలంగాణలో భూకుంభకోణాలకు ఉన్న అవకాశాలను, చరిత్రను, తెరాస ప్రభుత్వ పాత్రను వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

హైదరాబాద్‌లోని మియాపూర్, హఫీజ్‌పేట ప్రాంతంలో వందలాది ఎకరాల ప్రభుత్వ, ప్రైవేటు భూములు అన్యాక్రాంత మయ్యాయని, అక్రమ రిజిస్ట్రేషన్ల పాలయ్యాయని, రాష్ట్ర ప్రభుత్వం వేలాది కోట్ల రూపాయలు నష్టపోయిందని జూన్ మొదటి వారంలో వార్తలు గుప్పుమన్నాయి. దాదాపు మూడువారాల పాటు ప్రచార సాధనాలన్నీ ఆ వార్తలతో మార్మోగి పోయాయి. ఎన్నో వాస్తవాలు, ఊహలు, కల్పనలు, అర్ధసత్యాలు, అసత్యాలు, అతిశయోక్తులు కలిపి వండిన ఈ వార్తా కథనాలు సంచలనానికే తప్ప నిజమైన పరిశోధనకు, చర్యలకు, అక్రమాల సవరణకు దారి తీయలేదు. ఏదైనా కుంభకోణం, అక్రమం బైటపడిన వెంటనే ఎవరినీ వదలం, దోషులను శిక్షిస్తాం అని గర్జించిన ఆనవాయితీ తోనే ముఖ్యమంత్రి, అధికారపక్ష నాయకులు, అధికారులు ఈసారి కూడ గర్జించారు గాని ఆ తర్వాత దర్యాప్తు, విచారణ, తప్పించుకున్న నిందితుల కోసం అన్వేషణ, న్యాయస్థానంలో వ్యాజ్యాలు, అక్రమాలు జరిపినవారికి శిక్షలు వంటి ప్రక్రియలలో ఏ ఒక్కటీ అంగుళమైనా ముందుకు కదలలేదు. ఈ లోగా మరొక సంచలనంగా మాదకద్రవ్యాల కుంభకోణం వార్తలు బద్దలు కావడంతో భూకుంభకోణం వార్తలు విస్మృతిలో పడిపోయాయి. అసలు భూకుంభకోణం వార్తలను పక్కకు తప్పించేందుకే పథకం ప్రకారం మాదకద్రవ్యాల కుంభకోణం వార్తలు బైటపెట్టారని కూడ ఆరోపణలు వస్తున్నాయి. మాదకద్రవ్యాల కేసులో కూడ ఏ చర్యలూ తీసుకోకుండానే జనం కళ్లుకప్పడానికి మరొక సంచలనం ఏదో రానే వస్తుంది.

హైదరాబాద్‌లో భూమి క్రయ విక్రమాలలో అక్రమాలు, రియల్ ఎస్టేట్ వ్యాపారుల అక్రమాలకు అధికార వర్గపు మద్దతు, భూ కుంభకోణాలు కొత్తవి కావు గాని తాజాగా బైటపడిన మియాపూర్ కుంభకోణం తీగలాగితే డొంక కదిలినట్టు అనేక విషయాలు బైటికి తెచ్చింది. హైదరాబాద్‌లోని కూకట్‌పల్లి సబ్ రిజిస్ట్రార్ తన పరిధిలో లేని మియాపూర్‌లో దాదాపు 693 ఎకరాల ప్రభుత్వ భూమిని ఒక ప్రైవేటు రియల్ ఎస్టేట్ వ్యాపార సంస్థతో సహా కొందరి పేర్లమీదికి వ్యక్తిగతంగా బదలాయించాడని మే చివరి వారంలో బైటపడింది. ఆ భూమి హైదరాబాద్ అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ (హుడా)కి చెందినది కాగా, దానిలో అత్యధిక భాగాన్ని పొన్నపూల సంజీవ ప్రసాద్ అనే వ్యక్తికి చెందిన గోల్డ్‌స్టోన్ ఇన్ఫ్రాటెక్, ట్రినిటీ ఇన్ఫ్రా వెంచర్స్, సువిశాల్ పవర్ జనరేటర్స్ అనే వ్యాపార సంస్థల పేర్ల మీదికి ఆ సబ్ రిజిస్ట్రార్ రాచకొండ శ్రీనివాసరావు రిజిస్టర్ చేశాడని వార్తలు బైటికి వచ్చాయి. ఈ లావాదేవీలో భారీగా లాభపడిన ప్రసాద్ గోల్డ్‌స్టోన్ ప్రసాద్‌గా సుప్రసిద్ధుడు. అమెరికాలో ముప్పై ఏళ్ల కిందటనే ఒక పెద్ద ద్రవ్య కుంభకోణంతో సంబంధం ఉందని ఆరోపణలు ఎదుర్కొన్నవాడు. చంద్రబాబు నాయుడు పాలనా కాలం నుంచీ హైదరాబాదులో రియల్ ఎస్టేట్ అక్రమాలకు ప్రధాన సూత్రధారులలో ఒకడుగా ఉన్నవాడు. ఇప్పుడు అక్రమాలు జరిగిన మూడు వ్యాపార సంస్థలు ఆయనకు చెందినవే కాగా, రెండు సంస్థలకు సంబంధించిన ఒక్కొక్క డైరెక్టర్ ను అరెస్టు చేసి, కొద్ది రోజుల్లోనే బెయిల్ పై విడుదల చేశారు గాని రెండు నెలలు గడిచినా అసలు గోల్డ్‌స్టోన్ ప్రసాద్ ఆచూకీ కనిపెట్టడానికి, అదుపులోకి తీసుకోవడానికి ప్రయత్నాలు కూడ జరగడం లేదు.

నిజాం పాలనా కాలంలో జాగీరు గ్రామమైన మియాపూర్‌లోని ఈ భూమిని నవాబు ఖైరసుద్దీన్ ఖాన్‌కు నిజాం ప్రభుత్వం సనద్‌గా ఇచ్చిందని, ఆ భూమి 1917-18 నాటికే నవాబ్ అధీనంలో ఉందని ఆధారాలున్నాయి. కాని పోలీసు చర్య తర్వాత ఇటువంటి భూములన్నిటినీ స్వాధీనం చేసుకున్నట్టుగానే ఈ భూమిని కూడ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఇది ప్రభుత్వ భూమి కాదని, తమ భూమేనని నవాబ్ ఖైసరుద్దీన్ ఖాన్ వారసులమని చెప్పుకునే కొందరు గతంలోనే న్యాయ స్థానాలను ఆశ్రయించారు. అలా వివాదంలో చిక్కిన ఈ భూమి గురించి ప్రభుత్వం, రెవెన్యూ శాఖ ప్రత్యేకంగా 2007లోనూ, 2010లోనూ సర్వే నంబర్లతో సహా ప్రకటిస్తూ, ఇక్కడ ఏ వివాదాలూ చెల్లవని, ఇది ప్రభుత్వానికి మాత్రమే చెందుతుందని, ఈ భూముల క్రయవిక్రయాలు, రిజిస్ట్రేషన్ జరగడం నిషిద్ధమని ప్రత్యేక ఉత్తర్వులు జారీ చేసింది.

ఈ చరిత్ర అంతా ఉండగా కూడ కూకట్‌పల్లి సబ్ రిజిస్ట్రార్ ఆర్. శ్రీనివాస రావు 2017 జనవరి 16న ఈ భూముల మీద ఖైరసుద్దీన్ ఖాన్ వారసులుగా చెప్పుకుంటున్న అమీరున్నిసా బేగం తదితరుల పేరు మీద జనరల్ పవర్ ఆఫ్ అటార్నీ రిజిస్టర్ చేశాడు. ఆ సాయంత్రమే వారు ఆ భూమిని గోల్డ్‌స్టోన్ ప్రసాద్‌కు చెందిన కంపెనీలకు అమ్మినట్టుగా కూడ రిజిస్టర్ చేశాడు. ఈ రిజిస్ట్రేషన్‌ను మామూలుగా భూముల రిజిస్ట్రేషన్ జాబితాలో చేర్చకుండా, వివాహ రిజిస్ట్రేషన్‌లతో కలిపి పెట్టి, భూముల రిజిస్ట్రేషన్ లో పరిగణనలోకే రాకుండా చేశాడు. నిజానికి మియాపూర్ భూములు ఈ కూకట్‌పల్లి సబ్ రిజిస్ట్రార్ పరిధిలోకి రావు. కాని 2013లో అప్పటి ప్రభుత్వం భూముల రిజిస్ట్రేషన్‌లో విప్లవాత్మక మార్పు అనే పేరుతో ఎనీవేర్ రిజిస్ట్రేషన్ (ఎక్కడి భూమినైనా ఎక్కడైనా రిజిస్టర్ చేసుకునే సౌకర్యం) ప్రవేశపెట్టింది. దానితో ఒక భూమి వివరాలు తెలిసి ఉండదానికి అవకాశం ఉన్న స్థానిక రిజిస్ట్రార్ కార్యాలయంలో కాక అక్రమంగా, అవినీతితో సుదూరపు రిజిస్ట్రార్ కార్యాలయంలో రిజిస్టర్ చేయించడం అక్రమ భూ వ్యాపారులకు అలవాటయింది.

అతి విలువైన ప్రభుత్వ భూమిని ప్రైవేటు సంస్థలకు అప్పగించడానికి చట్టబద్ధమైన ఏర్పాటు చేయడం, నిషిద్ధ భూమిని రిజిస్టర్ చేయడం, అతి తక్కువ స్టాంప్ డ్యూటీ వసూలు చేయడం, ఈ అక్రమాలు చేసినందుకు లక్షల రూపాయలో, కోట్ల రూపాయలో లంచం తినడం

వంటి అనేక కారణాల వల్ల కూకట్‌పల్లి సబ్ రిజిస్ట్రార్ చేసిన చర్య చట్టవ్యతిరేకమైనది, అక్రమమైనది, అనైతికమైనది. ఆ చర్య ప్రభుత్వానికి వేలాది కోట్ల రూపాయల నష్టం తేవడంతో పాటు, ప్రభుత్వ భూమి అన్యాక్రాంతం కావడానికి వీలు కల్పించింది. ఇలా చేతులు మారిన భూమి 693 ఎకరాలు అని తొలివార్తలు రాగా, 796 ఎకరాలని, 816 ఎకరాలని ఆ అంకె మారుతూ వచ్చింది. ఈ భూమి విలువ పదివేల కోట్ల రూపాయల దాకా ఉండవచ్చునని ఊహాగానాలు వెలువడ్డాయి.

ఈ అక్రమాలన్నీ ఒక అంతర్గత పరిశీలనలో బైటపడి, ఉన్నతాధికారి ఫిర్యాదు చేయడంతో పోలీసులు ప్రవేశించి మే 29న ఆ సబ్ రిజిస్ట్రార్‌ను, ఇన్ఫ్రా కంపెనీల డైరెక్టర్లు ఇద్దరిని అరెస్టు చేసి కేసు పెట్టారు. అధికారంలోకి వచ్చి మూడు సంవత్సరాలు నిండిన సందర్భంగా భారీగా ఉత్సవాలు జరుపుకోబోతున్న ప్రభుత్వానికి సరిగ్గా మూడు రోజుల ముందే ఈ భారీ కుంభకోణం బైటపడడంతో ఏవో కంటి తుడుపు చర్యలు తీసుకోక తప్పలేదు. ప్రభుత్వం హడావిడిగా రంగంలోకి దిగి రాష్ట్ర వ్యాప్తంగా 142 రిజిస్ట్రేషన్ కార్యాలయాల మీద దాడి చేయమని పోలీసులను ఆదేశించింది. ఎనీవేర్ రిజిస్ట్రేషన్ పద్ధతిని రద్దు చేసింది. డెబ్భై మందికి పైగా సబ్ రిజిస్ట్రార్లను, జాయింట్ రిజిస్ట్రార్లను బదిలీ చేసింది. సబ్ రిజిస్ట్రార్లకు, రిజిస్ట్రార్లకు ఉన్న అధికారాలపై కోత విధించింది. మియాపూర్ భూకుంభకోణంపై సిఐడి దర్యాప్తుకు ఆదేశించింది. జిల్లాలలో కూడ సబ్ రిజిస్ట్రార్ కార్యాలయాల మీద అవినీతి నిరోధక శాఖ చేత దాడులు చేయించింది. ఇకనుంచి అన్ని రిజిస్ట్రేషన్ కార్యాలయాల్లో సిసిటివి కెమెరాల నిఘా ఏర్పాటు చేయాలని ఆదేశించింది. అవినీతి నిరోధక శాఖ అధికారులు కొందరు సబ్ రిజిస్ట్రార్ల ఇళ్ల మీద కూడ దాడిచేసి వారి ఆదాయాలకు మించిన ఆస్తులు, కోట్లాది రూపాయల ఆస్తులు ఉన్నాయని తేల్చారు.

అయితే ఈ కుంభకోణం గురించి వార్తలు తమ ఉత్సవాల మధ్య ఇబ్బంది పెట్టాయి గనుక మాత్రమే పాలకులు ఈ మాత్రం తూతూ మంత్రం చర్యలు ప్రకటించారు గాని ఈ చర్యలు కొనసాగించాలని, అక్రమాలకు పాల్పడిన వారందరినీ విచారించాలనీ, శిక్షించాలనీ, హైదరాబాదు లోనూ తెలంగాణలోనూ భూక్రయ విక్రయాల అక్రమాలను అరికట్టడానికి ఇది ఒక సందర్భంగ తీసుకోవాలనీ అనుకోలేదు. ఇటువంటి భూముల అమ్మకం కొనుగోలు అక్రమాలు, ప్రభుత్వ భూములు అన్యాక్రాంతం కావడం, రిజిస్ట్రేషన్ అధికారుల అవినీతి ఒక్క మియాపూర్‌లో మాత్రమే జరగలేదు. అదే సమయంలో నగరంలోని గచ్చీబౌలి, ఎల్బీ నగర్, బాలానగర్, ఘాంసిమియా గూడ (శంషాబాద్), ఇబ్రహీంపట్నం వంటి చోట్ల జరిగిన భూకుంభకోణాల గురించి కూడ వార్తలు వెలువడ్డాయి. అంటే మియాపూర్‌లో బైటపడినది నీటిలో మునిగి ఉన్న మంచుకొండ శిఖరాగ్రం మాత్రమేననీ, తవ్వితే ప్రతి ఎకరంలోనూ అక్రమాలు బైటపడే అవకాశం ఉందని స్పష్టమయింది. అందువల్ల ఒక విశాలమైన, సమగ్రమైన విచారణ, పరిశోధన, కఠిన చర్యలకు నాంది పలకవలసిన సందర్భం వచ్చింది. కాని ఈ భూముల కుంభకోణా లలో రియల్ ఎస్టేట్ వ్యాపారులు, రిజిస్ట్రేషన్ అధికారులు మాత్రమే కాక, అధికార పార్టీతో సహా అన్ని రాజకీయ పార్టీల నాయకులు, ముఖ్యమంత్రి కార్యాలయంలోని ఒక సీనియర్ మహిళా ఐఎఎస్ అధికారి, ఒక మంత్రి పేషీలోని ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ వంటివారికి సంబంధాలున్నాయని బైటపడింది. పాలకపార్టీ పార్లమెంటు సభ్యుడు కె. కేశవరావు కుటుంబ సభ్యుల పేరు మీద ఈ అక్రమ భూముల్లో కొంత భాగం రిజిస్టర్ అయిందని బైటపడింది. మియపూర్‌లో అక్రమంగా భూమి రిజిస్ట్రేషన్ అయిన ట్రినిటీ ఇన్ఫ్రా వెంచర్ అనే సంస్థకూ పాలకపార్టీకి సన్నిహితుడు, ముఖ్యమంత్రి బంధువు, పాలకపార్టీ పత్రిక యజమాని దీవకొండ దామోదర్ రావుకూ సన్నిహిత సంబంధం ఉందని బైటపడింది. అంటే నిజాయితీతో దర్యాప్తు, పరిశోధన జరిపితే చూపుడువేలు అధికారపక్షం వైపుకే తిరుగుతుందని స్పష్టంగా తేలింది. అందువల్లనే భూముల అక్రమ క్రయవిక్రయాల కేసులో సమగ్రంగా దర్యాప్తు, పరిశోధన జరపాలని, నేరస్తులందరినీ బోనెక్కించి విచారించాలని, నేరస్తులకు శిక్షలు విధించేలా చూడాలని పాలకులు అనుకోలేదు. ఈ వివాదం నుంచి బైటపడడం ఎట్లా, ప్రజలదృష్టిని మళ్లించడం ఎట్లా అనే అంశాలపైనే కేంద్రీకరించారు.

అసలు మియాపూర్ కుంభకోణంలో బైటపడిన భూ క్రయ విక్రయ ఆక్రమణ అక్రమాలు సముద్రంలో కాకిరెట్ట లాంటివి. తెలంగాణ భూమి చరిత్ర, హైదరాబాద్ నగర భూమి చరిత్ర ఇటువంటి ఎన్నో కుంభకోణా లకు, అక్రమాలకు వీలు కల్పించే చరిత్ర. ఇందుకు ప్రధాన కారణం అసఫ్ జాహీ పాలనలో నెలకొన్న భూయాజమాన్యపు అవకతవకలు, వాటిని యథాతథంగా కొనసాగించిన ఆంధ్రప్రదేశ్ పాలకుల అక్రమాలు.

అసఫ్ జాహీ పాలనలోని హైదరాబాద్ రాజ్యం ఐదు కోట్ల ముప్పై లక్షల ఎకరాల విస్తీర్ణంతో ఉండేది. మొత్తం రాజ్యంలో పదో వంతు భూమి, యాభై రెండు లక్షల ఎకరాలు, నిజాం ప్రభువుల సొంత ఆస్తి (సర్ఫ్ ఎ ఖాస్) గా ఉండేది. అది మొత్తం రాజ్యంలో 1961 గ్రామాల్లో విస్తరించి ఉండగా, అందులో తెలంగాణలో 789 గ్రామాలుండేవి. అది కాక, పాయెగాలు, ఉమ్రాలు, జాగీర్లు, సంస్థానాలు, ఎస్టేట్లు, ఇనాంలు, దేశముఖ్‌లు, దేశపాండేలు, మక్తేదార్లు వంటి ఏడెనిమిది అంతరాల భూస్వామ్య వర్గం చేతుల్లో మరొక రెండు కోట్ల ఎకరాలుండేది. అంటే వందల, వేల, లక్షల ఎకరాలు సొంతఆస్తిగా కలిగిన భూస్వాముల చేతుల్లోనే రాజ్యంలోని సగం భూమి ఉండేది. నాటి హైదరాబాద్ రాజ్యంలో మరాఠీ మాట్లాడే ఐదు జిల్లాలు, కన్నడం మాట్లాడే మూడు జిల్లాలు మినహాయిస్తే, అప్పటికి ఎనిమిది జిల్లాల తెలంగాణ విస్తీర్ణం రెండు కోట్ల ఎనభై లక్షల ఎకరాలు కాగా, అందులో ఉజ్జాయింపుగా సగం ఒక కోటీ నలభై లక్షల ఎకరాలు రాజుకూ, ప్రభువర్గానికీ, బడా భూస్వాములకూ చెందినదని అనుకోవచ్చు. హైదరాబాదుపై పోలీసు చర్య అనే సైనిక చర్య తర్వాత ఈ బడా భూస్వామ్య వర్గపు ఆస్తిలో, ముఖ్యంగా భూమిలో ఎక్కువ భాగం ప్రభుత్వ ఆస్తిగా మారింది.

భారత ప్రభుత్వ సైనిక చర్యతో 1948 సెప్టెంబర్ 17న నిజాం ప్రభుత్వం కూలిపోయిన తర్వాత 1949 ఫిబ్రవరి 22న సర్ఫ్ ఎ ఖాస్ భూములను ప్రభుత్వానికి బదలాయిస్తూ ఒక ఫర్మాన్ విడుదల చేశారు. 1949 ఆగస్ట్‌లో జాగీర్ల రద్దు చట్టం ప్రకటించి, 967 జాగీర్ల అధీనంలోని 6,536 గ్రామాలలో ఒక కోటీ అరవై నాలుగు లక్షల ఎకరాల భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఈ అంకె మొత్తం హైదారాబాదు రాజ్యానికి సంబంధించినది గాని, అందులో సగం తెలంగాణలో ఉండి ఉండవచ్చు. ప్రభుత్వం ఉస్మాన్ అలీ ఖాన్‌కు, జాగీర్దార్లకు నష్టపరిహారం చెల్లించి మరీ ఈ భూములను స్వాధీనం చేసుకున్నది. ఆ భూముల్లో కొంత భాగం మీద అప్పటికి కనీసం ఏడు సంవత్సరాలుగా కౌలుకు సాగు చేస్తున్న రైతులకు 1950 రక్షిత కౌల్దారీ చట్టం ప్రకారం అధికారం స్థిరపడింది గాని సాగులో లేని భూమి లక్షలాది ఎకరాలు ప్రభుత్వ

భూమిగా మారింది. లేదా, అంగబలం, అర్థబలం ఉండి ఆక్రమించుకున్న పెత్తందార్ల ఆస్తిగా మారింది. అలాగే సైనిక చర్య తర్వాత చాల మంది బడా భూస్వాములు, ముఖ్యంగా ముస్లిం భూస్వాములు పాకిస్తాన్‌కో, ఇతర దేశాలకో వెళ్లిపోవడంతో వారి భూములు, ఆస్తులు లావారిస్ (వారసులు లేని) ఆస్తులుగా మిగిలి, దురాక్రమించుకున్న వారి ఆస్తులుగా మారిపోయాయి.

నిజానికి తెలంగాణ భూయాజమాన్యంలోని ఇటువంటి చారిత్రక అవకతవకల గురించి ఇంకా పరిశోధించవలసినదీ, విశ్లేషించవలసినదీ ఎంతో ఉంది గాని ప్రత్యేకించి హైదరాబాద్ గురించి కూడ కొంత తెలుసుకోవాలి. తెలంగాణలో సర్ఫ్ ఎ ఖాస్ మొత్తం 789 గ్రామాల్లో విస్తరించి ఉండగా, అందులో అత్యధికంగా 573 గ్రామాలు అత్రాఫ్ బల్దా జిల్లాలోనే ఉండేవి. నాటి అత్రాఫ్ బల్దా జిల్లా అంటే ప్రస్తుత గ్రేటర్ హైదరాబాద్. లేదా హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలు. అంటే ప్రస్తుత గ్రేటర్ హైదరాబాద్ లోని కొన్ని లక్షల ఎకరాలు 1948 సెప్టెంబర్ తర్వాత ప్రభుత్వ భూమిగా మారిపోయాయి. దేశవ్యాప్తంగా సంస్థానాలు, రాజకుటుంబాలు, వారి రాజ్యాల రాజధాని నగరాలు ఎన్నో ఉన్నప్పటికీ, ఆ నగరాల్లో ఏ ఒక్కదానికీ లేని ప్రత్యేకత హైదరాబాద్‌కు దక్కింది. నగరంలోనూ, చుట్టుపట్లా లక్షల ఎకరాల ప్రభుత్వ భూమి ఉన్న ఏకైక నగరంగా హైదరాబాద్ నిలిచింది. దానితో పాటే తెలంగాణ అంతటా, ముఖ్యంగా జాగీరు గ్రామాలలో, ప్రత్యేకించి హైదరాబాద్ నగరంలో చాల చోట్ల భూయాజమాన్యం గురించి స్పష్టమైన, నిస్సందేహమైన, నిర్ద్వంద్వమైన పత్రాలు లేని స్థితి ఉండింది. అసంఖ్యాకంగా భూ యాజమాన్య వివాదాలు, న్యాయస్థానపు వ్యాజ్యాలు చెలరేగాయి. ఈ కారణం వల్లనే తెలంగాణలో భూముల క్రయ విక్రయాలు ఇష్టారాజ్యంగా జరగగూడదని, తెలంగాణ ప్రాంతీయ మండలి ఆమోదం మేరకే క్రయ విక్రయాలు జరగాలని ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు రాసుకున్న పెద్ద మనుషుల ఒప్పందం (1956) లో ఒక నిబంధన చేర్చారు.

అయినప్పటికీ 1950 నుంచే రాజకీయ, అధికార వర్గాలు భూములను ఆక్రమించడం, లావారిస్ ఆస్తులు, ప్రభుత్వ ఆస్తులు తమకు అంతకు ముందు ఎప్పుడో అమ్మినట్టుగా తప్పుడు పత్రాలు సృష్టించడం, వారసులు కాని వారెందరో తామే వారసులమని, తమకు ఆస్తులు ఇప్పించాలని న్యాయస్థానాలలో వ్యాజ్యాలు వేయడం మొదలయ్యాయి. ఇవి వ్యక్తిగత స్థాయి వివాదాలు కాగా, 1956లో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తనకు వారసత్వంగా వచ్చిన విస్తారమైన భూమిని తన ఇష్టారాజ్యంగా ఆశ్రితులకు పంపిణీ చేయడం ప్రారంభించింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ రంగ సంస్థలు, సైనిక బలగాలు, పరిశోధనా సంస్థలు, విద్యాసంస్థలు వంటి ప్రభుత్వ, ప్రజోపయోగ కార్యక్రమాలకు వేలాది ఎకరాల భూమిని రాష్ట్ర ప్రభుత్వం ఇస్తూ వచ్చింది. ఇక 1980లు వచ్చి, ప్రపంచీకరణ కార్యక్రమాలు, బహుళజాతి సంస్థల భూముల వేట, దేశదేశాల సంపన్నులు, ముఖ్యంగా కోస్తాప్రాంతం నుంచి విదేశాలకు, అమెరికాకు వెళ్లి విపరీతంగా డబ్బు సంపాదించి దాన్ని తిరిగి స్వరాష్ట్రంలో మదుపు పెట్టదలచుకున్న శక్తులు అందరికీ ఏదో ఒక సరైనదో, కానిదో కారణం చూపి వందల ఎకరాలు భూమి అడగడానికీ, ప్రభుత్వాధికారం నెరపుతున్న పెద్దలు చేతికి ఎముక లేకుండా దానం చేయడానికీ మార్గం సుగమమైంది. మొదట భూమిని ప్రభుత్వ భూమిగానే ఉంచుతూ కారు చౌకగా 49 సంవత్సరాల, 99 సంవత్సరాల లీజుకు ఆయా వ్యక్తులకు, సంస్థలకు కట్టబెట్టే అలవాటు, క్రమంగా చంద్రబాబు నాయుడు వచ్చేనాటికి కారుచౌక ధరలకు పూర్తి అమ్మకంగా, చివరికి ఉచితంగా కూడ ఇవ్వడంగా మారింది. భూమి మీద ప్రభుత్వ యాజమాన్యం స్థానంలో పారిశ్రామిక వేత్తలుగా, వ్యాపారస్తులుగా చెప్పుకుని భూమి సంపాదించినవారి యాజమాన్యం మొదలయింది. సినిమా పరిశ్రమ తరలిరావడానికనే పేరుతో, పారిశ్రామికీకరణ పేరుతో, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయోటెక్నాలజీ, ఫైనాన్షియల్ సర్వీసెస్, బిజినెస్ సర్వీసెస్ పేరుతో ప్రజా ప్రయోజనం ఉన్నా లేకపోయినా భూమి పందారం మొదలయింది. ఇలా దురాక్రమించిన, అక్రమంగా కబ్జా పెట్టిన భూముల్లో రియల్ ఎస్టేట్ వెంచర్లు, ఫార్మ్ హౌజులు, రిసార్టులు, గెస్ట్ హౌజులు, క్లబ్బులు, తోటలు, సినిమా స్టుడియోలు, ఐటి కంపెనీలు కుప్పలు తెప్పలుగా వచ్చాయి.

ప్రభుత్వానికి, విప్లవపార్టీలకు మధ్య జరిగిన చర్చలలో 2004 అక్టోబర్ 15న విప్లవ పార్టీలు ప్రభుత్వం ముందు ఉంచిన 'భూమి పంపిణీ – వ్యవసాయ రంగ అభివృద్ధి – మా అవగాహన' అనే పత్రంలో 'మా నిర్దిష్ట ప్రతిపాదనలు' అనే శీర్షిక కింద చేసిన 17 ప్రతిపాదనలలో ఒకటిగా "వ్యవసాయంతో సంబంధం లేని ఫార్మ్ హౌజెస్, స్టుడియోలు, పరిశ్రమలు, పత్రికలు, విద్య, వైద్యం, వినోదం, రియల్ ఎస్టేట్ పేరు మీద కొనసాగుతున్న వ్యవసాయ భూములను స్వాధీనం చేసుకుని పేదలకు పంచాలి. పట్టణాల్లో వివిధ సంస్థలకు అవసరానికి మించి ప్రభుత్వం ఇచ్చిన భూమి, రియల్ ఎస్టేట్‌గా మారే అవకాశం ఉన్న వ్యవసాయ భూమిని కూడ వెనక్కి తీసుకుని పేదలకు పంచాలి" అని ప్రతిపాదించారు. ఈ పత్రానికి అనుబంధంగా 'హైదరాబాద్ పరిసరాల్లో అన్యాక్రాంతమైన వ్యవసాయ భూముల వివరాలు' అంటూ దాదాపు 50 సంస్థలకు ఇచ్చిన 25,000 ఎకరాలకు పైగా భూమి వివరాలు ఇచ్చారు. ఈ వివరాల మీద భూఆక్రమణల మీద, పందారాల మీద పెద్ద ఎత్తున చర్చ జరిగింది.

తెలంగాణలో, ప్రత్యేకించి హైదరాబాద్ భూముల విషయంలో జరిగిన అక్రమాల గురించి ఇంతగా చర్చ జరిగినప్పటికీ, ఆ తర్వాత కూడ భూపందారాలు ఆగలేదు. మణికొండ జాగీర్ భూములను ఎమార్ ప్రాపర్టీస్ అనే దుబాయికి చెందిన దొంగ కంపెనీకి ఇచ్చిన కేసులో ఒక ఐఎఎస్ అధికారితో సహా ఎందరో జైలు పాలయ్యారు. మణికొండలోనే వక్ఫ్ భూములను లాంకో గ్రూప్ కంపెనీలకు ఇచ్చిన కేసు వివాదాస్పదమై, అప్పటి ప్రభుత్వం వక్ఫ్ బోర్డు మీద ఒత్తిడి తెచ్చి, అది తమ భూమి కాదని న్యాయస్థానం ముందర వక్ఫ్ బోర్డ్ తోనే చెప్పించింది.

ఈ నేపథ్యంలో వెల్లువెత్తిన తెలంగాణ ఉద్యమక్రమంలో, 1956 నుంచి జరిగిన భూ క్రయవిక్రయ అక్రమాలను, భూ బదలాయింపులను అన్నిటినీ తెలంగాణ రాష్ట్రం ఏర్పడినాక సమీక్షించాలని, అక్రమాలను సవరించాలని డిమాండ్‌ను కొందరైనా ముందుకు తెచ్చారు. మరీ ముఖ్యంగా లాంకో రాజగోపాల్ తెలంగాణ ఉద్యమ వ్యతిరేకిగా దూకుడుగా ముందుకు వచ్చినందువల్ల, ఆయనకు అక్రమంగా ప్రభుత్వం ఇచ్చిన భూమి గురించి, ఇతర ఆంధ్ర, రాయలసీమ ప్రాంత భూ బకాసురుల గురించి చాల వేదికల మీద చర్చ జరిగింది. పెద్దమనుషుల ఒప్పందంలో భూ క్రయ విక్రయాల నిబంధనను గుర్తు చేస్తూ, 1956 నుంచి జరిగిన భూబదలాయింపులన్నిటి పైన సమీక్ష జరపాలని డిమాండ్ వచ్చింది. జరిగిన చరిత్రలోని అక్రమాల వల్ల, తలెత్తిన డిమాండ్ వల్ల

భూమి విషయంలో సంస్కరణలు జరపడానికి, అక్రమాలను సవరించడానికి తెలంగాణ ప్రభుత్వానికి మంచి అవకాశం వచ్చింది. కాని తెలంగాణ ఏర్పడి మూడు సంవత్సరాలు గడిచినా ఆ అవకాశాన్ని ప్రభుత్వం వాడుకోలేదు. లేదా, ఆ వివరాలు తెలుసుకుని తన స్వప్రయోజనాలు నెరవేర్చుకోవడానికి వాడుకోవడం ప్రారంభించింది. భూబదలాయింపుల అక్రమాల వివరాలు తెలుసుకోవడానికి తెలంగాణ ప్రభుత్వం ఏమి చేసిందో, ఆ వివరాల మీద ఆధారపడి చర్యలు తీసుకోవడంలో మాత్రం ఎందుకు వెనుకడుగు వేసిందో తెలుసుకుంటే గాని మియాపూర్ కుంభకోణం విషయంలో ప్రభుత్వ నిర్లిప్తతకు, సాచివేత ధోరణికి, చివరికి నిష్క్రియకు కారణాలు, మూలాలు అర్థం కావు.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడి, 2014 జూన్ 2న తెలంగాణ రాష్ట్ర సమితి ప్రభుత్వం ఏర్పాటయినాక ఆరు నెలలు తిరగకుండానే డిసెంబర్ 5న హైదరాబాద్ భూసంబంధిత అక్రమాలను పరిశోధించి నివేదిక ఇవ్వడానికి ఒక టాస్క్ ఫోర్స్ ను నియమించారు. లాండ్ అడ్మినిస్ట్రేషన్ చీఫ్ కమిషనర్‌గా పదవీ విరమణ పొందిన, నిజాయితీపరుడని పేరు ఉన్న సీనియర్ ఐఎఎస్ అధికారి ఎస్.కె. సిన్హా నేతృత్వంలో ఈ టాస్క్ ఫోర్స్ ఏర్పడింది. తెలంగాణ రాష్ట్రంలో, ప్రత్యేకించి హైదరాబాద్ పరిసరాల్లో భూ యాజమాన్యం, ప్రభుత్వ భూములు, అక్రమ ఆక్రమణలు, రిజిస్ట్రేషన్లలో అక్రమాలు, భూబదలాయింపులు వంటి వ్యవహారాలు పరిశీలించి సమగ్ర నివేదిక సమర్పించడం, అక్రమాలు సరిదిద్దడానికి సిఫారసులు చేయడం ఈ టాస్క్‌ఫోర్స్ బాధ్యతలు. పద్దెనిమిది నెలల పాటు పనిచేసి ఈ టాస్క్‌ఫోర్స్ ఒక వివరమైన నివేదికను 2016 జూన్‌లో సమర్పించింది. ఆ నివేదికను శాసనసభలో సమర్పించి, తగిన చర్యలు తీసుకుంటారని అప్పట్లో వార్తలు వెలువడ్డాయి గాని ఏడాది గడిచినా ఇప్పటికీ ఆ నివేదికను బైటపెట్టలేదు. టాస్క్ ఫోర్స్ పదవీకాలం డిసెంబర్ 2016తో పూర్తి అయినా, టాస్క్‌ఫోర్స్ పని పూర్తి కాకపోయినా దాని పదవీ కాలాన్ని పొడిగించలేదు.

ఎస్.కె. సిన్హా కమిటీ ఇచ్చిన నివేదికలను ప్రభుత్వం అధికారికంగా బైట పెట్టనప్పటికీ, ఆ నివేదికలో ఏముందో చెదురుమదురుగా వార్తలు వచ్చాయి. చట్టబద్ధంగా ప్రభుత్వానికి చెంది, ప్రస్తుతం ప్రభుత్వ స్వాధీనంలో లేని, ఇతరుల స్వాధీనంలో ఉన్న భూములను ఈ కమిటీ లెక్కించింది. భూదాన్, దేవాదాయ, ధర్మాదాయ, వక్ఫ్, ఇనాం, సనద్, అసైన్డ్ భూములలో ప్రభుత్వం దగ్గరనో, అవి పొందినవారి దగ్గరనో ఉండవలసిన భూములు ఇతరుల దగ్గర ఎలా ఉన్నాయో కమిటీ నిర్ధారించింది. ఇలా అన్యాక్రాంతమైన భూమిని వెనక్కి తీసుకోవాలని, ఆక్రమణదారుల మీద చట్టపరమైన చర్యలు తీసుకోవాలని, కీలకమైన ఫైళ్లను ధ్వంసం చేసిన, మాయం చేసిన అధికారుల మీద చర్యలు తీసుకోవాలని కమిటీ సూచించింది. ఈ భూకుంభకోణాలతో సంబంధం ఉన్న శాసనసభ్యుల, మాజీ శాసన సభ్యుల, అధికారుల, డిప్యూటీ కలెక్టర్ల, ఆర్‌డిఒల పేర్లు స్పష్టంగా చెప్పి మరీ ఎవరెవరి మీద ఏ చర్య తీసుకోవచ్చునో సూచించింది.

రాష్ట్రంలో మొత్తంగా కనీసం 35.67 లక్షల ఎకరాల ప్రభుత్వ భూమి ఉందని, దానిలో 13.80 లక్షల ఎకరాలు సాగుకు లాయకైన భూమి కాదని ఈ కమిటీ నిర్ధారించింది. అంటే కనీసం 22 లక్షల ఎకరాల వ్యవసాయయోగ్యమైన ప్రభుత్వ భూమి ఉందని కమిటీ తేల్చిందన్నమాట. వేరువేరు సామాజిక వర్గాలకు అసైన్ మెంట్ ద్వారా ప్రభుత్వం ఇచ్చే భూమి చాల అన్యాక్రాంతమైందని, అసైన్డ్ భూమిని ఇతరులకు అమ్మడం చట్టబద్ధంగా నిషేధం అయినప్పటికీ అలా భూమి పొందినవారిలో దాదాపు ఒక లక్ష మంది మొత్తంగా 98,169 ఎకరాల అసైన్డ్ భూమిని ప్రైవేటు వ్యక్తులకు అమ్మివేశారని కమిటీ తేల్చింది. నిస్సందేహంగా ప్రభుత్వానికి చెందిన దాదాపు పది వేల ఎకరాల భూమి ప్రైవేటు వ్యక్తుల చేతుల్లోకి చేరిందని కమిటీ చెప్పింది. భూగరిష్ఠ పరిమితి చట్టం ప్రకారం మిగులు భూమిగా తేల్చిన భూమిలో పది వేల ఎకరాలు ప్రభుత్వ స్వాధీనంలో ఉండవలసి ఉండగా అన్యాక్రాంతమయ్యాయని చెప్పింది. భూదాన్ భూముల్లో 49,000 ఎకరాల పైన చేతులు మారాయని, దేవాదాయ, ధర్మాదాయ భూములు దాదాపు 14,500 ఎకరాలు అన్యాక్రాంతమయ్యాయని ఈ నివేదిక చెప్పింది.

మొత్తంగా అన్యాక్రాంతమైన భూములలో 5.90 లక్షల ఎకరాల భూములను ప్రభుత్వం వెనక్కి తీసుకోవడానికి చట్టపరమైన అడ్డంకులేమీ లేవని కమిటీ చెప్పింది. అలాగే గతంలో అసైన్ చేసిన భూములు ఏ కారణం కోసం ఇచ్చారో ఆ కారణానికి వాడకంలో లేనందువల్ల 16,288 ఎకరాల భూమిని ప్రభుత్వం వెనక్కి తీసుకోవచ్చునని కమిటీ చెప్పింది. ప్రత్యేకించి పదకొండు భూకుంభకోణాల గురించి ప్రత్యేక నివేదికలు ఇచ్చిన ఈ కమిటీ కొల్లూరు, ఉస్మాన్‌సాగర్, తెల్లాపూర్, పటాన్‌చెరు, రామచంద్రాపురం, బాట సింగారం, తుర్క యాంజాల్‌లలో మాజీ సైనికులకు, రాజకీయ బాధితులకు, స్వాతంత్ర్య సమరయోధులకు, దళితులకు అసైన్ చేసిన భూముల బదలాయింపులలో జరిగిన అక్రమాలను పేర్కొంది. హైదరాబాద్-వరంగల్ రహదారికి ఇరువైపులా 800 ఎకరాల ప్రభుత్వ భూమిని అక్రమంగా కబ్జా చేసి చుట్టూ సొంతభూమి లాగ గోడలు కట్టుకున్న ఉదంతాన్ని ప్రస్తావించింది.

తెలంగాణ సమాజానికి, ప్రజలకు చెందిన ఈ భూమి ఆరు దశాబ్దాలుగా గురైన అక్రమ ఆక్రమణల నుంచి తప్పించి, మళ్లీ తెలంగాణ సామాజిక వనరుగా మార్చడానికి తెలంగాణ ప్రభుత్వానికి ఎస్.కె. సిన్హా కమిటీ నివేదిక ఒక అవకాశం ఇచ్చింది. ప్రభుత్వ భూమి ఎంత ఉందో, అన్యాక్రాంతమైన భూమి ఎంత వెనక్కి తీసుకోవచ్చునో సూచించి భూమిలేని దళిత కుటుంబాలకు మూడు ఎకరాల భూమి, అభివృద్ధి పథకాల కోసం భూమి, అభివృద్ధి పథకాలలో నిర్వాసితులవుతున్నవారికి భూమి ఇవ్వడానికి తెలంగాణ ప్రభుత్వానికి ఈ నివేదిక అవకాశం ఇచ్చింది. కాని ప్రభుత్వం ఆ అవకాశాన్ని వాడుకోదలచుకోలేదు. అక్రమ ఆక్రమణ దారుల గురించి తెలుసుకుని వారిని బెదిరించి తనకు అనుకూలం చేసుకోవడానికి, ఎక్కడెక్కడ ప్రభుత్వ భూమి లభ్యమవుతున్నదో తెలుసుకుని తన ఆశ్రితులకు పందారం చేయడానికి లేదా అధికార పార్టీకి చెందినవారు ఆక్రమించడానికి ఒక అవకాశంగా మాత్రమే తెలంగాణ ప్రభుత్వానికి ఈ కమిటీ నివేదిక ఉపయోగపడింది. అందువల్లనే మియాపూర్ భూకుంభకోణం ఎంత గగ్గోలును సృష్టించినా, ప్రచార సాధనాలలో ఎంత హోరెత్తినా, పైపైన కొన్ని తూతూమంత్రపు చర్యలు తప్ప లోతైన, నిర్మాణాత్మకమైన చర్యలు లేవు. తెలంగాణ భూమిని తెలంగాణ ప్రజలనుంచి వేరుచేసి అన్యాక్రాంతం చేసిన ఆరు దశాబ్దాల ఆంధ్రప్రదేశ్ చరిత్రను పునరావృతం చేయడమే తన పని అన్నట్టు తెలంగాణ ప్రభుత్వం ప్రవర్తిస్తున్నది. కాకపోతే ఈ సారి అక్రమ ఆక్రమణల నాటకంలో కొన్ని పాత్రలు, పాత్రధారులు మారారు. కాని ఎడతెగకుండా సాగుతున్న నాటకం మాత్రం అదే.

*(రచయిత వీక్షణం సంపాదకుడు)* వీ

# ఇసుక మాఫియా కోసం ప్రజలపై దాడులు

*ఇసుక మాఫియా లారీల కింద ప్రజలు ప్రాణాలు కోల్పోతుంటే ప్రభుత్వం ఆ సమస్యను పరిష్కరించకుండా, పోలీసు నిర్బంధం పరిష్కారంగా భావించడంలోనే పాలకుల బలహీత అర్థమవుతుందని అంటున్నారు* **వై. రామచంద్రం, మానువాడ విజయ్**

తెలంగాణ రాష్ట్ర వ్యాప్తంగా ప్రజలను కలిచివేస్తున్న ఘటన జరిగిన నేరెళ్ల గ్రామం రాజన్న సిరిసిల్లా జిల్లా కేంద్రానికి 13 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఘటన వివరాల్లోకి వెళితే జూలై 2న నేరెళ్ల గ్రామానికి చెందిన ఎరుకల భూమయ్య(55) అనే రైతు ఎరువుల కోసం జిల్లెల క్రాసింగ్‌కి వెళ్లి మోటర్ సైకిల్‌పై తిరిగి వస్తున్నాడు. అదే సమయంలో ఎదురుగా వస్తున్న ఇసుక లారీ భూమయ్య మోటార్ సైకిల్‌ని ఢీకొట్టింది. దీంతో ఆయన అక్కడికక్కడే మృతి చెందాడు. గత రెండు సంవత్సరాల కాలంలో ఇసుక లారీలు గుద్దడం వల్ల ఐదుగురు చనిపోయారు. అందులో నేరెళ్ల గ్రామానికి చెందిన గంధం మల్లేశం(58), బొల్లవేని రమేష్(45), వడ్ల రవి(31), బంగారపు భూమయ్య(55), జిల్లెలకు చెందిన కారంగుల కరుణాకర్ రావు(32) ఉన్నారు. 46 మంది గాయాలపాలయ్యారు. ఇలా చనిపోయిన సందర్భాల్లో కాంట్రాక్టర్లు, తాము లారీ యజమానులం కాదని స్థానిక నాయకులు, పోలీసులు మృతుల కుటుంబాలకు చెప్పి తప్పించు కుంటున్నారు. కావాలంటే కోర్టులో కేసు వేసుకొమ్మని సలహా ఇచ్చి శవాన్ని అక్కడి నుండి తరలించడానికి మాత్రం తమ శాయశక్తులా ప్రయత్నం చేస్తున్నారు.

ఇదే ప్రాంతంలో వరుసగా ప్రమాదాలు జరిగిన ప్రతిసారి స్థానిక ప్రజలు ఈ దారి గుండా ఇసుక లారీలు నడుపవద్దని నిరసన తెలిపిన ఎవరు పట్టించుకోలేదు. ఇదే క్రమంలో జూలై 2న భూమయ్య కూడా ఇసుక లారీ ప్రమాదంలో చనిపోయిన విషయం తెలియడంతో నేరెళ్ల, జిల్లెల, రామచంద్రాపురం గ్రామాల ప్రజలు ఆవేదనకు లోనయ్యారు. ఎప్పటి నుండో ప్రజల్లో గూడుకట్టుకొని ఉన్న ఆగ్రహం కట్టలు తెంచుకుని తమ ప్రాణాలను తీస్తున్న లారీలపై దాడి చేశారు. ఈ దాడిలో నాలుగు లారీలు కాలిపోయాయి. మరో ఐదు లారీల అద్దాలు పగిలాయి. ఈ ఘటన గురించి తెలుసుకున్న స్థానిక ఎస్.ఐ. సైదారావు కానిస్టేబుళ్లతో సంఘటన స్థలానికి చేరుకున్నారు. పోలీసులు అక్కడి ప్రజలను చెదరగొట్టడానికి ప్రయత్నించడంతో పోలీసులకు ప్రజలకు మధ్య ఘర్షణ జరిగింది. ప్రజలు శవాలుగా మారుతుంటే స్పందించని వారు మమ్మల్ని చెదరగొట్టడమేంటని ప్రజలు నిలదీశారు. దీంతో ఎస్.ఐ. పై అధికారులకు సమాచారం ఇచ్చారు. జిల్లా ఎస్.పి. విశ్వజిత్ కంపాటి, సి.ఐ. శ్రీనివాసరావు పోలీసు బెటాలియన్‌తో ఆ ప్రాంతానికి చేరుకున్నారు. ప్రజలు చెదిరి పోకుండా ఆరు గంటలపాటు రోడ్డుపైనే కూర్చున్నారు. కాలుతున్న లారీల మంటలను ఆర్పడానికి వచ్చిన ఫైర్ ఇంజన్లను కూడా ప్రజలు అడ్డుకున్నారు. ఆయిల్ ట్యాంకులు పేలిపోతాయనడంతో వదిలారు. ఇది మొదటి రోజు జరిగిన సంఘటన వివరాలు.

ఇక రెండవ రోజైన జూలై 3న నేరెళ్ల, జిల్లెల, రామచంద్రాపురం గ్రామాల ప్రజలు సిరిసిల్లలోని అంబేద్కర్ చౌరస్తా వద్ద బాధిత కుటుంబానికి న్యాయం చేయాలని డిమాండ్ చేస్తూ బైటాయించారు. ఎవరు పట్టించుకున్నది లేదు. అన్నింటికి పోలీసులే సమాధానాలు చెపుతున్నారు.

ప్రజలు వ్యక్తం చేసిన ఆగ్రహం ప్రభుత్వానికి, పోలీసులకు చట్ట వ్యతిరేకమైనదిగా అనిపించింది. అందులో భాగంగానే స్థానిక పోలీసులు లారీ దగ్ధం కేసులో అనుమానితులు అనే పేరుతో నేరెళ్ల గ్రామంలోని ఇండ్లలోకి బలవంతంగా చొరబడి యువకులను పట్టుకుపోయారు. అడ్డుపడిన కుటుంబ సభ్యులతో ఎస్.పి. విశ్వజిత్ కంపాటి మాట్లాడి పంపిస్తామని చెప్పారు. పోలీసులు పట్టుకుపోయిన వారిలో పెంట బాలయ్య, కోలా హరీష్, చెప్యాల బాలరాజ్, పసుల ఈశ్వర్, గంధం గోపాల్, బత్తుల మహేష్, చికోటి శ్రీనివాస్, గణేష్‌లు ఉన్నారు. తమ పిల్లలు సాయంత్రమైన తిరిగి రాకపోవడంతో ఆందోళనకు గురైన కుటుంబ సభ్యులు జూలై 6న ఎస్.పి.ని కలిశారు. 'మీరు గనుక మీ పిల్లలకోసం రోడ్డెక్కితే మీ పిల్లలు శవాలుగా వస్తార'ని బెదిరించి పంపించారు. 8వ తేదీన ఎనిమిది మందిని సిరిసిల్ల కోర్టులో హాజరుపరిచి జైలుకు తీసుకెళ్లారు. తీవ్రగాయాలతో వచ్చిన వారిని చూసిన జైలర్ జైల్లో పెట్టుకుంటే వారికి ఏమవుతుందోననే భయంతో చికిత్సకోసం తిప్పిపంపారు. పోలీసులు వారిని ప్రభుత్వ ఆస్పత్రిలో చూపించి మెడికల్ సర్టిఫికెట్ తీసుకువచ్చి జైలుకు పంపారు.

కుటుంబ సభ్యులు జూలై 10న జైలుకెళ్లి కలిశారు. తమ పిల్లల ఒంటిపై ఉన్న దెబ్బలకు చలించిపోయి భోరున ఏడ్చామన్నారు. పట్టుకెళ్లినప్పటి నుండి వరుసగా నాలుగు రోజులు కొట్టారని యువకులు తెలిపారు. కొట్టే క్రమంలో సొమ్మసిల్లి పడిపోతే కరెంట్ షాక్‌లిచ్చి లేపి కొట్టారన్నారు. రోకలిబండలెక్కిచ్చి తీవ్రమైన చిత్రహింసలకు గురిచేసినట్లుగా తెలిపారు. చిత్రహింసలకు గురిచేసిన విషయాన్ని ఎక్కడైనా చెపితే మీ కుటుంబంలోని మహిళలపై వ్యభిచారం కేసు పెడతామని, గంజాయి కేసు పెడతామని, ఎన్‌కౌంటర్ చేస్తామని ఎస్.పి. బెదిరించారని తెలిపారు.

కాంగ్రెస్ పార్టీ నాయకులు బాధితులను కలిసి మాట్లాడి ఆ విషయాల్ని మీడియాకు తెలిపారు. ఆ దృశ్యాలను సోషల్ మీడియాలో పెట్టారు. బయటికి కనిపించే తీవ్రగాయాలతో లేవలేకుండా వణికిపోతున్నవారి పరిస్థితి చూస్తే దీనికోసమేనా మనం తెలంగాణను పోరాడి సాధించుకున్నది అని అనిపించక మానదు. పోరాడి సాధించుకున్న

తెలంగాణలో దళితులకు జీవించే హక్కు లేదా అని బాధితులు ప్రశ్నిస్తున్నారు. ఇసుక మాఫియా రాజ్యాన్ని ఎవరు ప్రశ్నించకుండా ఉండడం కోసమే ప్రజల్ని చిత్రహింసలు పెట్టి భయభ్రాంతులకు గురిచేస్తున్నారు.

ఈ విషయం తెలుసుకున్న దళిత సంఘాలు, అన్ని రాజకీయ పార్టీలు, ప్రజా సంఘాలు, జెఏసి చైర్మన్ కోదండరాం, పౌరహక్కుల సంఘం, మందకృష్ణ మాదిగ, టిమాస్ వారు బాధితులను కలిసి పరామర్శించారు. ఘటన వివరాలు తెలుసుకొని ఆయా పార్టీలు, ప్రజా సంఘాలు విషయాన్ని బయటి ప్రపంచానికి తెలిపారు. మానవ హక్కుల కమిషన్‌కు ఫిర్యాదు చేశారు. ఇదే అంశంపై దాదాపు 150 సంఘాలు కరీంనగర్‌లోని అంబేద్కర్ భవన్‌లో అన్ని పార్టీలతో చర్చలు జరిపారు. ఈ ఘటనకు బాధ్యులైన ఎస్.పి. కంపాటి పై ఎస్‌సి/ఎస్‌టి అట్రాసిటీ కేసు నమోదు చేయాలని, హత్యానేరం కేసు పెట్టాలని, మొదటగా అతన్ని సస్పెండ్ చేయాలని, దళిత సంఘాల నాయకులపై పెట్టిన కేసులను ఎత్తివేయాలని డిమాండ్ చేశారు. గత నాలుగు నెలలుగా తెరిచిన రౌడీ షీట్లపైన, బైండ్ ఓవర్‌ల పైన పూర్తి విచారణ జరిపించాలనే డిమాండ్‌లతో జూలై 31న ఛలో సిరిసిల్లకు పిలుపునిచ్చారు.

జూలై 2న జరిగిన సంఘటనలు విడదీసి చూస్తే మొదటిది ఇసుక మాఫియా ప్రయోజనంలో భాగంగా జరిగినది. రెండవదానికి కారణం మొదటిదే. ఎందుకంటే ఏ కారణం లేకుండా ప్రజలు తమకు తామే వెళ్ళి లారీలను తగులబెట్టలేదు. ప్రజలు ప్రాణాలు కోల్పోయినప్పుడు స్పందించని ప్రభుత్వం, పోలీసులు ఇసుక లారీలను ప్రజలు కాల్చారన్న కారణంతో అరెస్టులు, చిత్రహింసలు, కేసులు, జైళ్లతో స్పందించింది. ఇది పోరాడి సాధించుకున్న తెలంగాణలో ప్రజలకు జరుగుతున్న న్యాయం! ఇక్కడ ప్రాణంలేని ఒక వస్తువైన లారీకి ఇచ్చినంత విలువ మనిషి ప్రాణానికి ఇవ్వడం లేదు. అట్లే ఇంకా కొంచెం ముందుకు వెళితే దేశంలో చనిపోయిన పశువుకు ఇచ్చిన విలువ నేను మనిషినే అని అనుకునే దళితులకు లేదు అనే విషయం ఈ ప్రభుత్వాలు రోజూ గుర్తుచేస్తునే ఉన్నాయి.

గతంలో ఇదే కారణంతో చనిపోయినప్పుడు స్థానికులు ఇసుక లారీలు ఆ దారిలో రావద్దని రాస్తారోకో చేసినా ఎటువంటి స్పందనా లేదు. ఇసుక లారీలు మాత్రం ఎటువంటి ఆటంకం లేకుండా స్థానిక రాజకీయ నాయకులు, పోలీసుల అండతో రోజూ తిరుగుతున్నాయి.

రాష్ట్ర వ్యాప్తంగా ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, పార్టీలు, హక్కుల సంఘాలు, ప్రజా సంఘాలు ప్రజల జీవించే హక్కుకు భగ్నం కలుగుతోందని ఆందోళన చెందుతున్న సందర్భంలో పౌరహక్కుల సంఘానికే అధ్యక్షున్ని అవుతానన్న ముఖ్యమంత్రి నుంచి ఎటువంటి స్పందనాలేదు. స్థానిక ఎంఎల్ఎ, మంత్రి, యువరాజు కెటిఆర్ ఈ ఘటనపై ప్రతిపక్షాలు స్పందిస్తే తప్ప స్పందించలేదు. పాలకుల ఈ మౌనానికి కారణాలు ఆర్థిక ప్రయోజనాలలోను, వ్యక్తిగత బంధుత్వాలలోను ఉన్నాయి. మిడ్‌మానేరు రిజర్వాయర్‌లో మునిగిపోయే ఈ భూములలో అపారమైన ఇసుక తవ్వితీయవచ్చునని అది ప్రభుత్వం తలపెట్టిన నిర్మాణ కార్యక్రమాలకు పనికి వస్తుందని సాకు చూపుతూ ఇష్టా రాజ్యంగా కాంట్రాక్టర్లకు ఈ ప్రాంత ఇసుక రీచ్‌లు అప్పగించారు. రోజుకు కనీసం వెయ్యి లారీలు, లక్షా ముప్పై ఐదు వేల క్యూబిక్ మీటర్ల ఇసుకను తరలిస్తున్నాయని అంచనా. ఒక లారీ ఇసుక తవ్వుకు పోయినందుకు ప్రభుత్వం వసూలుచేసేది రు. 8,250 కాగా ఒక లారీ ఇసుకను ఓపెన్ మార్కెట్‌లో అమ్మితే కనీసం ఆదాయం రు. 70-80 వేలు. దీనితో కాంట్రాక్టర్లు ఎట్లా కోట్లకు పడగెత్తుతున్నారో, అధికార పార్టీ నాయకులకు, అధికారులకు ఎంత ముడుపులు చెల్లిస్తున్నారో ఊహించవలసిందే. ప్రత్యేకంగా నేరెళ్ల, జిల్లెల ప్రాంతంలో ఇసుక తవ్వుకు పోతున్న గోల్డ్‌మైన్ మినరల్స్ నలుగురు యజమానులలో ఇద్దరు ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావుకు సన్నిహిత బంధువులు. వారిలో ఒకరు టి.ఆర్.ఎస్. అధికార పత్రిక నమస్తే తెలంగాణ మేనేజింగ్ డైరెక్టర్.

ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను ప్రభుత్వం ముందుంచుతున్న ప్రజాస్వామిక వాదులను పోలీసులు భయ భ్రాంతులకు గురిచేస్తున్నారు. సిరిసిల్లలో నిత్యం బైండోవర్ల పేరుతో, రౌడీషీట్లు తెరుస్తున్నారు. సంఘ విద్రోహులని ప్రచారం చేస్తున్నారు. ప్రభుత్వాలు అభివృద్ధి పేరుతో అమలుపరుస్తున్న విధానాల వల్ల సమాజంలో సామాజిక, ఆర్థిక, రాజకీయ సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. ప్రభుత్వాలు ఈ సమస్యల మూలాలను అర్థం చేసుకోకుండా ప్రశ్నించే వారి గొంతునొక్కడమే పరిష్కారంగా భావిస్తున్నాయి. ఇదంతా ప్రజలను భయభ్రాంతులకు గురిచేయడానికి ఒక పద్ధతి ప్రకారం ప్రభుత్వం అమలుచేస్తున్న విధానం.

తెలంగాణలో జరుగుతున్న భూకుంభకోణాలను వెలికితీస్తే వేలాది ఎకరాలు బయటపడతాయి. దాంతో కె.సి.ఆర్ దళితులకు ఇస్తానన్న మూడు ఎకరాల భూమి ఇవ్వొచ్చు, గ్రామాల్లో బతుకు లేకుండా అయి పట్టణాలకు వచ్చిన వారికి నిలువ నీడ కూడా ఏర్పాటు చేయవచ్చు. ప్రభుత్వం, మీడియా భూకుంభకోణాలపై చూసీ చూడనట్లు వ్యవహరిస్తున్నాయి. ఎప్పుడు లేదన్నట్లుగా వ్యక్తిగత విషయమైన మత్తు పదార్థాల అన్వేషణలో పోలీసులు, మీడియా అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాయి. సామాజిక పరమైన విషయాల కన్నా వ్యక్తిగత విషయాలనే సామాజిక విషయాలుగా భ్రమింపజేస్తూ రోజుకో కథనం వినిపిస్తూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్న పరిస్థితి నేడు రాష్ట్రంలో కొనసాగుతోంది.

కాంగ్రెస్ అధికారంలో ఉండగా ఈ ఇసుక మాఫియా కాంగ్రెస్ నాయకుల ఆధ్వర్యంలోనే నడిచింది. అప్పటి నుండి ప్రజల మనుసుల్లో తమ భవిష్యత్ తరాలకు ఉపయోగపడే సహజ వనరు అక్రమంగా తరలిస్తున్నారనే వ్యతిరేకత గూడుకట్టుకొని ఉంది. దాన్ని తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం మరింత దూకుడుగా వ్యవహరిస్తూ కొనసాగిస్తోంది. ఇక్కడ పార్టీలతో సంబంధం లేకుండా అధికారంలో ఎవరు ఉంటే వారు ఇటువంటి అక్రమాలు కొనసాగిస్తారు.

జూలై 31న ఛలో నేరెళ్లకు ఇచ్చిన పిలుపును భగ్నం చేయడానికి జూలై 27 రాత్రి నుండే స్థానిక నాయకులను, ప్రజాస్వామిక వాదులను, దళిత సంఘాల నాయకులను, జిల్లాలోని ప్రతిపక్ష రాజకీయ నాయకులను అరెస్ట్ చేసి వివిధ పోలీసు స్టేషన్లలో నిర్బంధించారు. రాష్ట్ర వ్యాప్తంగా దళిత, బహుజన సంఘాలు ధర్నాలు రాస్తారోకోలు చేస్తున్నాయి. నేరెళ్లలో ఇసుక మాఫియా వల్ల ఉత్పన్నమయిన అసలు సమస్యను ప్రభుత్వం పరిష్కరించడంలేదు. కాని స్థానిక ప్రజల మరణాలకు కారణమైన రాజకీయ ఇసుక మాఫియాను కాపాడడానికి, దానికి చట్టం పేరుతో

# గొర్రె తోక బెత్తెడు గొల్లల బతుకులు

***ప్రభుత్వాలు ఏ పథకం తెచ్చినా ప్రజలను తమ ఓటు బ్యాంకుగా మార్చుకోవడానికేనని, తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం తీసుకువచ్చిన గొర్రెల పంపిణీ పథకం కూడా అందులో భాగమే తప్పించి గొల్లల మేలు కోసం కాదని అంటున్నారు బైరెడ్డి సతీశ్***

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం అట్టహాసంగా, ఆర్భాటంగా ప్రవేశపెట్టిన గొల్ల కుర్మలకు గొర్ల పథకం రాబోయే మూడేళ్లలో 25 వేల కోట్ల రూపాయల సంపదను పోగేస్తుందని, దేశంలోని అందరి గొల్లల కంటే తెలంగాణ గొల్లలే అత్యధిక సంపన్నులవుతారని ముఖ్యమంత్రి గారు ప్రకటించారు. కూలిపోతున్న కుల వృత్తులను నిలబెట్టి, గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పటిష్టపరుస్తామని చాలా ఆకర్షణీయంగా సెలవిచ్చారు. బుడ్డగోసి, భుజాన గొంగడి, నెత్తిమీద రుమాలు చుట్టి గొర్ల మందలతో జీవితాంతం తిరుగుతున్న గొల్లల జీవితాలు ఈ మూడేళ్లలోనే మారిపోతాయా? తరతరాలుగా గొర్రెల పెంపకం వృత్తిలో మునిగిపోయిన గొల్ల కుర్మలు కోటీశ్వరులైన దాఖలాలు ఉన్నాయా? మహా అయితే కూటికి దొరికిందేమో కాని కోట్లు సంపాదించిందెన్నడు? గొర్రె తోక బెత్తెడులాగా గొల్లల బతుకులున్నాయి కాని బాగు పడ్డదెప్పుడు, బంగ్లాలు కట్టిందెప్పుడు? గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు ఆయువుపట్టయిన వ్యవసాయం కుదేలైనంక దానిపై ఆధారపడ్డ అనేక కుల వృత్తుల్లాగానే గొర్ల పెంపకం కూడా వెనుకంజవేసింది. పాత కాలపు రోజుల్లో ఇంటిల్లిపాది విద్యకు దూరమై గొర్ల మందతోపాటు పాడి పశువులను పెంచి పాలు అమ్ముకుని జీవితాలు కొనసాగించారు. భూకమతాల విస్తీర్ణం తగ్గిపోడం, బీడు భూములు, కొండగట్టులు తరిగిపోవడం గొర్రెలను, మేకలను మేపడం కష్టం కావడం వల్ల ఆ వృత్తుల్లో కొనసాగే వారి సంఖ్య గణనీయంగా తగ్గిపోయింది. ఇంటికో బర్రెను సాదుకున్న గ్రామీణ కుటుంబ ఆర్థిక వ్యవస్థలో ఇవాళ ప్యాకెట్ పాలు కొనుక్కోవాల్సిన పరిస్థితి వచ్చింది. నేడు గోధూళి వేళల్లో ధూళి మాత్రమే మిగిలింది. గొర్రెల పెంపకంలో ఉన్న యాదవ సామాజిక ప్రజానికపు కొత్త తరం అంతా గొర్రెల పెంపకం వృత్తిని కొనసాగించే ఆసక్తిని, సంసిద్ధతను అనివార్యంగా కోల్పోతున్నది. ఆధునిక విద్య, ఆధునిక వృత్తులు ఉద్యోగాల్లోకి ప్రవేశించే హక్కుల్ని వారికి ఏ రూపంలోనూ నిరాకరించే అధికారం ఎవరికీ లేదు. అయితే మొత్తంగా ఆ వృత్తి కాలగర్భంలో కలిసిపోయిందని, దాని అవసరమూ లేదని ఏ మాత్రం చెప్పలేము. ఇప్పటికీ అది గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో గణనీయంగా పాత్ర పోషిస్తున్నప్పటికీ భవిష్యత్తు మాత్రం ప్రశ్నార్థకం. ఇవాల్టి రూపంలోనే కొనసాగించడం మాత్రం అసాధ్యమవుతుంది. ప్రభుత్వం చెపుతున్నట్టు గొల్ల కుర్మలను నిజంగా కోటీశ్వరులుగా మార్చివేస్తుందా? ఇప్పటికీ మారని వారి బతుకులు ఈ ఒక్క స్కీంతోనే మారిపోతాయా? 30 లక్షల జనాభా ఉన్న ఈ సమూహాన్ని ఓటు బ్యాంకుగా మలుచుకునే మరో ఆకర్షణీయమైన పథకమేనా ఇది? మొత్తంగా గుణాత్మకమైన మార్పును తీసుకవచ్చి అభివృద్ధిని ప్రజల పరం చేసే విధానాల కంటే ఆయా సమూహాలను తాత్కాలికంగా సంతృప్తి పరిచే విధానాలను అన్ని ప్రభుత్వాలు అమలు పరిచినట్టు ఈ ప్రభుత్వం కూడా సారంలో కాకపోయినా రూపంలో అటుగా ఇటుగా మార్పులతో ప్రవేశపెడుతూనే ఉన్నది. ఇలాంటి పథకాలన్నీ ఏదో రూపంలో వున్నవే అని చరిత్రలోకి వెళితే తెలుస్తుంది.

ప్రభుత్వం ప్రవేశపెట్టిన గొర్రెల పథకం ద్వారా నాలుగు లక్షల కుటుంబాలతో 30 లక్షల జనాభా ఉన్న గొల్ల కుర్మలు లబ్ది పొందనున్నారు! 5 వేల కోట్ల రూపాయల ప్రభుత్వ వ్యయంతో 84 లక్షల గొర్రెలతో హైదరాబాద్ మినహాయించి మిగిలిన 30 జిల్లాలలో ఈ పథకం

---

ప్రజలను భయభ్రాంతులకు గురిచేసి ఇసుక మాఫియాకు సహకరిస్తున్న జిల్లా ఎస్.పి. విశ్వజిత్ కంపాటిని కాపాడడం కోసం ప్రభుత్వం ప్రజలను అణచివేయ జూస్తుంది.

సహజ వనరులు ఎక్కడెక్కడైతే ఉన్నాయో అక్కడి ప్రజలను బెదిరించి, నిర్వాసితుల్ని చేసి లేదంటే ట్రాక్టర్లతో, లారీలతో తొక్కించి, మహిళలపై అత్యాచారాలు చేసి, హత్యలు చేసి, జైళ్లలో నిర్బంధించి, బాంబులు వేసైనా వనరులను దోచుకెళ్లడం జరుగుతున్నది. అది నేరెళ్లలో ఇసుక మాఫియా కావచ్చు, ఆదివాసి ప్రాంతాల్లోని ఖనిజ సంపదను బహుళజాతి సంస్థలకు కట్టబెడుతున్న భారత పాలక వర్గాలు కావచ్చు, గల్ఫ్ దేశాల్లోని ఆయిల్ కోసం సామ్రాజ్యవాద దేశాలు కావచ్చు. సహజ వనరులున్న ప్రాంతాల్లోని ప్రజలు వాటిని భవిష్యత్ తరాలకు అందించడానికి నిత్యం ప్రభుత్వంతో పోరాడుతున్నారు. మిగతా సమాజమంతా తమకు సంబంధంలేని విషయంగా చూస్తుంది. మొత్తం సమాజానికి చెందవలసిన సహజ సంపదను కొద్ది మంది దోచుకోవడాన్ని వాళ్లు అడ్డుకుంటున్నారు. ఈ వనరులను కొల్లగొట్టడానికి స్థానిక నాయకులు మొదలుకొని కేంద్ర స్థాయిలో ఉండే నాయకుల వరకు ఎవరి స్థాయిలో వారు స్థానిక, విదేశీ దోపిడీశక్తులకు ఉపయోగపడుతున్నారు. అలాంటప్పుడు దేశ సహజ సంపదను కాపాడుతున్న ప్రజలకు మిగతా సమాజం బాసటగా నిలిచి ఈ వనరులను కాపాడుకోవాల్సిన బాధ్యతా, అవసరం ఉన్నాయి. అలా చేయకపోతే మిగతా సమాజం బతుకు ప్రశ్నార్థకంగా మారే ప్రమాదం ఎంతో దూరంలో లేదనే విషయాన్ని ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది.

*(రచయితలు వీక్షణం సహాయ సంపాదకులు, తెలంగాణ విద్యార్థి వేదిక సభ్యులు, ఉస్మానియా యూనివర్సిటీ)* వీ

అమలవబోతున్నదని ప్రభుత్వం పేర్కొన్నది. గొల్ల కుర్మల సమూహానికి చెందిన 18 ఏళ్లు నిండిన వారెవరైనా 51 రూపాయి కనీస రుసుముతో గొర్రెల పెంపకందార్ల సొసైటీలో సభ్యులుగా చేరవచ్చు. ప్రతి లబ్ధిదారున్ని ఒక యూనిట్‌గా పేర్కొన్నారు. ఒక్కో యూనిటిలో 20 ఆడ గొర్రెలు, ఒక మగ గొర్రె ఉంటుంది. వీటి కొనుగోలుకు అయ్యే ఖర్చు ఒక లక్షా ఇరవై ఐదు వేలు. దానిలో 75 శాతం ప్రభుత్వం, 25 శాతం వాటా అంటే 31,250 రూపాయలు లబ్ధిదారులు బరించాలి. పాత వాటితో కలుపుకొని కొత్తగా సొసైటీలో సభ్యులైన వారి సంఖ్య 6 లక్షలకు చేరుకున్నది. మొత్తంగా 7 లక్షల 61 వేల దరఖాస్తు పత్రాలు అందాయని వాటిలో 7 లక్షల 18 వేల యూనిట్‌లను మంజూరు చేయడానికి అర్హత కలిగి ఉన్నట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఈ మొత్తానికి అవసరమైన కోటి 50 లక్షల గొర్రెలను కొనుగోలు చేయనున్నట్లు కూడా పేర్కొన్నది. ఈ సొసైటీల ఏర్పాటు, సభ్యత్వ రుసుము నుండి లబ్ధిదారుల ఎంపిక వరకు అనేక అవకతవకలు జరిగినట్టు మిగతా పథకాలకు సంబంధించి వచ్చినట్టుగానే అనేక ఆరోపణలు వినిపించాయి.

జూన్ 20 నుండి మొదలైన ఈ గొర్రెల పంపిణీలో మొదటి విడతగా 42 లక్షలు, మలివిడతలో 42 లక్షలు ఉంటుందని అధికారులు పేర్కొన్నారు. ఈ పథకం మొదలు పెట్టినపుడు జరిగినంత హంగూ ఆర్భాటం, ప్రచార పటాటోపం, మీడియా దృష్టి ఆ పథకం కొనసాగింపులో కనపడవనేది కాదనలేని సత్యం. ఆ లోపు ప్రభుత్వం మరో 'పాపులర్' పథకం ప్రకటించి ప్రచారంతో హోరెత్తిస్తుంది. ఈ క్రమంలో 'గొర్రెలు' ఎక్కడ పోయినా పట్టించుకునేవాళ్లు కరువవుతారు. ఇన్ని లక్షల గొర్లు స్థానికంగా లభ్యంకావు కాబట్టి పొరుగు రాష్ట్రాల్లోనే కొనుగోలు చేయాల్సి వస్తుంది. గిరాకీ బాగా వచ్చి వ్యాపారం బాగా జరుగుతుందని ఆయా రాష్ట్రాల్లో గొర్ల పెంపకం దార్లు ధరల్ని అమాంతం పెంచేస్తారు. ప్రభుత్వ కేటాయింపులు సరిపోవు. అధికారులు చేతులెత్తేస్తారు. కొన్నవాటి రవాణా, ఇన్సురెన్స్ ఖర్చులు ఎలాగు పెరుగుతాయి. ఈలోగా లాటరీ ద్వారా లబ్ధిదారుల్ని ఎంపిక చేసే ప్రక్రియ కూడా మందగిస్తుంది. ఇప్పటికే కొన్ని నియోజకవర్గాల్లోనూ, మండలాల్లోనూ ఒక్క గ్రామాన్ని మాత్రమే ఎంపిక చేశారు. ఆ ఎంపిక చేసిన గ్రామంలో కూడా అన్ని యూనిట్ల గొర్రెల పంపకం జరగలేదు. ఈ పథకం ప్రారంభమైన నాటి నుండి పంపిణీ జరిగిన తీరును సమీక్షించిన సమావేశంలో స్వయంగా ఆ శాఖ మంత్రిగారే ప్రకటించిన వివరాల ప్రకారం 20 వేల లబ్ధిదారులకు 4.2 లక్షల గొర్రెల పంపిణీ చేశారు. అంటే ఈ సంవత్సరంలోనే 3 లక్షల 70 వేల లబ్ధిదారులకు అందాల్సిన గొర్రెల పంపిణీ లక్ష్యం పూర్తవడం అసాధ్యం. ఇప్పటికే ఇతర రాష్ట్రాల్లో కూడా చాలినన్ని గొర్రెలు అందుబాటులో లేవని ఉన్న వాటి ధరలు రెట్టింపు అవుతున్నాయని వార్తలు వస్తున్నాయి.

మిగిలిన లబ్ధిదారులకు ఎప్పుడు వస్తాయో తెలియదు కానీ నమోదైన 7 లక్షల 70 వేల మంది నుండి 32 వేల రూపాయల చొప్పున కోట్ల రూపాయలను వసూలు చేశారు. ఈ మొత్తంలో సగం మందికి మాత్రమే ఈ సంవత్సరం గొర్రెల పంపిణీ చేస్తున్నారు. అంటే ప్రభుత్వం రూపాయి ఖర్చు లేకుండానే మొదటి విడత పంపిణీ చేయవచ్చన్నమాట. సరే మొత్తం 84 లక్షల గొర్రెల పంపిణీ పూర్తయినా కూడా వాటిని మేపుకునే భూమి ఎక్కడ అందుబాటులో వున్నది? 46 లక్షల ఎకరాల్లో గొర్రెలు తినే గడ్డిని పెంచుతామని ప్రభుత్వం చెబుతుంది. నిజానికి అంత భూమి కేవలం గడ్డిని పెంచడానికే అందుబాటులోలేదనేది వాస్తవం. ఓ వైపు వివిధ ప్రాజెక్టుల పేరుతో వేలాది ఎకరాల భూమిని పోలీసులతోనే రెవెన్యూ పనులు చేయిస్తూ గొడ్డు గోద, గొర్రెలతో పాటు ఊళ్లనే ఖాళీ చేయిస్తుంటే కొత్తగా భూమి ఎక్కడి నుండి వస్తుంది? గొల్ల కుర్మల కుటుంబాల చేతుల్లో వున్న మొత్తం భూమి 16 లక్షల ఎకరాలకు మించి లేదు. అది కూడా వ్యవసాయ భూమి మాత్రమే. వివిధ ఆహార, వాణిజ్య పంటలు పండించడానికే సరిపోతుంది. ఇక గొర్లకేది జాగ? అటవీ భూములు అందుబాటులో ఉన్న చోట కొద్దిమేరకు సాధ్యం కావచ్చు. వీటికి తోడు ఆయా కాలాల్లో గొర్రెలకు వచ్చే వ్యాధులకు సంబంధించిన చికిత్సలు అందుబాటులో లేవు. వంద పశువైద్యశాలలు, టోల్‌ఫ్రీ నెంబర్‌తో కూడిన అంబులెన్స్ సదుపాయం కల్పిస్తామంటున్న ప్రభుత్వానికి ఇప్పటికీ గ్రామీణ ప్రాంతాల్లో తరిగి పోయిన పశువులకు కూడా వైద్యసేవలు అందుబాటులో లేవనే విషయము తెలియంది కాదు.

ఆచరణాత్మక సమస్యలు అధిగమించలేకుండా వుంటాయని తెలిసినా ఇలాంటి పథకాల ఆరంభ శూరత్వం ఎందకనే రహస్యం తెలియందేమికాదు! ఇవాళ గొల్ల కుర్మలు తమ పిల్లల్ని గొర్రెల కాపరులనే చేయదలిచారా? గొర్రెల పెంపకం వృత్తి నిజంగా వారి ఆర్థికాభివృద్ధిని అంత శీఘ్రగతిన పైకి తీసుకెల్లగలిగితే ఇన్ని తరాలుగా అంత వెనుకబాటు తనాన్ని వారెందుకు అనుభవిస్తారు? అన్ని సామాజిక సమూహాల్లాగానే వారు సామాజిక వివక్షను, వెనుకబాటు తనాన్ని, దోపిడీని అనుభవించారు. వారి ప్రత్యేక సమస్యల్ని, ఇతర సమాజంతోని ఉండే వైరుధ్యాన్ని పరిష్కరిస్తూనే వెనుబాటుతనం, దోపిడీ నుండి విముక్తి చేసి సమిష్టి చలనంలో వారిని భాగస్వాములను చేయాలి. రాజ్యాధికార అండతో నగరాల్లో ఆర్థిక సామ్రాజ్యాల్ని నిర్మించే సామాజిక సమూహాలు పాలనా కర్ర పెత్తనం చేస్తున్నారు. వారి దయాదాక్షిణ్యాలతోనే అసలైన శ్రమ జీవులు బతకాలనే విధానాల కొనసాగింపు నడుస్తున్నది. ఏ పాలక పార్టీకి కూడా మనుషులు మనుషులుగా కనిపించడం లేదు. కేవలం ఓటర్లుగా మాత్రమే కనిపిస్తున్నారు.

విద్యావంతులైన, చైతన్యవంతమైన సమాజాన్ని నిర్మించడం కంటే శాశ్వతంగా బలహీనులుగా మార్చే, పాలకుల ఎంగిలి మెతుకులపై బతికేలా చేసే అభివృద్ధి ప్రక్రియనే బలంగా ముందుకు తోస్తున్నారు. సంక్షేమం పేరుతోనో, ఏదో వృత్తిని బతికించే పేరుతోనో ఏదో ఒక సమూహాన్ని ఏమార్చడానికి, ఓటుబ్యాంకుగా మార్చుకోవడానికి వేసే ఎత్తుగడలే తప్ప నిజమైన అభివృద్ధి కార్యక్రమాలు అసలే లేవు. పోనీ ఆ పథకాలన్నా చిత్తశుద్ధితో అమలు చేస్తారా అంటే అది మచ్చుకైనా కనిపించదు. కనీసం వాళ్లు పెట్టుకున్న లక్ష్యాలను వాళ్లైనా సాధించలేరు. దీనికితోడు గొప్పగా ప్రచారం చేసే వ్యాపార మీడియా ప్రజల్ని మరింతగా మాయలో పడేస్తున్నది. ఇలాంటి పథకాలను ఉపయోగించుకుని ఆవిర్భవించే పాలక వర్గాల దళారి మాఫియా శక్తులకు కొదవేముండదు. అధికార యంత్రాంగపు చేతివాటం ఎలాగూ ఉంటుంది. చేసేది గోరంతా, చెప్పేది కొండంత. ఇలాంటివి వందల, వేల సంఖ్యలో గడచిన ప్రభుత్వాల హయాంలో వచ్చినప్పటికీ ఎక్కడ వేసిన గొంగడి అక్కడే ఉన్నది. ఈ 'గొంగడి' ఇంతే!

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

# గాడి తప్పిన చంద్రబాబు మూడేళ్ల పాలన

***చంద్రబాబు ప్రభుత్వం మూడేళ్ల పరిపాలనలో ప్రజలకు ఇచ్చిన ఎన్నికల హామీలలో ఏ ఒక్కటీ అమలు చేయలేదనీ, రాజకీయ ఎత్తుగడలు తప్ప ప్రజా సంక్షేమాన్ని పూర్తిగా విస్మరించిందనీ అంటున్నారు* షేక్ కరిముల్లా**

గత మూడేళ్లుగా అటు కేంద్రంలోనూ ఇటు రాష్ట్రంలోనూ విధ్వంస పాలన కొనసాగుతుంది. ప్రజల మౌలిక సమస్యలతో పాటు సాధారణ సమస్యలు కూడా పరిష్కారం కాకపోగా, మరిన్ని సమస్యలు సృష్టిస్తూ, ప్రజలను కష్టాలపాలు చేస్తూ, ఒక అభద్రతతో కూడిన వాతావరణం నేడు దేశంలో నెలకొంది. స్వాతంత్ర్యానంతరం సృష్టించుకున్న వ్యవస్థలు, సంస్థలు నేడు బలహీనమై పాలనా వ్యవస్థ పూర్తిగా ధ్వంసమైపోయింది. ప్రభుత్వాలను, వాటి సంస్థలను ప్రజలు చీదరించుకుంటున్నారు. ప్రభుత్వ రంగ పాలనా వ్యవస్థలు ప్రజలకు మేలు చేయకుండా బడాబాబులకు ఉపయోగపడే జేబు సంస్థలుగా మారాయి. ఆ కారణంగా ఇవి ప్రజల ఛీత్కారానికి గురై నేడో రేపో కూలిపోవడానికి సిద్ధంగా ఉన్నాయి.

పాలనలో ప్రపంచానికే పాఠాలు చెప్పానని, గొప్ప పాలన అనుభవం ఉందని గొప్పగా చెప్పుకునే చంద్రబాబు పాలనలో ఈ మూడేళ్లలో ఆంధ్రప్రదేశ్‌లో పరిపాలన వ్యవస్థ పూర్తిగా గాడితప్పింది. తన మంత్రులు సహితం తన మాటవినే స్థితిలో నేడు లేరు. ప్రజా శ్రేయస్సును గ్రామ స్థాయిలో అందించే ఉద్దేశంతో రాజ్యాంగ బద్ధంగా ఏర్పాటైన స్థానిక స్వపరిపాలన వ్యవస్థను కాదని జన్మభూమి కమిటీల పేరుతో పచ్చ చొక్కాలకు అధికారం ఇవ్వడంతో వారు ఆడిందే ఆట, పాడిందే పాట అయిపోయింది. దీంతో స్థానిక స్వపరిపాలనవ్యవస్థ బలహీనమైపోయింది.

గత మూడేళ్లుగా వరుసగా కరువు వెంటాడుతుంది. గడిచిన నాలుగు నెలల్లో ఆంధ్రప్రదేశ్‌లో సుమారు 70 మంది రైతులు పంటకు గిట్టుబాటు ధర లభించక, అప్పులు తీర్చే మార్గం కనిపించక బలవన్మరణానికి గురైయ్యారు. గతంలో వ్యవసాయం దండగన్న చంద్రబాబు ప్రభుత్వం చోద్యం చూస్తూ ముసలి కన్నీరు కార్చడం తప్ప రైతులకు మేలుచేసే ఒక్క పని చేయడం లేదు.

సర్కారు నిర్లక్ష్యం, వ్యాపారుల మాయాజాలం, దళారుల దోపిడీ వెరసి మిర్చి రైతును మింగేశాయి. నిరుడు పత్తి పంట దెబ్బతినగా, ఈసారి మిర్చితో పాటు వివిధ పంటలకు గిట్టుబాటు ధర లేక రైతులు తీవ్రంగా నష్టపోయారు.

2014 మార్చ్ 31 నాటికి రాష్ట్రంలో వ్యవసాయ రుణాల రూపంలో బ్యాంకులకు రైతులు రు. 87,612 కోట్లు బకాయి పడ్డారు. ఈ రుణాలన్నీ బేషరతుగా మాఫీ చేస్తామని చంద్రబాబు హామీ ఇచ్చారు. అధికారంలోకి వచ్చాక షరతులు విధించారు. రుణమాఫీ కింద ఇప్పటి దాకా కేవలం రు. 10,625 కోట్లు మాత్రమే ఇచ్చి చేతులు దులుపుకున్నారు. రుణమాఫీ నీటి మూటగానే మిగిలిపోయింది. అసలే సంక్షోభంలో ఉన్న వ్యవసాయ రంగం నకిలీ విత్తనాల బెడద, గిట్టుబాటు ధరలు లేక మరింత సంక్షోభంలో కూరుకుపోయింది.

ఎన్నికల్లో డ్వాక్రా రుణాలన్నింటిని మాఫీ చేస్తానన్న చంద్రబాబు అధికారంలోకి వచ్చాక మాట మార్చారు. 2014 మార్చ్ చివరి నాటికి డ్వాక్ర సంఘాల పేరిట బ్యాంకుల్లో ఉన్న అప్పుల్లో రుపాయి కూడా ప్రభుత్వం మాఫీ చేయలేదు. ఈ మూడేళ్ల కాలానికి అప్పులపై వడ్డీ భారం రు. 750 కోట్ల వరకు పెరిగింది. ఈ పరిస్థితులలో ప్రభుత్వం పెట్టుబడి నిధిగా ఇస్తానని ఇప్పటి వరకు రెండు విడతలుగా రు. 3 వేల చొప్పున రు. 6,000 వేలు జమచేసి ప్రభుత్వం చేతులు దులుపుకుంది. డ్వాక్రా రుణాలు మాఫీ చేయకపోగా జీరో వడ్డీ పథకానికి నిధులు ఆపేశారు. ఫలితంగా అసలు, వడ్డీ భారాన్ని డ్వాక్రా మహిళలే మోయాల్సి వచ్చింది.

పేదలకు ఉచిత వైద్యం అందించే లక్ష్యంతో ఏర్పడిన ఆరోగ్య శ్రీ పథకం పేరు మార్చి హడావిడి చేయడం తప్పితే అమలు చేయకుండా పథకం బలహీనం చేశారు. ఇక ఉద్యోగుల హెల్త్‌కార్డు పథకం అమలు జరగడం లేదు. ఉద్యోగుల నుండి ప్రతినెల రు. 90, రు. 120లు వసూలు చేస్తున్నారే గాని, వైద్య సేవలు ఉద్యోగులకు అందుబాటులో లేవు. ఇక 104, 108 సర్వీసులు అటకెక్కాయి. ప్రజారోగ్యంపై రాష్ట్ర స్థూల ఉత్పత్తిలో 36 శాతం తగ్గకుండా ఖర్చు చేయాలి. ఇవేమి అమలుకు నోచుకోక వైద్యం ప్రజలకు అందని ద్రాక్ష పండైంది.

విద్యా రంగం అస్తవ్యస్తంగా తయారైంది. ఇతర రాష్ట్రాలలో విఫలమైన పథకం, సిబిఎస్ఇ వారు కూడా ఎత్తివేసిన పథకం, ఎందుకు కొరగాని సిసిఇ పథకాన్ని విద్యావ్యవస్థలో అమలు చేస్తూ విద్యా వ్యవస్థను చిన్నా భిన్నం చేశారు. హేతుబద్దీకరణ పేరుతో ప్రభుత్వ స్కూళ్లను మూసివేయడమే లక్ష్యంగా ప్రభుత్వ పేదల బడులను మూసివేస్తున్నారు. పిల్లలు లేరనే సాకు చూపి, ప్రతియేడూ స్కూళ్లను మూసివేస్తున్నారు. తద్వారా పేదపిల్లలకు విద్యను దూరం చేస్తున్నారు.

మరోవైపు అధికారంలోకి రాగానే మద్యం బెల్టుషాపులను రద్దు చేస్తానని, మద్యపాన నియంత్రణ విధానం పాటిస్తామని హామీ ఇచ్చి, ఈ హామీని తుంగలోకి తొక్కి, ఊరువాడ బెల్టు షాపులను విస్తరించారు. గ్రామాలలో తాగు నీరు దొరకడం లేదు గాని, మద్యం మాత్రం ఏరులై పారుతుంది. మద్యాన్నే ప్రధాన ఆదాయ వనరుగా మార్చుకున్నారు. ఇది చాలా సిగ్గుచేటు.

'జాబు రావాలంటే బాబు రావాలి' అంటూ ఎన్నికలలో ఊదరగొట్టిన బాబు గద్దెనెక్కగానే ఆ ఊసే ఎత్తడం లేదు. గడిచిన మూడేళ్లలో ఉద్యోగాల భర్తీ చేయలేదు. ఇంటింటికి ఉద్యోగం, ఉద్యోగం కల్పించేలోగా నెలకు రు. 2,000 నిరుద్యోగ భృతి కల్పిస్తామని ఎన్నికలలో హామీ ఇచ్చిన బాబు గత మూడేళ్లుగా ఒక్క రూపాయి కూడా చెల్లించలేదు. తూతూ

మంత్రంగా ఈ ఏటి బడ్జెట్‌లో నిరుద్యోగ భృతి కింద రు. 500 కోట్ల నిధులు కేటాయించారే కాని, ఇప్పటివరకు రూపాయి కూడా భృతి కింద చెల్లించలేదు. అయినా ఈ నిధులు ఏ మూలకు సరిపోవు. ఈ మూడేళ్ల ఉద్యోగాల భర్తీ జాడలేదు. ఎన్నికలకు ముందు కాంట్రాక్టు ఉద్యోగులను క్రమబద్ధీకరిస్తామన్నారు. ఇప్పుడు దాని ఊసేలేదు. కొత్తగా పరిశ్రమలు లేవు. ఉద్యోగాలు లేవు. తమ భవిష్యత్తు ఏమిటో అర్థం కాక నిరుద్యోగ యువత తీవ్ర నిరాశ నిస్పృహల్లో ఉన్నారు.

రాష్ట్రంలో నిలువ నీడలేని పేదలకు మూడు సెంట్ల స్థలంతో పాటు అందులో ఉచితంగా గృహాలు నిర్మించి ఇస్తామని ఎన్నికల ముందు వాగ్దానం చేసిన బాబు, గృహ నిర్మాణ రంగానికి 2014-15 బడ్జెట్‌లో రు. 808 కోట్లు, 2015-16లో రు. 897 కోట్లు, 2016-17లో రు. 1132.8 కోట్లు, 2017-18లో రు. 1457 కోట్లు కేటాయించిన, గృహ నిర్మాణం మాత్రం చేపట్టలేదు. ఎన్‌టిఆర్ గృహ నిర్మాణ పథకం అంటూ పేరు మార్చి ప్రచారం చేశారు. ఒక్కో ఇంటికి రు. 3 లక్షలు ఇస్తామని చెప్పి, 1.50 లక్షలకు కుదించారు. మొత్తం 6.05 లక్షల ఇళ్లు కేటాయించి 3,34,146 మాత్రమే మంజూరు చేశారు. తీరా నిర్మించింది వేయిలోపు మాత్రమే.

ప్రపంచ స్థాయి నిర్మాణం పేరిట జరుగుతున్న రాజధాని నిర్మాణం ఒక తంతుగా ఉంది. భూసేకరణ చట్టాలను తుంగలో తొక్కి సంవత్సరానికి మూడు పంటలు పండే మంచి సారవంతమైన భూములను ల్యాండ్ పూలింగ్ పేరుతో బలవంతంగా 33,500 వేల ఎకరాలను రైతుల నుంచి సమీకరించారు. మరో 20 వేల ఎకరాల వరకు ప్రభుత్వ భూములను సేకరించారు. ఈ భూములలో చాలా వరకు ప్రభుత్వంలోని పెద్దలు, వారి సన్నిహితులు బినామీలు పంచుకుని వారి భూములను మాత్రం ల్యాండ్ పూలింగ్ పరిధి నుంచి తప్పించి పండగ చేసుకున్నారు. భారీగా లబ్దిపొందారు.

ఇక రాష్ట్ర విభజన జరిగి మూడేళ్లు గడిచినా రాజధాని నిర్మాణం ఇంకా కాగితాల మీద నుంచి నేలపైకి రాలేదు. పవర్ పాయింట్ ప్రజెంటేషన్లతో, గ్రాఫిక్స్‌తో సింగపూర్ ప్రణాళికలు, లండన్ డిజైన్లు అంటూ హడావిడి తప్ప ప్రాథమిక పనులు కూడా ఇంకా పూర్తికాలేదు. వెలగపూడిలో తాత్కాలిక సచివాలయం తప్ప ఇప్పటి వరకు రాజధానికి సంబంధించి మంచి ప్రాజెక్టులు నిర్మాణం కాలేదు. 1350 ఎకరాల్లో హైకోర్టు, అసెంబ్లీ భవనం, సచివాలయం, శాఖాధిపతుల భవనాలు, కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల భవనాల డిజైన్లు అనేక మలుపులు తిరుగుతూ కాగితాలకే పరిమితమైనాయి. మొత్తానికి పనులు చూస్తుంటే రాజధాని ఒక రంగుల కలగా మిగిలిపోతుందనిపిస్తుంది.

ఇది ఇలా ఉంటే రాష్ట్ర రాజకీయాలు పూర్తిగా దిగజారాయి. రాజ్యాంగ విలువలకు, ప్రజాస్వామ్య స్ఫూర్తికి విరుద్ధంగా పార్టీ ఫిరాయింపుల చట్టాన్ని ఉల్లంఘిస్తూ, చట్టంలోని లొసుగులను వాడుకుంటూ, ప్రతిపక్ష పార్టీ ఎంఎల్ఎలను ప్రలోభపరిచి పార్టీ ఫిరాయింపులకు పాల్పడ్డారు చంద్రబాబు. ఒక పార్టీ గుర్తుపై గెలిచిన ఎంఎల్ఎలకు మంత్రి పదవులు, కాంట్రాక్టులు, ఇతర పదవులు ఇచ్చారు. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రతిపక్షాలకు తగిన గౌరవం, ప్రాతినిధ్యం ఇవ్వాల్సింది పోయి, ప్రతిపక్షం పట్ల కక్షపూరిత ధోరణితో వ్యవహరించడం రాజకీయ దిగజారుడుకు నిదర్శనం. పార్టీ ఫిరాయింపులకు ఎవరు పాల్పడినా అది ప్రజలను వంచించడమే అవుతుంది. ప్రజలు ఈ నీచ రాజకీయాలను అసహ్యించుకుంటారు, ద్వేషిస్తారు, తగిన గుణపాఠం చెబుతారు.

రాష్ట్రంలో అన్ని గ్రామాలకు ఎన్‌టిఆర్ సుజల స్రవంతి పథకం ద్వారా మంచినీటి ప్లాంటులు ఏర్పాటు చేసి రెండు రూపాయలకే 20 లీటర్ల తాగునీరు అందిస్తామని చంద్రబాబు ఎన్నికలలో హామీ ఇచ్చారు. ఏదో అరకొర ప్లాంటులు ఏర్పరిచారు తప్ప, ఆచరణలో ఈ పథకం అమలు కావడం లేదు. గ్రామాల్లో రక్షిత మంచినీటి సదుపాయం లేదు. ప్రజలు బావులు, బోర్లు, చెరువులు, సెలయేర్లు, చలమల్లోని కలుషిత, సురక్షితం కాని నీరు తాగుతున్నారు. ఏజెన్సీ ప్రాంతాలలో గిరిజనులైతే కలుషిత నీరు తాగి డయేరియా, కామెర్లు, టైఫాయిడ్ తదితర వ్యాధుల భారిన పడుతున్నారు. కఠిన జలాలు (ఫ్లోరైడ్) తాగడం వల్ల ప్రకాశం, ఉత్తరాంధ్ర జిల్లాలలో ప్రజలు మూత్ర పిండాల వ్యాధుల భారిన పడుతున్నారు. జీవితాలు బుగ్గిపాలు చేసుకుంటున్నారు. 'ఫ్లోరోసిస్' అనే వ్యాధి భారిన పడి కాళ్లు, చేతులు చచ్చుబడి అంగవైకల్యంతో బాధలు పడుతున్నారు. ఈ వ్యాధితో అంగవైకల్యం సంభవించాక మందుల ద్వారా కానీ, శస్త్ర చికిత్స ద్వారా కానీ ఆ లోపాన్ని సరిదిద్దలేం కాబట్టి, ఇప్పుడైనా ఎన్‌టిఆర్ సుజల స్రవంతి పథకం ద్వారా రాష్ట్ర ప్రజలకు సురక్షిత తాగు నీరు అందించాలని ప్రజలు కోరుకుంటున్నారు. మంచినీరు అందించి వారి ఆరోగ్యాన్ని కాపాడవలసిన సామాజిక బాధ్యత రాష్ట్ర ప్రభుత్వంపై ఉంది. ఈ ఎన్నికల హామీని విస్మరించరాదు.

రాష్ట్రం విభజన సమస్యతో కొట్టుమిట్టాడుతుంటే, సర్కారు అట్టహాసాలకు, ఆర్భాటాలకు పోతూ ఉంది. గోదావరి, కృష్ణా నదుల పుష్కరాలను మెగా ఈవెంట్‌లా నిర్వహించింది. రాష్ట్ర ప్రభుత్వం ఇంత చేసి సరిగ్గా ఏర్పాట్లు చేయని కారణంగా గోదావరి పుష్కరాల తొక్కిసలాటలో తొలిరోజు 29 మంది మరణించారు. నూతన రాజధాని అమరావతి శంకుస్థాపన కార్యక్రమాలు, భూమిపూజ, సంకల్ప దీక్ష అంటూ ఆర్భాటంగా నిర్వహించి, ఎంతో ప్రజాధనం దుర్వినియోగ పరిచారు. నీరు-చెట్టు-రైతు భరోసా, స్వచ్ఛ భారత్ వంటి ఆడంబర కార్యక్రమాలకు కొదువే లేదు.

నవ నిర్మాణ దీక్షల పేరుతో మూడేళ్లలో రు. పది కోట్లు ఖర్చు చేశారు. అలాగే రెండు పారిశ్రామిక భాగస్వామ్య సదస్సులు నిర్వహించారు. ప్రకటనలు, ప్రచార కార్యక్రమాల నిర్వహణకు మొత్తం కలిపి రు. 30 కోట్లు ఖర్చు చేశారు. చంద్రబాబు విదేశీ పర్యటనలకు దాదాపు వంద కోట్ల వరకు ఖర్చు చేశారు. సింగపూర్ సంస్థ సుర్భానాకు రాజధాని మాస్టర్ ప్లాన్ కోసం రాష్ట్ర ప్రభుత్వం రు. 15 కోట్లు చెల్లించింది. రాయలసీమలో రెయిన్ గన్స్‌తో కరువును తరిమికొట్టి వేరు సెనగ పంటను కాపాడడానికి అంటూ రు. 177 కోట్లకు పైగా ప్రభుత్వం ఖర్చు చేసింది. కానీ ఒక్క ఎకరం పంటను కూడా కాపాడలేకపోయింది.

మొత్తంగా ప్రజాధనం వృథా తప్ప ప్రయోజనం శూన్యం. ఇప్పటికి రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు పిఆర్‌సి బకాయిలు చెల్లించలేదు. మూడు విడతల డిఏ చెల్లించవలసి ఉంది. ఉద్యోగులు వీటి సంగతి అడిగితే మాత్రం ప్రభుత్వానికి రాష్ట్ర ఆర్థిక పరిస్థితి గుర్తుకొస్తుంది. 'ఇంట్లో ఈగల మోత బయట పల్లకీల మోత' సామెతలా రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఉన్నప్పుడు ఈ అనవసరపు వృథా ఖర్చు అవసరమా? ఇక రాష్ట్ర ప్రత్యేక హోదా సాధన విషయాన్ని చంద్రబాబు గాలికి వదిలేశారు. రెండు నాలుకల ధోరణి కనబరిచారు. మొత్తంగా ఎన్నికల ముందు అనేక వాగ్దానాలు

# దళితుల సాంఘిక బహిష్కరణ

*స్వాతంత్ర్యం వచ్చి ఏడు దశాబ్దాలైనా దళితులపై అగ్రకుల దురాగతాలు కొనసాగుతూనే ఉన్నాయనీ, పాలకుల అండతో ఈ దాడులు ఇంకా మితిమీరిపోతున్నాయనీ, ప్రజలు ఐక్యంగా పోరాడితే తప్ప దీనికి పరిష్కారం లేదనీ అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని పశ్చిమగోదావరి జిల్లా పాలకోడేరు మండలం గరగపర్రు గ్రామంలో గత రెండు నెలలు (మే-జూన్) గా దళితుల సాంఘిక బహిష్కరణ నుంచి దళిత ఉద్యమకారులు, ప్రజాస్వామ్యవాదులు అనేక గుణపాఠాలు నేర్చుకోవలసి ఉంది. ఎందుకంటే, ఈ దేశానికి స్వాతంత్రం (అధికార మార్పిడి) వచ్చి దాదాపు 70 సంవత్సరాలు పూర్తి అయింది. 1956 సంవత్సరంలోనే డా. బిఆర్. అంబేద్కర్ న్యాయశాఖా మంత్రిగా ఉండగానే పౌర హక్కుల పరిరక్షణ చట్టం 1955 అమలులోకి వచ్చింది. అంటరానితనం అమానుషం, వెట్టిచాకిరి నిర్మూలన, కట్టుబానిసత్వం రద్దు లాంటి నినాదాలు ప్రతి ప్రభుత్వ కార్యాలయం దగ్గర ఇప్పటికీ దర్శనమిస్తున్నాయి. అంతే కాకుండా 1989లో ఎస్‌సి/ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం వచ్చింది. (కారంచేడు ఉద్యమం స్ఫూర్తితో) ఆ చట్టాన్ని 2015లో ఇటీవల కొన్ని సవరణలు కూడా తీసుకొని వచ్చారు. 1995లో ఆ చట్ట ప్రకారం బాధితులకు రక్షణ, నష్టపరిహారం, ఉద్యోగం, పునరావాసం మొదలైన సౌకర్యాలన్నీ కల్పించబడ్డాయి. ఇవన్నీ కూడా కేంద్ర చట్టాలే. దేశ వ్యాప్తంగా అమలు జరగవలసి ఉంది.

అయితే అవన్నీ కూడా దళితుల సాంఘిక బహిష్కరణ జరిగిన గరగపర్రులో ఎందుకు అమలు కాలేదు? అన్నది మన ముందున్న ప్రశ్న! కేవలం గ్రామ చెరువు గట్టుపైన అంబేద్కర్ విగ్రహం నెలకొల్పి నందుకు దానిని దాచిపెట్టి, దళితులు ఉద్యమించిన తర్వాత గాని ఆ విగ్రహాన్ని స్థానిక గ్రామ పంచాయితీ కార్యాలయం ముందు ప్రత్యక్షం చేశారంటే, ఎటువంటి కరుడుగట్టిన భూస్వామ్య, అగ్రకుల దురహంకారంతో వ్యవస్థ మనుగడలో ఉందో అర్థం చేసుకోవచ్చు. అందునా ఈ భూస్వామ్య దురహంకారులకు అధికార తెలుగుదేశం పార్టీ అండ చేదోడు వాదోడుగా ఉంది.

స్థానిక సర్పంచ్ కూడా అదే దళిత (మాల) కులానికి చెందిన వ్యక్తి అయినప్పటికీ ఆమెకు ఏమాత్రం అధికారాలూ, హోదా అక్కడ లేదు. పంచాయతీ కార్యదర్శి, స్థానిక పోలీసు అధికారులలో కొంతమంది దళితులు ఉన్నప్పటికీ అక్కడ చట్టం, పౌర హక్కులు, ప్రజాస్వామిక హక్కులు ఏమీ పనిచేయవు. ఎందుకంటే అవన్నీ ఈ దేశంలో కొంతమందికి మాత్రమే వర్తించే విధంగా ఈ అధికార యంత్రాంగం ప్రవర్తించేటట్లుగా అధికార వ్యవస్థ రూపొందించబడింది. అక్కడ దళితులకు సొంత పొలం లేక, రోజువారీ కూలీ మీద ఆధారపడి జీవనం సాగించే పరిస్థితి. కొంతమంది క్షత్రియ రాజుల దగ్గర ఉన్న పొలాన్ని గుత్తకు (కౌలుకు) తీసుకొని కష్టంతో పండించుకొని జీవించేవారు.

ఇలా ఉండగా ఏప్రిల్ 14న అంబేద్కర్ జయంతి రోజున విగ్రహ ప్రతిష్టన కార్యక్రమం గ్రామంలోని ప్రధాన రహదారి పక్కన ఉన్న చెరువుగట్టు పక్కన నెలకొల్పడం అక్కడ ఉన్న అగ్రకుల భూస్వామ్య పెత్తందార్లకు కంటగింపయింది. వెంటనే అక్కడి నుంచి ఆ విగ్రహాన్ని తొలగించారు. ప్రభుత్వమే మంత్రులతోనూ, కలెక్టర్లతోనూ కమిటీలు వేసి అంబేద్కర్ జయంత్యుత్సవ సభలు నిర్వహిస్తుండగా, ఇక్కడ దళితులు తమ స్వంత ఖర్చుతో కమిటీగా ఏర్పడి విగ్రహాన్ని తెచ్చుకొని ప్రతిష్టించుకుంటే ఏదో ఘోరం జరిగినట్లు, ప్రమాదం జరిగినట్లు భూస్వామ్య దురహంకారులు గ్రామ దళితుల (మాల) పై సాంఘిక

చేసిన చంద్రబాబు 'ఏరు దాటేదాక ఏటి మల్లన్న... ఏరు దాటాకా బోడి మల్లన్న' అన్న చందంగా ఇచ్చిన హామీలను గాలికి వదిలేశారు. నేడు పాలనా పరంగా గాడితప్పిన చంద్రబాబు ప్రజలపై అసహనం వ్యక్తం చేస్తున్నారు. 2017 జూన్ 23న నంద్యాల పర్యటనలో మాట్లాడుతూ 'నేనిచ్చిన పింఛన్ తింటున్నారు. నేను వేసిన రోడ్డు మీద నడుస్తున్నారు. నాకెందుకు ఓటు వేయరు? ఎవరు డబ్బిచ్చినా నాకే ఓటు వేయాలి. నేను తలచుకుంటే ఓటుకు రు. ఐదు వేలు ఇవ్వగలను. కాని ఎందుకివ్వాలి?' అంటూ చంద్రబాబు సమస్యలు చెప్పుకునేందుకు వచ్చిన ప్రజలపై అసహనం వెళ్లగక్కారు. ముఖ్యమంత్రికి చెప్పుకుంటే సమస్యలు పరిష్కారమవుతాయని ఆశతో వచ్చిన ప్రజలు ఆయన సమాధానంతో షాక్ తిన్నారు. ముఖ్యమంత్రి మాట్లాడిన తీరు రాజకీయ వర్గాలలో చర్చనీయాంశమైనది. ఒక రాజ్యాంగ బద్ద బాధ్యతాయుత పదవిలో ఉన్నవారు ప్రజల సమస్యల పరిష్కారంలో చొరవ చూపాలి. ఒక అర్థవంతమైన పరిష్కారం చూపాలి. అది వారి బాధ్యత. ఇది ఆయనకు తెలియదా? లేదా అహంకారమా? రాజ్యాంగంలో రాసుకున్న ప్రజా సంక్షేమం, శ్రేయస్సులను అమలు చేసి, ప్రజలకు మేలు చేయడానికే ప్రజలు ఆ రాజకీయ నాయకులకు అధికారం ఇచ్చారు తప్ప, ప్రజలపై స్వారీ చేయడానికి కాదు. అయినా అమలు జరుగుతున్న సంక్షేమ కార్యక్రమాలు, పథకాలు ప్రజలు కాయకష్టం చేసి పన్నుల రూపంలో ఖజానా నింపిన డబ్బులేనని రాజకీయ నాయకులు గుర్తుంచుకోవాలి. వారి జేబుల్లోంచి తీసి ఖర్చు పెడుతున్నట్లు, అదేదో వారి దయాదాక్షిణ్యం లాగా మాట్లాడడం వారి అవివేకం. ఏమైనా నేడున్న పార్లమెంటరీ రాజకీయాలు ప్రజల సమస్యలు పరిష్కరించలేవని 70 సంవత్సరాల స్వాతంత్రానంతర చరిత్ర తేల్చి చెప్పింది. ప్రజలు మరో ప్రత్యామ్నాయ రాజకీయాలను నిర్మించుకోవలసిన సమయం ఆసన్నమైంది.

*(రచయిత సామాజిక విశ్లేషకులు)*

వీ

బహిష్కరణ విధించారు. వారితో మాట్లాడే వారికి రు. 10,000 అపరాధ రుసుం, వారిని పక్క గ్రామాల వారు ఎవరైనా కలవడానికి వస్తారనుకుంటే వారి వివరాలు తెలుసుకోవడానికి, ఎవరెవరితో మాట్లాడుతున్నారో తెలుసుకోవడానికి – సిసి కెమెరాలు (పోలీసు వ్యవస్థ మాదిరిగా) ఏర్పాటు చేశారంటే ఎంత దుర్మార్గమైన పరిస్థితులు ఈ దేశంలో నెలకొన్నవో మనమంతా అర్థం చేసుకోవాలి.

కేవలం దళితులంతా విద్యావంతులై, ఉద్యోగాలలో స్థిరపడి, ఒక ఇల్లు, ఒక కారు, లేదా కార్లు ఉంటే దళితుల విముక్తి జరిగినట్లు భావిస్తున్న నేటి దళిత ఉద్యమకారులకు ఈ సాంఘిక బహిష్కరణ పెద్ద గుణపాఠం కావాలి. కులవ్యవస్థ అంతరించిపోలేదు. కేవలం తన రూపు మార్చు కున్నది. వివిధ రూపాలలో, వివిధ వర్ణాలతో రూపాంతరం చెందుతూ, ఏదో ఒక విధంగా దళితులను అణిచివేస్తూ, తద్వారా కుల వ్యవస్థను, అప్రజాస్వామిక బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు సంస్కృతిని విస్తరింప చేయాలనే దీర్ఘకాలిక ప్రయోజనం ఈ సాంఘిక బహిష్కరణలో దాగి ఉన్నది. దీనిని అర్థం చేసుకోకుండా కుల నిర్మూలన అనే దీర్ఘకాలిక పోరాటం, దళిత ఉద్యమానికి అంతుచిక్కదు.

దళితులకు ఆ గ్రామంలో ఏ రకమైన వస్తువులు, పదార్థాలు అమ్మరాదు. చివరకు ఇది ఎంతదూరం పోయిందంటే దళితులకు వైద్యం కూడా చేయరాదని ఆంక్షలు విధించారు. డాక్టర్‌ను కూడా గ్రామంలో వైద్యం చేయకుండా బహిష్కరించారు. ఇదీ 70 ఏళ్ల భారత స్వాతంత్రం సాధించిన ప్రగతి.

దళితులు కానివారు కూడా అనగా బిసిలు, ఇతర కులాలవారు కూడా దళితుల పక్షం వహించకుండా, జరుగుతున్న అన్యాయాన్ని ఖండించకుండా, అగ్రకుల క్షత్రియ–రాజులవైపే నిలబడ్డారు. ఇది నిజంగా కులవ్యవస్థ అసలు స్వభావం, స్వరూపం. ఇది మొదటి నుండీ జరుగుతున్నదే! గ్రామీణ సాంఘిక వ్యవస్థలో ప్రజల జీవన విధానాన్ని అగ్రకుల భూస్వామ్య దురహంకారులు శాసిస్తున్నంత కాలం ఈ పరిస్థితి నెలకొని ఉంటుంది. కాంగ్రెస్ అధికారంలో ఉన్నా, తెలుగుదేశం – బిజెపిలు అధికారంలో ఉన్నా ఇదే పరిస్థితి.

ఇంత జరుగుతున్నా బయటికి వార్త రాకుండా ఆ గ్రామ భూస్వామ్య శక్తులు ఎంతగా జాగ్రత్త పడ్డాయంటే, వారికున్న వ్యూహం, అవకాశాలు, సహకారం, (అధికారులు–పోలీసులు) దళిత సంఘాలకు, దళిత నాయకులకు లేకపోవడం కూడా ఒక గుణపాఠమే. మొట్టమొదట ఈ దుస్సంఘటనను వెలుగులోకి తీసుకొని వచ్చింది 10 టివి (ప్రజాశక్తి అనుబంధం) మాధ్యమం. ఆ తర్వాత ఆంగ్ల దినపత్రిక ది హన్స్ ఇండియా, ఎచ్ఎంటివి ప్రధానంగా వెలుగులోకి తీసుకొనివచ్చారు.

గరగపర్రు దళితులు దాదాపు రెండు నెలలు సాంఘిక బహిష్కరణకు గురవ్వడం ద్వారా వారికి వర్తించే ప్రాథమిక హక్కులన్నీ కోల్పోయి నరకం చవిచూశారంటే మనం ఎటువంటి అమానవీయమైన, దుర్మార్గమైన సమాజంలో నివసిస్తున్నామో అర్థం చేసుకోవాలి. ఆ జిల్లాకు చెందిన మంత్రి, కొవ్వూరు ఎంఎల్ఎ అయిన జవహర్, ఎస్‌సి కార్పొరేషన్ ఛైర్మన్ జూపూడి ప్రభాకర్‌రావు, ఎస్‌సి/ఎస్‌టి కమిషన్ ఛైర్మన్ కారెం శివాజీ, సాంఘిక సంక్షేమ శాఖా మంత్రి నక్కా ఆనంద్‌బాబు తదితరులు ఆ గ్రామాన్ని సందర్శించి, దళితులకు నష్టపరిహారం, కొంత ఆర్థిక సహాయం అందించారు తప్ప అసలు అంబేద్కర్ విగ్రహాన్ని మాత్రం చెరువు గట్టుపై ప్రతిష్టించలేకపోయారు.

ఇది ఒక చట్ట పరిధిలో దళితులను ఇమడ్చడం. అంతకు మించి దళితులు ఆలోచించకూడదనే స్వీయ నియంత్రణ (సెల్ఫ్ కంట్రోల్) కు కొంతమంది దళిత నాయకులు వచ్చారు. ఇది కూడా ఒక గుణపాఠం లాంటిదే.

రాష్ట్ర వ్యాప్తంగా దళితులు ఉద్యమిస్తే తప్ప ఎస్‌సి/ఎస్‌టి కేసు నమోదు కాలేదు. ఏదో పంచాయితీ కార్యదర్శిని, మండల ఎస్ఐని సస్పెండ్ చేశారు. అసలు నిందితులు స్థానిక తహసీల్దార్, జిల్లా కలెక్టర్, ఆర్‌డిఓలు. ఎందుకంటే జరుగుతున్న విషయాలను మెమొరాండం రూపంలో గ్రామ దళితులు ప్రజాదర్బార్‌లో ఇచ్చినప్పటికీ దానిని ఏ మాత్రం పట్టించు కోకుండా, స్థానిక అగ్రకుల భూస్వాములకు సహకరించారు. వీరిపై సెక్షన్ (4) ఎస్‌సి/ఎస్‌టి (పిఒఎ) యాక్ట్ 1989 ప్రకారం కేసు నమోదు చేసి అరెస్ట్ చేయాలి. సాంఘిక బహిష్కరణ విధించిన వారికన్నా తెలిసి కూడా దానిని ఆపలేకపోయిన అధికార యంత్రాంగం అంతా చట్టప్రకారం నిందితులలో భాగమే.

అంబేద్కర్ గురించి రోజూ మాట్లాడే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఐఎఎస్/ఐపిఎస్ అధికారులు సామాన్య దళితులకు జరుగుతున్న, విధించబడిన అమానవీయమైన సాంఘిక బహిష్కరణపై ఇంత వరకూ నోరు మెదపలేదు. ముఖ్యమంత్రి అసలు తనకు ఏమీ సంబంధం లేనట్లు వ్యవహరిస్తున్నాడు. కేవలం దళిత నాయకులను ఆ గ్రామానికి పంపించి, వారితో ప్రకటన చేయించాడు తప్ప స్వయంగా తాను ఏమీ మాట్లాడలేదు. ఆయన దృష్టిలో ఇది ప్రాధాన్యతలేని అంశమేమో? ఇంత పెద్ద సంఘటన జరుగుతూ ఉంటే రాజ్యాంగ బద్ధంగా పాలన సాగిస్తున్న వ్యక్తికి, రాజ్యాంగ హక్కుల ఉల్లంఘన తన పార్టీ ముఖ్యుల వల్ల జరిగిందని తెలిసీ కూడా నాటకం ఆడుతున్నాడు. ఇదంతా దళిత ఉద్యమకారులు గ్రహించాలి. ఈ కేసులో నిందితుల అరెస్ట్‌కు పెద్ద ఎత్తున ఉద్యమించవలసి వచ్చింది. అంతే కానీ ‘చట్టం తన పని తాను చేసుకొని పోలేదు’.

ఇలాంటి సాంఘిక బహిష్కరణలు, అవమానాలు, అణచివేతలు అన్నీ చట్టం చట్రంలోనే మౌనంగా సాగిపోతున్నాయి. దీనిని ఎదుర్కొవడానికి, అసమానతలను ప్రతిఘటించడానికి, మానసిక సంసిద్ధత అవసరం. ముఖ్యంగా దళితులకున్న భావ దారిద్ర్యాన్ని, క్రైస్తవ మతాధిపతుల పెత్తనాన్ని పోగొట్టాలి. తమకు తాము సుఖంగా, గౌరవంగా, ఆర్థిక వెసులుబాటుతో జీవిస్తున్నామని భావిస్తున్నప్పటికీ, అంతిమ లక్ష్యం సమ సమాజం దిశగా ఆ పోరాటం నడవడం లేదు. ఇదొక లోపం.

ఎబిసిడి వర్గీకరణ కావాలని ఒకరు, కాకూడదని మరొక కులం పోరాడుతున్నారు తప్ప, ఇరువురూ, లేదా మొత్తం సమాజం ఎదుర్కొంటున్న మౌలిక అంశాలపట్ల కలిసి పోరాడలేని పరిస్థితి నెలకొన్నది. ఇది ఇరువురికీ నష్టం. భూస్వామ్య పునాదులు, వారికి మద్దతునిస్తున్న అధికార యంత్రాంగం, అగ్రకుల దురహంకారుల పెత్తనం గ్రామాలలో నిర్మూలించబడకుండా, కుల నిర్మూలన జరగదు. ఒకవైపు అంబేద్కర్‌ను పూజిస్తున్నారు. మరోవైపు సాంఘిక బహిష్కరణ విధిస్తున్నారు. అన్నీ వారే చేస్తున్నారు. మొన్న కారంచేడు, చుండూరు, నేడు గరగపర్రు, రేపు మరో గ్రామం కావచ్చు. అందుకే నిరంతరం అప్రమత్తులై, చైతన్యవంతులై పోరాడడం ద్వారానే కుల నిర్మూలన సాధ్యపడుతుంది తప్ప – మరో మార్గం లేదు.

*(రచయిత న్యాయవాది, ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# పెరుగుతున్న రైతు ఉద్యమాలు

*దేశంలో రైతుల పరిస్థితి చాలా పతనావస్థకు చేరిందనీ, పంట పండించడానికి, పండించిన పంటకు ధర తెచ్చుకోవడానికి, ఆ ధరను అమలు చేసుకోవడానికి కూడా ఉద్యమాలు చేయాల్సిన పరిస్థితి ఏర్పడిందనీ అంటున్నారు* **భాస్కర్ ఎంపెల్లి**

**భా**రత ఆర్థిక వ్యవస్థ నయా-ఉదారవాద పంథా తీసుకున్న తర్వాత వ్యవసాయానికి తక్కువ ప్రాధాన్యత ఇవ్వడం ఆర్థిక విధానంలో భాగంగా మారింది. ప్రైవేటు పరిశ్రమలను ప్రోత్సహిస్తూ, ఐటి రంగానికి అధిక ప్రాధాన్యతనిస్తూ పట్టణీకరనే ప్రధాన ధ్యేయంగా ఉన్న ఆర్థిక విధానాలతో, పట్టణాల్లో అసంఘటిత రంగం విపరీతంగా పెరిగి పట్టణ జనాభా పెరిగింది. పెరుగుతున్న పట్టణ జనాభా అవసరాలు తీర్చడానికి, ప్రభుత్వం వ్యవసాయ ఉత్పత్తుల ధరలు తక్కువగా నిర్ణయించడం ఒక విధానంగా చేసుకుంది. ఆ నిర్ణయించిన కనీస మద్దతుధర కూడా రైతులకు ఇవ్వకుండా ప్రభుత్వం చేతులు ఎత్తివేయడంతో, పంట కాస్త దళారుల చేతుల్లోకి వెళ్లి అక్కడ నుండి కార్పొరేట్లయిన రిలయన్స్ ఫ్రెష్, బిగ్ బజార్, స్పెన్సర్, డి-మార్ట్ లాంటి సంస్థలకు భారీ లాభాలు సమకూరుస్తూ అధిక ధరలకు పట్టణాల్లో అమ్ముడవుతున్నాయి.

ప్రభుత్వం వ్యవసాయానికి నిధులు కేటాయించకుండా నీటిపారుదల వసతులు, రుణాలు, ఇతర పనిముట్లు రైతులకు అందించే బాధ్యత నుండి ప్రపంచ బాంకు ఆదేశాలకు అనుగుణంగా ఎప్పుడో తప్పుకుంది. ఇప్పుడు వ్యవసాయం రైతు వ్యక్తిగత సమస్య. పంటకు కనీస మద్దతు ధర లభించక పోవడంతో పెట్టిన పెట్టుబడి రాబట్టుకోవడానికి ఉత్పాదకత పెంచడం తప్ప వేరే మార్గం లేకుండా పోయింది. ఇందుకు రైతుకు ఉన్న మార్గాలు రెండు. ఇంకా భూమిని కౌలుకి తీసుకోని సాగు చేయడం లేదా ఉన్న దాంట్లో నీటిపారుదల వసతులు, పెట్టుబడి, ఇతర అవసరాలు సమకూర్చుకుని ఉత్పత్తి చేయడం. రెండూ కూడా ఉత్పత్తి వ్యయాన్ని పెంచేవే. ఇటువంటి పరిస్థితిలో వర్షాభావం ఏర్పడితే ఆత్మహత్యే గతి.

ఇన్ని కష్టాలకు ఓర్చి కూడా రైతులు అధిక ఉత్పత్తిని సాధించినా, వారి ఆధాయాలు పెరగలేదు. వ్యవసాయ ఉత్పత్తుల ధరలు ప్రభుత్వం తక్కువగా నిర్ణయించడమే దానికి కారణం. కనీస మద్దతు ధర అంటే అంతకు తక్కువ ధరకు అమ్ముకునే పరిస్థితి రాదు అని ప్రభుత్వం హామి ఇవ్వడం. నీతీ ఆయోగ్ ఉపాధ్యక్షుడు అరవింద్ పనగారియ, రిజర్వ్ బాంకు గవర్నర్ ఉర్జిత్ పటేల్, మన్మోహన్ సింగ్ లాంటి ప్రపంచ బాంకు మాజీ ఉద్యోగస్తుల సలహాలతో ఆ హామిని ప్రభుత్వాలు నిలబెట్టుకోక పోవడం వలన రైతులు ఆత్మహత్య చేసుకొనో లేదా ఆ మద్దతు ధర కోసం చేసిన ఉద్యమాల్లోనో చనిపోతున్నారు.

వర్షాలు, వాతావరణం కారణంగా వచ్చిన దానికంటే వ్యవసాయ మార్కెట్లలో అక్రమంగా చేరిన మధ్య దళారులు సృష్టిస్తున్న సంక్షోభమే ఎక్కువ. గిట్టుబాటు ధర నిర్ణయించడమే తన పనిగా ప్రభుత్వం కుచించుకుపోయిన తర్వాత మార్కెట్ నియంత్రణ ప్రైవేట్ ఏజెన్సీల చేతికి పోయింది. పంట బాగా పండి మార్కెట్‌కి వచ్చిన రైతుకి అవసరానికి మించి ఉత్పత్తి ఉందని కృత్రిమ మిగులు చూపించి ధరలు అమాంతంగా తగ్గిస్తున్నారు. మధ్య దళారులు, ప్రైవేట్ ఏజెన్సీలు కృత్రిమంగా సృష్టిస్తున్న సంక్షోభాలు, మోసాలు నియంత్రించడం వీళ్లంతా భాగస్వాములుగా నడుస్తున్న ప్రభుత్వాలకు చేతకావడం లేదు. వ్యవసాయమే జీవనాధారంగా ఉన్న చిన్న మధ్యతరగతి రైతులు పంటను గిడ్డంగుల్లో నిల్వ ఉంచే స్థోమత లేక, ప్రభుత్వ గిడ్డంగులు లేక ఎంతో కొంత, వచ్చిందే చాలని అమ్ముకుంటున్నారు. ఇప్పుడు రైతు సంక్షేమం దళారుల దయాదాక్షిణ్యం.

రైతులను సంక్షోభంలో నుండి బయట పడేయడానికి ఎం.ఎస్. స్వామినాథన్ అధ్యక్షతన ఏర్పడిన జాతీయ కమిషన్ కొన్ని సిఫారసులు చేసింది. దాని ప్రకారం పంటకు ఉత్పత్తి వ్యయం కంటే 50 శాతం ఎక్కువగా కనీస మద్దతు ధర నిర్ణయించాలి. ఈ కనీస మద్దతు ధర కేవలం వరి, గోదుమ లాంటి ఆహార పంటలకే కాకుండా ఇతర పంటలకు కూడా వర్తింపచేయాలి.

పంటకు గిట్టుబాటు ధర అందేలా ప్రభుత్వం సరైన యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. ఇవేవి కూడా అమలుకు కాదు కదా కనీసం పరిగణలోకి తీసుకోలేదు. ఎం.ఎస్. స్వామినాథన్ భూస్వాము లకు, పెట్టుబడిదారులకు ఉపయోగపడే, భూపంపిణీ డిమాండ్‌ను నీరుగార్చే హరిత విప్లవం లాంటి పాలసీలు చేస్తే అమలు చేస్తారు కాని రైతులకు ఉపయోగపడే విధానాలు సిఫారసు చేస్తే ఎందుకు చేస్తారు.

నిత్యవసరాల ధరలు, కూరగాయల ధరలు పెరగకుండా, ద్రవ్యోల్బణాన్ని నియంత్రించడానికి, రైతులకు సరియైన సదుపాయాలు కల్పించి ఉత్పత్తి పెంచడానికి బదులు, వాళ్లు అనేక కష్టాలకు ఓర్చి పండించిన పంటకు తక్కువ ధర నిర్ణయించడమనే తప్పుడు పద్ధతిని ప్రభుత్వాలు వారికి సలహాలు ఇస్తున్న ఆర్థికవేత్తలు ఎంచుకున్నారు. నిర్ణయించిన కనీస ధరల దగ్గర ఉత్పత్తి వ్యయమైనా రాబట్టుకోవడానికి రైతులు ఉత్పత్తి పెంచితే, ఉత్పత్తి పెరిగినందుకే ధరలు తగ్గాయని వాదిస్తున్నారు.

దేశంలో ఆహార ధాన్యాల ఉత్పత్తి 2015-16తో పోలిస్తే 2016-17లో 8.6 శాతం ఎక్కువగా ఉంది. బడ్జెట్‌లో వ్యవసాయానికి ఎక్కువ నిధులు కేటాయించడం వల్లనే ఇది సాధ్యం అయిందని బిజెపి ప్రభుత్వం గొప్పలు చెప్పుకుంది. తీరా పంటకు గిట్టుబాటు ధర కల్పించడంలో పూర్తిగా విఫలం అయింది. ఇదేమని ప్రశ్నించినందుకు మధ్యప్రదేశ్‌లో ఐదుగురు రైతులను కాల్చి చంపింది. వాళ్లకు కావల్సిన వసతులు కల్పించి, పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పిస్తే పంట రుణాలు రైతులే కట్టుకుంటారు. రుణమాఫీ అడగరు. వాళ్ల శ్రమకు తగిన ప్రతిఫలం చెల్లిస్తే రైతులు మీ ఆర్థికవేత్తల చేత, ఆర్థిక సంస్థల చేత ప్రతిసారి అవమానాలకు గురికారు. పండించిన పంటను తక్కువ ధరకే కాజేస్తూ, వ్యవసాయ ఉత్పత్తి వ్యయభారాన్ని రైతులపై రుద్దుతూ, పైనుండి వారి

రుణాలు మాఫీ చేసి వారిని ఆదుకుంటున్నామని చెప్పుకోవడమే ప్రపంచీకరణ ప్రత్యేకత. నరేంద్రమోడి 2022 నాటికి రైతుల ఆధాయాలు రెండింతలు చేస్తామని హామీలు ఇస్తున్నాడు. ప్రభుత్వం బాధ్యతగా కల్పించాల్సిన వసతులు కల్పించి, వారి శ్రమకు తగిన ప్రతిఫలం దక్కేలా చూస్తే 2022 దాకా ఆగాల్సిన పనిలేదు ఇప్పుడు కూడా రైతుల ఆధాయం రెండితలు కాగలదు.

**దేశవ్యాప్తంగా రైతు ఉద్యమాలు (మధ్యప్రదేశ్, మహారాష్ట్ర)**

నోట్ల రద్దు ఉత్తరభారత దేశంలోని రైతులను అతలాకుతలం చేసింది. సరిగ్గా గోదుమ, చెరుకు, ఇతర పంటలు చేతికి వచ్చే సమయానికి పెద్ద నోట్ల రద్దు చేయడం, డిజిటలైజేషన్ పేరుతో నగదు అందుబాటులో లేకుండా చేయడం జరిగింది. కోతలు కోయడానికి, పంటను మార్కెట్‌కి చేర్చడానికి రైతులు నానా కష్టాలు పడ్డారు. ఇంతా చేసి పంట అమ్మిన తర్వాత నగదు లేదని చెక్కులు ఇచ్చారు. ఇదంతా ఉత్తరప్రదేశ్ ఎన్నికల్లో ప్రజాగ్రహంగా బయటపడుతోందని అందరూ ఎదురుచూశారు. కాని ఎన్నికల అజెండాగా రుణమాఫీని ముందుకు తీసుకువచ్చి స్వయంగా ప్రధానమంత్రే రుణమాఫీని ప్రకటించి ప్రజల్లో కొంత ఉపశమనం పొందారు. పైగా సమాజ్‌వాదీ పార్టీ అంతర్గత కుమ్ములాటలు కలిసి వచ్చి బిజెపి భారీ మేజారిటీతో గేలిచింది. అప్పటికే ప్రభుత్వ మద్దతు కరువై వ్యవసాయం కష్టంగా మారి ఆత్మహత్యలు ఒకవైపు ఉండగా, నోట్ల రద్దు మరోక విపత్తు. ఇదంతా కాకుండా ఎప్పుడూ రుణ మాఫీకి నిధులు లేవని, లేదా ఆ విషయం కేంద్రం పరిధిలోది కాదని బుకాయించే కేంద్ర ప్రభుత్వం ఉత్తరప్రదేశ్ ఎన్నికలు గెలవడం కోసం స్వయంగా రుణమాఫీ హామిని ఇవ్వడం దాని రైతు వ్యతిరేక విధానాన్ని బయట పెట్టింది. కేంద్ర మంత్రి వెంకయ్యానాయుడు అయితే రుణమాఫీ ఒక ఫ్యాషన్‌గా మారింది అని ఎగతాలి చేశాడు.

ఇదంతా మిగత రాష్ట్రాల రైతుల ఆగ్రహానికి కారణం అయ్యింది. అలా అవుతుందని కేంద్రంలోని బిజెపికి కూడా తెలుసు. అప్పటికే దక్షిణాది రాష్ట్రాలైన తమిళనాడు, తెలంగాణ, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక లాంటి రాష్ట్రాల్లో రైతులు ఉద్యమ బాటపట్టారు. ఇది ఉత్తరాదికి కూడా చేరి దేశవ్యాప్త రైతు తిరుగుబాటుగా మారగలదు. అది జరగకుండా చూడాలి అంటే రైతుల సమస్యలను పరిష్కరించాలి.

అందుకు వారు అనుసరించే నయా-హిందూవాద (నయా-ఉదారవాదం హిందూత్వ) ఆర్థిక విధానాలు, వాటిని అమలు చేయిస్తున్న ప్రపంచబాంకు, ఇక్కడ పనిచేస్తున్న దాని ఉద్యోగస్తులు ఒప్పుకోరు. పైగా అది పాలకవర్గ ప్రయోజనాలకు వ్యతిరేకం. అప్పుడు బిజెపికి ఉన్న మార్గం నమూనా (ప్రాక్సీ) ఉద్యమాన్ని సృష్టించి, దానిచేత కొన్ని డిమాండ్‌లు చేయించి బిజెపి అనుబంద సంఘాలను పిలుచుకొని చర్చించి డిమాండ్లు నెరవేరాయని సమ్మె విరమింప చేయడం. దాంతో అసలు డిమాండ్‌లు నీరుగార్చి, రైతులు సంఘటితం కాగల అవకాశాలు తగ్గించవచ్చు. అందుకు వారు ఎంచుకున్నవి మహారాష్ట్ర, మధ్యప్రదేశ్.

ఈ రెండు రాష్ట్రాల్లో రైతుల సంఖ్య, సమస్యలు, వారు సంఘటితం కాగల శక్తి ఎక్కువ. పైగా ఈ రెండు రాష్ట్రాల్లో బిజెపి బలం, వారి ప్రణాళిక అమలు చెయగల ప్రభుత్వాలు ఉన్నాయి.

మహారాష్ట్రలో రైతులు తమ సమస్యల పరిష్కారానికి 2,000 గ్రామాలు తమ గ్రామ పంచాయితీల్లో మహారాష్ట్ర ఆవిర్భావ దినం మే1న తీర్మానం చేసి జూన్ 1న రైతుల సమ్మెకు పిలుపునిచ్చారు. ఇదంతా స్థానికంగా ఉన్న బిజెపి నాయకుల ఆధ్వర్యంలో జరిగింది. మే 11న పుణేలో జరిగిన సమావేశంలో ఉద్యమాన్ని నడపడానికి కోర్ కమిటిని ఎన్నుకోవడం జరిగింది. అప్పటికే అవకాశం కోసం చూస్తున్న రైతులు వేగంగా మారుతున్న సమీకరణలు అర్థం కాకపోయినా ఎవరో ఒకరు ముందుకు వచ్చారు కదా అని సమ్మెకు సిద్ధమయ్యారు. జూన్ 1 సమ్మె సమయానికి చాలామందికి అనుమానాలు మొదలై గ్రూపులుగా విడిపోయింది ఉద్యమం. జూన్ రెండున మహారాష్ట్ర ముఖ్యమంత్రి ఫడ్నవిస్‌తో కోర్‌కమిటీ భేటి అయి 3వ తేది నుండి సమ్మెను విరమిస్తున్నామని, ప్రభుత్వం రుణ మాఫీకి ఒప్పుకుంది అని ప్రకటించారు.

మోసపోయామని గ్రహించిన రైతుల ఆగ్రహం కోర్ కమిటీ మీదకు మళ్లింది. దాంతో ప్రభుత్వ అనుకూల బిజెపి నాయకులను పక్కకు పెట్టి రెండవసారి ఉద్యమ కోర్ కమిటీని ఎన్నుకున్నారు. అప్పుడు ఉద్యమం ఉద్యమ రూపాన్ని తీసుకుంది. రైతులు ప్రభుత్వం ముందుంచిన అన్ని డిమాండ్ల మీద స్పష్టమైన హామి ఇచ్చేవరకు సమ్మె విరమించమని పట్టణాలకు కూరగాయలు, పాలు మొదలైనవి నిలిపివేశారు. ఉద్యమ సెగ పట్టణాలకు తాకింది. అప్పుడు మహారాష్ట్ర ప్రభుత్వం 30,000 కోట్ల రూపాయల రుణాలను మాఫీ చెస్తున్నట్టు ప్రకటించి, అందుకు ప్రభుత్వ ఉద్యోగులు తమ ఒకరోజు జీతాన్ని ఇవ్వాల్సిందిగా కోరింది.

మధ్యప్రదేశ్‌లో సరిగ్గా ఇలాంటిదే జరిగింది. జూన్ 1న ఉద్యమం మొదలైతే జూన్ 5న మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి శివరాజ్ సింఘ్ చౌహాన్ బిజెపి అనుబంధ రైతు సంఘం భారతీయ కిసాన్ సంఘ్ (బికెఎస్) చర్చలు జరిపారు. ప్రభుత్వం ఉల్లిగడ్డలు కిలో రు. 8కి కొనడానికి అంగీకరించినందున సమ్మె విరమిస్తున్నామని ప్రకటించింది.

విషయాన్ని చాలా తెలివిగా పక్కతోవ పట్టించామనుకున్న ప్రభుత్వానికి రైతులు తమ వర్గ కసిని రుచి చూపించారు. జరుగుతున్న ఉద్యమాన్ని నీరుగార్చడానికే బికెఎస్ ఉద్యమంలోకి వచ్చిందని గ్రహించిన రైతులు ఉద్యమాన్ని ఉధృతం చేశారు.

ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఐదుగురు రైతులను ఉద్యమ కేంద్రం అయిన మంద్సూర్‌లో కాల్చి చంపింది. అయినా రైతులు వెనుకడుగు వేయక ప్రభుత్వం దిగివచ్చేలా ఉద్యమించారు. చివరకు ప్రభుత్వం చిన్నసన్నకారు రైతుల రుణాలు రెండు లక్షల పరిమితి వరకు మాఫీ చేస్తామని ప్రకటించింది.

అయితే కొంతమంది రైతులకే రుణమాఫీ చేయడం కాదని రైతులందరికి పరిమితి విధించకుండా రుణమాఫీ చేయాలని, ఉత్పత్తి వ్యయం కంటే ఒకటిన్నర రెట్లు అధికంగా కనీస మద్దతు ధర నిర్ణయించాలని అప్పటివరకు ఉద్యమం విరమించేది లేదని తేల్చిచేప్పారు.

తమిళనాడు రైతుల వినూత్న నిరసనలు దేశం మొత్తాన్ని వారి వైపు తిప్పుకోవడమే కాకుండా రైతుల దీనస్థితిని కళ్లకు కట్టినట్టు చూపింది. తమిళనాడు రైతులు గత నూట నలభై సంవత్సరాల్లో కనీవినీ ఎరుగని కరువు బారినపడ్డారు. వర్షాలు రాక ఒకవైపు, కావేరి జలాల వివాదం మరోవైపు. ఒక్క నెలరోజుల వ్యవధిలోనే దాదాపు నూటా ఆరుగురు రైతులు ఆత్మహత్య చేసుకున్న పరిస్థితి. రాష్ట్రంలో జయలలిత చనిపోయిన తర్వాత అధికార పార్టీ ముఖ్యమంత్రి పదవికోసం తన్నుకుంటూ తమ గోడు వినే పరస్థితి లేకపోవడంతో వారు ఢిల్లీని కేంద్రంగా చేసుకుని నిరసనలు చేశారు.

జంతర్ మంతర్ దగ్గర దాదాపు నలభై ఒక రోజుల పాటు నిరసన చేస్తే కనీసం వినడానికి కూడా ఎవరు రాలేదు. కేంద్రానికి అది తమ సమస్య కాదు. ముఖ్యమంత్రి పళనిస్వామి వచ్చి డిమాండ్లు నెరవేరుస్తామని

హామీ ఇచ్చిన తర్వాత నిరసన విరమించారు. ఆ డిమాండ్లు నెరవేర్చని కారణంగా తమిళనాడు రైతులు మళ్లీ జంతర్ మంతర్ చేరుకున్నారు.

తెలుగు రాష్ట్రాల్లో మిరప రైతులకు మద్దతు ధర లభించక రైతులు వారి పంటను వారే తగలపెట్టుకున్నారు. మార్కెట్‌కి వచ్చిన పంటను కొనాలని డిమాండ్ చేసిన కారణంగా రైతుల మీద కేసులు పెట్టి వారిని నేరస్తుల్లాగా బేడిలు వేసి కోర్టుకు తీసుకురావడం అందరూ చూశారు. గత సంవత్సరం క్వింటా మిర్చి పన్నెండు వేలు ఉంటే ఈ సంవత్సరం మూడు వేలు అయింది. ఆగ్రహించిన రైతులకు కేసులే సమాధానం అయింది. ఇక అమరావతి రైతుల బాధలు వేరే కథ.

చత్తీస్‌గడ్‌లో నోట్ల రద్దుతో చత్తీస్‌గడ్ రైతులు తాము పండించిన టమాటాలు వందకిలోలు యాభై రూపాయలకు అమ్ముకోవాల్సి వచ్చింది. దీంతో ఆగ్రహించిన రైతులు టమాటాలు ట్రక్కుల కిందేసి తొక్కించి ప్రభుత్వ చేతకానితనాన్ని నిరసించారు.

ఉత్తరప్రదేశ్ ఎన్నికల సమయంలో నరేంద్రమోడి బిజెపి అధికారంలోకి వస్తే చెరుకు రైతులకు పద్నాలుగు రోజుల్లో వారికి చక్కెర మిల్లుల నుండి రావల్సిన నగదు మొత్తంను ఇప్పిస్తామని హామీ ఇవ్వడం జరిగింది. రైతులకు 2014-15 సంవత్సరం నుండి రావల్సిన మొత్తం ఇంకా రాలేదు. మళ్లీ పంట సమయం వచ్చింది, బిజెపి అధికారంలోకి వచ్చి నాలుగు నెలలు దాటింది. అయినా వారికి రావల్సిన డబ్బులు మాత్రం రాలేదు. దాంతో రైతులు ప్రధానమంత్రికి, ముఖ్యమంత్రికి తాము ఆత్మహత్య చేసుకోవడానికి అనుమతినివ్వమని లేఖలు రాస్తున్నారు.

వాళ్లు రుణమాఫీ అడగట్లేదు, సబ్సిడీ అడగట్లేదు. వారు పండించి, అమ్మిన పంటకు డబ్బులు అధికారంలోకి వచ్చిన రెండు వారాల్లో ఇప్పిస్తామని స్వయానా ప్రధానమంత్రి ఇచ్చిన హామిని నాలుగు నెలలైనా నెరవేర్చక పోవడంతో వారు ఈ నిర్ణయానికి వచ్చారు. ఈ బిజెపి పాలనలో అమ్మిన పంట డబ్బులు ఇప్పించడం కూడా ఎన్నికల హామీగా మారింది. అదే విధంగా కర్ణాటక, పంజాబ్, జార్ఖండ్, రాజస్థాన్ లాంటి రాష్ట్రాల్లో కూడా రైతులు పెద్ద ఎత్తున ఉద్యమానికి సిద్ధం అవుతున్నారు.

వ్యవసాయానికి నిధులు, రైతుల సంక్షేమం, పంట రుణాలు మాఫీ కేవలం ఎన్నికల అజెండాగా మారిపోయాయి. ప్రస్తుతం జరుగుతున్న రైతు ఉద్యమం కేవలం రుణమాఫీ లేదా గిట్టుబాటు ధర కోసం జరుగుతున్నట్టు అనిపించినా దాని మూలాలు, లక్ష్యాలు వేరుగా ఉన్నాయి. వ్యవసాయరంగం మీద ప్రభుత్వాల నిర్లక్ష్యానికి వ్యతిరేకంగా జరుగుతున్నవీ ఉద్యమాలు. ఇప్పుడు దేశవ్యాప్తంగా రైతులు చేస్తున్న ఉద్యమాలు కేవలం రుణమాఫి, గిట్టుబాటు ధర కోసం కాదు. ఉత్పత్తికి సరైన ధర కోసం, వారి శ్రమకి తగిన ప్రతిఫలం కోసం.

వ్యవసాయం, రైతులను అవమానాలకు గురిచేస్తూ పట్టణీకరణ, ప్రైవేటీకరణ ప్రధాన లక్ష్యాలుగా ఉన్న ఆర్థిక విధానాలతో రైతుకి అస్తిత్వ సమస్య ఏర్పడింది. ఆ అస్తిత్వాన్ని కాపాడుకోవడానికి జరుగుతున్నవే ఈ దేశవ్యాప్త రైతు ఉద్యమాలు.

అయితే దేశవ్యాప్తంగా ఇలాంటి పరిస్థితి ఉంటే రైతులందరిని కలిపే ఒక రాజకీయ మాధ్యమం కరువయింది. భారత ఆర్థిక వ్యవస్థ నెహ్రూ సోషలిజం, ఇందిర సంక్షేమ రాజ్యం నుండి పి.వి.నర్సింహారావు నయా-ఉదారవాదానికి మారిన తర్వాత ఇప్పుడు రాష్ట్రానికో ప్రపంచ బాంకు దళారి తయారవుతూ రైతు సంక్షేమం గాలికి వదిలేసి గాల్లో మేడలు కట్టే ఐ.టి., అభివృద్ధి రంగంగా మారింది.

పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో అధికారంలోకి రావడానికి భూస్వాముల మద్దతు ఎంత అవసరమో ఇందిర గాంధీకి ఉత్తరాది రాష్ట్రాల అగ్రకుల భూస్వాములు తెలియచెప్పి అధికారాన్ని కాపాడుకోవడానికి అత్యయిక పరిస్థితి కల్పించిన తర్వాత భూస్వాములకు ఇబ్బంది కలగని ఆర్థిక విధానాలు అవసరమయ్యాయి. అప్పుడు బూర్జువా రాజకీయ పార్టీలు నయా-ఉదారవాదం ఎంచుకుంటే, పార్లమెంటరీ కమ్యూనిస్టు పార్టీలకు పెట్టుబడిదారీ పంథాలో సోషలిజం మార్గం అయింది. ఇప్పుడు భూపంపిణీ, భూసంస్కరణలు అర్థం లేని వాదనలు. ఎక్కడైనా వాస్తవిక ఆర్థిక పరిస్థితులు రాజకీయ పంథాను నిర్ణయించాలి కాని, మన దేశంలో అధికారంలోకి రావాలనే లేదా అధికారాన్ని కాపాడుకోవాలనే రాజకీయావసరం ఆర్థిక విధానాన్ని నిర్ణయించింది.

కమ్యూనిస్టు పార్టీలు అధికారంలో ఉన్న రాష్ట్రాల్లో కూడా రైతుల పరిస్థితి ఏమీ మెరుగ్గా లేదు. మిగతా రాష్ట్రాల కంటే కాస్త ఎక్కువ ఎరువుల సబ్సిడీ ఇస్తుండవచ్చు. అందుకే రైతుల నమ్మకాన్ని ఈ పార్లమెంటరీ కమ్యూనిస్టు రైతు సంఘాలు కూడా పొందలేక పోతున్నాయి.

ఒకవైపు దేశవ్యాప్త వ్యవసాయ సంక్షోభం, రైతులలో పెరుగుతున్న అశాంతి ఒకవైపు. దానిని రాజకీయ లక్ష్యంగా మార్చగల చిత్తశుద్ధి ఏ రాజకీయ పార్టీకి లేకపోయింది. అందుకే ఇప్పుడు వ్యవసాయ సంక్షోభం పరిష్కరించగల రైతు కూలి సంఘాల చారిత్రక అవసరం ఏర్పడింది.

*(రచయిత శాస్త్ర పరిశోధక విద్యార్థి)* వీ


**పదిహేను సంవత్సరాలుగా దేశవ్యాప్తంగా ప్రజాభిప్రాయ సర్వేలు నిర్వహిస్తున్న పీపుల్స్ పల్స్‌కు తెలంగాణ - ఆంధ్రప్రదేశ్‌లలో ఎన్నికల సర్వేలు నిర్వహించడానికి క్షేత్రస్థాయి పరిశోధకులు కావాలి. డిగ్రీ, ఆపైన అర్హతలు, ఆసక్తి, సర్వేలలో అభిరుచి ఉన్న అభ్యర్థులు**

**peoplespulse.hyd@gmail.com కు**

**తమ దరఖాస్తులు, వివరాలు పంపాలి.**

**చివరి తేది 15 ఆగస్టు 2017**




Flat No. 402, Surabhi Complex, Opp. Lotus Hospital, Lakdikapool, Khairatabad, Hyderabad - 500 004

**peoplespulse.hyd@gmail.com**

Advt.

# భారత ఆర్థిక వ్యవస్థపై జిఎస్‌టి ప్రభావం

***వస్తు, సేవల పన్ను విధానం భారత దేశ ఆర్థిక వ్యవస్థలో తీవ్ర ప్రతికూల పరిణామాలకు దారితీస్తుందనీ, సామాన్యులపై అది మరింత ఆర్థిక భారాన్ని పెంచుతుందనీ అంటున్నారు* డా. ఎ. పున్నయ్య**

అత్యధిక జనాభా గల దేశాల్లో రెండవ స్థానంలో 134 కోట్ల జనాభాను కలిగి ఉన్న భారతదేశం చైనా, రష్యా అనంతరం నేడు రెండు ట్రిలియన్ డాలర్ల లావాదేవీలతో గల పెద్ద ఆర్థికవ్యవస్థగా ఉంది. 1211 రకాల వస్తువులు, 500 రకాల సేవలు, 5 పన్ను స్లాబులు, కోటి మంది వ్యాపారులు కోట్ల కొలది ఆశలు అంతకు మించిన అనుమానాలు ముసురుకుంటుండగా ఒకే దేశం, ఒకటే మార్కెట్, ఒకటే పన్ను అంటూ ప్రారంభించింది. ప్రధాన ప్రతిపక్షం కాంగ్రెసుతో సహా లెఫ్ట్, బిఎస్‌పి, డిఎంకె, ఆర్‌జెడి పార్టీలు వేడుకకు దూరమైనప్పటికి, రాజకీయ ఆర్థిక అతిరథ మహారథులు ఆసక్తిగా పరికిస్తుండగా జూన్ 30న అర్ధరాత్రి జిఎస్‌టి గంట మోగింది.

భారత స్వాతంత్ర్య సిద్ధితో సమానంగా ఆర్థిక స్వాతంత్ర్య రూపంలో దీని ఆరంభాన్ని అత్యంత ఘనంగా నిర్వహించడంలోనే ప్రధాని మోడి ప్రత్యేకత ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఒక విధానాన్నయినా, పథకాన్నయినా ప్రపంచ దృష్టిని ఆకర్షించేట్టుగా ఆరంభించడంలో ఆయనకు ఆయనే సాటిగా నిలబడ్డాడు. చారిత్రాత్మకమైన ఈ హాల్‌లోనే 1947లో స్వాతంత్ర్య దినోత్సవ అధికార బదిలీ, ఆ తర్వాత రజతోత్సవం, స్వర్ణోత్సవం కూడా జరిగింది. ప్రధాని జిఎస్‌టి ఆమోదాన్ని దేశ చరిత్రలోనే చారిత్రాత్మక ఘట్టంగా ప్రకటించినారు. కాని సామ్రాజ్యవాద పెట్టుబడి, భారత కార్పొరేట్ శక్తులు జిఎస్‌టిని అమలు చేయాలని చాలా కాలంగా ప్రయత్నిస్తున్నారు. అయితే 2010లో యుపిఏ ప్రభుత్వం జిఎస్‌టి బిల్లును ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినపుడు బిజెపి వ్యతిరేకించింది. అందులో అత్యంత కీలక పాత్ర పోషించింది బిజెపి పాలిత రాష్ట్రాలు, మరీ ముఖ్యంగా అప్పటి గుజరాత్ ముఖ్యమంత్రి బాధ్యతల్లో ఉన్న నరేంద్ర మోడీనే. ఇప్పుడు దేశ ప్రధానిగా దానిని ఆచరణలోకి తెచ్చిన ఘనకీర్తిని కూడా మోడీ సొంతం చేసుకున్నాడు. పెద్దనోట్ల రద్దు, నగదు రహిత లావాదేవీలకు కొనసాగింపుగా తెచ్చిన ఈ "మెగా సంస్కరణ"తో ధరలు తగ్గుతాయా, పెరుగుతాయా, పన్నుపోటు కాటు వేస్తుందా వెసులుబాటునిస్తుందా, ఉత్పత్తిదారునికి వచ్చేదేమిటి, వ్యాపారికి చేరేదేమిటి, జనానికి రాబోయేదేమిటి చర్చించుకుందాం.

అత్యంత సంక్లిష్టమైన వ్యవస్థ నుంచి సులభ, పారదర్శకమైన వ్యవస్థ వైపు మారినపుడు సహజంగా ఉత్పత్తిదారుల నుంచి, వ్యాపారుల నుంచి వ్యతిరేకత ఉండకూడదు. సామాన్యుడు నెలవారి ఖర్చులో వచ్చే మార్పు గురించి ఆలోచిస్తుంటే, చిరు వ్యాపారులు, చిన్న వర్తకులు, చిన్న పరిశ్రమలు, చిన్న చిన్న ఉత్పత్తిదారులు విభిన్న కారణాలతో భయపడు తున్నారు. 29 రాష్ట్రాలు, 7 కేంద్రపాలిత ప్రాంతాలుగా ఉన్న విశాలమైన దేశంలో దశాబ్దాల విధానాన్ని మార్చుతున్నపుడు ముందుగా బలమైన ప్రత్యామ్నాయ వ్యవస్థను సృష్టించకుండా తాపీగా సర్దుకుంటుందను కోవడం సముచితమేమికాదు. నేడు పెద్దనోట్ల రద్దు ప్రభావం వల్ల కుదేలైన ఆర్థిక వ్యవస్థ మనకండ్ల ముందే తేలియాడుతుంది. బడుగు వ్యాపార సంస్థలను, బడా పారిశ్రామిక సంస్థలను ఒకే గాటన కడుతున్నపుడు బడుగు సంస్థల గోడు వినడం అవసరం. స్థానిక మార్కెట్‌పై బతుకు ఈడ్చే చిన్న పరిశ్రమలను సుదూరంగా ఉండే పెద్ద పరిశ్రమలు చావు దెబ్బ తీయకుండా వాటిని నిలబెట్టడానికి ప్రభుత్వం చేయూతనివ్వాలి.

**పన్నుల లక్ష్యాలు – సంస్కరణలు**

ప్రభుత్వాలు ప్రజా సంక్షేమం కోసం అనేక కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి. అందువల్ల ప్రభుత్వ వ్యయానికి సరిపడే ఆదాయాన్ని సమకూర్చుకునే మార్గాలలో అత్యంత ముఖ్యమైనవి పన్నులు. పన్నులు కేవలం ప్రభుత్వానికి ఆదాయాన్ని సమకూర్చడమే కాకుండా, సుస్థిర ఆర్థికాభివృద్ధికి, ఆర్థిక వ్యత్యాసాలను నిర్మూలించడానికి తోడ్పడుతాయి. భారత పన్నుల నిర్మాణం బ్రిటిష్ పన్నుల విధానం ఆధారంగా జరిగింది. ఏ దేశంలోనైనా పన్నుల నిర్మాణం పన్నుల లక్ష్యాలపై ఆధారపడి ఉంటుంది. స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల్లో భారత పన్నుల లక్ష్యాలు ప్రధానంగా ప్రభుత్వానికి తగిన రాబడిని సమకూర్చడంతోపాటు ప్రణాళికా లక్ష్యాలను సాధించడంగా ఉండేది. కాలానుగుణంగా పన్నుల విధానంలో ఎన్నో మార్పులు జరిగాయి. ఎన్నో కమిటీలు భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు అనుకూలంగా సూచనలు చేస్తూనే ఉన్నాయి. ఈ క్రమంలో 1990లో అమ్మకపు పన్ను నుండి విలువ ఆధారిత పన్ను (వ్యాట్)కు మారడానికి ప్రయత్నాలు మొదలుపెట్టి 2005లో (వ్యాట్) విలువ ఆధారిత పన్నును ప్రవేశ పెట్టినారు.

పన్నుల చెల్లింపులో ఎక్కువ చిక్కులున్నందున పన్ను మీద పన్నుకు స్వస్తి చెప్పి పన్నులు సరళంగా, తేలికగా ఉండాలనే లక్ష్యాలతో వ్యాట్ విధానంలోని అనేక లొసుగులను అధిగమించే సమగ్ర జిఎస్‌టిని రూపొందించాలని ప్రొ. విజయ కేల్కర్ కమిటీ 2003లో మార్గదర్శకాలను ఇచ్చింది. కమిటీ సూచన ప్రకారంగా వస్తు, సేవల పన్ను భారత సమాఖ్యకు లభించిన ఘనమైన విజయమని, ఏకీకృత విఫణి ఏర్పాటుకు ముందడుగన్నారు. రానున్న రోజుల్లో దేశంలోని వెనుకబడిన ప్రాంతాల పారిశ్రామికీకరణకు, పారిశ్రామిక ఎగుమతుల పెంపుకు ఈ ఏకీకృత పన్నుల వ్యవస్థ దోహదపడుతుందన్నారు. ఉత్పత్తిదారులు, వినియోగదారు లు ఎదుర్కొంటున్న సమస్యలన్నీ వస్తు, సేవల పన్నుతో రూపుమాపే విధంగా ఈ పన్నును సమర్థవంతంగా, పారదర్శకంగా అమలు చేయాలని ప్రొ. విజయకేల్కర్ సూచించారు.

భారత పన్నుల వ్యవస్థలో నూతనశకం ఆరంభమైంది. ఆర్థిక వ్యవస్థకు సంబంధించి పన్నుల వసూళ్ల స్వభావం, పద్ధతులు పూర్తిగా మారుతున్నాయి. పన్ను విధానంలో ప్రధాన భాగస్వాములు ముగ్గురు. ఉత్పత్తిదారుడు, వినియోగదారుడు, ప్రభుత్వం. ఉత్పత్తిదారునికి పన్ను తగ్గి చెల్లింపులో ఇబ్బందులు తొలగాలి. వినియోగదారునికి ధరలు తగ్గాలి. అంతటా ఒకే ధరకు వస్తువులు అందుబాటులో ఉండాలి. ప్రభుత్వాలకు

ఆదాయాలు ఘనంగా పెరగాలనే భూమిక మీద వస్తు, సేవల పన్ను నిర్మాణం జరిగింది. నేడు దేశం మొత్తం మీద ఒకే జిఎస్‌టిగా రాష్ట్రాలకు సంబంధించిన వస్తు, సేవా పన్ను (ఎస్‌జిఎస్‌టి), కేంద్రానికి సంబంధించిన వస్తు, సేవల పన్ను (సిజిఎస్‌టి), అంతర్రాష్ట్ర లావాదేవీలకు సంబంధించిన వస్తు, సేవల పన్ను (ఐజిఎస్‌టి), అట్లాగే ప్రస్తుతం ఈ జిఎస్‌టి విధానంలో జీరో, ఐదు, పన్నెండు, పద్దెనిమిది, ఇరవై ఎనిమిది శాతంగా 5 టాక్స్ స్లాబులు నిర్ణయించినారు. ఇంతకు ముందు గరిష్టంగా 34-40 శాతం పన్ను కూడా ఉంది. దానితో పోల్చితే గరిష్ట పన్ను మాత్రం తగ్గింది. ప్రజలు అత్యధికంగా వినియోగించే వస్తు, సేవలను తక్కువ పన్ను శాతం పరిధిలోకి తెచ్చినట్లు ప్రభుత్వం చెప్పినప్పటికి, సంపన్నులు వినియోగించే వాటిపై పన్ను తగ్గించి సామాన్యులు వినియోగించే వాటిపై పన్ను పెంచారు. పన్ను లేని మరెన్నో వస్తువులు నేడు పన్ను పరిధిలోకి రావడం వల్ల రోజువారీగా ఉపయోగించే ఆహార ధాన్యాలు, పండ్లు కూరగాయలతో పాటుగా ఇతర అత్యవసర వస్తువుల ధరలు పెరిగి ద్రవ్యోల్బణానికి దారితీస్తుంది.

దేశంలో 133 ప్రాథమిక వస్తువులపై జిఎస్‌టి వల్ల అధిక భారం పడుతుందని వ్యాపార, వాణిజ్య సంఘాలు ప్రభుత్వానికి నివేదించినా కేవలం 66 వస్తువులకు మాత్రమే పన్ను నుంచి ఉపశమనం కలిగించినారు. మొత్తం మీద 81 శాతం వస్తు సేవలు 18 శాతం పన్ను స్లాబులోకి వచ్చినాయి. మందుల మీద 12 శాతం, సబ్బులు, పేస్టుల మీద 18 శాతం, నిల్వ చేసిన కూరగాయల మీద 12 శాతం, సిమెంట్ లాంటి వస్తువులెన్నింటిమీదనో 24 శాతం పన్ను విధించుట వలన సామాన్యులకధిక భారం కానుంది. సామాన్యుల నుంచి సంపన్నుల దాకా వినియోగించే అనేక వస్తు సేవల ధరల్లో జిఎస్‌టి కారణంగా హెచ్చుతగ్గులున్నాయి. దీని దీర్ఘకాలిక ప్రభావం ఎలా ఉంటుందనేది అనుభవం, అమలు, ఆచరణ మీద రుజువు అవుతుంది.

**జిఎస్‌టి ప్రభావిత రంగాలు**

ప్రస్తుత విధానంలో రు. 1.50 కోట్ల టర్నోవర్ పైగా ఉన్న కంపెనీలు మాత్రమే ఎక్సైజ్ డ్యూటీ పరిధిలో ఉంటే, జిఎస్‌టి అమలుతో నేడది రు. 20 లక్షలకు కుదించడం వలన అనేక చిన్న తరహా పరిశ్రమలు, వ్యాపార సంస్థలు దీని పరిధిలోకి వచ్చినాయి. ఉద్యోగిత వికేంద్రీకరణకు అవకాశమున్న ఈ పరిశ్రమలకు ఇబ్బందికరమైన పరిస్థితులేర్పడినాయి. జిఎస్‌టి నిర్వహణ పూర్తి ఆన్‌లైన్‌లోనే నిర్వహించాల్సి ఉంటుంది. చిన్న మధ్య తరగతి సంస్థలకు, వ్యాపారులకు దీనిని నిర్వహించడం వ్యయప్రయాసలతో కూడుకున్నది. ప్రస్తుతం సామాన్యునికి సైతం నిత్యావసరంగా మారిన మొబైల్ ఫోన్లు, ఇంటర్‌నెట్ సేవలు జిఎస్‌టి అమలు తర్వాత చెల్లిస్తున్న బిల్లులు 15 శాతం నుండి 18 శాతానికి పెరిగినాయి. మొబైల్ చార్జీలు, పోస్టు పెయిడ్ 3 శాతం పెరిగితే, ప్రి పెయిడ్ టాక్‌టైమ్ తగ్గింది. వైద్య రంగంలో గ్లాండ్స్, ఆర్గాన్స్, ఆయుర్వేద, యునాని మందులు, హోమియోపతి, సిద్ధ మందుల ధరలు 7 శాతం పెరిగినాయి. మధ్య తరగతి వర్గాలు వినియోగించే పెర్‌ఫ్యూమ్స్, మేకప్ ప్రిపరేషన్స్, షాంపూలు, హెయిర్‌క్రీమ్స్ మొదలగు సౌందర్య ఉపకరణాలకు గరిష్టంగా 28 శాతం పెరిగింది. సాధారణ వస్తువులు అగర్‌బత్తీలు మొదలుకొని వెన్న, నెయ్యి, చీజ్, జామ్స్, జెల్లీ, పేస్టులు, వంటిసబ్బు, షేవింగ్ క్రీమ్స్, పెన్సిల్స్, షార్పనర్, సబ్బులు, తల నూనెల వరకు గరిష్టంగా 12 శాతం పన్ను పెరిగింది. లెదర్ వస్తువులు, బ్యాగులు, ఎయిర్ కండిషనర్స్, రిఫ్రిజిరేటర్లు, వాషింగ్ మిషన్స్, వ్యాయామ పరికరాలు 13.5 పెరిగినాయి.

**వ్యవసాయ రంగం**

పాలకుల దార్శనికతలేని చర్యల ఫలితంగా వ్యవసాయ రంగం దెబ్బతిని దేశం రైతుల ఆత్మహత్యలకు నిలయంగా మారింది. దేశానికి రైతే వెన్నెముకని ప్రగల్భాలు పలికిన పాలకులు రైతు వెన్ను విరచి వేస్తున్నారు. తాను చిందించిన రక్తానికి, స్వేదానికి తగ్గట్లు సిరులు కురుస్తాయన్న ఆశల్ని ఆవిరి చేసేసి రైతు ఇంట జిఎస్‌టి ఆరని మంటలు రేపుతున్నది. విత్తనాలు మొదలుకొని, ఎరువులు, పురుగు మందులు, నీటి పారుదలకు ఉపయోగించే డ్రిప్, స్ప్రింక్లర్స్, పైపులు, ఎలక్ట్రికల్ మోటర్స్, దున్నేందుకు వాడే పనిముట్లు మొదలగు వ్యవసాయ ఇన్‌పుట్స్‌పై ఏకాఏకిగా 18 శాతంగా పెంచింది. వ్యవసాయ ఉత్పత్తులు బియ్యం, గోధుమలు, పాలు, తాజా కూరగాయలు, పండ్లను మాత్రం జీరో టాక్స్‌లోకి తెచ్చింది. రైతు పండించిన పంటలకు ధరల్లో పెరుగుదల కన్పించకపోగా వ్యవసాయానికి ఉపయోగించే ఉత్పాదితాలపై జిఎస్‌టి 12 నుండి 18 శాతం స్లాబులో ఉండడం వలన వ్యవసాయాన్ని, రైతును సంక్షోభంలోకి నెట్టినట్లయింది.

**వస్త్ర పరిశ్రమరంగం**

నూతన ఆర్థిక విధానాల ఫలితంగా చేనేత పరిశ్రమ కుదేలయి నేతన్నలు ఉపాధి కోల్పోయి, అర్థాకలితో చేనేత మగ్గాలే ఉరితాళ్లుగా బిగుస్తున్నాయి. వ్యవసాయం తర్వాత గ్రామీణ ప్రజలకు ప్రధాన ఉపాధి రంగంగా విరాజిల్లుతున్న చేనేత పరిశ్రమ అనేకానేక ఒడిదుడుకులను తట్టుకుంటూ అంతర్జాతీయ గుర్తింపు పొందింది. అలాంటి చేనేత పరిశ్రమను జిఎస్‌టి మరింత సంక్షోభంలోకి నెట్టింది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత జరిగిన తొలి జాతీయ ప్రణాళిక సంఘం సమావేశంలో కుటీర పరిశ్రమలపై పన్ను విధించరాదనే నిర్ణయం జరిగింది. చేనేతకు సంబంధించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నూలు వస్త్రాలపై ఎట్టి పరిస్థితుల్లోనూ పన్ను విధించరాదని స్పష్టం చేశాయి. ఇందుకు భిన్నంగా ముడి సిల్క్, సిల్క్ వేస్టు, ఖాదీ యార్న్‌లపై పన్ను ఉండదని ఒకవైపు చెపుతూనే మరోవైపు యార్న్, కలర్స్, జరీ వస్త్రాలపై 5 శాతం జిఎస్‌టిని విధించారు. ఈ ప్రభావంతో చేనేత వస్త్రాల ధరలు గరిష్టంగా 20 శాతం పెరుగుతాయి. భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 43 అనుసారంగా ప్రభుత్వం కుటీర పరిశ్రమలను కాపాడుకొని ప్రోత్సహించాల్సిన బాధ్యతకు విరుద్ధంగా చేనేత ముడి సరుకులకు చిలుపనూలుపై పన్ను విధించడంతో దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలో బంద్‌లతో ఆందోళనలు తీవ్రమయ్యాయి. ఆర్థికాభివృద్ధితో పాటు ఉపాధి అవకాశాలను దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం చేనేతకు వెన్నుదన్నుగా నిలవాల్సిన అవసరముంది.

**బ్యాంకింగ్ రంగం**

పొదుపు పెట్టుబడులు, బ్యాంక్ లావాదేవీలు, షేర్లు, మ్యూచువల్ ఫండ్స్ వంటివి ఆర్థిక సేవలు. ఈ సేవలపై 15 శాతం నుండి 18 శాతం జిఎస్‌టి విధించారు. ఇప్పటికే సర్వీసు చార్జీలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న బ్యాంకింగ్ ఖాతాదారులు మరింత ఇబ్బందికి గురికానున్నారు. పెద్దనోట్ల రద్దు, ఇ-మనీ ట్రాన్స్‌ఫర్, డిజిటల్ ఇండియాలో భాగంగా బ్యాంక్ సేవలను విస్తరించాలని సామాన్య ప్రజల్ని సహితం అనివార్యంగా బ్యాంకులవైపు పరుగెత్తించిన ప్రభుత్వం నేడు బ్యాంకింగ్ సేవలపై పన్ను విధించడాన్ని ప్రభుత్వ దొల్లతనంగా భావించాలి. బ్యాంకింగ్, క్రెడిట్ కార్డు, మనీ ట్రాన్స్‌ఫర్, ఉచిత పరిమితి దాటి ఏటిఎంల ద్వారా నగదు ఉపసంహరణ, డెబిట్ కార్డు సేవలు, గృహ రుణాల ప్రాసెసింగ్ ఫీజు, లాకర్ అద్దెలు, చెక్కులు, డ్రాఫ్టులు, డుప్లికేట్ పాసు పుస్తకాల జారీ,

బిల్లుల కలెక్షన్‌, వేరే ప్రాంతాల చెక్కుల కలెక్షన్స్‌, నగదు, నగదు నిర్వహణ చార్జీలతో పాటు ఎస్‌ఎంఎస్‌ అలర్ట్‌ చార్జీలపై సహితం పన్నుభారం పెరిగింది. మొత్తంగా చెల్లించే ప్రతి వంద రూపాయలకు 3 రూపాయల చొప్పున భారం పెరిగింది.

**బీమా రంగం**

సామాన్యుల నుంచి సంపన్నుల దాకా ఏదో ఒక బీమా పాలసీ లేకుండా ఉండరు. తక్కువ ప్రీమియానికే ఎక్కువ బీమా రక్షణ కల్పించే టర్మ్‌ పాలసీలు. అనారోగ్యంలో ఆదుకునే ఆరోగ్య బీమా పాలసీలు, పెట్టుబడితో కలిసి ఉన్న పాలసీలు ఇక నుండి 3 శాతం భారం అయినట్లే. నేటి వరకు 15 శాతంగా ఉన్న సేవా పన్ను జిఎస్‌టి అమలు వల్ల 18 శాతానికి పెరిగింది. ఇక సంప్రదాయ ఎండోమెంట్‌ పాలసీలపైన కూడా జిఎస్‌టి ప్రభావం పడింది. ఈ పాలసీ మొదటి సంవత్సరం ప్రీమియంపై గతంలో 3.75 శాతం సేవా పన్ను వసూలు చేస్తుండగా జిఎస్‌టి ప్రభావంతో 4.5 శాతానికి చేరింది. పునరుద్ధరణ సమయంలో ఉన్న సేవా పన్ను జిఎస్‌టి ప్రభావంతో 2.25 శాతానికి పెరిగింది. ఒకే ప్రీమియంతో తీసుకునే యూనిట్‌ పాలసీపై 1.5 శాతం నుండి 1.8 శాతంకి పెరిగింది. నూతన ఆర్థిక విధానాలలో భాగంగా సామాజిక భద్రత సంక్షేమాల కల్పన నుండి ప్రభుత్వం వైదొలిగింది. నేడు ప్రజలే స్వచ్ఛందంగా సామాజిక భద్రతకు ఖర్చు చేస్తున్న సొమ్ముపై పన్ను వేయడం, పన్నును పెంచడం విచారకరం.

**బంగారం**

జిఎస్‌టి అమలుకంటే ముందు బంగారు ఆభరణాలపై కస్టమ్స్‌ డ్యూటి 10 శాతం, ఎక్సైజ్‌ పన్ను 1 శాతం, వ్యాట్‌ 1.2 శాతం ఇలా మొత్తంగా 12.43 శాతం వరకు వర్తించేది. ప్రస్తుతం బంగారు ఆభరణాలకు 3 శాతం పన్ను పెంచారు. మజూరి రుసుములపై 18 శాతం సేవా పన్ను వర్తిస్తుంది. కస్టమ్స్‌ డ్యూటీ యథా తథంగా ఉంది. జిఎస్‌టి అమలు తర్వాత బంగారు ఆభరణాలపై నికరంగా చూస్తే 15.67 శాతం పన్ను చెల్లించాల్సి వస్తుంది. గతంకంటే 3.24 శాతం అధికం. బంగారంలో పరోక్షంగా పెట్టుబడి పెట్టేందుకు అవకాశం కల్పించే గోల్డ్‌ ఇటిఎఫ్‌, గోల్డ్‌ మ్యూచువల్‌ ఫండ్సుపై జిఎస్‌టి ప్రభావం కూడా కొంతమేరకుంది.

**బీడీ పరిశ్రమ**

బీడి పరిశ్రమ చిన్నతరహా పరిశ్రమ. దేశంలో 60 లక్షల మంది ఒక తెలంగాణ రాష్ట్రంలోనే 7 లక్షల మంది బీడీ కార్మికులు జీవిస్తున్నారు. బీడీ తయారీకి తునికాకు తెంపే 50 లక్షల మంది కార్మికులు, తంబాకు పండించే రైతులు, రైతు కూలీలు 40 లక్షల మంది దేశవ్యాప్తంగా కోటి యాభై లక్షల మంది బీడి పరిశ్రమపై ఆధారపడి జీవిస్తున్నారు. బీడి తయారీలో వెనుకబడిన హరిజన, గిరిజన, ఆదివాసీ, మైనారిటీ వర్గాల మహిళా కార్మికులే 98 శాతం భాగస్వాములవుతున్నారు. దేశంలోనే మహిళా కార్మికులు అధికంగా గల రంగం ఇదే. మహిళా సాధికారిత, స్వయం ఉపాధి పథకాలు అందిస్తామన్న పాలకులు ఆ దిశగా చర్యలు చేపట్టక పోగా వీరిని వీధుల్లోకి నెడుతున్నారు.

బీడీ, సిగరెట్ల వలన అనారోగ్యాల పాలు కాకుండా పొగ లేని రాజ్యాన్ని ఏర్పాటు చేసే దిశగా ప్రణాళికలు చేస్తూ ఈ కార్మికులకు ప్రత్యామ్నాయ జీవనోపాధి కల్పించడంలో ప్రభుత్వాలు విఫలమయినాయనేది యథార్థం. ఈ స్థితిలో జిఎస్‌టి వడ్డన బీడీ కార్మికులను మరింత కుంగతీయక తప్పదు. జిఎస్‌టి అమల్లోకి వచ్చిన రోజే బీడీల ఉత్పత్తి 40 శాతం తగ్గింది. ఈ పరిశ్రమ జిఎస్‌టి పరిధిలోకి రావడంతో మొత్తం 51 శాతం పన్నును బీడి పరిశ్రమ భరించవలసి వస్తున్నది. గత ఆరేళ్లుగా 6 లక్షల మంది ఈ పరిశ్రమకు దూరమైనారు. ఈ ప్రభావం వలన మరింత మంది ఈ వృత్తిని వదలి నిరుద్యోగులుగా మారే అవకాశం లేకపోలేదు.

కనుక బీడీలపై జిఎస్‌టి వడ్డన ఎత్తివేయాలని, బీడీ కార్మికులను దెబ్బతీసే అనాలోచిత విధానాలను తీవ్రంగా వ్యతిరేకించాలని లక్షలాది మంది కార్మికులు ఉద్యమ కార్యాచరణ సిద్ధ పరుచుకున్నారు.

**ప్రవాసులపై జిఎస్‌టి ప్రభావం**

చమురు ధరల అస్థిరత వల్ల విదేశాల్లో ఉద్యోగాలు కోల్పోయి, ఇంటిబాట పట్టిన వేలాది మంది కార్మికులకు వస్తు, సేవల పన్ను తీవ్ర ఇబ్బందులను కల్గిస్తుంది. ఆర్థిక సమస్యలతో పాత సామానుతో సహా స్వదేశానికి వస్తున్న నిరుపేద ప్రవాసులకు గట్టి షాక్‌ ఇస్తుంది. కార్గో కంపెనీల ద్వారా పంపే సామాన్లపై 28 శాతం జిఎస్‌టి, 10 శాతం కస్టమ్స్‌ సుంకం దానికి 3 శాతం విద్యా సెస్‌ కలిపి 41 శాతం పన్ను విధిస్తున్నారు. అసలే ఉద్యోగం కోల్పోయి దిక్కుతోచని స్థితిలో స్వదేశానికి వస్తున్న వారిపై ఇలా పన్ను విధించడంతో తీవ్ర ఆవేదన చెందుతున్నారు. పన్ను భారం మోయలేక విమానాశ్రయాల్లో టన్నులకొద్ది సామాన్లు కార్గో కాంప్లెక్స్‌లలో నిలిచిపోయాయి.

**ఇతర రంగాలు**

పదేళ్లుగా ఆరోగ్యం పరిశుభ్రతపై ప్రభుత్వ ప్రచారం వలన శానిటరీ ప్యాదుల వినియోగం గరిష్ఠంగా పెరిగింది. నేడు శానిటరీ ప్యాడ్లపై 12 శాతం పన్ను విధించడంతో ప్రజల్లో తీవ్ర వ్యతిరేకత వస్తుంది. కళాశాల, విశ్వవిద్యాలయాల్లో సేవల పన్ను గతంలో 3 శాతం ఉండగా నేడది 18 శాతంగా పెంచినారు. ఆర్థికంగా వెనుకబడిన వారు ఉత్తమస్థాయి విశ్వవిద్యాలయాల్లో చేరడం సులభంగా లేదు. ఉన్నత విద్యను వృద్ధి చేయడానికి కేంద్ర రాష్ట్రాలు ఆర్థికంగా వెనుకబడిన విద్యార్థుల కోసం ప్రత్యేక పథకాలనివ్వకుండా పన్ను భారం పెంచడం శోచనీయంగా ఉంది. గ్రానైట్‌ పరిశ్రమపై జిఎస్‌టి ప్రభావంతో ఆ పరిశ్రమ తీవ్రంగా దెబ్బతింటుంది.

**రాష్ట్రాలపై జిఎస్‌టి ప్రభావం**

జిఎస్‌టి భారతదేశ సమాఖ్య స్ఫూర్తికి విఘాతం కలిగిస్తుంది. పన్నుల వ్యవస్థలో రాష్ట్రాలకున్న అధికారాలను స్వయం ప్రతిపత్తిని ఇది హరించి వేసింది. రాష్ట్రాలకు తమ ప్రాధాన్యతలకు అనుగుణంగా పన్నులు వేసే హక్కు ఇకనుండి ఉండదు. రాష్ట్రాల హక్కులన్ని కేంద్రానికి, జిఎస్‌టి కౌన్సిల్‌కు ధారాదత్తం అయినందున ఇక రాష్ట్రాల పరిస్థితి మున్సిపాలిటీల స్థాయికి కుదించినట్లు అయింది. జిఎస్‌టి కౌన్సిల్‌లో కేంద్రానిదే పైచేయిగా ఉంటుంది. కేంద్రం ఏది అనుకుంటే దానినే జిఎస్‌టి కౌన్సిల్‌ విధాన ప్రకటనగా ప్రకటించుకునే అవకాశం ఉంది. దీనివల్ల ఆర్థిక వనరుల కోసం రాష్ట్రాలు కేంద్రంపై పూర్తిగా ఆధారపడాల్సిందే. రు. 55 వేల కోట్లతో ఒక ప్రత్యేక నిధిని ఏర్పాటు చేసి పన్నుల వల్ల కలిగే లోటును ఐదేండ్ల వరకు భరిస్తామని ఉచిత హామీ ఇచ్చింది. అమలు ఎట్లా ఉంటుందనేది భవిష్యత్‌లో తేలనుంది.

సమాఖ్య దేశాలలో అసలైన పరిపాలన రాష్ట్ర ప్రభుత్వాలే చేయాలి. వ్యవసాయం, విద్య, ఆరోగ్యం, పోలీసు వ్యవస్థ మొదలైనవి రాష్ట్ర

జాబితాలోని అంశాలే. ఈ అంశాలను రాష్ట్రాలే నిర్వహించాలి. రాష్ట్రాలు పరిపాలన వ్యయం, ప్రజలకు ఇవ్వగలిగే సంక్షేమ పథకాలు, సేవల కొరకు కేంద్రంపై ఆధారపడాల్సి ఉంటుంది. కేంద్రంలోను, రాష్ట్రంలోను ఒకే పార్టీ లేదా కేంద్రానికి మద్దతు ఇచ్చే రాష్ట్ర ప్రభుత్వాలకు కేంద్రం ఇచ్చే ప్రాధాన్యత ఇతర పార్టీలు పరిపాలించే రాష్ట్రాలకు ఇచ్చే ఆర్థిక మద్దతుకు తేడా ఉండే అవకాశం ఉంది. ఈ సమన్వయం కొరవడి కేంద్ర రాష్ట్రాల మధ్య ఘర్షణ పరిస్థితులు తలెత్తే అవకాశాలు కూడా మెండుగా ఉన్నాయి. ప్రధానంగా కేంద్రం కనుసన్నలలో మెదలని రాష్ట్రాలకు ఈ ఘర్షణ మరింత పెరుగుతుంది. జిఎస్‌టి పరోక్ష పన్ను అయినందున తయారీ కన్నా వినియోగంపైనే అధికంగా ఆధార పడుతుంది. దీని వలన జనాభా ఎక్కువగా ఉన్న ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహార్, పశ్చిమ బెంగాల్ లాంటి రాష్ట్రాలకు పన్ను లెక్కువగా వస్తాయి. అందువల్ల ఈ రాష్ట్రాలు మొదటి నుండి జిఎస్‌టిని వ్యతిరేకించడం లేదు. కాని ఉత్పత్తి కేంద్రాలుగా ఉన్న మహారాష్ట్ర, గుజరాత్, తమిళనాడు లాంటి రాష్ట్రాలకు ఆదాయాలు గణనీయంగా తగ్గే అవకాశాలున్నాయి.

**తెలంగాణ రాష్ట్రంపై జిఎస్‌టి ప్రభావం**

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కేంద్రంతో బయటకు ఎన్ని మాట్లాడి నప్పటికీ జిఎస్‌టి అమలుకు మద్దతు తెలపడం అనేది అంతర్గత అవగాహనతో కుదుర్చుకున్న ఒప్పందమనే అనుమానం రాక తప్పదు. రాష్ట్ర ప్రభుత్వంపై కేంద్రం అవాకులు చెవాకులు మాట్లాడితే రాష్ట్ర ప్రభుత్వ పెద్దలు మరింత ఘాటుగా మాట్లాడుతారు. కేంద్రం ఏ పని రాష్ట్రాలకు అప్పజెప్పినా అన్ని రాష్ట్రాలకంటే తెలంగాణ రాష్ట్రమే ముందు పూర్తి చేసి కేంద్రంతో శభాష్ అనిపించుకుంటుంది. జిఎస్‌టి విషయంలో అత్యవసర సమావేశం పెట్టి బిజెపి పాలిత రాష్ట్రాలకంటే ముందే సెలవు రోజైనప్పటికి ఆమోదించినారు. ఆచరణ సాధ్యమైనరీతిలోనే పన్ను వ్యవస్థ ఉండాలని, జిఎస్‌టి వల్ల సామాన్య ప్రజలకు భారం పడవద్దనే షరతులకు లోబడే మద్దతిస్తున్నామని ప్రకటించిన రాష్ట్ర ప్రభుత్వం, తెలంగాణ ప్రజల తరపున 35 వస్తువులపై పన్ను తగ్గింపు ప్రతిపాదనలు పంపితే కేంద్రంగాని, జిఎస్‌టి కౌన్సిల్ గాని కేవలం మూడు వస్తువులపైన మాత్రమే సమీక్షించి మిగిలిన వాటిపైన జవాబు చెప్పలేదంటే, తెలంగాణ ప్రభుత్వ షరతులెంత బలమైనవో అర్థం చేసుకోవచ్చు.

గతంలో వ్యాట్ ద్వారా రు. 16,500 కోట్లు వసూలు కాగా ఇందులో 50 శాతం కేంద్రానికి అనగా రు. 8,250 కోట్లు చెల్లించినారు. సర్వీసు, సెంట్రల్ ఎక్సైజ్ పన్నుల వసూళ్ల వల్ల వచ్చిన రు. 12,500 కోట్లు కలిపి తెలంగాణకు దాదాపు రెండు వేల కోట్లకు పైగా నష్టపోయే పరిస్థితిని అంచనా వేసినారు. దీనికి తోడు మిషన్ భగీరథకు రు. 5,200 కోట్లు, మిషన్ కాకతీయకు రు. 2,600 కోట్లు, సాగునీటి ప్రాజెక్టులపై రు. 1300 కోట్లు, రోడ్లు, భవనాల రంగంలోని పథకాలపై రు. 6,500 కోట్లు జిఎస్‌టి వల్ల అదనపు భారం పడుతుందనేది అంచనా.

పెరిగిన జిఎస్‌టి వలన నీటి పారుదలతో పాటు రోడ్లు, భవనాలు, గృహ నిర్మాణం ఇలా అన్ని ఇంజనీరింగ్ శాఖలపై అధనంగా రు. 19,200 కోట్ల భారం పడుతుందనేది తాజా అంచనా. ఇందులో ప్రధానంగా అధిక భారం నీటి పారుదల శాఖపైనే పడుతుంది. ఇప్పటికే వేల కోట్ల రూపాయల పనులకు ఒప్పందాలు జరిగినాయి. మరిన్ని పనులకు టెండర్లు మొదలయ్యాయి. గతంలో వ్యాట్ 5 శాతం ఉంటే నేడు జిఎస్‌టి రూపంలో 18 శాతానికి పెరిగింది. దీనిని మోయలేమని అంటున్న గుత్తేదార్లకు ప్రభుత్వం ఏ సమాధానం చెపుతుందోనని ఎదురు చూస్తున్నారు.

**ముగింపు**

ఈ ప్రక్రియలో వ్యాపారులకు ఇంటర్‌నెట్ కంప్యూటర్ తప్పనిసరి. ఆన్‌లైన్ ద్వారా ప్రతి 20 రోజులకొక మారు రిటర్న్ ఫైల్ చేయాలి. దేశ వ్యాప్తంగా ఒక కోటి మంది ఎక్సైజ్, సర్వీసు టాక్స్, వ్యాట్ పరిధిలోకి వచ్చే వ్యాపారులుంటే నేటి వరకు 80 లక్షల వ్యాపారులు మాత్రమే జిఎస్‌టి నెట్‌వర్కులో తమ సంస్థలను నమోదు చేసుకున్నారు. ఇంకా 20 శాతం మంది నమోదు చేసుకోవాల్సి ఉంది. ప్రభుత్వం జిఎస్‌టిని అమలులోకి తీసుకురావాలన్న ఆతృత తప్ప కొత్త పన్ను విధానంపై వర్తకులకు, పారిశ్రామిక వర్గాల వారికి తగిన అవగాహన కల్పించలేదు. జిఎస్‌టి వ్యవస్థ పూర్తిగా అమల్లోకి వస్తే దేశవ్యాప్తంగా ఉన్న కోటికి పైగా జిఎస్‌టి చెల్లింపుదారుల నుంచి సెకనుకు 1.2 లక్షల లావాదేవీలు జిఎస్‌టి నెట్‌వర్కు ద్వారా జరుగుతాయి.

నెలకు ఈ నెట్‌వర్కు ద్వారా దాదాపుగా 320 కోట్ల జిఎస్‌టిఎన్ ఎలా తట్టుకొని నిలుస్తుందన్నది సాంకేతిక నిపుణులతో పాటు సర్కారుకు కూడా ఆందోళనగా ఉంది. జిఎస్‌టిఎన్ కనుక ఒక నిమిషం పని చేయడం ఆగిపోతే ప్రభుత్వానికి కోట్లల్లో నష్టం వాటిల్లే ప్రమాదంతోపాటు మాల్‌వేర్, రాన్సమ్‌వేర్ లాంటి సైబర్ దాడులు పెరుగుతున్న నేపథ్యంలో జిఎస్‌టిఎన్‌పై వర్తకులు ఆందోళన చెందుతున్నారు.

ఒకే దేశం ఒకే పన్ను అని చెప్పినప్పటికి పలు రకాల పన్నులు వసూలు చేస్తున్నారు. స్టాంపు డ్యూటీ, విద్యుత్ సెస్సు, స్థానిక సంస్థలు విధించే అదనపు వినోదపు పన్ను, ఆస్తి పన్ను, మున్సిపల్ కార్పొరేషన్స్ సరిహద్దుల వద్ద విధించే ప్రవేశ రుసుము, రోడ్డు పన్ను టోల్‌టాక్స్, ఎక్సైజ్ సుంకంతో పాటు పెట్రోలియం, రియల్ ఎస్టేట్ రంగాలను కూడా ఈ పరిధిలోకి చేర్చినపుడే ఈ చట్టం సమగ్రంగా ఉంటుంది.

ఇది పరోక్షంగా ప్రజలపై ప్రభుత్వాలు చేసే క్రూరమైన దాడి. జిఎస్‌టి భారం వేతనాల మీద, ఇతర ఆదాయాల మీద పడుతుంది. అంతిమంగా శ్రమజీవులపై ఈ భారమంతా రుద్దబడుతుంది. ఈ రకంగా సేకరించిన పన్నులను ప్రజలపై నిర్బంధాన్ని పెంచే ఆయుధాల కొనుగోళ్లకు, ప్రజా ఉద్యమాలను అణిచివేసే భద్రతా బలగాలను పెంచడానికి, రాజకీయ నాయకుల విలాసాలకు, ప్రజలపై పరాన్నభుక్కులుగా ఉన్న నిరంకుశ అధికార యంత్రాంగాన్ని పెంచడానికి వినియోగిస్తున్నారు.

భారత ప్రజలపై పాలక వర్గాలు చేస్తున్న దాడులకు పెద్దనోట్ల రద్దు అనంతరం జిఎస్‌టి మరో ఉదాహరణగా ఉంటుంది. నగదు రద్దు ఆర్థికాభివృద్ధిని కుంటు పరచడమే కాకుండా కార్పొరేట్ ప్రయోజనాలను నెరవేర్చిందని సజీవసాక్ష్యంగా మన కళ్లముందుంది. నేడున్న జిఎస్‌టి కూడా అలాంటి మరొక దృష్టాంతమే అవుతుంది. పాలకులు స్వతంత్ర భారతదేశంలో ఇది సరికొత్త భానోదయం అంటూ దేశ భవిష్యత్‌ను మార్చగల గుణాత్మక ఆర్థిక పరివర్తనగా వర్ణిస్తున్నారు.

ఇలాంటి ప్రధాన మార్పులు విజయం సాధించడమనేది వాటి సమర్థ అమలుపైనే ఆధారపడుతుంది. లేదంటే నేడు సమర్థిస్తున్న రాష్ట్రాలు కూడా హామీల అమలులో లోపాలు ఏర్పడితే తిరుగుబాటు జండా నెగరవేయడంలో వెనుకాడబోవు. అంతిమంగా జిఎస్‌టి అమల్లో విధానకర్తలు అనుసరించే సంవిధానం ప్రధానమైనది. అయితే వస్తుసేవల పన్ను విధానం సామాన్యులకు, చిన్నతరహా వ్యాపారస్తులకు పూర్తి స్థాయిలో నేటికీ అర్థం కాలేదనేది వాస్తవం. ప్రభుత్వం ఆశించిన ఫలితాలు ఏ మేరకు ఉంటాయో వేచి చూడాలి.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్,*
*తెలంగాణ విశ్వవిద్యాలయం, నిజామాబాద్)*

వీ

# ఆవు పాఠం - గోరక్షక రాజకీయాలు

***గోరక్షణ పేరుతో సంఘపరివార్ శక్తులు సమాజంలో మతకలహాలు సృష్టించడానికి ప్రయత్నిస్తున్నాయనీ, వీటికి లౌకిక శక్తులు, ప్రజాస్వామిక వాదులు అడ్డుకట్ట వేయాలనీ అంటున్నారు ప్రొ. కె.పి. సుబ్బారావు***

అనగనగా ఒక ఆవు. ఆవు ఒక సాధు జంతువు. ఆవుకు నాలుగు కాళ్లు, ఒక తోక ఉండును. ఆవు పాలిచ్చును. ఇలా నడుస్తుంది ఆవు పాఠం చిన్నతనంలో. ఏ ప్రశ్నకైనా జవాబు అడిగితే అసలు జవాబు చెప్పలేక తిరిగి తిరిగి ఆవు పాఠం దగ్గర ఆగిపోతారనే హాస్యం కూడా బాగానే పండింది. అది హాస్యమే గాని పరిహాసం మాత్రం కాదు. అదే ఆవు ఇప్పుడు పవిత్రమైపోయింది. సాధు జంతువు గోమాత అయిపోయింది. ఆవులో ముప్పది మూడు కోట్ల దేవతలు నివసిస్తారని, ఆవు తల్లి లాంటిదని, ఆవు పంచగవ్యం (పాలు, పెరుగు, నెయ్యి, మూత్రం, పేడ) అన్ని రోగాలకు విముక్తిదాయకమని, అందుచేత ఆవును వధించకూడదని, ఆవును చంపితే నరకానికి పోతారని ఈ రోజు చాలా ప్రసార, ప్రచార సాధనాల ద్వారా హోరెత్తిస్తున్నారు.

ఆవు హిందువులకు ఆరాధ్య దేవత కాబట్టి గోరక్షకులు ఇక ఆవులను రక్షిస్తారట. ఆవును భక్షించేవారిని శిక్షిస్తారట. దీని కొరకు కేంద్ర స్థాయిలో 'కీసెల్' ఒక దానిని ఏర్పాటు చేసింది సంఘపరివార్. దీనికి అండగా భజరంగ్‌దల్, విశ్వహిందూ పరిషత్, స్వయం సేవక్ సంఘ్‌లు ఈ కార్యక్రమంలో భాగస్వామ్యం పంచుకుంటున్నాయి. వీరు రాజ్యాంగాన్ని గౌరవిస్తామని చెపుతూ చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకుని కొందరిని కొట్టడం, తిట్టడమే గాక, కిరాతకంగా చంపుతున్నారు. గోవధ పేరిట మానవ వధ చేస్తున్నారు. ఇప్పటికి అందిన సమాచారాన్ని బట్టి 63 మందిని చంపారు. ఇవి 2014 నుండి దేశ వ్యాప్తంగా జరిగాయి. ఇందులో ఎక్కువ మంది ముస్లింలు ఉన్నారు. అక్కడక్కడా దళితులపై కూడా హింసాత్మక చర్యలు జరిగాయి. ఇటీవల జూన్ 28న రంజాన్ సందర్భంగా జరిగిన సంఘటన దేశ వ్యాప్తంగా చర్చకు తెరదీసింది. పద్నాలుగు సంవత్సరాల వయసు గల జునైద్‌ఖాన్ ఢిల్లీకి రైలులో వెళుతుంటే కత్తులతో పొడిచి చంపారు. ఉత్తరప్రదేశ్‌లోని దాద్రిలో ఆఖ్లాక్ అనే వ్యక్తి గో మాంసాన్ని ఫ్రిడ్జిలో దాచాడని కర్రలు, ఇనుప రాడ్లతో కొట్టి చంపారు. ఇంతకి అది మేక మాంసమని తెలిసినా కనీసం పశ్చాత్తాపం చూపలేదు గోరక్షకులు. అపరాధ భావన ఏమాత్రం లేదు. పైగా గోరక్షణకు చాలా చరిత్ర ఉందని చెప్పుకుంటున్నారు.

సంఘపరివార్ రాజకీయ రూపమైన భారతీయ జనతా పార్టీ అధికారంలోకి రావడంతో ఇది మొదలైంది. ప్రభుత్వ విధానాలను విమర్శించినా, హిందూ మతానికి వ్యతిరేకంగా మాట్లాడినా ఏదో రూపంలో హేతువాదుల మీద, కళాకారుల మీద, సాహిత్యకారుల మీద దాడి చేసి చంపుతున్నారు. దీనికి దబోల్కర్, కల్బుర్గి, పన్సారేల బహిరంగ హత్యలే సాక్ష్యం. నిందితులను పట్టుకొని శిక్షించకపోవడం వెనుక అధికార పార్టీ ఉన్నదనే నమ్మాలి. ప్రధాన మంత్రి సన్నాయి నొక్కులు నొక్కడమే తప్ప ఇంతవరకు గోరక్షకులపై ఎటువంటి నివారణ చర్యలు తీసుకోలేదు. ఇది ఒక రకంగా పరోక్షంగా గోరక్షకులచే చర్యలకు ఆమోదం తెలపడమే అవుతుంది. గోరక్షణ అనే అంశం గత వంద సంవత్సరాలకు పైగా నలుగుతూనే ఉంది.

దయానంత సరస్వతి (ఆర్య సమాజం) గోరక్షణ కోసం 1882లోనే స్వయంగా ఒక కమిటీని నియమించాడు. దానికి శాఖలు భారతదేశ మంతా ఏర్పడ్డాయి. గో హత్యకు వ్యతిరేకంగా మొదటి ఆందోళన పంజాబ్‌లో జరిగింది. గోవు పవిత్ర ప్రాణి ఏమీ కాదని, గోవును వధించిన ముస్లింలకు రక్షణ కల్పించాలని 1888లో అలహాబాద్‌లోని బ్రిటిష్ కోర్టు తీర్పునిచ్చింది. ఆ రోజుల్లో గోవులను వధించే పరియాలు (అస్పృశ్యులు) ముస్లింలపై గోరక్షక కమిటీ దాడులకు పాల్పడుతుండేది. ఈ అంశంపై కొన్నిసార్లు మతకలహాలు కూడా జరిగాయి. దీన్నిబట్టి మనకు అర్థమవుతున్నదేమంటే గోరక్షణ పేరుతో జరుగుతున్న దాడులు కొత్తవేమీ కాదు. అయితే ఇవి ఇప్పుడు మరింత ఎక్కువ అయ్యాయి. ఆనాటి బ్రిటిష్ కాలంలో జరిగిన సాంఘిక సంస్కరణలతో పాటు హేతువాద, సోషలిస్టు భావాలు వ్యాప్తి చెందడం వలన సంఘపరివార్ శక్తులు తెర వెనక్కు పోయాయి. చాపకింద నీరులా అన్ని శక్తులు ఇప్పుడు మళ్లీ తలెత్తాయి. ఆవును కేంద్ర బిందువుగా చేసుకొని ప్రజలను మతాల వారిగా చీల్చడమే సంఘపరివార్ ముఖ్య ఉద్దేశం. ఆర్థిక విషయాలతో కూడిన మత, ధార్మిక, ఆధ్యాత్మిక ఘర్షణను తీసుకురావడానికి హిందూ మతోన్మాదులు ప్రయత్నం చేస్తున్నారు. వీటికి వత్తాసుగా రాజ్యాంగాన్ని, ఆర్థిక కారణాలను, శాస్త్రీయతను జోడిస్తున్నారు. డా. అంబేద్కర్‌ను కూడా అడ్డుపెట్టుకొని రాజ్యాంగంలోని 48వ అధికరణను అసంబద్ధంగా ఎత్తి చూపుతున్నారు. ఆ అధికరణ చాలా కీలకమైనదిగా వారు చెపుతున్నారు. ఆ అధికరణను చదివితే ఎవరికైనా అర్థమయ్యేది వ్యవసాయానికి అవసరమైనవి, పాలిచ్చే జంతువులను వధించరాదు, ఆవు వీటిలో ఒకటి. పనికిరాని పశువులు, వయస్సు మీరిన జంతువులు, వట్టిపోయిన ఆవులు గాని, గేదెలు గాని వధ్యశాలలకు పంపించడం ఎప్పటి నుండో జరుగుతుంది. అలా చేయకపోతే వాటిని ఆదరించడానికి రైతుకు చాలా వ్యయమవుతుంది. పంటలు సరిగ్గా పండక అప్పుల పాలవుతున్న రైతులకు ఇది భారమే అవుతుంది. అదే రాజ్యాంగంలో అధికరణ 19 (1) (జి) ఏం చెపుతుందంటే ఏ రకమైన వర్తకం గాని, వ్యాపారం గాని, వృత్తి గాని చేసుకోవడం ఒక ప్రాథమిక హక్కు. గోవధ పేరిట ఈ హక్కును హరించడానికి కేంద్ర ప్రభుత్వం ప్రివెన్షన్ ఆఫ్ క్రుయెల్టి టు ఎనిమల్స్ (రెగ్యులేషన్ ఆఫ్ లైవ్ స్టాక్ మార్కెట్ రూల్స్) యాక్ట్‌ను తీసుకొచ్చింది. దీన్ని కూడా ఆర్డినెన్స్ రూపంలో ఎనిమల్

హస్బండ్రి శాఖ ద్వారా విడుదల చేయించింది. నిజానికి ఈ అంశం రాష్ట్ర ప్రభుత్వ పరిధిలోనిది. ఇప్పటికే 24 రాష్ట్రాలలో ప్రివెన్షన్ ఆఫ్ క్రుయెల్టి టు ఎనిమల్స్ యాక్ట్, 1960 ఉంది. కొత్తగా వచ్చిన చట్టం (ఆర్డినెన్స్) దీని పొడిగింపే కాదు, దానిని విస్తరించింది. దానిలోని రూల్స్ ప్రకారం ఆవులే కాదు, ఎద్దులు, దున్నపోతులు, గేదెలు, కోడె దూడలు, ఒంటెలు కూడా జంతువధ నిషేధం కిందికి వస్తాయి.

ఏ రూల్స్‌కైనా కొన్ని పరిమితులుంటాయి. ఈ రూల్స్‌కు మాత్రం కేవలం హిందువులు ఉపయోగించే జంతువులకే వర్తిస్తుంది. ఈ రూల్స్ వలన నష్టపోయేది దళితులు, ముస్లింలు. ఎందుకంటే పశువుల ఆలన పాలన చూసేది, కబేళాలకు తీసుకెళ్లేది, వాటిపై వ్యాపారం చేసేది వారే కాబట్టి. జంతువులు వాటి చర్మాలపైన, వాటికి సంబంధించిన పరిశ్రమలలో 22 లక్షల మంది ఆధారపడి జీవిస్తున్నారు. ప్రపంచ తోలు పరిశ్రమలో మన దేశానికి సంబంధించి 12 శాతం లావాదేవీలున్నాయి. గొడ్డు మాంసాన్ని ఎగుమతి చేయడంలో బ్రెజిల్ కంటే మనదేశం ముందు వరుసలో ఉంది. ప్రపంచంలో 4 బిలియన్ల విలువ గల గొడ్డు మాంసాన్ని ఇతర దేశాలకు సరఫరా చేస్తుంది. ఇది 2016 సంవత్సరం ఏప్రిల్ నుండి డిసెంబర్‌ల మధ్య 13 శాతానికి పడిపోయింది. చాలా మంది నిరుద్యోగులయ్యారు. ప్రస్తుత రూల్స్ వలన డైరీ, తోలు పరిశ్రమలు తీవ్ర ప్రభావానికి గురవుతాయని నిపుణులు చెబుతున్నారు. సుమారు 25 మిలియన్ల పాలను ఎగుమతి చేసే మనదేశం వెనుకబడుతుంది. దీన్ని ఆసరగా తీసుకొని తమ పాల ఉత్పత్తులను దిగుమతి చేయడానికి ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, అమెరికా దేశాలు ఎదురు చూస్తున్నాయి. ముస్లిం దేశాలకు ఎగుమతి చేసే 'హలాల్ మీట్' తగ్గిపోతుంది. ఇది గేదెల నుండి వస్తుంది. వియత్నాం, మలేసియా, ఈజిప్టు, సౌది అరేబియా దేశాలు ఎక్కువగా ఈ హలాల్ మీట్‌ను దిగుమతి చేసుకుంటాయి. అమెరికా వ్యవసాయ శాఖ లెక్కల ప్రకారం భారతదేశం మాంసం విక్రయంలో గేదెల మాంసం 23 శాతమైతే, ఆవు మాంసం కేవలం 5 శాతమే. ఈ మార్కెట్ సుమారు 26,000 కోట్ల ఆదాయాన్ని భారతదేశానికి తీసుకొస్తుంది.

గొడ్డు మాంసం అంటే ఆవు మాంసమేననే అపోహ చాలా మందిలో ఉంది. మనదేశంలో ఆవు మాంసాన్ని చాలా తక్కువ మంది తింటారు. అదైనా చచ్చినదాన్ని లేదా అట్టిపోయినా దాన్ని మాత్రమే తినడానికి వీలవుతుంది. డా. అంబేద్కర్ ఒక సభలో దళితులను ఉద్దేశించి చెపుతూ చచ్చిన గొడ్డు మాంసం తినవద్దని, అలా చేయడం వలన అనారోగ్యానికి గురౌతారని చెప్పడమే కాక, అగ్రవర్ణాల వారు వారిని తక్కువగా చూస్తున్నారని హెచ్చరించాడు. దానితో చాలా మంది దళితులు చచ్చిన కళేబరాలను తీసివేయడమే చేసేవారు గాని తినేవారు కాదు. ఇప్పటికి గొడ్డు మాంసమంటే ఎద్దు/కోడెదూడ మాంసమే. ఇది గోరక్షకులకు అర్థం కానిది. వారు జీవకారుణ్యం కోసం కాదు, మత ప్రచారం కోసం ఆవును ఉపయోగించుకుంటున్నారు. గోశాలల పేరిట వందలాది గోవులను పెంచుతున్నారు. వాటికి సరియైన పోషణ, ఆలన పాలనలేక గోశాలల్లోనే చనిపోతున్నట్లు వార్తలొస్తున్నాయి. లక్నోలో ఒక ఎన్‌జిఒ నడుపుతున్న గోశాలలో సుమారు వంద ఆవులు చనిపోయాయి. గోరక్షకులు మరోపక్క ఆవును జాతీయ జంతువు చేయమని గగ్గోలు పెడుతున్నారు. అసలు ఆవుల రక్షణ చూసే దళితులు, ముస్లింలు లేకపోతే గోవులను రక్షించేవారెవరు?

ఆవు ఒక జంతువు మాత్రమే. ఆవుకు వేదాలలో ప్రత్యేక స్థానముందని, పవిత్రతను ఆపాదించి దేశ ప్రజలను విభజించి పాలించాలనేదే సంఘపరివార్ కుతంత్రం. ముఖ్యంగా దళితులను, ముస్లింలను టార్గెట్ చేస్తున్నారు. స్వేచ్ఛ లేకపోతే ప్రజాస్వామ్యమే లేదు. మత దురహంకారం చేసే చట్టాలు అంతిమంగా సోషల్ ఫాసిజానికి దారితీస్తుంది. ఇది సరికొత్త ఆవు పాలానికి తెరదీస్తుంది. భవిష్యత్తులో సమాజంలో మత కలహాలు జరగడానికి అవకాశముంది. దీన్ని లౌకిక శక్తులు, ప్రజాస్వామిక వాదులు అడ్డుకట్ట వేయడానికి ముందుకు రావాలి. సంఘపరివార్ ముందుకు తెస్తున్న కుహనా లౌకిక వాదాన్ని మతాధారిత సాంస్కృతిక జాతీయవాదాన్ని, ప్రజలను మతం పేరిట చీల్చే దేశ భక్తిని ఎండగట్టాలి. సంఘపరివార్ ఒక్కోసారి ఆధ్యాత్మిక ఆర్థిక వాదాన్ని, మరోసారి ఆర్థిక ఆధ్యాత్మిక వాదాలను తమకు అనుకూలంగా ప్రజలపై రుద్దుతున్నాయి. ఈ గుట్టును రట్టు చేయాలి.

*(రచయిత ఆంధ్రా యూనివర్సిటీ అధ్యాపకులు)* వీ





**30-5-26/1, కోకా చలపతిరావు వీధి, విజయవాడ - 520 002**

**సెల్ : 9247253884, 8977493465**

Advt.

# డెబ్బై ఏళ్ల బూటకపు స్వాతంత్ర్యం

***భారతదేశంలో బ్రిటిష్ ప్రత్యక్ష పాలన ముగిసిపోయి ఈ ఆగస్ట్ 15కు డెబ్బై ఏళ్లు అయిన సందర్భంగా ఏడు దశాబ్దాల వలసానంతర భారతదేశాన్ని ఎలా అర్థం చేసుకోవాలో వివరిస్తున్నారు* ఎడ్ల పోచయ్య**

సుదీర్ఘమైన, సంక్లిష్టమైన భారత సమాజ చరిత్రలో 1947 ఆగస్ట్ 15 తప్పనిసరిగా ఒక కీలకమైన రోజు. ఆ తేదీని భారత స్వాతంత్ర్య దినం అనుకునే వాళ్లున్నారు, ఆ రోజున వచ్చినది స్వాతంత్ర్యం కాదని, అధికార మార్పిడి మాత్రమేనని అనేవాళ్లున్నారు. ఆ రోజుతో నవభారతం ప్రారంభమై ప్రగతి సాధించిందని, ఎన్నో అంకెలు చూపే వాళ్లున్నారు. భారతదేశం ఆ తేదీ తర్వాత పెనం మీది నుంచి పొయ్యిలో పడిందని, ఒక్క సామ్రాజ్యవాది అధీనంలో ఉన్న దేశం అనేక సామ్రాజ్యవాదాల ఇష్టారాజ్యపు క్రీడలకు బలి అవుతున్నదని అనేవాళ్లున్నారు. పరతంత్రం రద్దయి ప్రజల పాలన మొదలయిందని అనేవాళ్లున్నారు. పరాయిపాలన పోయినా, తెల్లదొరల పాలన స్థానంలో నల్లదొరల పాలన వచ్చినా సమాజ స్థితి ఏమి మారిందని అడిగేవాళ్లున్నారు. 1947 కు ముందరి కన్న ఈ ఏడు దశాబ్దాలలోనే దేశపు ఆర్థిక, సామాజిక సమస్యలు ఎక్కువయ్యాయని అనేవాళ్లున్నారు. ఇన్ని భిన్న దృక్పథాల మధ్య 1947 ఆగస్ట్ 15 న జరిగిన పరిణామాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఆ తర్వాత జరిగిన డెబ్బై ఏళ్ల చరిత్ర మీద ఆ తేదీ ప్రభావాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

**ఇది స్వాతంత్ర్యమేనా?**

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందా, 1947 ఆగస్ట్ 15న వచ్చింది స్వాతంత్ర్యమేనా అనే ప్రశ్నలు సంక్లిష్టమైనవి. ఎన్నెన్నో దేశీయ, ప్రపంచ పరిణామాల నేపథ్యంలో చర్చించవలసినవి. భారత స్వాతంత్ర్యోద్యమం లోని వివిధ పాయల గురించి, పెరుగుతున్న సమరశీలత గురించి చర్చించాలి. రెండో ప్రపంచ యుద్ధం నాటికి బ్రిటిష్ పాలిత దేశంలోనూ, స్వదేశీ సంస్థానాలలోనూ ప్రజలలో పెరుగుతున్న అసంతృప్తి గురించి చర్చించాలి. ప్రపంచవ్యాప్తంగా పీడిత ప్రజలపై సోవియట్ యూనియన్ ప్రభావం పెరుగుతుండడం గురించి చర్చించాలి. యుద్ధంలో సామ్రాజ్యవాద శక్తుల బలాబలాలలో వచ్చిన మార్పుల వల్ల యుద్ధానంతరం ప్రత్యక్ష వలసవాదానికి ముగింపు పలకక తప్పదని సామ్రాజ్యవాదం గుర్తించిన తీరు చర్చించాలి. ఇవన్నీ సక్రమంగా అర్థం చేసుకున్నప్పుడే ఏ పరిస్థితిలో బ్రిటిష్ వలసవాద ప్రభుత్వం భారతదేశం నుంచి ఉపసంహరించుకోవాలని అనుకున్నదో అర్థమవుతుంది. అంటే అది ప్రజలు కోరుకుని, పోరాడి, సాధించిన స్వాతంత్ర్యమా, పాలకులే ఎత్తుగడలతో, అనివార్యంగా, దయాధర్మంగా ఇచ్చిన "స్వాతంత్ర్యమా" చర్చించవలసి ఉంటుంది. వీటిలో మొదటిదానికి మాత్రమే స్వాతంత్ర్యం అని పిలుచుకునే అర్హత ఉంటుంది. రెండోది స్వాతంత్ర్యం ముసుగేసుకున్న పరాధీనత అవుతుంది.

మారుతున్న ప్రపంచంలో, ప్రత్యేకంగా సోవియట్ యూనియన్ ఉదాహరణ ప్రపంచ ప్రజలందరినీ, పోరాడుతున్న ప్రజలందరినీ ఆకర్షిస్తున్న సమయంలో ఇక తమ వలసలు కొనసాగించడం సాధ్యం కాదని 1930ల నాటికే సామ్రాజ్యవాదులకు అర్థమయింది. అప్పటికి రెండు మూడు శతాబ్దాలుగా దక్షిణ అమెరికా, ఆఫ్రికా, ఆసియాలలో తాము సాగిస్తున్న ఆర్థిక దోపిడీని కొనసాగించాలంటే సైనిక, రాజకీయ పాలనా పద్ధతులు కాక ఇతర పద్ధతులు అన్వేషించాలని సామ్రాజ్యవాదులు తెలుసుకున్నారు. తమ ఆర్థిక ప్రయోజనాలు యథాతథంగా కొనసాగాలంటే ఈ వలస దేశాలలో సైనిక, రాజకీయ అధికారాన్ని తమ దళారీలకు అప్పగించాలని, దళారీలను రూపుదిద్దే పని ప్రారంభించారు.

బ్రిటిష్ పాలిత భారతదేశంలో 1935 భారత ప్రభుత్వ చట్టం, 1937లో ప్రారంభమైన పార్లమెంటరీ ఎన్నికలు ఈ సామ్రాజ్యవాద అనుకూల దళారీ వర్గం తయారీలో భాగమే. చరిత్ర సామ్రాజ్యవాదులు కోరుకున్నట్టుగా సాగి ఉంటే ఈ దళారీ వర్గం తయారీ ఎప్పటికి పూర్తయి, అధికారమార్పిడి ఎప్పుడు జరిగి ఉండేదో గాని ఈలోగా రెండో ప్రపంచ యుద్ధం వచ్చింది. దానితో పాటు ప్రజా చైతన్యం, ప్రజా పోరాటాలు పెరిగాయి. తాము దళారీలుగా తయారు చేయదలచుకున్న వర్గం కూడ డూ ఆర్ డై, క్విట్ ఇండియా వంటి సమరశీల నినాదాలు ఇవ్వకతప్పని పరిస్థితి తలెత్తింది. దేశంలో అనేక చోట్ల కమ్యూనిస్టుల ప్రాబల్యం పెరిగి, కనీసం మూడు ప్రాంతాలలో రైతాంగ సాయుధ పోరాటాలు ప్రారంభమయ్యాయి. చివరికి వలసవాదుల సొంత సైన్యంలోనే తిరుగుబాటు ప్రారంభమయింది. ఈ పూర్వరంగంలో భారతదేశం వంటి సువిశాల దేశాన్ని సొంతంగా పాలించడం కన్న తమ దళారీ సేవకుల చేత పాలింపజేసి, పాత ప్రయోజనాలే పొందడం మంచిది కదా అని బ్రిటిష్ పాలకవర్గాలు ఆలోచించాయి. అందువల్లనే 1885 నుంచి, లేదా 1909 నుంచి 1945 దాకా మందకొడిగా, నత్తనడకగా సాగిన అధికారమార్పిడి ప్రయత్నాలు యుద్ధానంతరం వేగం పుంజుకుని రెండు సంవత్సరాల లోపే పూర్తయిపోయాయి.

అప్పుడు ఉన్న పరిస్థితిలో ఏదో ఒక రకంగా బ్రిటిష్ పాలకులు దేశాన్ని వదిలి వెళ్లిపోతే చాలని అసంఖ్యాక ప్రజానీకం భావించారు. అందువల్ల ఇది నిజమైన స్వాతంత్ర్యమేనా కాదా అని నిశిత పరిశీలన చేయకుండానే ఈ అధికార మార్పిడిని అంగీకరించారు, స్వాగతించారు. అప్పటికి దేశ రాజకీయాలలో ప్రభావశీలమైన పార్టీగా ఉండిన భారత కమ్యూనిస్టు పార్టీ మొదట ఇది స్వాతంత్ర్యం కాదనే ప్రకటించింది. ఏడు సంవత్సరాలు చర్చోపచర్చలు జరిపి చివరికి 1955లో ఇది స్వాతంత్ర్యమేనని అంగీకరించింది.

దేశాన్ని వదిలిపోతున్నామని బ్రిటిష్ పాలకులు జూన్‌లో చేసిన ప్రకటనకు స్పందిస్తూ భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఈ మార్పు ఒక ముందడుగేనని, భారత ప్రజల చేతుల్లో ఒక ఆయుధంగా ఉపయోగపడుతుందని, కాని ఇది సంపూర్ణ స్వాతంత్ర్యం కాదని స్పష్టంగానే వ్యాఖ్యానించింది. దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించే పోరాటానికి కొత్తగా పునరంకితం అవుతానని పార్టీ ఆగస్ట్ 3న ప్రకటించింది. పార్టీ అధికారపత్రిక పీపుల్స్ ఏజ్ 1948 జనవరి 21 సంచిక సంపాదకీయం "స్వాతంత్ర్యం వచ్చిందని అనడం దారుణమైన అబద్ధం...జాతీయ నాయకత్వం ఒక బూటకపు స్వాతంత్ర్యాన్ని ఆమోదించింది" అని రాసింది.

1948 ఫిబ్రవరి–మార్చ్ లలో జరిగిన పార్టీ రెండో మహాసభ కోసం తయారైన ముసాయిదా తీర్మానంలో "సామ్రాజ్యవాదంతో రహస్య ఒప్పందం కుదుర్చుకుని...దాన్ని స్వాతంత్ర్యమనీ, స్వరాజ్యమనీ నమ్మబలుకుతున్నారు" అని రాశారు. మహాసభలో ఆమోదించిన పార్టీ కార్యక్రమం కూడ బూటకపు స్వాతంత్ర్యం గురించీ, వదలని బ్రిటిష్ పట్టు గురించీ, సాధించవలసిన సంపూర్ణ స్వాతంత్ర్యం గురించీ మాట్లాడింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు, కార్మిక పార్టీల సమాచార కేంద్రం కొమిన్ ఫార్మ్ ప్రచురించిన లాస్టింగ్ పీస్ పత్రిక 1950 జనవరి 27 సంచిక సంపాదకీయం "భారతదేశం మీద రుద్దిన బూటకపు స్వాతంత్ర్యం" అని రాసింది. మొదటి రెండున్నర సంవత్సరాలు తీసుకున్న ఈ వైఖరి ఆ తర్వాత వేగంగా మారిపోతూ వచ్చింది. అంతకుముందు నుంచే బ్రిటిష్ పాలనలో జరుగుతున్న ఎన్నికల్లో పాల్గొంటూ వచ్చిన కమ్యూనిస్టు పార్టీ వలసానంతర తొలి ఎన్నికల్లో కూడ పాల్గొనాలని అప్పటికి పార్టీకి మార్గదర్శకత్వం వహిస్తున్న బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీ సలహా ఇచ్చింది. 1953 డిసెంబర్ – 1954 జనవరిల్లో మదురైలో జరిగిన మూడో మహాసభ పత్రాలలో మార్పు స్పష్టమైంది. అక్కడ ఎన్నికైన కేంద్ర కమిటీ సెప్టెంబర్ లో పార్టీ కార్యక్రమంలో కీలక మార్పులు చేసి, స్వాతంత్ర్యాన్ని అంగీకరించింది.

తర్వాత సోవియట్ యూనియన్‌లో స్టాలిన్ మరణం, ఇరవయో పార్టీ మహాసభ వంటి పరిణామాలతో సోషలిజానికి శాంతియుత పరివర్తన సిద్ధాంతం ప్రాబల్యంలోకి వచ్చింది. భారతదేశం వంటి దేశం పెట్టుబడిదారీయేతర మార్గంలో సోషలిజంలోకి ప్రయాణిస్తుందనే కొత్త సిద్ధాంతం తయారై, భారత సమాజపు స్థితిని ఎలా నిర్వచించాలి, ఆ స్థితి ఏ విప్లవ దశను సూచిస్తున్నది, అందువల్ల ఏ విప్లవమార్గం చేపట్టాలి వంటి ప్రశ్నలు వెనక్కి పోయాయి. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిందనే అభిప్రాయానిదే పైచేయి అయింది.

కాని ఒక దశాబ్దం గడిచాక, ఈ లోగా కమ్యూనిస్టు పార్టీలో కూడ చీలిక జరిగి, కొత్త కమ్యూనిస్టు పార్టీ మీద పెట్టుకున్న ఆశలు కూడ వమ్ము అవుతున్నాయనిపించిన దశలో భారత స్వాతంత్ర్యం గురించి ప్రశ్నలు మరొకసారి తలెత్తాయి. ప్రపంచవ్యాప్తంగానే ఆగ్రహ దశాబ్దంగా పేరొందిన ఆ 1960లలో దేశవ్యాప్తంగా వలసానంతర తొలితరం అసంతృప్తి వేరువేరు రూపాల్లో వ్యక్తం కావడం మొదలయింది. ఆ అసంతృప్తికి చారుమజుందార్ రాసిన వ్యాసాల్లో సైద్ధాంతిక వ్యక్తీకరణ దొరికింది. క్రమంగా ఆ సూత్రీకరణలు స్థిరపడి, 1969 ఏప్రిల్‌లో ఏర్పడిన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ లెనినిస్ట్) రాజకీయ తీర్మానంలో 1947 ఆగస్ట్ 15న భారతదేశానికి వచ్చినది స్వాతంత్ర్యం కాదని, అది కేవలం అధికార మార్పిడి మాత్రమేనని, ఒక సామ్రాజ్యవాద దేశపు వలస దోపిడీ స్థానంలో ఎన్నో సామ్రాజ్యవాద దేశాల నయావలస దోపిడీ సాగుతున్నదని, భారతదేశం అర్ధవలసగా ఉన్నదని స్పష్టమైన ప్రకటన వెలువడింది. తాకట్టులో భారతదేశం పుస్తకంలో తరిమెల నాగిరెడ్డి ఈ వాదనను గణాంకాలతో, చారిత్రక, సమకాలీన వివరాలతో విశ్లేషించారు.

ఈ సైద్ధాంతిక చర్చతో సంబంధం లేకుండానే, భారత ప్రభుత్వం బ్రిటిష్ కామన్ వెల్త్ లో చేరిన 1947 నుంచీ, ప్రపంచబ్యాంకు రుణం తీసుకున్న 1949 నుంచీ, ఇటు అమెరికా, అటు సోవియట్ యూనియన్ ఆదేశాలకు లొంగిపోతూ అంతర్గత రాజకీయార్థిక విధానాలు అమలు చేస్తున్నప్పటి నుంచీ చాలమంది స్వతంత్ర పరిశీలకులు కూడ ఇది పూర్తి స్వాతంత్ర్యం కాదని విశ్లేషిస్తూ వచ్చారు.

ఇక 1985లో రాజీవ్ గాంధీ ప్రారంభించిన దిగుమతుల సరళీకరణ, 1992లో పి.వి. నరసింహారావు ప్రారంభించిన ప్రపంచీకరణ విధానాల తర్వాత భారత పాలకులు ఏ నిర్ణయమూ స్వతంత్రంగా తీసుకోలేని స్థితి ఉందని మార్క్సిస్టు లెనినిస్టులు మాత్రమే కాక గాంధేయవాదులు, సర్వోదయ వాదులు, నిజమైన దేశభక్తులు, స్వతంత్ర ఆర్థిక వేత్తలు కూడ భావించడం మొదలుపెట్టారు.

అధికారమార్పిడి, వలస, అర్ధవలస, నయావలస వంటి పారిభాషిక పదాలు వాడేవారితో పాటే, "రాజకీయ స్వాతంత్ర్యం వచ్చింది గాని ఆర్థిక, సామాజిక స్వాతంత్ర్యం రాలేదు" అనీ, "బ్రిటిష్ వాడి పాలనే బాగుండేది" అనీ, "పాలన నానాటికీ దిగజారుతున్నది" అనీ, "గతంలో కన్న దోపిడీ, పీడన, అణచివేత, లంచగొండితనం పెరిగాయి" అనీ. "స్వాతంత్ర్యం తర్వాత ధనికులు మరింత ధనికులయ్యారు, పేదలు మరింత పేదలయ్యారు" అనీ, "రెండో స్వాతంత్ర్య పోరాటం జరగవలసి ఉంది" అనీ వేరువేరు రూపాల్లో సాగుతున్న విశ్లేషణల్లో స్వాతంత్ర్య ఫలాలు దేశ ప్రజలకు అందలేదనే భావనలు, బ్రిటిష్ పాలనా కాలంనాటి పరిస్థితులు 1947 ఆగస్ట్ 15 తర్వాత మారలేదనే భావనలు ప్రచారంలో ఉన్నాయి.

ఈ సందర్భంలో భారత రాజ్యాంగాన్ని రచించడానికి ఏర్పడిన రాజ్యాంగ నిర్ణయ సభ చివరి సమావేశంలో, రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షుడిగా డా. బి ఆర్ అంబేడ్కర్ 1949 నవంబర్ 25న చేసిన ఉపన్యాసం నుంచి కొన్ని మాటలు గుర్తు తెచ్చుకోవడం ఆసక్తికరంగా ఉంటుంది:

"జనవరి 26, 1950న భారతదేశం ఒక స్వతంత్ర దేశంగా మారుతుంది. ఆ స్వాతంత్ర్యానికి ఏమవుతుంది? భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోగలుగుతుందా, లేదా మరొకసారి కోల్పోతుందా?.... భారతదేశం గతంలో స్వాతంత్ర్యం అనుభవించిన దేశమే. కాని అది తన స్వాతంత్ర్యాన్ని ఒకసారి కోల్పోయింది. అది తన స్వాతంత్ర్యాన్ని రెండోసారి కోల్పోతుందా? ...

స్వేచ్ఛను సమానత్వం నుంచి వేరు చేయడానికి వీలులేదు. సమానత్వాన్ని స్వేచ్ఛ నుంచి వేరు చేయడానికి వీలు లేదు. స్వేచ్ఛనూ, సమానత్వాన్నీ సౌభ్రాతృత్వంతో వేరు చేయలేము. సమానత్వం లేకుండా స్వేచ్ఛ మాత్రమే ఉంటే అది అనేకుల మీద కొందరి ఆధిపత్యాన్ని సృష్టిస్తుంది. స్వేచ్ఛ లేకుండా సమానత్వం మాత్రమే ఉంటే అది వ్యక్తిగత

చొరవను చంపివేస్తుంది. సౌభ్రాతృత్వం లేకుండా స్వేచ్ఛా సమానత్వాలు సహజంగా వికసించలేవు. వాటిని అమలు చేయడానికి రక్షక భటుడుగా సౌభ్రాతృత్వం కావాలి.

భారత సమాజంలో ఈ మూడిటిలో రెండు ఎంతమాత్రం లేవనే గుర్తింపుతో మనం ప్రారంభిద్దాం. వాటిలో ఒకటి సమానత్వం. సామాజిక తలంలో భారత సమాజం తారతమ్య అసమానత సూత్రం పునాదిగా ఉంది. ఈ సమాజంలో కొందరికి అపార సంపద, అసంఖ్యాకులు కఠోర దారిద్ర్యంలో జీవించే స్థితి ఉంది.

జనవరి 26, 1950న మనం ఒక వైరుధ్యమయమైన జీవితంలో ప్రవేశించబోతున్నాం. రాజకీయాలలోనేమో మనకు సమానత్వం ఉంటుంది. సామాజిక ఆర్థిక జీవనంలో మాత్రం మనకు అసమానత్వం ఉంటుంది. రాజకీయాలలో మనం ఒక మనిషికి ఒక వోటు ఒక విలువ అనే సూత్రాన్ని గుర్తిస్తాం. కాని మన సామాజిక, ఆర్థిక జీవనంలో మన సామాజిక ఆర్థిక వ్యవస్థ కారణంగా ఒక మనిషికి ఒక విలువ అనే సూత్రాన్ని నిరాకరించడం కొనసాగిస్తాం. ఈ వైరుధ్యమయమైన జీవితాన్ని ఎంతకాలం కొనసాగించగలం? మన సామాజిక, ఆర్థిక జీవనంలో సమానత్వాన్ని నిరాకరిస్తూ ఎంతకాలం కొనసాగగలం?

నిస్సందేహంగా స్వాతంత్ర్యం అనేది సంతోష సందర్భమే. కాని ఈ స్వాతంత్ర్యం మన ముందుకు అనేక బాధ్యతలు తెస్తున్నదని మనం మరచిపోగూడదు. ఇంతకాలంగా ప్రతి తప్పుకూ బ్రిటిష్ వాళ్లను కారణంగా చూపే అవకాశాన్ని ఈ స్వాతంత్ర్యం ద్వారా మనం కోల్పోతాం. ఇకనుంచి ఏదైనా తప్పు జరిగితే మనం నిందించడానికి ఎవరూ లేరు. మనను మనం నిందించుకోవలసిందే. పైగా తప్పులు జరగడానికి మరింత ఎక్కువ అవకాశం ఉంది కూడ...."

డెబ్బై ఏళ్లు గడిచాక చూస్తే ఆ మాటలు ఎంత నిజమో, ఎంత దూరదృష్టితో చెప్పినవో అర్థం అవుతుంది.

### ఈ ఏడు దశాబ్దాలలో ఏం జరిగింది?

అలా చారిత్రకంగా, సైద్ధాంతికంగా కాకపోయినా, ఇది నిజంగా స్వాతంత్ర్యమే అనుకునే వాళ్లయినా ఈ డెబ్బై ఏళ్ల చరిత్రను బేరీజు వేసి స్వతంత్ర పాలనలో భారతదేశం ఏమి సాధించిందో వివరించవలసి ఉంది. అందుకు కనీసం నాలుగు ప్రాతిపదికలున్నాయి.

ఒకటి, పేదరికం, నిరుద్యోగం, విద్య, ఆరోగ్యం, సమానత్వం, ప్రజాస్వామ్యం, లౌకికత్వం, జాతుల సమస్య, కేంద్ర, రాష్ట్ర సంబంధాలు, విదేశీ సంబంధాలు వంటి సామాజిక, రాజకీయార్థిక, పాలనా పరమైన సూచికలలో ఏడు దశాబ్దాలలో సాధించిన, సాధించలేకపోయిన ప్రగతి ద్వారా అంచనా వేయడం.

రెండు, రైతాంగం, కార్మికులు, స్త్రీలు, దళితులు, ఆదివాసులు, మైనారిటీలు, మధ్యతరగతి వంటి విభిన్న, అసంఖ్యాక ప్రజా సమూహాల జీవన స్థితిగతులలో వచ్చిన మార్పుల ద్వారా స్వాతంత్ర్యాన్ని, స్వాతంత్ర్య ఫలాలను అంచనా వేయడం.

మూడు, వలసవాద ప్రయోజనాల కొనసాగింపు, దేశీయ పెట్టుబడిదారులు, భూస్వాములు, ధనికులు, రాజకీయ నాయకులు, రాజ్యాంగయంత్రం పొందుతున్న ఫలాల ద్వారా స్వాతంత్ర్యాన్ని అంచనా వేయడం.

నాలుగు, దేశం ఏడు దశాబ్దాల చలనంలో సాధించినవేమిటో అర్థం చేసుకోవడానికి ఉత్పత్తి శక్తులలో, ఉత్పత్తి సంబంధాలలో, ఉపరితలాంశాలలో సాధించిన, సాధించలేకపోయిన ప్రగతిని అంచనా వేయడం.

ఈ నాలుగు ప్రాతిపదికలలో ఏ ఒక్క ప్రాతిపదిక మీద అంచనా వేయదలచినా అది ఒక ఉద్గ్రంథమే అవుతుంది. ఇక్కడ ఆయా ప్రాతిపదికలను స్థూలంగా మాత్రమే పరిశీలిద్దాం.

### పేదరికం

ఏడు దశాబ్దాల "స్వతంత్ర" పాలన తర్వాత, ప్రపంచం మొత్తంలోని పేదలలో మూడో వంతు మంది భారతదేశంలోనే ఉన్నారు. 1947 నాటికి భారతదేశంలో పేదల సంఖ్య ఎంతో కచ్చితమైన లెక్కలు లేవు గాని పేదరికం విస్తృతంగానే ఉండేది. ఆ తర్వాత కాలంలో ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలు, అంతర్జాతీయ సంస్థలు, స్వతంత్ర పరిశీలకులు వేరువేరు లెక్కలు వేశారు. ఆదాయాన్ని బట్టి, ఖర్చును బట్టి, వినియోగించే ఆహారపదార్థాల కాలరీలను బట్టి, కొనుగోలు శక్తిని బట్టి పేదరికం లెక్కలు మారిపోతూ వచ్చాయి. ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగానే పేదరికం తక్కువ ఉందని, తగ్గుతుందని చూపడానికి ప్రమాణాలూ మారుస్తూ ఉండగా, భిన్నమైన సంస్థలు, వ్యక్తులు భిన్నమైన ప్రమాణాలు వాడుతున్నారు. దానితో కచ్చితంగా పేదల సంఖ్య గురించి గందరగోళం వ్యాపించి ఉంది.

ప్రభుత్వం చెపుతున్న 12.4 శాతం, అంతర్జాతీయ సంస్థలు చెపుతున్న 20–30 శాతం, స్వతంత్ర పరిశోధకులు చెపుతున్న 50–60 శాతం మధ్యలో ఎక్కడో పేదరికం ఉండవచ్చు. కాని కనీసం భారత ప్రజానీకంలో సగం అయినా పేదరికంలో ఉన్నారనేది నిస్సందేహం. ఈ డెబ్బై ఏళ్లలో ప్రభుత్వాలు ఎన్నెన్నో పేదరిక నిర్మూలనా కార్యక్రమాలు చేపట్టి, వేల కోట్ల రూపాయలు వెచ్చించింది గాని దాదాపు మూడు తరాలు గడిచినా, "స్వతంత్ర" భారత ప్రభుత్వానికి పేదరికాన్ని నిర్మూలించడం సాధ్యం కాలేదు. పేదరిక నిర్మూలనా కార్యక్రమాల నిధులతో రాజకీయ నాయకులు, పెత్తందార్లు, మధ్యవర్తులు, కాంట్రాక్టర్లు లాభపడ్డారనేది ఏ గ్రామానికి వెళ్లినా కనబడే దృశ్యమే. మరొకవైపు దేశంలోని సంపదలో 60 శాతం దేశ జనాభాలోని ఒక్క శాతం చేతుల్లో ఉన్నదని అంతర్జాతీయ సంస్థలు వేస్తున్న అంచనాలు దేశ సంపదలు కొందరి హక్కు భుక్తం కావడం వల్లనే, దేశ పాలకులు ఆ స్థితిని కొనసాగనివ్వడం వల్లనే పేదరికం పెరుగుతున్నదని చూపుతున్నాయి.

### నిరుద్యోగం

అలాగే దేశంలో పనిచేయగలిగిన వయసులో ఉన్నవారందరికీ పని కల్పించాలనే ఆదర్శం పెట్టుకున్నప్పటికీ దేశంలో నిరుద్యోగం, ప్రచ్ఛన్న నిరుద్యోగం, అర్థవంతమైన ఉద్యోగాలు లేకపోవడం, ఉన్న అర్హత కన్న తక్కువదైన మరొక ఉద్యోగం చేయడం చాల ఎక్కువగా ఉన్నాయి. జాతీయాదాయంలో 17 శాతం మాత్రమే సమకూరుస్తున్నదని ప్రభుత్వమే చెపుతున్న వ్యవసాయ రంగం ఇవాళ్టికీ శ్రామిక జనాభాలో 50 శాతం మందికి పని కల్పిస్తున్నదంటే జాతీయాదాయపు లెక్కలైనా తప్పు అయిఉండాలి. లేదా వ్యవసాయ రంగంలో అవసరమైన వారి కంటె

ఎక్కువ పని చేస్తూ ప్రచ్ఛన్న నిరుద్యోగంలో ఉన్నారనుకోవాలి.

అలాగే 26 శాతం జాతీయాదాయం వాటా ఉన్న పారిశ్రామిక రంగం 22 శాతం శ్రామిక జనాభాకు పని కల్పిస్తుండగా, ఆర్భాటంగా ప్రాచుర్యంలోకి వచ్చిన సేవారంగం 54 శాతం జాతీయాదాయం వాటాతో ఉన్నప్పటికీ 28 శాతం శ్రామిక జనాభాకు మాత్రమే పని కల్పిస్తున్నది. ఈ అంకెలను బట్టే భారత ఆర్థిక వ్యవస్థ ఎంత అస్తవ్యస్తంగా ఉన్నదో, పనిచేయగలిగిన, చేయదలచిన జనాభాకు పని ఇవ్వలేని దుస్థితి ఏడు దశాబ్దాల తర్వాత కూడ తొలగిపోలేదని, వలస పాలనలో లాగనే కొనసాగుతున్నదని అర్థమవుతుంది.

## విద్య

విద్యారంగంలో, ముఖ్యంగా అక్షరాస్యతా శాతంలో చూసినప్పుడు భారతదేశంలో 1951లో 16 శాతం ఉండిన అక్షరాస్యత 2011 నాటికి 74 శాతానికి చేరింది. కాని భారీ పెరుగుదలగా కనబడుతున్న ఈ అంకె పొట్ట విప్పి చూస్తే ఎన్నో పురుగులు బైటపడతాయి. డెబ్బై సంవత్సరాల తర్వాత కూడ "స్వతంత్ర" పాలకవర్గాలు నలుగురిలో ఒకరికి అక్షర జ్ఞానం కూడ ఇవ్వలేకపోయాయనేది ఒక వాస్తవమైతే, ఈ అంకెల గారడీ కోసం ప్రభుత్వాలు అక్షరాస్యతకు ఇచ్చిన సంకుచిత నిర్వచనం వల్ల అక్షరాస్యులుగా గుర్తింపు పొందినవారందరూ విద్యావంతులు కారు. కనీసం పాఠశాల విద్య అయినా పూర్తి చేసినవారు కారు.

ప్రాథమిక పాఠశాలలోనే ఆ వయసు బాలబాలికలు అందరూ చేరడం లేదంటే, పై చదువుల స్థాయి వచ్చేసరికి చదువు వదిలేస్తున్నవారి సంఖ్య నానాటికీ పెరిగిపోతున్నది. విద్య చాల ఖరీదు కావడం, విద్యారంగం మీద ప్రభుత్వ పెట్టుబడులు తరిగిపోతుండడం, కుటుంబాల ఆర్థిక స్థితి వల్ల పిల్లలు చదువుకోలేని స్థితి ఉండడం వంటి ఎన్నో కారణాల వల్ల ఏటా పదమూడు కోట్ల మంది ప్రాథమిక పాఠశాలలో చేరితే, వారిలో ఆరో తరగతికి ఆరున్నర కోట్ల మంది, పదకొండో తరగతికి మూడు కోట్ల ఎనభై లక్షల మంది, డిగ్రీ స్థాయికి రెండు కోట్ల డెబ్బై లక్షల మంది, పోస్ట్ గ్రాడ్యుయేషన్ స్థాయికి నలభై లక్షల మంది మిగులుతున్నారని ప్రభుత్వ గణాంకాలు చెపుతున్నాయి. అంటే ఏడు దశాబ్దాల "స్వాతంత్ర్యం" తర్వాత మూడు శాతం విద్యార్థులకు మాత్రమే ఉన్నత విద్యలో చేరడానికి అవకాశం దొరుకుతున్నదన్నమాట.

## సమానత్వం

దేశంలో ఆర్థిక, కుల, మత, ప్రాంతీయ, భాషా అసమానతలు నానాటికీ పెరిగిపోతున్నాయి. ఈ అసమానతలను తొలగించడం, తగ్గించడం తన బాధ్యత అని చెప్పుకుని అధికారానికి వచ్చిన ప్రభుత్వాలు ఆ అసమానతలను మరింతగా పెంచి పోషిస్తున్నాయి. వీటిలో ప్రతి ఒక్క అసమానతా వివక్షకు, విద్వేషానికి, హింసకు దారితీసి, ఈ డెబ్బై సంవత్సరాలలో ఎంత రక్తపాతానికి, హత్యాకాండలకు, ఊచకోతలకు కారణమయిందో అధ్యయనం చేస్తే, ఆ హింసాకాండను ఆపడానికి ప్రయత్నించవలసిన పాలకవర్గాలు, ప్రభుత్వాలు, అధికారయంత్రాంగం ఆ పని చేయకపోగా, తామే హింసకు ప్రేరేపించాయని తెలుస్తుంది. అంటే దేశంలో అసమానతా స్థితి వలస పాలన కాలంలో కన్న "స్వతంత్ర" పాలనలోనే దుర్భరంగా మారిందని తెలుస్తుంది.

దేశంలోని అత్యున్నత స్థానాలకు అన్ని అణగారిన వర్గాల నుంచి రాష్ట్రపతులుగా, ఉపరాష్ట్రపతులుగా, ప్రధానమంత్రులుగా, అత్యున్నతాధికారులుగా నామమాత్రంగా, ఉదాహరణ ప్రాయంగా ఒకరో ఇద్దరో ఎదిగినప్పటికీ, ఆయా వర్గాల సగటు మనుషులు అనుభవిస్తున్న దోపిడీ, పీడన, వివక్ష, చిన్నచూపు ఏడు దశాబ్దాలలో ఎంతమాత్రం తగ్గలేదు సరిగదా, కొన్ని రంగాలలో పెరిగినట్టు కనబడుతుంది.

ఈ పెరిగిపోతున్న అసమానతలన్నిటికీ ఒక ఉదాహరణగా స్త్రీ పురుష అసమానతను చూస్తే "స్వతంత్ర" భారతం ఎంత ప్రగతిని సాధించిందో అర్థమవుతుంది. స్త్రీల పట్ల చిన్నచూపు, గర్భస్థ స్త్రీ శిశువులను హతమార్చడం వంటి కారణాల వల్ల ప్రతి వెయ్యి మంది పురుషులకు 927 మంది స్త్రీలతో స్త్రీ పురుష నిష్పత్తి ఉండవలసినదానికంటె అన్యాయంగా ఉంది. స్త్రీ పురుష అసమానత విషయంలో ప్రపంచంలోని 187 దేశాలను బేరీజు వేసిన యుఎన్‌డిపి మానవాభివృద్ధి నివేదిక భారతదేశాన్ని 132వ స్థానంలో పెట్టింది.

దక్షిణాసియాలోని అన్ని దేశాలూ పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లతో సహా భారతదేశం కన్న మెరుగైన స్థితిలో ఉన్నాయి. ఏరోజు పత్రిక తెరిచినా స్త్రీల మీద అత్యాచారాలు, హింస, ఆడపిల్లలను కనడం మీద వ్యతిరేకత, విద్యలో, ఆరోగ్యంలో, అవకాశాలలో, గౌరవంలో స్త్రీల పట్ల వివక్ష, ప్రచార, వినోద సాధనాలలో స్త్రీని అసమానంగా చూసే సంస్కృతి విచ్చలవిడిగా కనబడతాయి.

## ఆరోగ్యం

ఆరోగ్యం విషయం చూస్తే, దేశంలో సగటు ఆయుఃప్రమాణం 1947లో 32 సంవత్సరాలు ఉండేది, 2015 నాటికి 68 సంవత్సరాలకు పెరిగింది. కాని ప్రతి వెయ్యి జననాలకు 50 మరణాలతో, ప్రపంచంకెల్లా శిశు మరణాల సంఖ్య ఎక్కువ ఉన్న దేశాలలో భారతదేశం కూడ ఉంది. దేశంలోని ఐదు సంవత్సరాల లోపు బాలబాలికల్లో దాదాపు సగం మంది, 15-49 సంవత్సరాల వయసుగలవారిలో మూడో వంతు మంది పోషకాహార లోపంతో ఉన్నారు.

భారత ప్రభుత్వం ఆరోగ్యం మీద పెట్టే ఖర్చు జాతీయాదాయంలో 1 శాతం కన్న తక్కువతో, ప్రపంచంలోకెల్లా ఆరోగ్యం మీద తక్కువ ఖర్చు పెట్టే దేశాలలో భారతదేశం ఒకటిగా ఉంది. ప్రత్యేకించి ఆదివాసుల, దళితుల, స్త్రీల ఆరోగ్య ప్రమాణాలు అత్యంత దారుణంగా ఉన్నాయి. డెబ్బై ఏళ్ల "స్వతంత్ర" పాలన అందరికీ ఆరోగ్యం అనే కనీస ప్రమాణాన్ని అందుకోలేకపోయింది.

ఒకవైపు అత్యాధునిక, అత్యంత ప్రామాణికమైన, అంతర్జాతీయ స్థాయి ఆరోగ్య సౌకర్యాలు అందుబాటులో ఉన్న నగరాలు, అల్పసంఖ్యాక సంపన్న వర్గం ఉండగా, ఇవాళ్టికీ కనీస వైద్య ఆరోగ్య సౌకర్యం అందని గ్రామాలు, అటవీ ప్రాంతాలు, కొండ ప్రాంతాలు ఎన్నో ఉన్నాయి. ప్రపంచంలోకెల్లా మెరుగైన వైద్య, ఆరోగ్య, సాంకేతిక విజ్ఞాన నిపుణులు ఉన్న దేశంగా పేరు తెచ్చుకున్న దేశం, జనాభాలో ఎనభై శాతం మందికి కనీస వైద్య, ఆరోగ్య సౌకర్యాలు కల్పించలేని స్థితిలో ఉంది.

*(మిగతా వచ్చే సంచికలో)*

*(రచయిత పాత్రికేయులు)* వీ

# కార్పొరేట్‌ల సేవకే విశాఖలో భూకబ్జాలు

***విశాఖపట్నంలో సామాన్యులకూ, ప్రభుత్వానికీ చెందిన వేలాది ఎకరాల భూములు కబ్జాలకు గురవుతున్నాయనీ, ఈ కబ్జా వ్యవహారంలో రాజకీయ నాయకుల పాత్ర ప్రముఖంగా ఉందనీ అంటున్నారు* పి.వి. రమణ**

విశాఖలో లక్షలాది మంది పేద ప్రజలు సంవత్సరాల తరబడి గూడు లేక అల్లాడుతున్నారు. తలదాచుకోవడాకి కొన్ని గజాల స్థలం ఇస్తే, గుడిసె వేసుకుంటామంటూ అధికారుల, ప్రజాప్రతినిధుల చుట్టూ తిరుగుతున్న నిరుపేదల సంఖ్య భారీగానే ఉంది. వారికి జానెడు స్థలం ఇవ్వడానికి మీన మేషాలు లెక్కించి, ఏళ్ల తరబడి కార్యాలయాల చుట్టూ తిప్పించుకునే అధికార యంత్రాంగం లక్షలాది ఎకరాల భూములను అప్పజెప్పడంలో నిస్సిగ్గుగా కబ్జా రాయుళ్ల కొమ్ముకాసిన తీరు విస్మయాన్ని కలిగిస్తోంది. ఈ వ్యవహారంపై నిష్పక్షపాతంగా వ్యవహరించి అక్రమార్కులను కఠినంగా శిక్షించాల్సిన రాష్ట్ర ప్రభుత్వం, దానికి భిన్నంగా రోజుకో మాట చెబుతూ పిల్లిమొగ్గలు వేస్తోంది. కొన్ని సంవత్సరాల నుండే విశాఖలోని కీలక ప్రాంతాలపై కబ్జా రాయుళ్లు కన్నేశారు. నగరం నలుమూలలా దందా సాగించారు. అభివృద్ధి పేరుతో ప్రభుత్వం అనుసరించిన విధానాలు ఆచరణలో వారికే ఉపయోగపడ్డాయి. అధికారం అండతో చట్టాలను చుట్టాలుగా చేసుకుని, అధికార యంత్రాంగాన్ని డూడూ బసవన్నలుగా మార్చేసి అక్రమార్కులు విరుచుకుపడ్డారు. విశాఖలోని అన్ని ప్రాంతాల నుండి భూ కబ్జా కథనాలు రావడానికి ఈ పరిస్థితే కారణం.

పెందుర్తి మండలం ముదపాకలో తొలుత వెలుగులోకి వచ్చిన ఈ వ్యవహారం ఆ తరువాత భీమునిపట్నం, అనకాపల్లి, మధురవాడ, కొమ్మాది తదితర ప్రాంతాలకు విస్తరించింది. ఎక్కడికక్కడ భూ కబ్జాల భాగోతాలు వెలుగులోకి వస్తున్నాయి. ఎన్ని వేల ఎకరాలను కబ్జా రాయుళ్లు కైంకర్యం చేశారో అర్థం కాని పరిస్థితి నెలకొంది. వేల ఎకరాలకు సంబంధించిన రికార్డులు తారుమారయ్యాయని ఒకసారి, హుదూద్ తుఫాన్ కారణంగా రికార్డులు గల్లంతయ్యాయని మరోసారి జిల్లాకు చెందిన అత్యున్నత అధికారి వ్యాఖ్యానించడం వివాదాస్పదంగా మారింది. భారీ ఎత్తున అక్రమాలు జరిగినట్లు తొలుత మాట్లాడిన అధికారులే కొండను తవ్వి ఎలుకను పట్టినట్లు నామ మాత్రపు ప్రభుత్వ భూమే కబ్జాకు గురయ్యిందని లెక్కలు తేల్చడం హాస్యాస్పదం.

ముఖ్యమంత్రి తనయుడు, రాష్ట్ర మంత్రి లోకేశ్ పర్యటన తరువాత అధికారుల వైఖరిలో గణనీయమైన మార్పు వచ్చిందన్న ఆరోపణలు వస్తున్నాయి. మరోవైపు ఈ వ్యవహారంపై బహిరంగ విచారణ నిర్వహిస్తామని, తేదీ కూడా ప్రకటించిన ప్రభుత్వం ఇప్పుడు వెనక్కి తగ్గింది. స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీమ్ (సిట్) ద్వారా విచారణ చేయిస్తామని చెబుతోంది. అధికార పార్టీకి చెందిన నేతలపైనే ఆరోపణలు వస్తున్న నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వ కనుసన్నల్లో సాగే దర్యాప్తు సంస్థలు పూర్తిస్థాయిలో నిజాలను వెలికితీయడం కూడా సందేహమే.

భూ బకాసురులు సమాచార హక్కు చట్టాన్ని తమకు అనుకూలంగా దుర్వినియోగం చేస్తున్నారు. ఆ చట్టాన్ని అడ్డుపెట్టుకుని తమ కబ్జాలకీ, సివిల్ వివాదాలకీ తెరలేపుతున్నారు. ఇదంతా కొందరు రెవెన్యూ ఉద్యోగుల అండదండలతోనే నడుస్తోంది. ముందు తాము కన్నేసిన సర్వే నెంబర్లలోని భూములకు సంబంధించిన రికార్డుల్ని తారుమారు చేయిస్తున్నారు. కొన్నిసార్లు నకిలీల్ని చొప్పిస్తున్నారు. ఆ తర్వాత సమాచార హక్కు చట్టం ఆధారంగా సదరు పత్రాలు, దస్తావేజుల కాపీలు కావాలంటూ దరఖాస్తు చేస్తున్నారు. వాటి నకలు చేతికి వచ్చాక దాని ఆధారంగా ఆ భూమిని తమకు స్వాధీనం చేయించాలంటూ ముందు రెవెన్యూ కోర్టులు, ఆ తర్వాత న్యాయస్థానాలకు వెళ్తున్నారు. ఈ విధంగా పలు జిరాయితీ, సర్కారు భూములు కబ్జాదారుల పాలవుతున్నాయి.

సహజంగా ఎవరైనా భూమి రిజిస్ట్రేషన్ చేయించుకోవాలంటే సబ్ రిజిస్ట్రార్ కార్యాలయానికి వెళ్లి సంబంధింత అధికారులకు భూమి తాలుకా పట్టా, రిజిస్ట్రేషన్ డాక్యుమెంట్ వీరికి ఎలా దఖలు పడిందనే పత్రాలు, భూమికి సంబంధించిన లింకు డాక్యుమెంట్లతో పాటు ఆధార్ కార్డు, మరేదైనా గుర్తింపు కార్డు, భూమి కొనుగోలు చేసిన వారి రెండు పాస్‌పోర్ట్ సైజ్ ఫొటోలు ఇవన్నీ తప్పని సరిగా సమర్పించాలి. అనంతరం భూమి తాలుకు సర్వే నెంబర్లను రిజిస్ట్రేషన్ అధికారులు పరిశీలించి, భూమికి సంబంధించిన కోర్టు కేసులేమైనా ఉన్నాయా అని విచారణ చేసిన తర్వాతే రిజిస్ట్రేషన్ ప్రక్రియ మొదలు పెడతారు. కానీ, భీమిలి మండలం చిప్పాడ గ్రామంలో సర్వే నంబర్ 184/6లోని 35 ఎకరాల భూమిని రిజిస్ట్రేషన్ చేయించే ప్రక్రియలో అధికారులు ఏ ఒక్క నిబంధనను పాటించలేదు. ప్రభుత్వ మార్గదర్శకాలను బేఖాతరు చేస్తూ రిజిస్ట్రేషన్ అధికారులు కోట్ల రూపాయల విలువైన భూమిని అక్రమార్కులకు కట్టబెట్టేశారు. వెబ్‌ల్యాండ్‌లో నమోదు చేయకుండా ఒక్క గజం కూడా రిజిస్ట్రేషన్ చేసే అధికారం సబ్ రిజిస్ట్రార్లకు లేదు. కానీ చిప్పాడ గ్రామంలోని 35 ఎకరాల భూమిని వెబ్‌ల్యాండ్‌లో నమోదు చేయకుండానే సదరు సబ్ రిజిస్ట్రార్లు సూర్య చంద్ర ఎస్టేట్స్ ప్రైవేట్ లిమిటెడ్‌కు కట్టబెట్టేయడం ఇప్పుడు వివాదాస్పదమవుతోంది.

రెవెన్యూ, రిజిస్ట్రేషన్ శాఖల్లో అవినీతి రాజ్యమేలుతుంది. అక్కడ వందల కోట్ల ఆస్తులు కూడబెడుతున్నారు. గత మూడేళ్లలో అవినీతి నిరోధక శాఖకు చిక్కినవారిలో అత్యధికులు ఈ శాఖలకు చెందిన వారే. విశాఖలో లక్ష కోట్ల విలువైన భూ కుంభకోణం వెనుక పాత్రదారులంతా ఈ రెండు శాఖలకు చెందిన వారే. ఇటీవలే విశాఖ రూరల్, భీమిలి తహసీల్దార్లు ఎసిబికి చిక్కగా తాజాగా గాజువాక సబ్ రిజిస్ట్రార్ ఆదాయానికి మించిన ఆస్తుల కేసులో దొరికిపోయారు. భూముల పరిరక్షణ, భూ రికార్డుల నిర్వహణ రెవెన్యూ బాధ్యత. నిబంధనలకు లోబడి చట్టప్రకారం భూముల కొనుగోళ్లు అమ్మకాలు జరిపేది రిజిస్ట్రేషన్ శాఖ. ఈ రెండు శాఖలు సమన్వయంతో పనిచేయాల్సిన అవసరం ఉంది. భూ రికార్డుల నిర్వహణలో పూర్తి పారదర్శకత, అమ్మకాలు

కొనుగోళ్ల సమయంలో రిజిస్ట్రేషన్ శాఖ నిశిత పరిశీలన పెడితే భూ అక్రమాలు జరిగే అవకాశం చాలా తక్కువ. కాని విశాఖ జిల్లాలో ఈ రెండు శాఖలు అవినీతి సంపాదనలో మంచి సమన్వయంతో పనిచేస్తున్నాయి. అధికారులు, సిబ్బంది రెండు చేతులా ఆర్జిస్తున్నారు. ప్రభుత్వ స్థలాలు కబ్జాకు గురవుతున్నా గుడ్లప్పగించి చూడడమే కాదు, రికార్డుల ట్యాంపరింగ్, రికార్డులు గల్లంతు చేయడం, కావాల్సిన వారికి అడిగిన వెంటనే ఎన్‌వోసిలు జారీ చేయడం, ప్రైవేటు వ్యక్తుల మధ్య భూతగాదాలు పెట్టడం రెవెన్యూ అధికారులకు వెన్నతో పెట్టిన విద్య. భీమిలి మండలంలో ఇద్దరు తహసీల్దార్లు, ఇద్దరు సబ్ రిజిస్ట్రార్‌లు ఇటీవల ఎసిబికి చిక్కారు.

నగర పరిధిలో 8, రూరల్ జిల్లా పరిధిలో 11 సబ్ రిజిస్ట్రేషన్ కార్యాలయాలు ఉన్నాయి. సాధారణ రోజుల్లో గ్రామీణ జిల్లా పరిధిలో 15 నుంచి 25 వరకు, సీజన్‌లో రోజుకు 20 నుంచి 50 వరకు, నగర పరిధిలోని 50 నుంచి 100 వరకు, సీజన్‌లో 75 నుంచి 200 వరకు సేల్ డీడ్ రిజిస్ట్రేషన్లు జరుగుతుంటాయి.

ప్రతి లావాదేవీలోనూ మార్కెట్ వాల్యూను బట్టి పర్సంటేజ్ లుంటాయి. కొంతమంది దస్తావేజు లేఖకులతో పాటు దళారీలు కూడా మామూళ్లు వసూలు చేస్తూ ప్రతిరోజు సాయంత్రానికి సంబంధిత సబ్ రిజిస్ట్రార్‌తో పాటు కార్యాలయ సిబ్బందికి పర్సంటేజ్‌ల కనుగుణంగా అందజేస్తుంటారు. మామూళ్లు తీసుకునే ఒక్కో సబ్ రిజిస్ట్రార్‌కు నెలకు కనీసం రూ.లక్ష నుంచి రూ.10లక్షల వరకు అక్రమార్జన ఉంటుందని అంచనా. కిందిస్థాయి సిబ్బంది కూడా వేలల్లోనే అక్రమార్జన సాగిస్తుంటారు. ఇందులో ప్రధాన వాటా రాష్ట్రస్థాయి రాజకీయ నాయకులకు, మంత్రులకు చేరుతుందని కొంత మంది అధికారులు బాహాటంగానే అంటున్నారు. ఇక రెవెన్యూ శాఖలో కూడా అదే తీరు. రికార్డుల ట్యాంపరింగ్ పట్టాలు పుట్టించడం, ప్రభుత్వ భూములను ప్రైవేటు భూములుగా చిత్రీకరించడం వీరికే చెల్లింది. ఇలా భూముల రూపుమార్చాలన్నా, పట్టాదార్ పాస్ పుస్తకాలు కావాలన్నా ఎన్‌వోసిలు ఇవ్వాలన్నా అన్నింటికి మామూళ్లు సమర్పించు కోవాల్సిందే. ఈ రెండు శాఖల్లో పనిచేసే వారు ఎప్పుడు ఎసిబికి చిక్కినా పట్టుబడే ఆదాయం కోట్లల్లోనే ఉంటోంది.

డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ సర్వే అధికారిగా పనిచేసిన ఎం. రాజేశ్వర రావుపై ఎసిబి అధికారులు దాడులు నిర్వహించగా రూ.50 కోట్ల విలువైన ఆస్తులు వెలుగుచూశాయి. అచ్యుతాపురం తహసీల్దార్ రామచంద్రరావు 4 లక్షల రూపాయల లంచం తీసుకుంటూ ఎసిబికి చిక్కారు. మునగపాక మండల రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ జి.సుభద్ర, భీమునిపట్నం ఆర్ ఐ–2 జి. శ్రీనివాసు లంచం తీసుకుంటూ ఎసిబి అధికారుల వలకు చిక్కారు. విశాఖ రూరల్, భీమిలిలో పనిచేసిన తహసీల్దార్లు శంకర్రావు, రామారావులపై ఎసిబి అధికారులు దాడులు చేయగా వందల కోట్ల రూపాయల ఆస్తులు వెలుగుచూశాయి. గాజువాక సబ్‌రిజిస్ట్రార్ వెంకయ్యనాయుడు వద్ద కూడా ఆదాయానికి మించి 100 కోట్ల రూపాయల ఆస్తులు ఎసిబికి చిక్కాయి. ఇది కేవలం కొందరి అవినీతి మాత్రమే.

**చంద్రబాబు, లోకేష్‌లపై ఆరోపణలు**

విశాఖ భూ కుంభకోణాలకు సంబంధించి రెండు ఉదంతాలను పరిశీలిస్తే సిఎం చంద్రబాబు, ఆయన కుమారుడు లోకేష్ ప్రమేయం ఉన్నట్లు, ఆరోపణలు వినిపిస్తున్నాయి. భూసేకరణ చేయాలని సిఎం పేషీ నుంచి విశాఖ నగరాభివృద్ధి సంస్థ (వుడా)కు సూచనలు అందగానే పాలకమండలి ఆమోదించి కార్యాచరణలోకి దిగింది. హుద్‌హుద్ తుఫాన్ వచ్చినప్పుడు వేలాది రికార్డులు గల్లంతయ్యాయని చెబుతున్నారు. దీన్ని అవకాశంగా తీసుకున్న టిడిపి నేతలు, బినామీలు రికార్డులను తారుమారు చేశారనే వాదనలు ఉన్నాయి. హుద్‌హుద్ సహాయ పనుల పర్యవేక్షణ పేరిట సిఎం చంద్రబాబు విశాఖ కలెక్టరేట్‌లో మకాం వేశారు. ఆ సమయంలో ఆయనకు తెలియకుండానే రికార్డులు గల్లంతు అయ్యాయా అనే ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి.

విశాఖలో 2,45,896 ఫీల్డ్ లెవల్ మెజర్‌మెంట్ బుక్స్ (ఎఫ్‌ఎంబి) లు ఉండగా 16,735 ఎఫ్‌ఎంబిలు కనిపించకుండా పోయాయి. 3022 రెవెన్యూ సర్వీస్ రికార్డ్ (ఆర్‌ఎస్‌ఆర్)లు ఉండగా అందులో 379 అదృశ్యం అయ్యాయి. 3022 గ్రామాలకు సంబంధించి క్లియర్ మ్యాపుల్లో 233 మ్యాపులు కనిపించకుండా పోయాయి. ఇందులో చాలా వరకు భీమిలి, మధురవాడ ప్రాంతాల్లోని భూములకు సంబంధించినవే ఉన్నాయి. రాష్ట్ర లైబ్రరీలో 4551 రికార్డులు భద్రపర్చడంతో వాటిని వెనక్కు తీసుకొస్తున్నట్లుగా ప్రకటించారు.

హుద్‌హుద్ తుపానులో ఈ రికార్డులు పోయాయని కలెక్టర్ చెబుతున్నారు. 2014 అక్టోబర్ 12న హుద్‌హుద్ తుఫాను విశాఖ తీరాన్ని దాటింది. ఈ ఘటనల్లో ఎక్కడా తహసీల్దార్ కార్యాలయాలు కూలిపోయినట్లు, కొట్టుకుపోయినట్లు, ధ్వంసమైనట్లు రికార్డు కాలేదు. పైగా తహసీల్దార్లు, ఆర్డీవోలు, రెవెన్యూ సిబ్బంది కార్యాలయాల్లోనే ఉండి తుఫాను పరిస్థితిని సమీక్షించారని ప్రభుత్వం ఘనంగా చెప్పుకుంది. ఇక సిఎం కూడా ఆ సమయంలో విశాఖలోనే మకాం వేశారు. ఇదే సమయంలో రికార్డులు పోయాయని చెబుతున్నారు. తుఫాను నష్టాలకు సంబంధించిన వివిధ అంశాల ప్రస్తావనలో కూడా ఏ అధికారి రికార్డులు పోయాయని అప్పుడు చెప్పలేదు.

ఒక్క విశాఖపట్నం రెవిన్యూ డివిజన్ పరిధిలోనే ఇప్పటి వరకు 11,143.36 ఎకరాల ప్రభుత్వ భూములు ఆక్రమణల పాలైపోయినట్లు అంచనా. జిల్లా వ్యాప్తంగా చూస్తే ఆక్రమణల చిట్టా 23,876.53 ఎకరాలు. ఇక ప్రైవేట్ వ్యక్తుల ఆస్తులు కూడా దాదాపుగా ఇంతే స్థాయిలో ఆక్రమణల పాలైపోయాయి. వీటన్నింటి విలువ కనీసం రూ.20 వేల కోట్ల పైనే ఉంటుందని అంచనా. అధికారులను ఆకట్టుకున్న భూబకాసురులు ముందుగా భూములను ఆక్రమించి, రికార్డులు మాయం చేసి, చివరికి దాన్నో సివిల్ వివాదంగా మార్చేసి పరిస్థితులను తమకనుకూలంగా మార్చుకుంటున్నారు.

**దసపల్లా హిల్స్ భూముల వివాదం**

ఒకప్పుడు అది సర్కారు భూమి అంటూ తెలుగుదేశం ప్రభుత్వమే జీవో జారీ చేసింది. జిల్లా కలెక్టర్ కూడా ప్రభుత్వ భూములుగా గుర్తించి గెజిట్ నోటిఫికేషన్ ఇచ్చారు. కానీ ఇప్పుడవి ప్రభుత్వ భూములు కావంటూ సిఎం చంద్రబాబు తనయుడు, మంత్రి లోకేష్ అనుచరులు అక్కడ ఇష్టారాజ్యంగా నిర్మాణాలు చేసేస్తున్నారు. వాటిని భూహక్కుదారుల నుంచి కొనుగోళ్లు చేసుకున్నామని పక్కా ఆధారాలు కూడా సృష్టిస్తున్నారు.

విశాఖ నగర నడిబొడ్డున ఉన్న దసపల్లా హిల్స్ భూములపై వివాదం 2000 సంవత్సరం నుంచి నడుస్తోంది. అక్కడ సర్వే నంబర్లు 1027, 1028,1196, 1197 లలోని 85.70 ఎకరాల్లోని 62.97 ఎకరాలు ప్రభుత్వ భూమిగా రికార్డుల్లో నమోదై ఉంది. ఇప్పుడు మార్కెట్ ధర ప్రకారం ఆ భూమి ధర రూ. 1500 కోట్ల పైమాటే. దసపల్లా భూముల

ఆక్రమణలకు నగరంలోని 19వ వార్డుకు చెందిన దాసరి అప్పారావు అనే నైట్ వాచ్‌మేన్‌ను తెరపైకి తెచ్చారు. దసపల్లా రాజు వారసులు వివాదాస్పద భూమిని అప్పారావుకు ఇచ్చినట్లు, అతను సర్వే నంబరు 1197లో 2,736 గజాల భూమిని దాట్ల శాంతి అనే మహిళకు విక్రయించినట్లు డాక్యుమెంట్లు సృష్టించారు. అక్కడ బహుళ అంతస్తుల భవనం నిర్మిస్తున్నారు. నెల నెలా రేషన్ షాపులో చౌక బియ్యం తీసుకునే అప్పారావు రూ.20 కోట్ల విలువ చేసే భూమిని బడాబాబులకు విక్రయించడం ఆశ్చర్యం కలిగిస్తోంది. ఈ వివాదాస్పద భూమిలోని 2000 గజాల్లో (సర్వే నంబరు 1196) తెలుగుదేశం పార్టీ జోనల్ కార్యాలయాన్ని నిర్మించారు.

**గీతం మూర్తి సామ్రాజ్య విస్తరణ**

1976లో భూమిలేని పేదలకు సాగు చేసుకొనే నిమిత్తం ఎండాడ, రుషికొండ పరిధిలోని నెంబర్ 35, 37, 38 ల్లో పట్టాలిచ్చారు. అయితే చాలా మంది నిరుపేద రైతులు సాగు చేసుకునే స్థోమత లేక ఆయా స్థలాలను అలాగే వదిలేశారు. అంతే ఆ భూములపై గీతం యూనివర్సిటీ అధినేత, టిడిపి నేత, ఎం.ఎల్.సి అయిన ఎంవిఎస్ మూర్తి కన్నుపడింది. ముందుగా ఆ స్థలాలన్నిటిని ఆక్రమించేశారు. తన విద్యావ్యాపార సామ్రాజ్యాన్ని విస్తరించుకోవడంలో భాగంగా ఆ స్థలాలను తనకు కేటాయించాల్సిందిగా 2008లో జిల్లా అధికారుల ద్వారా తొలిసారి ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. నిరుపేదలకు కేటాయించిన భూములు తిరిగి వారికే దక్కాలి తప్ప మరెవరికీ చెందకూడదని ఆ నాటి ప్రభుత్వం ఆ విజ్ఞప్తిని తిరస్కరించింది.

విలువైన ఆ భూములపై కన్నేసిన గీతం మూర్తి, వైఎస్ హఠాన్మరణం తర్వాత మళ్లీ ప్రతిపాదనలు పంపారు. అయితే ఈసారి అప్పటి ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఐవీఆర్ కృష్ణారావు అడ్డుకున్నారు. ఆ తర్వాత 2012 – 13 మధ్య కాలంలో అప్పటి జిల్లా కలెక్టర్ శేషాద్రి ఆ ప్రతిపాదనలకు జిల్లాస్థాయిలోనే మోకాలడ్డారు. శేషాద్రి బదిలీ తర్వాత వచ్చిన అధికారులు మాత్రం సదరు టిడిపి నాయకుడికి తలొగ్గారు. ఇక 2014లో టిడిపి ప్రభుత్వం వచ్చిన దరిమిలా అధికార యంత్రాంగం ఎమ్మెల్సీకి దాసోహమంది. ఖాళీగా ఉన్న భూములు అన్యాక్రాంతం కాకుండా నామమాత్రపు ధరకు గీతం మూర్తికి కట్టబెట్టాల్సిందిగా మళ్లీ ప్రతిపాదనలు పంపారు. సర్వే నెంబర్ 35,36,37,38లలో 37 ఎకరాలకు తొలుత ఎలినేషన్ ప్రతిపాదనలు పంపగా, ఇదే సంస్థ అధీనంలో ఉన్న సర్వే నెం.191/1,2,8లలో 1.54 ఎకరాలు, 20/5,55/4, 55/5 లలో మరో 5.98 ఎకరాలు కలిపి మొత్తం మరో 7.52 ఎకరాలను ఈ సంస్థకే కేటాయించేందుకు వీలుగా మరో ఎలినేషన్ ప్రతిపాదనలు పంపారు.

పేదలకు కట్టబెట్టాల్సిన భూములను కొట్టేసేందుకు పక్కా పథకంతో ముందుకు వెళ్తున్న టిడిపి నాయకుడు విశాఖ పట్టణాభివృద్ధి సంస్థ (వుడా)కు చెందిన 20.36 ఎకరాల భూములను కూడా ఎన్నో ఏళ్లుగా అనధికారికంగా తన అధీనంలోనే ఉంచుకున్నాడు. సర్వే నెంబర్ 36లో ఉన్న భూమి వుడాకి దఖలుపడి ఎన్నో ఏళ్లయినా, ఇప్పటికీ వుడా అధికారులు ఆ భూమిని పూర్తి స్థాయిలో స్వాధీనం చేసుకోలేకపోయారు. ఇప్పటికీ ఆ భూముల్లో టిడిపీ వ్యాపారవేత్తకు చెందిన నిర్మాణాల ఆనవాళ్లే ఉండడం గమనార్హం.

కబ్జా జరిగిందని ధ్రువీకరించినా ఆ భూములను వదులుకోవడానికి గీతం వర్సిటీ ససేమిరా అంటూ మళ్లీ చక్రం తిప్పింది. ప్రభుత్వ ముఖ్యనేత సూచన మేరకు గీతం కాలేజీ చైర్మన్ ఆ భూములు తనకే కేటాయించాలని కోరుతూ ఇటీవల జిల్లా కలెక్టర్‌కు దరఖాస్తు చేసుకున్నారు. సామాజిక సేవలో భాగంగా కాలేజీని నిర్వహిస్తున్నానని, నామమాత్రపు ధరకు 55.24 ఎకరాలను తనకు ఇవ్వాలని దరఖాస్తులో పేర్కొన్నారు. ఆ దరఖాస్తుకు అనుగుణంగా జిల్లా కలెక్టర్ ప్రభుత్వానికి సిఫార్సు చేశారు. గీతం కాలేజీ ఆక్రమించుకున్న భూమి ప్రభుత్వానిదేనని జిల్లా అధికార యంత్రాంగం నిర్ధారించినా, అక్రమ సిఫార్సు చేయడం పట్ల అధికార యంత్రాంగం నివ్వెరపోతోంది. జిల్లా కలెక్టర్ సిఫార్సు ఆధారంగా ఆగమేఘాలపై రూ.1000 కోట్ల విలువైన భూమిని ఎంవిఎస్ మూర్తికి చౌక ధరకు కట్టబెట్టేందుకు ఫైలు సిద్ధమైపోయింది. వచ్చే మంత్రివర్గ సమావేశంలో ఇందుకు ఆమోదం తెలపాలని నిర్ణయించారు.

విశాఖపట్నం భూముల ట్యాంపరింగ్ భాగోతంలో విజయనగరం జిల్లా టిడిపి నేతల భాగస్వామ్యం కూడా ఉన్నట్లు బహిర్గతమైంది. డిజిపి ప్రకటించిన ట్యాంపరింగ్ చేసిన వారి జాబితాలోని మొదటి వ్యక్తి విజయనగరం జిల్లా శృంగవరపుకోట ఎమ్మెల్యే కోళ్ల లలితకుమారి ప్రధాన అనుచరుడు, టిడిపి జిల్లా ఉపాధ్యక్షుడు గోగాడ జగన్నాథంనాయుడే కావడం గమనార్హం. ఆయన బావ భూమిరెడ్డి జగన్నాథకుమార్ కూడా ట్యాంపరింగ్ జాబితాలో ఉన్నారు. కొమ్మాది గ్రామ పరిధిలోని 30/2 సర్వే నంబర్ పేరిట 12 ఎకరాలు,140/ పి సర్వే నంబర్ పేరిట 10 ఎకరాలు ట్యాంపరింగ్ అయ్యాయి. భూమిరెడ్డి జగన్నాథకుమార్‌ది విశాఖ జిల్లా చోడవరం. ఆయన పేరిట సర్వే నంబర్ 29/2లో 7.24 ఎకరాలు రికార్డుల్లో చేరాయి. ఇవన్నీ అటవీశాఖ భూములే కావడం విశేషం. విజయనగరం టిడిపి ఉపాధ్యక్షుడైన గోగాడ జగన్నాథంనాయుడు భార్య పద్మావతి ప్రస్తుతం వేపాడ మండలం వావిల పాడు టిడిపి ఎంపిటిసిగా కొనసాగుతున్నారు. జగన్నాథంనాయుడు తండ్రి సూర్యనారాయణ కూడా టిడిపి తరపున సర్పంచ్‌గా పనిచేశారు. కొమ్మాదిలో 22 ఎకరాల అటవీశాఖ భూములు జగన్నాథం పేరిట రికార్డుల్లోకి చేరాయి. ఆయన సోదరి భర్త భూమిరెడ్డి జగన్నాథ్‌కుమార్ పేరున 7.24 ఎకరాలు రికార్డుల్లోకి ఎక్కాయి.

ఆనందపురం మండలం, రామవరం గ్రామంలో సర్వే నెంబర్లు 126, 127, 130/1, 130/2లలో 300 కోట్ల విలువచేసే 95.89 ఎకరాల ప్రభుత్వ భూమిని ప్రైవేటు పరం అయిన కేసులో అనకాపల్లి అధికారపార్టీ ఎంఎల్‌ఏ పీలా గోవింద సత్యన్నారాయణతో సహా మరో 10 మంది పైన ఆనందపురం పోలీసులు కేసు నమోదు చేశారు. ఈ భూములకు సంబంధించిన 1(బి) రిజిస్టర్లు, 10(1) అడంగళ్లు, ఎస్ఎఫ్ఎ తదితరలలో ఉండాల్సిన వివరాలన్నీ పూర్తిగా మార్పులు, చేర్పులు చేసినట్లుగా గుర్తించారు. ఆ భూములకు పట్టాదారు పాసుపుస్తకాలు, టైటిల్ డీడ్‌లను కూడా పుట్టించినట్లు గుర్తించారు. ప్రభుత్వ భూమిని సొంతం చేసుకోవడానికి నకిలీ దస్త్రాలను సృష్టించడం, ప్రభుత్వ రికార్డుల్లో వివరాలు తారుమారు, ఫోర్జరీలు చేయడం ఆయా పత్రాలను ఉపయోగించి పలు అక్రమాలకు పాల్పడినట్లు తేలింది.

'ప్రజా ప్రతినిధులు, రాజకీయ నాయకుల అండదండలతోనే విశాఖలో భూ దందా యథేచ్ఛగా కొనసాగుతోందని' రాష్ట్ర మంత్రి సిఎచ్ అయ్యన్నపాత్రుడు వెల్లడించారు. ప్రవాసాంధ్రులు ఎంతో కష్టపడి సంపాదించిన సొమ్ముతో విశాఖలో భూములు కొనుగోలు చేస్తే భూ బకాసురులు వాటిని ఆక్రమించుకుంటూ వారిని ముప్పుతిప్పలు పెడుతున్నారని' చెప్పారు. 'విశాఖలో భూ దందా సాగుతోందంట కదా? రాజకీయ అండదండలుంటే ఎక్కడైనా సరే. ప్రభుత్వ భూములైనా దర్జాగా కబ్జా చేయవచ్చట కదా. మీరు కాస్త మద్దతుగా ఉంటే నేనో రెండెకరాలు

ఆక్రమించుకుంటానంటూ ఓ స్నేహితుడు నన్నడిగాడు. ఆయన మాటలు వింటుంటే విశాఖలో భూములు ఎంత ఈజీగా కబ్జా చేయవచ్చో అర్థమవుతోంది' అని అయ్యన్న అన్నారు.

విశాఖ వుడా చిల్డ్రన్స్ థియేటర్‌లో జూన్ 2న జరిగిన నవనిర్మాణ దీక్ష సభలో ఆయన మాట్లాడారు. భూ బకాసురులను ఉపేక్షించరాదని తరిమి తరిమి కొట్టాలని పిలుపునిచ్చారు. విశాఖ వాసులు కూడా వెర్రి వాళ్లు కాదని తేడా వస్తే తరిమి కొడతారని చెప్పారు. ఆర్ అండ్ బిసిఇ గంగాధర్ రు. 150 కోట్ల అక్రమాస్తులతో ఎసిబికి దొరికిపోయారని ఒక సిఇ కి ఇంత సంపాదన అవసరమా? అని ఆయన ప్రశ్నించారు. తహసీల్దార్లు సైతం రూ.40 కోట్లు, రూ.50 కోట్ల ఆస్తులతో ఎసిబికి చిక్కారని, వీరికి ఇంత ఆస్తులు ఎక్కడ నుంచి వచ్చాయని ప్రశ్నించారు.

'భూ దోపిడీదారులను విశాఖ ప్రజలు తరిమి తరిమి తన్నేందుకు సిద్ధంగా ఉన్నారని, తాను నిజాన్ని నిర్భయంగా చెపుతానని, మంత్రి పదవినైనా వదులుకునేందుకు సిద్ధంగా ఉన్నానని' విశాఖ జిల్లా నర్సీపట్నం ఆర్డీవో కార్యాలయంలో జూన్ 3న జరిగిన నవనిర్మాణ దీక్షలో పాల్గొన్న మంత్రి అయ్యన్న విశాఖ నగరంలో జరిగిన భూ కుంభకోణంపై స్పందించారు. ఉన్నది ఉన్నట్టు మాట్లాడతానని, దీనిపై తనకు ఎటువంటి నష్టం జరిగినా వెనకడుగు వేసే ప్రసక్తే లేదని పేర్కొన్నారు.

జూలై 14న సిట్‌కు వివరాలు అందిస్తూ "2014 నుంచే విశాఖలో భూ కబ్జాలు, దందాలు మొదలయ్యాయి. అవి ఇప్పుడు తారా స్థాయికి చేరుకున్నాయి. నెల్లూరు, ప్రకాశం జిల్లాలతో పాటు ఇతర జిల్లాలను వచ్చిన నేతలు ఇక్కడ ప్రభుత్వ భూములను కబ్జా చేయడమే కాదు. పేద, మధ్యతరగతి ప్రజలను లక్ష్యంగా చేసుకుని రికార్డుల ట్యాంపరింగ్ చేసి వారి భూములను బలవంతంగా లాక్కొంటున్నారు. ఈ భూ దందాలపై నేనేమీ నిన్నా మొన్నా ఆరోపించలేదు. 2014లోనే ప్రభుత్వం దృష్టికి తీసుకువెళ్లా. త్రిసభ్య కమిటీతో విచారణ జరిపించమని ముఖ్య మంత్రి చంద్రబాబు నాయుడుకు, రెవెన్యూ మంత్రి కె.ఇ. కృష్ణమూర్తి, ఆర్థిక మంత్రి యనమల రామకృష్ణుడులకు ఉత్తరాలు రాశాను. గడిచిన రెండేళ్లుగా ప్రముఖ దిన పత్రికల్లో భూ కబ్జాలు, దందాలపై వచ్చిన కథనాల క్లిప్పింగ్స్‌తో సహా సుమారు 1700 ఎకరాలకు సంబంధించిన అవకతవకలు, కబ్జాలపై ఫిర్యాదు చేశానని" ప్రకటించారు.

విశాఖలో లక్షల కోట్ల రూపాయల భూకబ్జాలకు పాల్పడుతున్న టిడిపి నేతలకు గ్యాంగ్ లీడర్ ముఖ్యమంత్రి చంద్రబాబు తనయుడు మంత్రి లోకేషేనని వైఎస్సార్‌సీపి ప్రధాన కార్యదర్శి రాజ్యసభ సభ్యుడు వి.విజయసాయిరెడ్డి ఆరోపించారు. విశాఖ భూ కుంభకోణంలో మంత్రి గంటా శ్రీనివాసరావు, టిడిపి ఎంఎల్‌ఎలు బండారు సత్యనారాయణ మూర్తి, పంచకర్ల రమేష్‌బాబు, వంగలపూడి అనిత, వెలగపూడి రామకృష్ణబాబు, పీలా గోవిందులు ఒక గ్యాంగ్‌గా ఏర్పడ్డారన్నారు. వీరంతా ప్రభుత్వ భూములను దోచుకుంటున్నారని అన్నారు.

వైఎస్ఆర్ సిపి ఆరోపణల ప్రకారం, ప్రభుత్వ ముఖ్య నేత ప్రోత్సాహం. ఆయన తనయుడి సహకారంతో విశాఖ నగరంతో పాటు చుట్టుపక్కల ఉన్న భీమిలి, ఆనందపురం, పెందుర్తి, సబ్బవరం, గాజువాక, పెదగంట్యాడ, పరవాడ, జిల్లాకు చెందిన ఓ మంత్రి ఆయన బంధువుతో పాటు సిటీ, గ్రామీణ ప్రాంతాలకు చెందిన కొంత మంది టిడిపి ఎంఎల్‌ఎలు ఈ భూ దందాలు సాగించారు. మీ ఇంటికి మీభూమి అంటూ వెబ్‌ల్యాండ్‌లో భూముల అనుసంధానం చేయడాన్ని అనుకూలంగా మలుచుకున్నారు. తహసీల్దార్లు, కంప్యూటర్ ఆపరేటర్లను లోబర్చుకొని డిజిటల్ కీ లను తమచేతులో పెట్టుకుని సుమారు 50 వేల ఎకరాలకు పైగా వ్యవసాయ భూముల రూపు మార్చేశారు. సిటీ పరిధిలో 38 ఎకరాలను, వుడాకు చెందిన 4167 ఎకరాలు గుటకాయ స్వాహా చేశారు. దేవాదాయ శాఖకు చెందిన 5670 ఎకరాలు, వక్ఫ్ బోర్డుకు చెందిన 4,400 ఎకరాలు, భూదాన బోర్డుకు చెందిన 201 ఎకరాలు కబ్జా చేశారు.

మరోవైపు 22 వేల ఎకరాల వ్యవసాయ భూములు, 1495 ఎకరాల వ్యవసాయేతర భూములను ఆక్రమించు కున్నారు. కోర్టు లిటిగేషన్ల పేరిట మరో పదివేల ఎకరాలకు సంబంధించి యజమానులను ముప్పుతిప్పలు పెడుతున్నారు.

1. మధురవాడ, కొమ్మాది ప్రాంతాల్లో రూ.2,200 కోట్ల విలువైన భూములకు చెందిన 1బి రికార్డులు టాంపర్‌కు గురైనట్లుగా నిర్ధారించారు.
2. 233 విలేజ్ మ్యాప్‌లతో పాటు, 1.06 లక్షల ఎకరాలకు చెందిన 16,735 ఎఫ్‌ఎంబిలు, 379 ఆర్ఎస్‌ఆర్‌లు మాయమైపోయినట్లు గుర్తించారు.
3. హుద్‌హుద్ తుఫాన్‌లోనే అత్యధికంగా వేలాది ఎకరాలకు సంబంధించి రికార్డులు గల్లంతైనట్లు కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ ప్రెస్‌మీట్ పెట్టి ప్రకటించారు.
4. కలెక్టర్‌పై తీవ్ర ఒత్తిళ్లు రావడంతో కేవలం 254 ఎకరాల రికార్డులు మాత్రమే పోయాయని చెప్పారు. పైగా భూకబ్జాలు జరగలేదని చెప్పారు.
5. అసలు దోషులను వదిలేసి తహసీల్దార్లు, విఆర్‌ఓలపై సస్పెన్షన్ వేటు వేసి విషయాన్ని పక్కదారి పట్టిస్తున్నారు.
6. బహిరంగ విచారణ నిర్వహిస్తామని ప్రకటించిన సర్కార్.. మాట తప్పి స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీమ్ (సిట్)ను ఏర్పాటు చేసింది.
7. సిట్ ఏర్పాటుపై జీవో కూడా విడుదల కాకముందే ట్యాంపరింగ్ నిందితులు వీరేనంటూ ఊరు పేరు లేని 29 మందిపై ఆరిలోవ పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేయడం అనుమానాలకు తావిస్తోంది.

**జూన్ 15న బహిరంగ విచారణ జరిపిస్తామని ప్రకటన**

విశాఖపట్నం జిల్లాలో సాగిన భూ అక్రమాలపై బహిరంగ విచారణ జరిపిస్తామని మే 30న ఉపముఖ్యమంత్రి, రెవెన్యూ శాఖ మంత్రి కెఇ కృష్ణమూర్తి తెలిపారు. జూన్ 15న అక్కడి కలెక్టరేట్‌లో జరిగే విచారణలో తనతోపాటు సీనియర్ రెవెన్యూ అధికారులు పాల్గొంటారని వెల్లడించారు. విశాఖ జిల్లాలో భూరికార్డులు మార్చివేసి అధికార పార్టీ నేతలు ప్రభుత్వ భూములను కొట్టేశారని, 6,000 ఎకరాలకు పైగా ప్రభుత్వ భూములు మాయమయ్యాయని విమర్శలు వెల్లువెత్తుతున్న నేపథ్యంలో ఈ మేరకు కె.ఇ. కృష్ణమూర్తి ఒక ప్రకటన విడుదల చేశారు. ఈ వ్యవహారంపై విచారణ నిమిత్తం రాష్ట్ర భూ పరిపాలన ప్రధాన కమిషనరేట్ (సిసిఎల్‌ఏ) నుంచి సీనియర్ అధికారుల బృందాన్ని రికార్డుల పరిశీలనకు విశాఖకు పంపుతామని మంత్రి ఆ ప్రకటనలో పేర్కొన్నారు. బాధితులు వచ్చి ఫిర్యాదు చేస్తే విచారించి సమస్య పరిష్కరిస్తామన్నారు.

భూభాగోతాలు ఒక్కొక్కటిగా బయటపడడంతో కలెక్టర్ కూడా స్వయంగా మే 30న ఒక ప్రకటన చేశారు. 2,45,896 ఎఫ్‌ఎంబిల్లో 16,730 ఎఫ్‌ఎంబిలు కనిపించడం లేదని, 3022 రఫ్ విలేజ్ మ్యాప్‌లకు గానూ 379 అదృశ్యం అయ్యాయని, సుమారు 5వేల ఎకరాలకు పైగానే భూ రికార్డులు ట్యాంపరింగ్ జరిగాయని ప్రకటించారు. సిపిఎం, సిపిఐ., వైసిపి వంటి పార్టీలు జిల్లాలో 11 మండలాల్లో లక్ష ఎకరాల వరకూ ఈ పరిస్థితే ఉందని, అధికార పార్టీ నాయకులే దోషులనీ చెబుతూ వస్తున్నాయి. రూ.25 వేల కోట్లకు పైగా భూ అక్రమాల విలువ విశాఖ

నగరం చుట్టుపక్కలా, గ్రామీణ ప్రాంతాల్లో ఉందని వారు ఎద్దేవా చేస్తూ ఆధారాలను కూడా ప్రభుత్వం, కలెక్టర్‌కు మెమోరాండంల రూపంలో ఇస్తున్నారు. భూ కబ్జాలు, దందాలపై విశాఖ అట్టుడికిపోతున్న సమయంలో ముఖ్యమంత్రి తనయుడు ఐటి మంత్రి లోకేష్ విశాఖ పర్యటనకు వచ్చి వెళ్లాక జిల్లా కలెక్టర్ ప్రవీణ్‌కుమార్ మాటమార్చారు. 244 ఎకరాల్లోనే భూ రికార్డులు తారుమారయ్యాయని, భూ కుంభకోణాలు జరిగాయంటూ కలెక్టర్ జూన్ 14న ప్రకటించారు.

**భూ కబ్జాలపై సిట్టింగ్ జడ్జితో విచారణకు డిమాండ్**

విశాఖలో వెలుగు చూసిన భూకబ్జాలపై సిట్టింగ్ జడ్జితో విచారణ జరిపించాలని కేంద్ర ప్రభుత్వ మాజీ కార్యదర్శి విశ్రాంత ఐఏఎస్ అధికారి ఇఎఎస్ శర్మ డిమాండ్ చేశారు. రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు చేసిన సిట్ వల్ల బాధితులకు ఎలాంటి న్యాయం జరగదన్నారు. "విశాఖలో రాజకీయ నేతలు, రెవెన్యూ అధికారులు, బ్యాంకు ఉద్యోగులు కుమ్మక్కై వేల ఎకరాలు కబ్జా చేశారు. ఇంత పెద్ద భారీ కుంభకోణంపై విచారణ నిష్పక్షపాతంగా ఉండాలి. విచారణ సంస్థలపై ప్రభుత్వ నియంత్రణ ఉండకూడదు. స్వతంత్ర దర్యాప్తు సంస్థతో విచారణ జరిపితేనే వాస్తవాలు వెల్లడవుతాయి." అని ఆయన స్పష్టం చేశారు.

రెవెన్యూ రికార్డులు తారుమారవుతున్న విషయాన్ని సరిగ్గా ఏడాది క్రితమే తనతో పాటు మరో రిటైర్డ్ ఐఎఎస్ అధికారి గోపాలరావు, రవికుమార్‌లు కలిసి గుర్తించామని, విజయనగరం, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాల్లో పది కేసుల్లో ఇలా రికార్డులు ట్యాంపర్ అయినట్టుగా గుర్తించామన్నారు. రెవెన్యూ రికార్డులన్నీ ఆనాడే తాము పరిశీలించామన్నారు. పదేళ్లనాటి అడంగళ్లను కూడా చూశామని పెద్దఎత్తున రికార్డులు తారుమారయ్యాయని, ఈ విషయాన్ని అప్పటి రెవెన్యూ ప్రిన్సిపల్ సెక్రటరీ దృష్టికి తీసుకెళ్లినా పట్టించుకోలేదని చెప్పారు.

వెబ్‌ల్యాండ్ పేరుతో ల్యాండ్ రికార్డులను ఆన్‌లైన్‌తో పొందుపర్చే ప్రక్రియ సమయంలోనే ఈ భూభాగోతం జరిగిందని, ఈ భూకబ్జాలకు అమరావతిలో బీజం పడిందని శర్మ అన్నారు. "అక్కడ (అమరావతిలో) రాజధాని పేరుతో సేకరించిన ల్యాండ్‌పూలింగ్‌లో పెద్దఎత్తున డి పట్టా భూములు సేకరించారు సరిగ్గా ఇక్కడా (విశాఖలో) అదేరీతిలో డిపట్టా భూదాన ఇనాం తదితర భూముల కొనుగోలుకు అధికార పార్టీ పెద్దలు తెరతీసారు" అని పేర్కొన్నారు. ముదుపాక తదితర ప్రాంతాల్లో ఈ తరహాలోనే భూకబ్జాలు జరిగాయన్నారు. డి. పట్టా భూముల కొనుగోళ్లు అమ్మకాలు జరపడానికి వీలులేదని చట్టం చెబుతున్నా అడ్డగోలుగా కొనుగోలు చేసి ఆపై ప్రభుత్వం నుంచి కోట్లాది రూపాయలు పరిహారం రూపంలో లాగేయడం అలవాటైపోయిందన్నారు.

అమరావతిలో రుచిచూసిన వారంతా నేడు విశాఖపై పడ్డారని, డి.పట్టా భూముల కొనుగోళ్లను లీగలైజ్ చేసుకునేందుకు ప్రత్యేక జీవో కూడా తీసుకొచ్చేందుకు ప్రయత్నిస్తున్నారని చెప్పారు. పారిశ్రామికంగా వృద్ధి చెందుతున్న మధురవాడ, కొమ్మాది, భీమిలి, నక్కపల్లి వంటి ప్రాంతాల్లో పెద్దఎత్తున రికార్డులు ట్యాంపరయ్యాయన్నారు. విశాఖ చుట్టుప్రక్కల ప్రాంతాల్లో భూమి విలువ అమాంతం పెరగడంతో కబ్జారాయుళ్లు ఇక్కడ పాగా వేశారని, పరదేశిపాలెం, కొమ్మాది, మధురవాడ ప్రాంతాల్లో ప్రభుత్వ భూముల్ని ప్రైవేటు భూములుగా చూపించి కొట్టేశారని వెల్లడించారు.

ప్రజా సంఘాలు ఐ.ఎఫ్.టి.యు., పి.ఒ.డబ్ల్యు, ఒ.పి.డి.ఆర్., పౌరహక్కుల సంఘం, దళిత విముక్తి, విద్యా పరిరక్షణ కమిటీ, మురికి వాడ నివాసుల సంక్షేమ సంఘం, ఉత్తరాంధ్ర సంఘర్షణ సమితి, అఖిల భారత రైతు కూలీ సంఘాల ఆధ్వర్యంలో కమిటీ జూన్ 14, 15 తేదీలలో కబ్జాలకు గురైన ప్రాంతాలను సందర్శించి ప్రజల నుండి వాస్తవాలను సేకరించింది. అధికారంలో ఉన్న మంత్రులు, ఎంఎల్ఏ ల సహకారంతో ఈ భూ కబ్జాలు సాగుతున్నట్లు కమిటీ గుర్తించింది. రాజధానికి భూ సేకరణలో వినియోగించిన ల్యాండ్ పూలింగ్ (భూ సమీకరణ) విధానం, పట్టణ భూ గరిష్ట పరిమిత చట్టాన్ని ఎత్తివేయడం, వ్యవసాయ భూములను సులువుగా మార్పిడి చేసే విధంగా చట్టాలను మార్చడం ఇవన్నీ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అన్ని చట్టాలను పటిష్టంగా అమలు చేయడానికి బదులు వాటిని తప్పించుకోవడానికి, పెద్ద ఎత్తున భూ కబ్జాలకు ఆస్కారం ఏర్పడిందని, చట్టాలను సులభతరం చేయడం భూకబ్జాలు సులభం కావడానికి దారి తీసిందని గుర్తించింది. ఈ సందర్భంగా భూ కబ్జాలన్నింటిపై జుడిషియల్ ఎంక్వైరీ జరిపించాలని, 1998 నుండి భూ రికార్డులను క్షుణ్ణంగా నిర్ణీత కాల వ్యవధిలో విచారణ చేసి, వాటి నిర్ధారణలను ప్రకటించాలని, విశాఖ పరిసర ప్రాంతాలలో ఉన్న పచ్చదనాన్ని, పర్యావరణాన్ని కాపాడాలని, నగరాన్ని కాంక్రీట్ జంగిల్‌గా మార్చడాన్ని నిరోధించాలని, చట్టాల ఉల్లంఘనకు పాల్పడుతున్న వారిని కఠినంగా శిక్షించాలని, జి.ఒ.నెం. 296 ప్రకారం క్రమబద్ధీకరించని పేదల భూములను వెంటనే క్రమబద్ధీకరించాలని డిమాండ్ చేసింది.

ఇప్పటికే చంద్రబాబు నాయుడి అభివృద్ధి విధానాల పర్యవసానంగా రాష్ట్రంలో భారీ స్థాయి పంట పొలాలు, ఆకుపచ్చని కొండలు, అటవీ భూములూ అన్నీ ప్రాజెక్టుల కోసం, రోడ్ల కోసం, నిర్మాణాల కోసం ఆహుతైపోయాయి. రాష్ట్రంలో గత 10 సంవత్సరాలలో అటవీ భూమి 10.6 శాతం తగ్గిపోయింది. శ్రీకాకుళం జిల్లాలో గతంలో పచ్చదనంతో కూడిన అటవీ భూములు 543.09 చ. కి.మీ. నేడు 174.90 చ.కి.మీ. లకు తగ్గిపోయింది. విజయనగరం జిల్లాలో 1143.73 చ.కి.మీ లుంటే నేడు 74.38 చ.కి.మీలకు తగ్గిపోయింది. విశాఖ జిల్లాలో గతంలో 4270.37 చ.కి.మీల విస్తీర్ణంలో పచ్చదనంతో కూడిన అటవీ భూములుండగా నేడు 357.13 చ.కి.మీ.కి తగ్గిపోయింది. దీనిని బట్టి పచ్చని అటవీ భూముల విధ్వంసం ఏ స్థాయిలో జరుగుతుందో అర్థమౌతుంది. దీనివలన ప్రజల ఆరోగ్యాలు తీవ్రమైన స్థాయిలో దెబ్బతింటున్నాయి. వీటికి తోడు నేడు భూకబ్జాల మార్గం ద్వారా లక్షలాది ఎకరాల భూములను కార్పొరేట్ శక్తులకు ధారపోస్తే, పేద, మధ్యతరగతి ప్రజలకు గూడు కరువవడమే కాకుండా నగరం తీవ్రమైన ప్రకృతి బీభత్సాలకు గురయ్యే ప్రమాదం ముంచుకొస్తుందని అందరూ గుర్తించాలి.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)*

వీ

కా. దశరథ్ మరణించి పది సంవత్సరాలు అయిన సందర్భంగా ఆయన స్మృతిలో...
వీక్షణంకు చిరకాలం వర్థిల్లాలని కోరుతూ...
– కుటుంబ సభ్యులు

# వాకపల్లి నెత్తుటి గాయానికి పదేళ్లు

***వాకపల్లి ఆదివాసి మహిళలపై పోలీసు అత్యాచార దమనకాండ జరిగి పదేళ్లయినా ఇప్పటికీ నిందితులపై కేసు నమోదు కాలేదనీ, వారికి న్యాయం జరగకపోగా నిత్యం దాడులతో నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నారనీ అంటున్నారు* రామారావు దొర**

మన దేశంలో మహిళలు తమ ప్రతిభతో రాణిస్తుంటే ప్రభుత్వాలు మాత్రం మా ఉదారత వల్లే సాధించినట్టు చెప్పుకొంటున్నాయి. అదే ఆదివాసిలో, దళితులో అయితే తామిచ్చిన రిజర్వేషన్లుగా గొప్పలు చెప్పుకొంటాయి. కాని తమను అత్యాచారం చేసి అపకీర్తి తలపెట్టిన పోలీసులను శిక్షించాలంటూ గత పదేళ్లుగా న్యాయం కోసం పోరాడుతున్న వాకపల్లి మహిళలను మాత్రం విద్రోహ శక్తులుగా ముద్రవేసి దోషులుగా నిలబెట్టింది మన సర్వసత్తాక గణతంత్ర దేశం.

2007 ఆగస్టు 20న విశాఖపట్నం జిల్లా జి. మాడుగుల మండలం నుర్మతి పంచాయితీ వాకపల్లి గ్రామానికి కూంబింగ్ పేరుతో గ్రేహౌండ్స్ దళాలు చొరబడ్డాయి. గ్రేహౌండ్స్ దళాలు పదకొండు మంది ఆదివాసీ కోందు మహిళలపై అత్యాచారానికి ఒడిగట్టిన అనైతిక సంఘటన గురించి అందరికి తెలిసిందే! ఈ ఆగస్టు 20తో ఆ అమానవీయ గాయానికి దశాబ్ద కాలం పూర్తవుతుంది. రాజ్యహింసను ఎదుర్కొంటూ, పోలీసుల బెదిరింపులకు లొంగకుండా, ప్రభుత్వం ప్రకటించిన సంక్షేమ పథకాలను, పోలీసులు ఇవ్వజూపిన డబ్బును నిర్మోహమాటంగా తిరస్కరించి, నిందితులైన పోలీసులను శిక్షించాలని దశాబ్దకాలంగా పోరాడుతూనే ఉన్నారు. ఆత్మ విశ్వాసం కోల్పోకుండా న్యాయ పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ఇప్పటికే అందులోని ఇద్దరు మహిళలు మరణించారు కూడా. అయినా నేటికి మానని గాయంగా రగులుతూనే ఉంది. కాదు! కాదు! రగిలిస్తూనే ఉన్నారు. బాధిత కుటుంబాలే కాదు! ఆ గ్రామంలో నివసిస్తున్న అన్ని కోందు కుటుంబాలు నేటికి పోలీసుల వేధింపులకు గురికాబడు తున్నామని వాపోతున్నారు.

వాకపల్లి ఘటనకు సంబంధించి నేర నిర్ధారణ సరిగా జరగలేదని, సిబిఐతో విచారణ జరిపించి నిజాలు రాబట్టాలని మొదటి నుండీ ఆదివాసిలు, ప్రజా సంఘాలు డిమాండ్ చేస్తునే ఉన్నారు. అయినా ఈ దుర్మార్గానికి ఒడిగట్టింది ప్రభుత్వ బలగాలే గనుక, పైరెండు డిమాండ్లకు ప్రభుత్వం ఎక్కడ తావివ్వకుండా తన పని తాను కానిచ్చుకొంటు పోయింది. అది ప్రభుత్వాల సహజ వైఖరికి నిదర్శనం. హైకోర్టు 21 మంది నిందితుల్లో 13 మందిపై విచారణ కొనసాగిస్తూ, 8 మందికి మినహాయింపు ఇచ్చింది. ఆ 13 మంది నిందితులు (పోలీసులు) తమపై మోపిన కేసు ఎత్తి వేయాలంటూ పైకోర్టును ఆశ్రయించారు. ఇప్పుడు నిందితులపై సుప్రీంకోర్టు స్టే కొనసాగుతుంది. పోలీసు బలగాలు చేసిన దుర్మార్గానికి ఊరుదాటి బయటకు రాలేని స్థితి మహిళలదైతే! కాయ కష్టంతో పొట్ట పోసుకునే శ్రమ జీవులు తమ దైనందిన అవసరాల కోసం వారపు సంతలకనో, ఆఫీసు పనుల కోసమనో, అసుపత్రులకనో ఊరు దాటి బయటకు వచ్చిన గ్రామస్తులు సైతం పోలీసుల వేధింపులకు గురవుతున్నామని ఆవేదన చెందుతున్నారు.

ఘటన జరిగిన నాటి నుంచి ఆదివాసి ఐక్య పోరాట సమితి (ఎఐపిఎస్), మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు పెద్ద ఎత్తున ఉద్యమాలు చేపట్టగా, ఆ రోజు వాకపల్లికి గ్రేహౌండ్స్ దళాలు వెళ్లినట్టు ఒప్పుకోవడమే కాకుండా, వారి వివరాలతో కూడిన జాబితా విడుదల చేసింది. కాని తగిన సమయంలో తగిన విధంగా వైద్య పరీక్షలు నిర్వహించలేదని నిరసనలు వెల్లువెత్తుతున్నా, ఈ కేసును అణగదొక్కడానికి వైద్య నివేదికల చుట్టూ తిప్పడానికే చూశారు. ఆ నివేదికను అడ్డుపెట్టుకుని రాష్ట్ర హోంశాఖ అత్యాచారం జరగలేదని నమ్మబలికింది.

గిరిజన సంక్షేమ శాఖ కార్యదర్శి నాగిరెడ్డి విచారణ జరిపి వాంగ్మూలాలను రికార్డు చేశారు. ప్రజా సంఘాలు కోరినట్టు సి.బి.ఐ. లేదా ఎస్.ఆర్. శంకరన్ వంటి వారితో స్వతంత్ర విచారణ జరిపితే మరికొన్ని నిజాలు బయటకు వచ్చే అవకాశం ఉంది అనే సూచనను పట్టించుకోలేదు.

2007 డిసెంబర్ 14న సిఐడి ఎస్‌పి శివానంద రెడ్డి తన తుది నివేదికలో సంఘటనకు సంబంధించి పరిస్థితుల సాక్ష్యంపై ఆధార పడవచ్చు. సాక్ష్యం చెప్పేటప్పుడు చిన్న చిన్న పొరపాట్లు దొరలవచ్చు. అందులో తప్పు లేదు. కాని ఈ కేసులో వైద్య నివేదిక, పరిస్థితులు అన్నిటిని పరిగణనలోకి తీసుకొంటే అత్యాచారం జరిగిందనేది నమ్మశక్యంగా లేదు అని పేర్కొంటూ, ఆ స్త్రీలు ప్రతిఘటించకపోవడం అసహజంగా ఉందనే అంశం ప్రస్తావించారు. ఆ గ్రామానికి వెళ్లింది సామాన్య ప్రజలు కాదు. దొంగలు కాదు. ప్రతిఘటించడానికి! సాయుధులైన గ్రేహౌండ్స్ పోలీసు బలగాలు. అయినా రాష్ట్ర ప్రభుత్వం కనుసన్నల్లో పనిచేస్తూ, పోలీసు శాఖలో భాగమైన సిఐడి బాధితుల పక్షాన నిలబడి ప్రభుత్వానికి మచ్చ తెచ్చే నివేదిక పారదర్శకంగా ఇస్తుందనే నమ్మకం లేకే గదా! సి.బి.ఐ. లేదా ఎస్.ఆర్. శంకరన్ (అప్పటికి బతికే ఉన్నారు) గారిచే విచారణకు హక్కుల సంఘాలు డిమాండ్ చేశాయి.

సిబిసిఐడి ఎస్‌పి ఇచ్చిన తుది నివేదికతో అసంతృప్తి చెందిన వాకపల్లి మహిళలు 2008 ఏప్రిల్ 16న పాడేరు ప్రథమ శ్రేణి జుడిషియల్ మేజిస్ట్రేట్ కోర్టులో నిరసన పిటిషన్ దాఖలు చేశారు. ఈ పిటిషన్‌పై విచారణ జరిపిన మేజిస్ట్రేట్ ఎ1 నుండి ఎ21 వరకు నిందితులపై 376(ఐఐ)(జి) ఆర్/డబ్ల్యు 149 ఐపిసి, ఎస్‌సి, ఎస్‌టి అత్యాచారాల నిరోధక చట్టం 3(ఎల్)(ఎక్స్) కింద కేసు నమోదు చేయాలనీ ఆదేశించారు. అయితే పాడేరు మేజిస్ట్రేట్ పిఆర్‌సి నెం.19 ఆఫ్ 2008లో

# ప్రజలపై భారం, విదేశీ సంస్థలకు లాభం

**ఒకవైపు ప్రజా రవాణా వ్యవస్థను బలహీన పరుస్తూ, మరోవైపు భారీ వ్యయాలతో నిర్మించ తలపెట్టబోతున్న మెట్రో ప్రాజెక్టు వల్ల ప్రజలపై భారం పెరుగుతోందనీ, మెట్రో వల్ల ప్రైవేట్ సంస్థలకు లాభాలే తప్ప ప్రజలకు మేలు తక్కువనీ అంటున్నారు ముప్పాళ్ళ భార్గవశ్రీ**

మెట్రోరైల్ ప్రాజెక్టును ఏవిధంగా విజయవాడ నగరానికి మణిహారం అని ప్రకటించారో 2007లో బి.ఆర్.టి.ఎస్ (బస్సు రాపిడ్ ట్రాన్స్‌పోర్టు సిస్టం) ను విజయవాడ నగరానికి వరం అని గతంలో ప్రకటించారు. విజయవాడ నగర తొలి మేయర్ టి. వెంకటేశ్వర రావు ఈ ప్రాజెక్టుకు త్రీవ అభ్యంతరం తెలియజేసినా, నగర కౌన్సిల్స్ సమావేశం ఈ ప్రాజెక్టును ఆపాలని ఏకగ్రీవంగా తీర్మానం చేసినా ఆనాటి ముఖ్యమంత్రి వై.ఎస్. జోక్యంతో జె.ఎన్.యు.ఆర్.ఎం. పథకం కింద వచ్చే నిధులు ఆగిపోతాయన్న పేరుతో ఈ ప్రాజెక్టు అమలుకు పూనుకున్నారు. నాడా దొరికితే గుర్రాన్ని కొన్నట్లుగా తొలగించిన సత్యనారాయణపురం రైల్వే లైను మార్గం దొరికిందనే పేరుతో రు. 150 కోట్ల ప్రాజెక్టును చేపట్టారు. 15 కి.మీ నిర్మించే ఈప్రాజెక్టులో కేవలం 5 కి.మీ (సత్యనారాయణపురం పాత రైల్వే లైను మార్గం) మాత్రమే ఈ ప్రాజెక్టుకు అనుకూలం. అప్పుడు నగరంలో కొంత కాలం బి.ఆర్.టి.ఎస్. బస్సులు తిప్పినా నగర ప్రయాణికులకు ఏమాత్రం ప్రయోజనకరంగా లేకపోవడంతో అపివేశారు.

విజయవాడ నగరానికి మెట్రోరైల్ ప్రాజెక్టు వస్తుందా, రాదా అన్న సందేహాలను ఈ మధ్య మున్సిపల్ శాఖా మంత్రి నారాయణ మెట్రోకు బదులుగా ప్రత్యామ్నాయ విధానాలపై ఎ.ఎం.ఆర్.సి.ని దృష్టి సారించాలని జూన్ రెండవ వారంలో ప్రకటించడంతో విజయవాడ నగర ప్రజల్లో సందేహాలు ఊపందుకున్నాయి. ఎ.ఎం.ఆర్.సి.(అమరావతి మెట్రో రైలు కార్పొరేషన్) ఎం.డి రామకృష్ణారెడ్డి మెట్రో పాజ్రెక్టులో ఒక వంతు మాత్రమే ఖర్చుతో నిర్మితమయ్యే ఎలివేటెడ్ బస్ / రైల్ ర్యాపిడ్ ట్రాన్స్‌పోర్టుకు ప్రతిపాదనలను సిద్ధం చేశారు. ఎలివేటెడ్ మార్గంలో అమర్చే అయిస్కాంతాలు (మాగ్నటిక్స్), సెన్సర్స్ ద్వారా డ్రైవర్ లేకుండా నడిచే ఈ రైళ్లకు అదనంగా భూసేకరణ భారం కూడా లేదని ప్రకటించారు. ఎకనామికల్, ప్రమాదరహిత, పర్యావరణ పరంగా బాగుండే రాపిడ్ ట్రాన్స్‌పోర్టు సిస్టమ్‌ను ఏర్పాటు చేయాలన్నది సి.ఎం. చంద్రబాబు భావనకనుగుణంగా దీన్ని ప్రతిపాదిస్తున్నామని, చైనా, సింగపూర్ దేశాల్లో ఈ సిస్టమ్ విజయవంతంగా అమలవుతున్నదని రామకృష్ణారెడ్డి ప్రకటించారు. అలానే మెట్రో రైల్ ప్రాజెక్టుకు రు. 7,712 కోట్ల వ్యయం అవుతందని అదే ఎలివేటెడ్ ప్రాజెక్టుకు అయితే ఇందులో రు. 2500 కోట్లు మాత్రమే అవుతుందని, మెట్రోకు కి.మీ రు. 250 కోట్లు వ్యయం అయితే ప్రత్యామ్నాయ ప్రాజెక్టుకు రు. 70-80 కోట్లు మాత్రమే అవుతుందని కూడా ప్రకటించారు.

విజయవాడ లాంటి చిన్న నగరాలకు మెట్రో రైలు కన్నా మోనో

---

చేపట్టిన ప్రొసీడింగ్స్‌ను కొట్టివేయాలని 2008 సెప్టెంబర్ 2న నిందితులు (పోలీసులు) హైకోర్టులో సిఆర్ఎల్. పి.నెం. 5598/2008 న దాఖలు చేశారు.

2008 సెప్టెంబర్ 4న హైకోర్టు పాడేరు మేజిస్ట్రేట్ కోర్టులో జరుగుతున్న ప్రొసీడింగ్స్ పై స్టే విదించింది. స్టే ఎత్తివేసి కేసు నమోదు చేసి విచారణ కొనసాగించాలని బాధిత మహిళలు సుప్రీంకోర్టుకు అప్పీలు చేయడం జరిగింది. నిందితులపై కేసు నమోదు చేయడానికే పదేళ్లుగా పోరాటం కొనసాగించవలసి వచ్చింది. బాధితుల వాంగ్మూలాల్లో లోపాలు, తేడాలు హైకోర్టు నిర్ణయించడం సరైనది కాదనే సూత్రం చట్టపరమైన ఆనవాయితీగా కొనసాగుతుంది.

దానిని అనుసరించి రేపో మాపో భారత అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు అవుననో... కాదనో... తీర్పు వెలువరించనుంది. అది సమ్మతమో! ఆ సమ్మతమో! అదలా ఉంచితే సహజ న్యాయ సూత్రాలకు విరుద్ధంగా బాధిత కుటుంబాలతో సహా వాకపల్లి ఆదివాసిలు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. పాంగి ముసలయ్య ఆ గ్రామ పెద్ద. మహిళలకు ఆ సమయంలో పెద్ద దిక్కుగా నిలిచిన వ్యక్తి. ముసలయ్య కుమారుడు పాంగి వెంకటరావు గ్రామస్థులతో కలసి 2012 ఏప్రిల్ 12న బ్యాంకు పనినిమిత్తం జి మాడుగుల వచ్చాడు. వెంకటరావు యూనియన్ బ్యాంక్ వద్ద ఉన్నట్టు తెలుసుకొన్న అప్పటి జి మాడుగుల సబ్ ఇన్‌స్పెక్టర్ (ఎస్ఐ) శ్రీనివాసరావు కానిస్టేబుల్‌తో వచ్చి పోలీస్ స్టేషన్‌కు ఈడ్చుకెల్లి నిర్బంధించారు. సాయంత్రానికి పంచాయితీ సర్పంచ్, గ్రామస్థులు, కుటుంబ సభ్యులు స్టేషన్‌కు వెళ్లి వెంకటరావుని విడిచిపెట్టాలని ప్రాధేయపడగా, మాకు ఇన్‌పార్మర్‌గా పనిచేయాలనీ ఎస్ఐ శ్రీనివాసరావు ఒత్తిడి చేశాడు. చేసేది లేక పోలీసుల అధీనంలో ఉన్న వెంకటరావును విడిచిపెట్టాలని రాష్ట్ర మానవ హక్కుల కమిషన్‌ను ఆశ్రయించారు. ఎచ్ఆర్‌సి పోలీసులకు నోటీసులు జారీ చేయడంతో వెంకటరావును పది రోజుల తరువాత విడిచిపెట్టారు. ఏ విచారణ లేకుండానే వాకపల్లిలో అత్యాచారమే జరగలేదని మొదటి నుంచి బుకాయిస్తున్న పోలీసులు ఘటన జరిగి పదేళ్లైనా ఆ గ్రామంపై ఇంత నిర్బంధం దేనికి ప్రయోగిస్తున్నట్టు? కేసు మానాన కేసు నడుస్తుంది. ఈ కేసును ఎక్కడో ఒక చోట తప్పుదారి పట్టించి నిందితులను కాపాడే ప్రయత్నంగా కనపడుతుంది.

*(రచయిత ఉభయ తెలుగు రాష్ట్రాల ప్రధాన కార్యదర్శి, ఆదివాసి రచయితల సంఘం)* వీ

రైలు మేలని డి.ఎం.ఆర్.సి. ఛైర్మన్ శ్రీధరన్‌తో పాటు మరికొందరు నిపుణులు కూడా చెప్తున్నారు. ఈ మోనోరైల్ వ్యవస్థ ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా 44 నగరాల్లో పనిచేస్తుందని, దీని నిర్మాణానికి కి.మీ కు రు. 150 కోట్లు మాత్రమే ఖర్చు అవుతుందని, ఈ ప్రాజెక్టుకు తక్కువ స్థలం సరిపోతుందని, దీని నిర్వహణా వ్యయం మెట్రోతో పోల్చితే 40శాతం తగ్గుతుందని, కాంక్రీటు బీమ్‌పై నడిచే మోనోరైల్‌కు 4 నుంచి 6కోచ్‌లుంటాయని, ఒక్కో కోచ్‌లో 120 మంది ప్రయాణించవచ్చని చెప్తున్నారు. మెట్రోరైల్ నిర్మాణం కంటే వ్యయం కొంత తగ్గుతుంది కాబట్టి ఈ ప్రాజెక్టును పరిశీలించాలని నిపుణులు ప్రకటిస్తున్నారు.

ఈ ప్రాజెక్టులపై భారాలు తగ్గించుకోవాలనే పేరుతో ప్రత్యామ్నాయ మార్గాలు అన్వేషించడానికి మున్సిపల్ మంత్రితో పాటు మెట్రో ఎం.డి. తదితర అధికారులు జూలై మొదటి వారంలో చైనా పర్యటనకు వెళ్లి మధ్యలో కౌలాలంపూర్‌లోని మెట్రో రైలు వ్యవస్థను, తరువాత చైనాలోని వ్యవస్థలను పరిశీలించామని, చైనాలో గంటకు 25000 నుండి 30000 మంది ప్రయాణీకులు ఉండడం వలన అక్కడ మెట్రో రైలు విజయవంతం కాగలుగుతున్నాయని, చైనాలో ఉన్న లైట్ రైల్ ట్రాన్స్‌పోర్టు (ఎల్.ఆర్.టి), మోనోరైలు వ్యవస్థలను పరిశీలించామని, వీటిలో ఎల్.ఆర్.టి పట్ల ముఖ్యమంత్రి మొగ్గు చూపారని, దీనిపై సమగ్ర అధ్యయనం జరిపేందుకు జర్మనీ కన్సల్‌టెంట్‌ను నియమించినట్లు మంత్రి నారాయణ ప్రకటించారు. ఎల్.ఆర్.టి. ప్రాజెక్టుకు రు. 4500-5000 కోట్లు లోపు వ్యయం అవుతుందని, మెట్రో రైలు కంటే పొడవు వెడల్పు తక్కువుగా ఉంటాయి కాబట్టి ట్రాక్ నిడివి కూడా తగ్గి భూసేకరణ వ్యయం కూడా తగ్గుతుందని ప్రకటించారు.

ఈ ప్రాజెక్టుకు రుణం ఇవ్వడానికి జర్మనీ, ఫ్రాన్స్ ఆర్థిక సంస్థలు రాష్ట్ర ప్రభుత్వంతో చర్చలు జరపడానికి సిద్ధంగా ఉన్నాయని ప్రకటించారు. రాష్ట్ర ప్రభుత్వం ఎన్ని ప్రత్యామ్నాయ ప్రాజెక్టులను పరిశీలించినా, చివరికి ప్రాజెక్టు నమూనా మొదలుకొని నిర్మాణం నుంచి అప్పుల వరకు విదేశీ సంస్థల మీద ఆధారపడవల్సి రావడం వలన మెరుగైన రవాణ సౌకర్యం పేరుతో ప్రజల పై భారాలు వేయడానికి చంద్రబాబు ప్రభుత్వం ఏమాత్రం వెనుకాడడం లేదు.

అసలు ప్రశ్న విజయవాడ నగరానికి ఇంత భారీ ప్రజా రవాణా ప్రాజెక్టులు అవసరమా! 2007లో ప్రారంభించిన బి.ఆర్.టి.ఎస్. బస్సులను విజయవాడ నగరంలో నడపడం ఆచరణలో సాధ్యం కాదని తేలినప్పటికీ రెండు రాష్ట్రాలుగా విడిపోయిన తర్వాత చంద్రబాబు ప్రభుత్వం 2014లో బి.ఆర్.టి.ఎస్ ప్రాజెక్టు కంటే భారమైన మెట్రో ప్రాజెక్టును విజయవాడ నగరానికి మణిహారం లాంటిదని ప్రకటించి ప్రజల్లో లేనిపోని ఆశలు పెంచింది. ఏ నగరంలోనైనా మెట్రోరైలు నిర్మించాలంటే ఆ నగరంలో కనీస జనాభా 20 లక్షలు ఉండాలి. అప్పుడే మెట్రో రైళ్లల్లో ప్రయాణికుల సంఖ్య తగినంతగా ఉంటుంది. విజయవాడ నగర ప్రస్తుతం జనాభా 11 లక్షలు మాత్రమే. తక్కువ జనాభా వలన ఈ ప్రాజెక్టు నష్టాల పాలయ్యే ప్రమాదముందని నీతి ఆయోగ్ ప్రారంభంలోనే రాష్ట్ర ప్రభుత్వాన్ని హెచ్చరించింది. ఒక వేళ వేలాది కోట్ల రూపాయల ఖర్చుతో మెట్రో రైలు వ్యవస్థను నిర్మించినా అది రాష్ట్ర రాజధాని అమరావతికి ఉపయోగపడదని ప్రకటించింది. మెట్రో రైల్ ప్రాజెక్టు కోసం విజయవాడ నగర శివారు ప్రాంతాలను కలిపి జనాభాను పెంచి చూపించడానికి చంద్రబాబు ప్రభుత్వం ప్రయత్నం కూడా చేసింది. ఆ ప్రయత్నంలో భాగంగా నిడమనూరు, పోరంకి, పెనమలూరు వంటి శివారు ప్రాంతాల్లో 75 ఎకరాల భూమిని కూడా సేకరించడానికి చంద్రబాబు ప్రభుత్వం ప్రయత్నం కూడా చేసింది. ఆ భూములను వదులుకోవడానికి రైతులు గట్టిగా నిరాకరించడంతో కూడా ఈ ప్రాజెక్టును ప్రారంభించడం ఆలస్యం అయింది.

విజయవాడ మెట్రోరైలు 26 కి.మీ మార్గ నిర్మాణానికి రు. 7712 కోట్లు అవుతుందని ప్రస్తుత అంచనా. ఈ ప్రాజెక్టు వ్యయంలో 20 శాతం మాత్రమే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు భరిస్తాయి. మిగిలిన నిధులను ఫ్రాన్స్, జర్మనీ ఆర్థిక సంస్థల నుండి రుణాలుగా తీసుకోవాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. దీనికి ముఖ్యకారణం పాలకుల ప్రపంచీకరణ విధానాలకు పెద్దపీట వేసే డి.ఎం.ఆర్.సి చైర్మన్ శ్రీధరన్ విదేశీ కంపెనీలకు మెట్రో రైలు నిర్మాణంలో పెద్దపీట వేయడమే. మన దేశంలో ఉన్న పరిశ్రమలు ఉత్పత్తి చేయగలిగిన మీటర్ గేజ్ నిర్మాణాన్ని కాదని బ్రాడ్ గేజ్ నిర్మాణం పేరుతో విదేశాలతో, ముఖ్యంగా జపాన్‌తో ఒప్పందం చేసుకోవడం వలన ప్రాజెక్టు ఖర్చు మూడింతలు పెరిగిపోయింది. హైదరాబాద్ మెట్రో రైలు నిర్మాణ ప్రాజెక్టు ఖర్చు పెరిగిపోవడానికి ఇదే ముఖ్య కారణం.

ఉమ్మడి రాష్ట్రంగా ఉన్నప్పుడు 2003లో ఆమోదం పొందిన 72 కి.మీల హైదరాబాద్ మెట్రోరైలు ప్రాజెక్టు 2012లో కార్యాచరణలోకి వచ్చి 2017కి పూర్తి చేయాలని ప్రకటించారు. 2012లో దీని కాంట్రాక్ట్‌ను మన దేశానికే చెందిన మల్టీనేషనల్ కంపెనీల్లో దిగ్గజమైన, అంతర్జాతీయంగా 30కి పైగా దేశాల్లో కాంట్రాక్టు కొనసాగిస్తున్న ఎల్&టి రు. 14,132 కోట్లకు దక్కించుకుంది. ట్రాన్స్‌స్టాయ్, రిలయన్స్ ఇన్‌ఫ్రా, ల్యాంకో ఇన్‌ఫ్రాటెక్, ఎస్సార్, సోమా లాంటి దిగ్గజాలను ఎదుర్కొని ఆ కంపెనీ మాటల్లోని 'ఇదివరకెన్నడూ దక్కని పెద్ద ఆర్డర్‌ను' పొందామని ప్రకటించింది. ఈ ప్రాజెక్టులో ఎల్&టి తో పాటు ప్రాజెక్టుకు అవసరమైన రోలింగ్ స్టాక్‌ను ద.కొరియాకు చెందిన హూండాయ్ రోటీమ్, సిగ్నల్ వ్యవస్థ - ట్రైయిన్ కంట్రోల్, కమ్యూనికేషన్‌లను ఫ్రెంచ్ కంపెనీ, ఆటోమాటిక్ ఫేర్ కలెక్షన్‌ను ఉ.కొరియాకు చెందిన సామ్‌సంగ్ సంస్థ, ఎలివేటర్, ఎస్కలేటర్‌లను అమెరికాకు చెందిన ఓటి ఐ ఎస్ సంస్థలు కాంట్రాక్ట్ పనులు చేస్తున్నాయి. అంటే ఈ ప్రాజెక్టుకు సంబంధించిన అన్ని భాగాలను అంతర్జాతీయంగా పేరుగాంచిన మన దేశానికి చెందిన బహుళజాతి సంస్థ ఎల్ అండ్ టితో పాటు విదేశీ సంస్థలు నిర్వహిస్తున్నాయంటే మన భారతీయ కంపెనీలను ఎంతగా దెబ్బ తీస్తున్నాయో, మన ఆర్థిక వనరులను ఏవిధంగా కొల్లగొట్టుకు పోతున్నాయో వేరే చెప్పనవసరం లేదు.

అలానే అంతకంటే ముఖ్యమైనది ప్రైవేటీకరణకు పెద్ద పీట వేస్తున్న పాలకులు ఈ ప్రాజెక్టును ఎల్ అండ్ టి సంస్థకు ప్రభుత్వ ప్రైవేట్ భాగస్వామ్యం (పిపిపి) కింద అప్పచేప్పడం ద్వారా 30-35 సం॥ల పాటు ఈ ప్రాజెక్టు కింద వచ్చే ఆదాయాన్ని ఈ ప్రాజెక్టు క్రింద పెట్టిన పెట్టుబడి కంటే రెండింతలు మూడింతల ఆదాయాన్ని పొంది, ప్రజా ధనాన్ని లూటీ చేయడానికి పబ్లిక్‌గా పర్మిషన్ తీసుకున్నాయి. పిపిపి కింద నిర్మాణం చేసిన జాతీయ రహదారులపై టోల్‌గేట్ రుసుముల ద్వారా కోట్లకు పడగలెత్తుతున్న బహుళజాతి కంపెనీలు ఇందుకు

ఉదాహరణగా నిలుస్తాయి. ఇప్పుడు విజయవాడలో నిర్మించ తలపెట్టిన మెట్రో ప్రాజెక్టును పిపిపి విధానం కింద చెపడుతున్నట్లు చంద్రబాబు ప్రభుత్వం ప్రకటించింది. అంటే సొమ్ము ఒకరిది సోకు ఒకరిది అన్న విధానాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఆశ్రయించింది.

అయితే ఈ సంస్థలు నిధులు ఇవ్వాలంటే కేంద్రానికి చెందిన ప్రజా పెట్టుబడుల మండలి (పిఐబి) అందుకు అంగీకారం తెలపాలి. ఈ ప్రాజెక్టు నిర్మాణ వ్యయంతో పాటు వడ్డీరేట్లు ఎక్కువగా ఉండడం, ఈ ప్రాజెక్టుకు తగిన జనాభా లేనందున ప్రాజెక్టు వలన లాభదాయికతపై సందేహాలు ఉండడం వలన పిఐబి ఈ ప్రాజెక్టుకు అనుమతి ఇవ్వలేని స్థితి నెలకొంది. మెట్రోరైల్ ప్రాజెక్టుపై చేసే వ్యయంపై అంతర్గత రాబడులు కనీసం 8 శాతం ఉండాలి. ఇపుడున్న జనాభా అంచనా ప్రకారం అంతర్గత రాబడులు కేవలం 3 శాతమేనని తేలడంతో ఈ ప్రాజెక్టు ఏమాత్రం లాభదాయకం కాదని పిఐబి స్పష్టం చేసింది. ప్రణాళికా సంఘం స్థానంలో మోడీ ప్రభుత్వం తీసుకొచ్చిన నీతి ఆయోగ్ కూడా పిఐబి వైఖరిని సమర్థించింది. మెట్రో ప్రాజెక్టు ఏమాత్రం లాభదాయకం కాదని కేంద్రస్థాయి సంస్థలే ప్రకటించడంతో చంద్రబాబు ప్రభుత్వం మెట్రో ప్రాజెక్టు స్థానంలో ప్రత్యామ్నాయ ప్రాజెక్టుల కోసం వేట ప్రారంభించింది.

చంద్రబాబు ప్రభుత్వం విజయవాడ నగరంలో మెట్రో రైల్ ప్రాజెక్టు ప్రతిపాదనతో ముందుకొచ్చినప్పుడే కేంద్ర పట్టణాభివృద్ధి శాఖ 2014 అక్టోబర్ 7న ప్రజలకు మెరుగైన రవాణా సేవలు అందించేందుకు "ప్రత్యేక ప్రజా రవాణా పార్కింగ్ విధానం" ను రూపొందించాలని, మెట్రో రైల్ ప్రాజెక్టు ఖర్చుతో పోలిస్తే అందులో కేవలం 5శాతం నిధులతో వేగవంతమైన ప్రజా రవాణా (బస్సు) సౌకర్యం కల్పించవచ్చని, వ్యక్తిగత వాహన వినియోగాన్ని తగ్గిస్తూ నగరాల్లో ట్రాఫిక్ సమస్యను అరికట్టేందుకు ఈ విధానాన్ని అమలు చేయడానికి నగర అభివృద్ధి ప్రణాళికల్లో తగిన మార్పులు చేయాలని తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల పురపాలక శాఖలకు కేంద్ర పట్టణాభివృద్ధి శాఖలకు లేఖలు కూడా పంపింది. మన పురపాలక శాఖలు అసలు అటువంటి విధానం ఒకటి ఉందని కూడా ప్రజలకు తెలియనీయకుండా ఆ పథకాన్ని బుట్ట దాఖలా చేశాయి. నానాటికీ విపరీతంగా పెరిగిపోతున్న వ్యక్తిగత వాహనాల వినియోగాన్ని నియంత్రించడంలో భాగంగా ప్రజా రవాణా వ్యవస్థను అభివృద్ధి చేసే విధంగా ప్రభుత్వాల విధానాలు లేకపోవడం వలన అన్ని నగరాల్లో ట్రాఫిక్ సమస్య నానాటికీ పెరిగిపోవడంతో పాటు వాహనాల ప్రమాదాలు కూడా ఊహించని విధంగా పెరిగిపోతున్నాయి. అంతేకాక హైదరాబాద్ కంటే నగరాల్లో వ్యక్తిగత వాహనాలు ఉన్నవారు ట్రాఫిక్ సుడిగుండంలో చిక్కుకొని వేళకు ఆఫీసులకు వెళ్లలేక, తిరిగి ఇళ్లకు ఆలస్యంగా చేరుకోవడంతో మానసిక ఒత్తిళ్లకు గురై నానా అవస్థలు పడుతున్నారు.

ప్రస్తుతం 11 లక్షలుగా ఉన్న విజయవాడ నగర జనాభా 20 లక్షలు పెరగడానికి ఎటువంటి ఆకస్మిక పరిణామాలు రావు అన్నది నిజం. ఒకవేళ 5 సంవత్సరాలకి కొంత జనాభా పెరిగినా దాని కనుగుణమైన ప్రజా రవాణా వ్యవస్థను అభివృద్ధి చేసుకోవచ్చును. ప్రస్తుతం బస్సు రవాణా వ్యవస్థ గతం కంటే చాలా మెరుగ్గా ఉంది. విజయవాడ నగరానికి 30-35-60-70 కి.మీ దూరంలో ఉన్న గుంటూరు, తెనాలి, ఏలూరు, గుడివాడ, బందరు ప్రాంతాలకు 5-10-30 నిమిషాల వ్యవధిలో నాన్‌స్టాఫ్ బస్సులు నడుస్తున్నాయి. అయితే నాన్‌స్టాఫ్, ఎక్స్‌ప్రెస్ బస్సులు పెంచుతున్నారు కానీ పాసెంజరు బస్సులు తగిన విధంగా పెంచకపోవడంతో చుట్టు పక్కల గ్రామాల ప్రయాణికులు బాగా ఇబ్బందులు పడుతున్నారు.

ఆర్‌టిసి లాభాలు వచ్చే రూట్లు, ఎక్స్‌ప్రెస్ బస్సులపై కేంద్రీకరించ దానికి బదులు పాసెంజర్ బస్సులకు తగిన ప్రాధాన్యత ఇవ్వాలి. అలా ఇవ్వకపోవడం వల్లనే ఆర్.టి.సికి సమాంతరంగా ప్రైవేట్ వాహనాల వ్యవస్థ నానాటికీ పెరుగుతూ ఉంది. దీని వలన ప్రజలకు ప్రయాణాల్లో అభద్రతా భావం పెరుగుతూ ఉంది. నిత్యం జరుగుతున్న రోడ్డు ప్రమాదాల వలన, ట్రాఫిక్ జామ్‌ల వలన, బయటికి వెళ్లిన వ్యక్తి తిరిగి ఇంటికి చేరేవరకు కుటుంబ సభ్యులు అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని ఉండాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి.

విజయవాడ నగరానికి అమరావతిని రాజధానిని ప్రకటించిన తర్వాత ప్రధాన రహదారుల్లో ట్రాఫిక్ జామ్‌లు పెరిగిపోతున్నాయి. సరైన ప్రజా రవాణా వ్యవస్థ లేకపోవడం వల్లనే ప్రజలు నానా ఇబ్బందులు పడుతున్నారు. రైలు రవాణా వ్యవస్థను పరిశీలిస్తే విజయవాడ నగరం నుంచి ఎక్స్‌ప్రెస్, సూపర్ ఫాస్ట్ రైళ్లు పెరుగుతున్నాయి కానీ ప్యాసింజర్ రైళ్లు పెరగడం లేదు. విజయవాడ నుంచి బయలుదేరే ఏ పాసింజర్ రైలునైనా చూడండి ప్రయాణికులు కిక్కిరిసి ఉంటున్నారు. పాసింజర్ రైళ్ల వ్యవస్థను పెంచడం ద్వారా విజయవాడ నగర చుట్టు పక్కల గ్రామాల ప్రజల రవాణా అవసరాలను తీర్చగల్గుతారు. విజయవాడ- గుంటూరు - తెనాలి - గుడివాడ-ఏలూరుల మధ్య సర్క్యులర్, ప్యాసింజర్ రైళ్ల వ్యవస్థను ఏర్పాటు చేయడం ద్వారా విజయవాడ నగర చుట్టు ప్రక్కల ప్రాంతాల్లో అధిక శాతంలో ఉన్న పేద, మధ్య తరగతి వర్గాలకు రవాణా వ్యవస్థను అందుబాటులోకి తీసుకెళ్ల గల్గుతాం. అలానే ఈ సర్క్యులర్ రైళ్ల నిర్మాణానికి అదనంగా భూమిని సేకరించాల్సిన అవసరం కూడా లేదు. లోకల్ రైళ్ల, ప్రజా రవాణ వ్యవస్థ ఎంతగా అభివృద్ధి అయితే అంతగా వ్యక్తిగత వాహనాల వాడకాన్ని తగ్గించగలుగుతాము. ఇందుకు చెన్నె, ముంబయి, కోలకత్తా, హైదరాబాద్, ఢిల్లీలలో లోకల్ రైల్ వ్యవస్థ వలన వస్తున్న ఫలితాలు మంచి ఉదాహరణలుగా పేర్కొనవచ్చు. అయితే ఇప్పటికి చెన్నె, ముంబాయి, కోల్‌కత్త లాంటి చోట్ల లోకల్ రైళ్ల వ్యవస్థ తగినంతగా అభివృద్ధి కాకపోవడంతో ప్రయాణికులు ఈనాటికి ఇబ్బందులు పడుతూనే ఉన్నారు. కావున పాలకులు ప్రజా రవాణా వ్యవస్థను అభివృద్ధి చేయడానికి ఆచరణాత్మక పథకాలను రూపొందించి అమలు చేయడానికి ప్రాధాన్యత ఇచ్చే పరిస్థితి రావాలి.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెట్టింపు ఉత్సాహంతో అమలు జరుపుతున్న ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాల్లో భాగంగానే మెట్రో రైల్ ప్రాజెక్టుల పేరుతో ఒకవైపు ప్రజలపై మరిన్ని భారాలు పెంచుతూ మరోవైపు విదేశీ సంస్థలకు మరిన్ని లాభాలు పెంచుతున్నాయి. మెట్రోరైల్‌కు ప్రత్యామ్నాయం అంటూ ప్రకటిస్తున్న మోనోరైల్, ఎలివేటెడ్ కారిడార్, ఎల్.ఆర్.టిలు కూడా బహుళా జాతి విదేశీ సంస్థల లాభాలకు వనరులు మాత్రమే కావున నానాటికీ పెరిగిపోతున్న ట్రాఫిక్ రద్దీని తగ్గించాలంటే వ్యక్తిగత వాహనాల వాడకాన్ని తగ్గించే విధంగా, ప్రయాణీకులపై చార్జీల భారాలు పడకుండా సరైన రైలు, రోడ్డు ప్రజా రవాణా వ్యవస్థను రూపొందించే విధంగా ప్రభుత్వాలపై ప్రజలు తీవ్రమైన వత్తిడి తీసుకురావాలి. ఇందుకు ప్రజాస్వామిక శక్తులు పూర్తి సంఘీభావాన్ని సమీకరించే కర్తవ్యాన్ని చేపట్టడం అవసరం.

*(రచయిత సి.పి.ఐ (యం.యల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# ట్రంప్, నెతన్యాహుల సరసన మోడీ

***మోడీ అమెరికా, ఇజ్రాయిల్ పర్యటన భారతదేశ సార్వభౌమత్వాన్ని తాకట్టుపెట్టి సామంత రాజ్యంగా మార్చే ప్రయత్నమేనని అంటున్నారు* ఎ. నర్సింహా రెడ్డి**

ప్రధానమంత్రి నరేంద్ర మోడీ తాజా అమెరికా (జూన్ 25-27), ఇజ్రాయిల్ (జూలై 4-6) పర్యటనలో ట్రంప్- మోడీ, నెతన్యాహు-మోడీల గాఢ ఆలింగనం ప్రముఖంగా పత్రికల పతాక శీర్షికలకెక్కడం, బిజెపి శ్రేణులు, దేశీయ, విదేశీ మీడియా భారత్‌కు ఎంతో మేలు జరిగినట్లు కీర్తించడం ఆత్మవంచనగా ఉంది. నిజానికి ఈ పర్యటనల ద్వారా భారత విదేశాంగ విధానం తిరోగమనం పట్టించడం మోడీ దాదాపు పూర్తి చేశారు. మోడీ అమెరికా, ఇజ్రాయిల్ పర్యటన పట్ల ప్రచారార్భాటం మినహా దేశ ప్రజలకు ఒనగూడింది శూన్యం. ట్రంప్, నెతన్యాహు, మోడీలకు మధ్య చాలా పోలికలున్నాయి. ముగ్గురూ జనాకర్షణ హామీలు, జాతీయవాదం, ఇస్లామిక్ వ్యతిరేకతను రెచ్చగొట్టే ప్రచారంతో అధికారంలోకి వచ్చారు. ఈ ముగ్గురు ముస్లింలపట్ల విద్వేషం కలవారే. అందువల్ల రాజకీయ, ఆర్థిక, దౌత్య వ్యవహారాలకు మించి ట్రంప్, నెతన్యాహు, మోడీ కలయికలో చూడవల్సిన అంశాలు చాలానే ఉన్నాయి.

ఈ ముగ్గురికి సోషల్ మీడియా అంటే మక్కువ. ట్విట్టర్, ఫేస్‌బుక్‌లో క్రియాశీలకంగా ఉంటారు. ఈ ముగ్గురికి రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటి ఫాసిస్టు హిట్లర్, ముస్సోలీని, టోజోల స్వభావం, లక్షణాలు ఉన్నాయి. అలాగే చైనా, ఉత్తర కొరియా, పాకిస్తాన్‌ల విషయంలో ఒకే వైఖరి తీసుకోవాలనే రాజకీయ వ్యూహం కనిపిస్తోంది. ఈ ముగ్గురు తమ దేశాల్లో కొన్ని వర్గాలను లక్ష్యంగా చేసుకుని విద్వేష రాజకీయాలను రెచ్చగొడుతున్నారు. హింసను ప్రేరేపిస్తున్నారు. ప్రజల ఐక్యతను విచ్ఛిన్నం చేసే కుట్రలు పన్నుతున్నారు. అంతర్జాతీయ న్యాయ సూత్రాలను ఉల్లంఘిస్తున్నారు. ప్రజాస్వామిక విలువలకు పాతరేస్తున్నారు. ప్రపంచంపై పెత్తనం సంపాదించడం, బహుళ ధృవ ప్రపంచం కొరకు జరిగే ప్రయత్నాలను భగ్నం చేయడమనే సామ్రాజ్యవాద ఆకాంక్షల్లో మన దేశాన్ని భాగాస్వామిని చేసేందుకు మోడీ సిద్ధంగా ఉన్నారనడానికి ఆ రెండు దేశాల పర్యటనలో చేసిన ప్రసంగాలే నిదర్శనం.

**అమెరికాలో ట్రంప్‌తో మోడీ**

మోడీ ప్రధాన ఎజెండాలో దేశంలో పేదరికం, ఆదాయ అసమానతలను తగ్గించాలనే విధానం లేనే లేదు. అదే సమయంలో ట్రంప్ కూడా సంపన్నులకు ఇంకా లాభాలు చేకూర్చేలా సహాయ పడుతున్నారు. ట్రంప్ ''అమెరికా ఫస్ట్''ను బలపరుస్తూ తన ప్రపంచాధిపత్యాన్ని నిలబెట్టుకోవాలనుకుంటున్నాడు. అలాగే ఉద్యోగాలు విదేశాలకు తరలిపోవడం ఆపాలనుకుంటున్నాడు. మోడీ ట్రంప్‌ను బిగికౌగిలిలో బంధించి తన భావ సారూప్యతను, ప్రయోజనాల ఐక్యతను ప్రకటిస్తే, ట్రంప్ మోడీని "నిజమైన స్నేహితుడు" అని అభివర్ణించాడు. మోడీని సంతృప్తి పరచడానికి పాకిస్తాన్, చైనాలపై ట్రంప్ విమర్శలు చేసినంత మాత్రాన భారతదేశం అమెరికాకి "నిజమైన నేస్తం"గా భావించకూడదు. అమెరికా ఎవరికైనా నమ్మదగిన మిత్రురాలు అవుతుందా, విధేయ సామంతులుగా తప్ప ఎవరైనా దానితో కలిసి నడవగలరా అన్నది చరిత్రను గమనిస్తే తెలుస్తుంది. నిజానికి 1990 వరకు అమెరికా భారత్‌కి ఎప్పుడూ కూడా నేస్తంగా లేదు. అత్యంత అవసరమైన సమయాలలో సహాయం చేయలేదు కూడా. భారత్-పాక్ యుద్ధ సమయంలో అమెరికా పాకిస్తాన్‌నే బలపర్చింది. చైనాతో భారత్ పోటీ పడడానికి ట్రంప్ సహకారాన్ని కోరుకుంటున్న సమయంలో అమెరికా కూడా చైనా సామర్థ్యాన్ని నిలువరించే పేరిట భారత్‌కి గాలం వేస్తున్నది. చైనా ఒక బలమైన దేశంగా, ముఖ్యంగా ఆర్థికంగా ఆవిర్భవించడం అమెరికన్ ఆధిపత్యానికి, సామ్రాజ్యవాద ఎత్తుగడలకు ఒక సవాలుగా మారింది.

ట్రంప్, మోడీల భేటీ, చర్చల గురించి మదింపు చేయడానికి వారిద్దరు కలిసి నిర్వహించిన విలేకరుల సమావేశం, జారీ చేసిన ఉమ్మడి ప్రకటనే ఆధారం. పాత్రికేయులకు ప్రశ్నలు వేసే అవకాశాన్ని నిరాకరించడంతో విలేకరుల సమావేశం ఏకపక్షంగా పరస్పర పొగడ్తలకే పరిమితమై సాగింది. అధికారుల సుదీర్ఘ కసరత్తు తరువాత ఉమ్మడి ప్రకటన విడుదల చేశారు. అమెరికా అధికారులు ముందే కోరినట్లుగా భారత్ ఐటి కంపెనీలను దెబ్బతీస్తూ హెచ్ 1బి వీసాలపై ట్రంప్ విధించిన నిషేధాన్ని గురించి మోడీ లేవనెత్తకూడదన్న విషయంలో అమెరికా కఠిన వైఖరిని అవలంబించింది. అందువల్ల భారతీయ యువత ఆశించినట్లు హెచ్1-బి వీసాల విషయంలో అమెరికా నుంచి మాట మాత్రంగా నైనా హామీ రాలేదు. ఇది భారతీయ ఐటి కంపెనీలపై తీవ్ర ప్రతికూల ప్రభావాన్ని చూపనుంది.

అదేవిధంగా వాతావరణంపై పారిస్ ఒప్పందం నుండి అమెరికా వైదొలగడం గూర్చి ట్రంప్ వద్ద ప్రస్తావించలేదు. ఈ ఉపసంహరణ వల్ల ఎంత వినాశనం జరగబోతుందన్న విషయాన్నైనా కనీసం పేర్కొంటే సమంజసంగా ఉండేది. అంతర్జాతీయ ఒప్పందం కొరకు అభివృద్ధి చెందిన దేశాల నుండి భారత్, తదితర దేశాలు డబ్బు దండుకొంటున్నాయని పారిస్‌లో ట్రంప్ నిందించారు. ఈ అవమానాన్ని కూడా మోడీ నిశ్శబ్దంగా దిగమింగడం చూస్తే మోడీ ప్రభుత్వం అమెరికా అడుగులకు మడుగులొత్తుతూ, భారత్ ఆత్మగౌరవాన్ని సైతం అమెరికాకు తాకట్టు పెట్టడానికి వెనుకాడడం లేదన్న విషయం స్పష్టమవుతోంది. ఇది అత్యంత సిగ్గుచేటైన విషయం. అందుకు బదులు, "ఆసియాలో చైనా ప్రమాదానికి" వ్యతిరేకంగా అమెరికా, జపాన్‌లతో కలిసి పనిచేయడానికి తాము సిద్ధంగా ఉన్నట్లు మోడీ తమ ప్రసంగాల్లో గొప్పగా చెప్పారు.

అమెరికా పర్యటనకు ముందే అమెరికన్ అధికారులు మోడీని కట్టడి చేశారు. అమెరికా నుండి ఆయుధాలు, ఇతర రక్షణ పరికరాలు కొనడానికి భారత్ పెద్ద మొత్తం వెచ్చిస్తే అధ్యక్షుడు ట్రంప్ సంతోషిస్తారు. చర్చల్లో ఇబ్బందికరమైన ప్రశ్నలేవీ లేవనెత్తకూడదు. ఆ రెండింటినీ మోడీ అంగీకరించారు. 19 బిలియన్ డాలర్ల రక్షణ ఒప్పందంపై భారత్ సంతకం

చేసింది. రక్షణ ఉత్పత్తులను మోడీ ప్రభుత్వం ప్రైవేటీకరించినందున, టాటా అడ్వాన్స్‌డ్ సిస్టమ్స్‌తో కలిసి భారత్‌లో ఎఫ్-16 యుద్ధ విమానాలు ఉత్పత్తి చేయనున్నట్లు లాక్‌హీడ్ మార్టిన్ మోడీ అమెరికా పర్యటనలో ఉండగానే ప్రకటించింది. అయితే, ఒప్పందం ప్రకారం ఎఫ్-16 విమానాలకు అవసరమైన విడిభాగాలను అమెరికా కంపెనీ అందిస్తుంది. వాటిని ఇక్కడ అమర్చుకోవడం మాత్రమే టాటా కంపెనీ చేయాల్సింది. అంటే ఎఫ్-16కు అవసరమైన సాంకేతికత మనకు లభించే అవకాశం లేదు. అదీగాక ఈ విమానాల విడిభాగాలు కూడా పూర్తిగా అమెరికాలో తయారయ్యేవి కాదు. 60 శాతంకు పైగా విడిభాగాలు నాటో దేశాలు, ఇంకా అమెరికాకు చెందిన మిత్ర దేశాల్లో తయారవుతాయి.

అమెరికా కంపెనీ వెస్టింగ్‌హౌస్ భారత్‌లో ఆరు అణు విద్యుత్ కేంద్రాలు తొలగించిన పునరుద్ధాటించబడింది. అమెరికా గత దశాబ్ద కాలంలో నెలకొల్పి నిరాకరించిన అణు రియాక్టర్లను భారత్‌కు ఇవ్వజూపిందని ఆ ఒప్పందం నాడే విమర్శలు వచ్చాయి. దురదృష్టకరమేమంటే, ఎంత ధర నిర్ణయించినా చెల్లించడానికి మేము సిద్ధంగా ఉన్నామని, వాటిని అమెరికా భారత్‌తో నెలకొల్పవచ్చునని మోడీ అంగీకరించారు. 2016లో ఒబామా భారత్ పర్యటన సందర్భంలో ఆ ఒప్పందం జరిగింది. ఆ కాలం చెల్లిన యంత్రాలను మన దేశంలో నెలకొల్పడానికి మోడీ అంగీకరించడం విడ్డూరంగా ఉంది. అంతేగాక, వెస్టింగ్‌హౌస్‌లో మేజర్ వాటాదారైన జపాన్‌కు చెందిన తోషిబా ఆ భాగస్వామ్యం నుండి తప్పుకుంది. బ్రిటన్, ఇండియాల్లో అణువిద్యుత్ కేంద్రాల నిర్మాణం నుంచి వైదొలిగింది. ఆ విద్యుత్ కేంద్రాలు ఆంధ్రప్రదేశ్‌లో నెలకొల్పాలని నిర్ణయించారు. ఆ ఒప్పందాన్ని పునః సమీక్షించాల్సిన పరిస్థితిలో మోడీ పునరుద్ధాటించడం అమెరికాను సంతృప్తిపరచడానికే!

ట్రంప్ మోడీతో ఆలింగనం, ప్రశంసలు ప్రేమతోనో, భారత ప్రయోజనాలు ఆశించో చేశారనుకోవడం పెద్ద పొరపాటు. తమ వాణిజ్య లోటు పూడ్చుకోవడానికి భారత్ ఓ పావుగా మారబోతుందనే ఆనందంతోనే ట్రంప్ అలా వ్యవహరించారనడంలో సందేహం లేదు. ఈ పర్యటనలో వీరిద్దరి మధ్య తీవ్రవాదం, రక్షణ సహకారం, వాణిజ్య సంబంధాల వృద్ధి వంటి అంశాలపై మాత్రమే చర్చలు జరిగాయి. భారత్ దృష్ట్యా అత్యంత ముఖ్యమైన మూడు అంశాలు అసలు అజెండాలోనే లేకుండా చేయడం ద్వారా ట్రంప్ ముందుగానే వ్యూహాత్మకంగా వ్యవహరించారు. దాన్ని ఏ మాత్రం పట్టించుకోకుండా అమెరికా పర్యటించడమే ఓ గొప్ప అన్నట్లు మోడీ అత్యుత్సాహాన్నీ ప్రదర్శించారు. ట్రంప్ స్వతహాగా వ్యాపారి. అంతర్జాతీయ రాజకీయ సూత్రాలు, విలువలు, ప్రమాణాలు ఆయనకు పట్టవు. ప్రజాస్వామిక ఆకాంక్షలు, దౌత్య సంబంధాలను మెరుగుపర్చుకోవడానికి ఇచ్చిపుచ్చుకునే విధానాలు ఆయనకు అంతగా రుచించవు.

ట్రంప్ ఆలోచనంతా వ్యాపార ప్రయోజనాలు, లాభనష్టాలే. అమెరికా కంపెనీలకు భారత్ తన మార్కెట్‌ను మరింత తెరచి ఉంచేలా చేయడమే ఆయన లక్ష్యంగా ఉంది. మోడీ సర్కారు జిఎస్‌టి సహా పలు సంస్కరణలతో ఆర్థిక వ్యవస్థను తీర్చిదిద్దుతున్నదని ప్రత్యేకంగా పేర్కొనడం, భారత్‌ను అత్యంత వేగంగా వృద్ధి చెందుతున్న ఆర్థిక వ్యవస్థగా ప్రశంసించడం, ఉభయదేశాలు కలిసికట్టుగా ఎదుగుదామని పిలుపునివ్వడం వెనుక ఆయన ఉద్దేశమంతా అమెరికన్ కంపెనీలను, పెట్టుబడులను ప్రోత్సహించడానికేనన్నది స్పష్టం. భారత్‌తో తనది వ్యాపారమైత్రి మాత్రమేనని ఆయన చెప్పకనే చెప్పారు. భారత్ ఇటీవలి కాలంలో అమెరికా మిత్ర దేశంగా మారింది. కానీ ట్రంప్ మిత్రత్వాన్ని గౌరవించడం కన్నా, వ్యాపార కోణంలోనే ఆలోచిస్తాడు. అందువల్ల భారత్‌తో వాణిజ్య లోటును పూడ్చాలని భావిస్తున్నారు. ఔషధాలు, ఇతర రంగాల్లో తమ దిగుమతులకు ఆటంకాలు ఉండకూడదనే సంకేతాన్ని ఇప్పటికే ఆయన ఇచ్చారు. మేధోహక్కుల పేరిట వాణిజ్యాన్ని పెంచుకోవాలన్నదే ఆయన అభిమతం.

ఇప్పటికే అమెరికా నుంచి సహజవాయువు కొనుగోలు చేయాలని భారత్ నిర్ణయించింది. దీనివల్ల ఖతార్, ఇరాన్ ధరల కన్నా ఎక్కువ పెట్టాల్సి వస్తుంది. అలాగే మూడు బిలియన్ డాలర్లకు 22 గార్డియన్ డ్రోన్స్‌ను కొనుగోలు చేయడంతో భారత్ ఇప్పుడు అమెరికా 'మేజర్ డిఫెన్స్ పార్ట్‌నర్' జాబితాలో చేరిపోయినట్టే. స్పేస్ జెట్ విమానయాన సంస్థ కొత్తగా 100 విమానాలను బోయింగ్ సంస్థ నుండి కొంటున్నందుకు ట్రంప్ సంబర పడ్డాడు. అమెరికాలో ఈ అమ్మకం వందల మందికి ఉపాధి కల్పించనుంది. గత పదేళ్లలో భారతదేశం అమెరికా నుంచి 15 బిలియన్ డాలర్ల విలువైన ఆయుధ సామాగ్రిని కొనుగోలు చేసింది. అమ్మకాలతో పాటు సాంకేతికతనూ ఇవ్వమంటూ అడుగుతూనే ఉన్నది. ఇప్పటివరకూ అది జరగలేదు. అమెరికా ఇప్పటివరకు నాటోయేతర దేశాలకు డ్రోన్‌లను విక్రయించలేదు. మోడీ సర్కారు ఆ దిశగానే ముందుకు సాగుతున్నది.. అమెరికా ముందు సాగిలపడుతున్నది.

భౌగోళిక రాజకీయాలలో అమెరికా గతంలో మాదిరిగా భారత్‌కు అమిత ప్రాధాన్యం ఇస్తున్నదా అనేది అనుమానమే. ట్రంప్ దృష్టిలో భారత్ పెద్ద మార్కెట్ తప్ప అంతర్జాతీయంగా రాజకీయ ప్రాముఖ్యత గల దేశం కాదు. ఇరు దేశాల మధ్య ప్రస్తుతమున్న వ్యూహాత్మక సంబంధాలను పెంపొందిస్తామనే రీతిలో అధ్యక్షుడు ట్రంప్ నుంచి ఒక్క ప్రకటన రాలేదు. చైనా-పాకిస్తాన్ ఎకనమిక్ కారిడార్ విషయమైన భారత్ వైఖరిని ట్రంప్ సమర్థించాడు. అయితే చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను ఉపయోగించుకోవాలనే వ్యూహం ప్రాధాన్యం సంతరించు కుంది. ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, విషయంలో ట్రంప్ వైఖరి నమ్మదగినదిగా లేదు. తీవ్రవాదంపై పోరాటం గూర్చి అమెరికా ఎన్ని మాటలు చెప్పినా, తీవ్రవాదంపై ఒక్కటిగా అంతర్జాతీయ పోరాటం అనే ప్రధాని మోడీ విజ్ఞప్తులను అది బలపరచలేదు. ఎందుకంటే అది ఒక కంటితో తీవ్రవాదాన్ని బలపరుస్తుంది. మరో కంటితో ఖండిస్తుంది. పాకిస్తాన్‌కు ఇప్పటికీ ఆయుధాలు విక్రయిస్తూనే ఉంది. చైనా తలపెట్టిన 'ఒన్ బెల్ట్ ఒన్ రోడ్డు' పథకంలో అమెరికా వాణిజ్య ప్రయోజనాల్ని కాంక్షిస్తోంది. రెండు దేశాల విలువలు, ప్రయోజనాలు ఒకటేనని చెప్పుకున్నా ఎవరి ప్రయోజనాలు వారికి ముఖ్యం అన్న రీతిలో, అందులోనూ అమెరికా ప్రయోజనాలకే ఎక్కువ ప్రయోజనం కలిగేలా మోడీ అమెరికా పర్యటన జరిగింది.

ఉమ్మడి ప్రకటనలో పాకిస్తాన్ భూభాగం నుండి ఉగ్రవాద కార్యక్రమాలను ప్రోత్సహించడం మానుకోవాలని పేర్కొంది. ట్రంప్‌తో భేటీకి ముందు హిజ్‌బుల్ ముజాహిద్దీన్ నేత సయ్యద్ సలాముద్దీన్‌ను అంతర్జాతీయ తీవ్రవాదిగా అమెరికా గుర్తించింది. వాస్తవానికి 71 సంవత్సరాల సలాముద్దీన్ ప్రస్తుతం తీవ్రవాద కార్యకలాపాల్లో క్రియాశీలంగా లేరని వార్తలు వస్తున్నాయి. అంతేగాకుండా ఆయన పాకిస్తాన్ సైనిక రక్షణలో ఉన్నట్లు కూడా వార్తలు వచ్చాయి. ఈ అంశాలను ప్రకటనలో చేర్చడమే తమ ఘన విజయంగా పాలక పక్షం చెప్పుకుంటోంది. అదే సమయంలో ప్రపంచ వ్యాప్తంగా తీవ్రవాదానికి అమెరికా చేస్తున్న సాయంపై నామమాత్రంగానైనా ఆందోళన వ్యక్తం చేయాలన్న తపన ప్రధానిలో కనపడలేదు. ఇరుగు పొరుగు దేశాలను

అమెరికా వేదికగా వేలెత్తి చూపడం ద్వారా ఆ దేశాలతో స్నేహ సంబంధాలపై పడే ప్రభావాన్ని మోడీ అంచనా వేసినట్లు కనిపించడం లేదు.

వీరి చర్చల్లో ఆఫ్గానిస్తాన్, ఉత్తర కొరియా, దక్షిణ చైనా సముద్రం, చైనా ఒకరోడ్డు–ఒకబెల్టు కార్యక్రమం ప్రస్తావనకు వచ్చినట్టు సంయుక్త ప్రకటన తెలిపింది. రోడ్డు–బెల్టుకు సంబంధించి అది పాక్ ఆక్రమిత కశ్మీర్ గుండా వెళ్లడంపై భారత్ ఆందోళనను అమెరికా పరిగణనలోకి తీసుకోలేదు. అయితే భౌగోళిక సార్వభౌమత్వాలను అతిక్రమించరాదని పేర్కొంది. ఆఫ్గానిస్తాన్‌తో కలిసి పనిచేయాలని నిర్ణయించారు. మొత్తం మీద 'మా ఇంటికొస్తే ఏం తెస్తావు, మీ ఇంటికొస్తే ఏం ఇస్తావు?' అన్నట్లు అమెరికా ధోరణి ఉంది. తమ ప్రయోజనాలే ముఖ్యమంటూ ట్రంప్ తెగేసి చెప్పినట్లయింది. ఈ పర్యటన ద్వారా మోడీ సాధించినదేమీ లేదని సుస్పష్టమవుతోంది. ఆందోళన కలిగించే అంశమేమిటంటే ఉగ్రవాదాన్ని ఒక మతానికి ముడిపెడుతూ అమెరికా వ్యవహరిస్తున్న ధోరణికి ప్రధాని తానా తందానా అనడం! ఇది ఇప్పటి వరకు కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న వైఖరికి భిన్నం. మొత్తం మీద మోడీ పర్యటన అమెరికా కోసం.. అమెరికా వలన.. అన్నట్లుగా సాగింది.

**ఇజ్రాయిల్‌లో నెతన్యాహు–మోడీ**

ఇన్నేళ్లుగా జాతీయ ఏకాభిప్రాయంగల అలీన మౌలిక భావనను, దౌత్య సంబంధాల విషయంలో సమతౌల్యాన్ని పాటించే విదేశాంగ విధానాన్ని తలకిందులు చేయడానికి మోడీ ప్రభుత్వం నడుం బిగించడం ఇజ్రాయిల్ పర్యటనతో బహిర్గతమవుతోంది. నిజానికి ప్రపంచ యవనికపై 1948 వరకూ ఇజ్రాయిల్ అన్న దేశమే లేదు. బ్రిటిష్, ఫ్రెంచ్ వలస పాలకులు అమెరికాతో కలిసి కుట్ర చేసి పాలస్తీనాలో ఇజ్రాయిల్‌ను సృష్టించారు. ఐక్యరాజ్య సమితి కూడా ఈ కుట్రలో భాగస్వామి. అప్పటికి బ్రిటిష్ వలస పాలనలో 'మ్యాండేట్'గా ఉన్న పాలస్తీనాను రెండు భాగాలుగా విడగొట్టి స్వతంత్ర ఇజ్రాయిల్, స్వతంత్ర పాలస్తీనాలను ఏర్పాటు చేయాలని సిఫారసు చేస్తూ ఐరాస 1947 నవంబరు 30న ఒక తీర్మానం చేసింది. అయితే ఆచరణలో బ్రిటిష్, ఫ్రెంచ్, అమెరికన్ సామ్రాజ్యవాదుల మద్దతుతో ఇజ్రాయిల్ పాలస్తీనా భూభాగం దురాక్రమించి తన అదుపులో పెట్టుకుంది. ఐరోపా దేశాలలో స్థిరపడిన యూదులను అక్కడికి రప్పించారు. స్థానికంగా చరిత్ర పూర్వం నుండి అక్కడ నివసిస్తున్న పాలస్తీనా అరబ్బులను వారి ఇండ్ల నుండి, పొలాల నుండి, వ్యాపారాల నుండి బలవంతంగా వెళ్లగొట్టారు.

మతపరమైన అస్తిత్వం ప్రాతిపదికగా యూదులను తరలించడం ద్వారా ఒక రాజ్యాన్ని ఏర్పాటు చేయాలన్న ఆలోచన వచ్చినప్పుడే భారత్ దాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది. ఆనాటి నుండి, భారత ప్రజలు ఇజ్రాయిల్ ఏర్పాటును వ్యతిరేకించారు. ఇజ్రాయిల్‌ను వ్యతిరేకిస్తూ మాతృ భూమి నుంచి గెంటివేయబడిన పాలస్తీనీయుల స్వరాజ్య స్థాపన డిమాండ్‌ను బలపరుస్తున్నారు. ఐరాస నిబంధనలకు వ్యతిరేకంగా ఇజ్రాయిల్ దురాక్రమణలకు పాల్పడుతోంది. పాలస్తీనాలో శాశ్వత నిర్మాణాలను చేపడుతున్నది. 1967 జూన్ నుంచి పాలస్తీనాపై ఇజ్రాయిల్ నిరంతరం యుద్ధం చేస్తూనే ఉంది. ఇప్పటికీ పాలస్తీనా సమస్య పరిష్కారం కాలేదు. మధ్య ప్రాచ్యంలో శాంతి నెలకొనలేదు. 70వ దశకంలో పాలస్తీనా ప్రతినిధి బృందం మన దేశంలో పర్యటించిన సందర్భంగా దేశంలోని అన్ని రాజకీయ పార్టీలు హృదయపూర్వక స్వాగతం పలుకగా, ఒక్క జనసంఘ్ (ఇప్పటి బిజెపి) మాత్రమే నిరసనలు తెలియజేసి ఇజ్రాయిల్ పక్షాన నిలబడింది. ఇవాళ హమాస్ పాలనలోని గాజా తప్ప పాలస్తీనా భూభాగం అంతా ఇజ్రాయిల్ దురాక్రమణలో యూదు వలస పాలన కింద మగ్గుతోంది.

1948లో ఇజ్రాయిల్ సృష్టించబడినప్పటి నుండి తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ నుంచి మన్మోహన్ సింగ్ వరకూ ఇజ్రాయిల్ విషయంలో జాగ్రత్త వహిస్తూ ఆ దేశంలో పర్యటించలేదనే విషయాన్ని గమనంలోకి తీసుకోవాలి. దీని వెనుక చారిత్రాత్మక పాలస్తీనా కన్నీటి గాథ, ఇజ్రాయిల్ దురాక్రమణ దాగి ఉంది. పాలస్తీనా ప్రజానీకంతో మన దేశం ఎప్పుడూ సంఘీభావం ప్రకటిస్తూ వచ్చింది. పాలస్తీనా లిబరేషన్ ఆర్గనైజేషన్ (పియల్ఓ)కు మద్దతు ఇవ్వడం, మన జాతీయ నాయకులందరూ వారివారి ఉపన్యాసాల్లో, చేతల్లో, రాతల్లో, పాలస్తీనా విముక్తి పోరాటానికి చేయూతనిస్తూ ఉండడమే గాక, ఐక్యరాజ్య సమితి, పలు అంతర్జాతీయ సమావేశాల్లో అండదండలు ప్రదర్శిస్తూ పాలస్తీనాకు బాసటగా ఉంటూ ఇజ్రాయిల్ దురాక్రమణలను ఖండిస్తూ వచ్చారు.

అమెరికా, ఇజ్రాయిల్ దేశాలు పాలస్తీనా విముక్తి ఉద్యమ పోరాట నాయకుడు యాసర్ ఆరాఫత్‌ను తీవ్రవాద నాయకునిగా ముద్రవేసి ప్రపంచాన్ని నమ్మించేందుకు ప్రయత్నించాయి. అయితే పాలస్తీనాకు గుర్తింపునిచ్చి ఢిల్లీలో దౌత్య కార్యాలయాన్ని ప్రారంభించుకునే అవకాశం ఇచ్చిన ఘనత మన దేశానికి దక్కింది. చరిత్రకు భిన్నంగా ఇప్పుడు ఇజ్రాయిల్‌లో కాలుమోపిన తొలి భారతీయ ప్రధానమంత్రి మోడీ అన్నది వాస్తవం. ఇజ్రాయిల్ పర్యటన సందర్భంగానే రమల్లా పర్యటనకు, పాలస్తీనా నాయకులతో సమావేశం కావడానికి భారత ప్రధాని తిరస్కరించడం ద్వారా ఇప్పటి దాక భారత్ అనుసరిస్తున్న వైఖరికి ముగింపు పలికినట్లయింది. ఇది నిస్సందేహంగా క్షమార్హంకాని ఘోర తప్పిదమే. తొలుత ఇజ్రాయిల్ పర్యటనలో భాగంగా పాలస్తీనాలో కూడా పర్యటించాలన్న భారత్ వ్యూహాన్ని అమెరికా, ఇజ్రాయిల్ ఒత్తిళ్లకు లొంగి రద్దు చేసుకొన్నారు.

ఈ పర్యటన రికార్డు పర్యటనల కోసమా? తొలి ప్రధానిగా ఇజ్రాయిల్ పర్యటించిన నాయకునిగా చరిత్ర సృష్టించడానికా? దేశ మిలిటరీ రంగంలోకి ఇజ్రాయిల్ ఆయుధాల ఒప్పందం కోసమా? లేక పాలస్తీనా సమస్య పరిష్కారానికై ఇజ్రాయిల్‌పై ఒత్తిడి పెంచి శాంతి సాధించడం కోసమా? లాంటి అనేక ప్రశ్నలు, సందేహాలు భారతీయుల మదిలో రగులుతున్నాయి. అసలు ఈ పర్యటన సమంజసమేనా? అని ప్రశ్నించుకోవాల్సిన సందర్భం మన ముందుకు వచ్చింది. 1992లో పి.వి. నరసింహారావు దౌత్యపరంగా ఇజ్రాయిల్‌ను గుర్తించినప్పుడు ఇజ్రాయిల్, పాలస్తీనా రెండు దేశాల ఏర్పాటు కొరకు భారత ప్రజలు డిమాండ్ చేశారు. తూర్పు జెరూసలెం రాజధానిగా ప్రత్యేక పాలస్తీనా దేశం ఏర్పాటుకు మద్దతును మనం కొనసాగించాం. 1967 నుండి ఇజ్రాయిల్ ఆక్రమించుకున్న భూభాగాలను ఖాళీ చేసి, దాన్ని పాలస్తీనాకు అప్పగించాలన్నది మన భావన.

82 లక్షల జనాభా కలిగిన ఇజ్రాయిల్ సుమారు 30 వేల కోట్ల డాలర్ల జిడిపి కలిగి ఉంది (మన దేశంలో సుమారు 7వ వంతు, జనాభాలో 160వ వంతు). వ్యవసాయ, పారిశ్రామిక, మిలిటరీ రంగంలో ఆధునాతన సాంకేతికతతో ముందంజలో ఉంది. మన దేశం మిలిటరీకి చేస్తున్న వ్యయంలో మూడో వంతు ఇజ్రాయిల్ చేస్తోంది. 18 వందల కోట్ల డాలర్లతో 15వ స్థానాన్ని ఆక్రమించింది. భారతదేశానికి ఇజ్రాయిల్‌కు మధ్య వాణిజ్యం 1992 నుంచి 2016కు 20 రెట్లు పెరిగింది. ప్రారంభంలో 20 కోట్ల డాలర్లు ఉన్న వాణిజ్యం 2016 నుంచి 420 కోట్ల డాలర్లకు పెరిగింది. నిజానికి విదేశాంగ విధానాలకు వస్తు క్రయవిక్రయాలు, వర్తక వాణిజ్యాలే ప్రధానం కాకూడదు. మానవ

సంబంధాలు, మానవ నాగరికత పరిరక్షణ ఎంతైనా అవసరం. వస్తు వాణిజ్య సముదాయాల మధ్య జాత్యహంకారం, మత అహంకారాలు పెరగకూడదు. అభివృద్ధి అనేది శాంతియుత సహజీవనానికి పరితపించాలి. ప్రజాస్వామ్యాన్ని కాపాడాలి. యుద్ధాలకు, దురాక్రమణలకు దూరంగా ఉండాలి. నిరంకుశ ఫాసిస్టు తరహా అభివృద్ధి మానవ జాతికే వినాశకరం.

90వ దశకంలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలు ప్రారంభమైనప్పటి నుండి ఇజ్రాయిల్‌తో దౌత్య సంబంధాలు ప్రారంభమయ్యాయి. పి.వి. నరసింహారావు నాయకత్వంలోని కాంగ్రెస్ ప్రభుత్వం 1992లో ఇజ్రాయిల్‌తో దౌత్య సంబంధాలను ఏర్పాటు చేసుకున్నది. ఆ తర్వాత అధికారంలోకి వచ్చిన ప్రభుత్వాలు క్రమంగా సంబంధాలను మెరుగు చేసుకున్నాయి. మన దేశం ఇజ్రాయిల్ నుండి ఆయుధాల కొనుగోలు ప్రారంభించింది. అమెరికా నుండి ఆయుధాలు కొనుగోలు చేయడం ప్రారంభించడానికి ముందు ఇజ్రాయిల్ మన దేశానికి అతి పెద్ద ఆయుధ సరఫరాదారుగా ఉంది. ఈ సంవత్సరం 260 కోట్ల డాలర్ల ఆయుధాలు కొనడానికి ఒప్పందం చేసుకున్నారు. ప్రస్తుతం అమెరికా మనకు అతి పెద్ద ఆయుధ సరఫరాదారుగా మారింది.

వివిధ రంగాల్లో ఇజ్రాయిల్‌తో సహకారానికి సంబంధించి, ఆయుధాలను, ఇతర రక్షణ పరికరాలను అమ్ముకోవడం వరకే పరిమితమైంది. మోడీ పర్యటనలో కూడా 200 కోట్ల డాలర్లకుపైగా ఒప్పందంపై సంతకాలు జరిగాయి. భద్రతా అంశాలు, తీవ్రవాదంపై పోరాటంలో సహకారం పేరిట ఇజ్రాయిల్ నిఘా, రక్షణ సంస్థలకు మన దేశంలోకి మరింత ప్రవేశం కల్పించవలసి ఉంటుంది. ఇప్పటికే ఇజ్రాయిల్ నిఘా సంస్థ మొస్సాద్‌కు మన భద్రతా యంత్రాంగంలో ప్రవేశ సౌలభ్యం కల్పించబడింది. గడచిన మూడేళ్లలో భారత్–ఇజ్రాయిల్ సైనిక దళాల రెండు సంయుక్త విన్యాసాలు నిర్వహించబడ్డాయి. అసోంలో ఒక విన్యాసం జరిగింది. అదేవిధంగా, భారత్, ఇజ్రాయిల్ నిఘా సంస్థల మధ్య సహకారం మరింత ముందుకు తీసుకుపోవడంలో ఎన్ఐఎ అధినేత అజిత్ దోవల్ ప్రధాన పాత్ర ఉన్నది. ఇది భారత్ భద్రతకే పెద్ద ముప్పు. అమెరికా, ఇజ్రాయిల్‌తో బహిరంగ సహకారం భారత సార్వభౌమత్వానికి ప్రమాదకరం.

2017 ఏప్రిల్‌లో భారతదేశం ఇజ్రాయిలీ ఎయిరోస్పేస్ పరిశ్రమల నుంచి దాదాపు 18 వేల కోట్ల రూపాయల విలువైన అల్ప శ్రేణి, దీర్ఘ శ్రేణి క్షిపణులను కొనుగోలు చేసింది. నిఘాకు పనికివచ్చే డ్రోన్లను ఇజ్రాయిల్ నుంచి కొనాలని భారత ప్రభుత్వం ఆలోచిస్తున్నది. ఇస్రో రాకెట్లతో ఇజ్రాయిలీ గూఢచార ఉపగ్రహాలను అంతరిక్షంలో ప్రవేశపెట్టారు. అంతర్గత భద్రతా విషయాలపైన ఇజ్రాయిలీ భద్రతా నిపుణులు భారతదేశానికి సలహాలు ఇస్తున్నారు. బిజెపి హిందూత్వ దృక్పథానికి, యూదుజాతి జాతీయవాదానికి మధ్య సన్నిహిత సారూప్యత ఉన్నది. నరేంద్ర మోడీ, మితవాద లికుడ్ పార్టీ ప్రధాని బెంజమిన్ నెతాన్యాహులు భావజాలపరమైన ఆత్మబంధువులయ్యారు. పాలస్తీనా ప్రజలను అణచివేయడంలోనూ, అరబ్ దేశాలను ఎదుర్కోవడంలోనూ ఇజ్రాయిల్ చూపుతున్న ప్రతిభను ఆర్ఎస్ఎస్, బిజెపిలు కొనియాడుతున్నాయి. వీరి ముస్లిం వ్యతిరేక ధోరణి ఇజ్రాయిల్‌ను అనుకరించాలనే ఆలోచనను ముందుకు తెచ్చింది.

హిందుత్వ భావనను రూపొందించిన వి డి సావర్కర్ 1952లోనే ఇజ్రాయిల్‌ను అనుసరించాలని అరెస్సెస్‌కు ప్రబోధించాడు. ఆయన అనుంగు శిష్యుడైన మోడీ ఇప్పుడు ఇజ్రాయిల్‌తో భారత దేశాన్ని పూర్తిగా మమేకం చేశాడు. 'ఇజ్రాయిల్ కొరకు ఇండియా' అని మోడీ టెల్ అవీవ్‌లో సగర్వంగా ప్రకటించాడు. ఇజ్రాయిల్‌ను మోడీ దర్శించడం ప్రతీకాత్మకతకు మించిన విషయం. ఇజ్రాయిల్‌తో వ్యూహాత్మక భాగస్వామ్యంలోకి భారతదేశాన్ని చేర్చడం మోడీ ప్రభుత్వ విదేశాంగ విధానంలో వచ్చిన పచ్చి మితవాద మార్పులో ఒక భాగం. దీంతో న్యాయమైన పాలస్తీనా పోరాటానికి ఇప్పటిదాక ఇస్తున్న మద్దతు ఉపసంహరించి, 'అమెరికా, ఇజ్రాయిల్, ఇండియా ఇరుసు' అనే హిందుత్వ లక్ష్యం కోసం మోడీ ప్రభుత్వం అడుగులు వేస్తున్నది.

**ముగింపు**

ప్రపంచ ప్రజలు ట్రంప్‌ను యుద్ధోన్మాదిగా వ్యతిరేకిస్తున్న దశలో మోడీ ట్రంప్‌ను తన బిగి కౌగిలిలో బంధించి అత్యుత్సాహం ప్రదర్శించారు. అమెరికాది విషకౌగిలి అని ప్రపంచ చరిత్ర చెబుతుంది. అలాగే తమది కాని నేల మీద తమ రాజ్యం స్థాపించుకుని స్థానికంగా ఉన్న పాలస్తీనియన్లను అంచులకు నెట్టి 70 ఏళ్లుగా అమెరికా దన్నుతో నిరంతర యుద్ధాలలో ముంచిన దుర్మార్గపు రాజ్య స్వభావాన్ని సంతరించుకున్న ఇజ్రాయిల్ ప్రధాని నెతన్యాహూను కలువడంలో అంతర్యం ఏమిటి? పర్యావసానం ఏమిటి? ఆలోచించాలి. ట్రంప్, నెతన్యాహూ, మోడీల స్నేహం, గాఢ ఆలింగనం, ధృడమైన మైత్రీ బంధం భారతదేశానికి మాత్రమే కాదు మొత్తం ప్రపంచానికే పెను ప్రమాదం. వీరి ముగ్గురి కలయిక సరిగ్గా రెండో ప్రపంచ యుద్ధ కాలంలో హిట్లర్–ముస్సోలినీ–టోజోల కలయిక లాంటిది. గల్ఫ్ యుద్ధ కాలంలో బుష్–బ్లెయిర్ కలయిక లాంటిది. ఆ దుష్ట కూటములను దాటి ప్రపంచం ముందుకు సాగింది. కాని ఈ దుష్ట కూటమి త్రయం చేతిలో ఉన్న మంత్రజాలాలు, టక్కు టమార విద్యలు మరింత ప్రమాదకరమైనవి. ఇవి ప్రజలలో నెలకొన్న అసంతృప్తులను వాడుకొని ఆ అసంతృప్తినే ఆయుధంగా చేసుకోగలిగినవి. తమ మీద తిరగబడవలసిన వాళ్లను తమ వెనుక నడిచేలా మాయ చేయగలిగినవి. తమ మీద ఇసుమంత విమర్శ సాగించినవారినైనా అదృశ్యం చేయగలంత దుర్మార్గమైనవి.

గతంలోనే భారత్ అమెరికాతో వ్యూహాత్మక సైనిక సహకార ఒప్పందం కుదిరింది. ఇప్పుడు మూడు దేశాల లక్ష్యం ఒకటే. ముస్లింలపై దాడులు చేయడం, వారిని టెర్రరిస్టులుగా ముద్రవేసి, వారిపై హత్యాకాండను కొనసాగించడం, ఆ దేశాలలోని చమురు, సహజ వనరులను కొల్లగొట్టడం, ప్రజల పౌరసత్వ హక్కులను హరించడం కోసం ఎత్తులు వేస్తున్నాయి. ఇప్పుడు గ్లోబల్ తీవ్రవాద పోరాటం నేపథ్యంలో, ఇజ్రాయిల్ ఒక సహజ మిత్రుడిగా ఎన్‌డిఎ ప్రభుత్వానికి కనపడడంలో ఆశ్చర్యం లేదు. భారత్‌తో ఆయుధ వ్యాపారంలోనూ, గూఢచర్య నైపుణ్య వినిమయం లోను రాణిస్తున్న ఇజ్రాయిల్‌కు మోడీ ప్రపంచంలోనే ముఖ్యమైన స్నేహితుడిగా కనిపించడంలోనూ విచిత్రం లేదు. ఇజ్రాయిల్ అమెరికా, రెండు ఆయుధ బేహారులే, యుద్ధోన్మాదులే, ఇప్పుడు భారత్ వారితో జతకలిసింది.

గత మూడు సంవత్సరాలుగా మోడీ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలే అమెరికా–ఇజ్రాయిల్‌ల సరసన చేరుస్తున్నాయి. ఈ విధానాలు దేశ లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థలకు తీవ్ర ప్రమాదం కలిగిస్తాయి. ఈ కూటమి అసలు స్వభావాన్నీ, ఎత్తులనూ ప్రతి ఒక్కరూ గ్రహించేలా చేయడమే, ప్రతిఘటనకు మార్గాలు రూపొందించడమే ఇవాళ బుద్ధిజీవుల ముందున్న చారిత్రక కర్తవ్యం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# హిందూ రాజ్య విస్తరణ కోసం రాజముద్ర

*లౌకిక దేశం అని గొప్పలు చెప్పుకుంటూనే దేశ ప్రథమ పౌరుడిని కూడా కుల ప్రాతిపదికన ఎన్నుకుంటున్నారనీ, దళిత రాష్ట్రపతిని ఎన్నుకున్నామంటూనే బిజెపి, సంఘ్‌పరివార్ శక్తులు హిందూ రాజ్య విస్తరణకు రాజముద్ర వేసుకుంటున్నారనీ అంటున్నారు* **డా. కత్తి పద్మారావు**

ఈనాడు భారతదేశం ఆర్ఎస్ఎస్ దాడులతో అట్టుడికిపోతోంది. లౌకికవాదానికి గొడ్డలివేటు వేస్తూ మోడీ ప్రభుత్వం సాగిపోతోంది. ఒకనాడు రాముడు పాలించిన రాజ్యంలో శంబూకుడు వేదాలు చదివినందుకు తలతుంచేసి 'వేద సంస్కృతిని కాపాడాను' అని రాముడు విర్రవీగి, బ్రాహ్మణులు తప్ప వేరేవారు శాస్త్రవిద్యలు చదవడానికి వీలులేదని శాసించినట్లే, అన్ని విశ్వవిద్యాలయాల్లో దళిత విద్యపై వేటు వేస్తున్న మోడీ రాష్ట్రపతిగా ఒక ఆర్ఎస్ఎస్ దళితుణ్ణి నియమించడం వలన దళిత విద్యపై, దళిత హక్కులపై నిరంతరం జరిగే దమనకాండకు రాజముద్ర వేయాలని ప్రయత్నిస్తున్నారు.

2015లో దళితులపై 707 హత్యాచారాలు జరుగగా అవి రెండు 2016లో 1500, 2017లో ఇప్పటికే 800గా నమోదు అయ్యాయి. ఉత్తరప్రదేశ్‌కు ఆర్యావర్తం అనిపేరు. అనగా ఆర్యరాజ్యం అని. ఆర్య రాజ్యం ఎలా ఉండాలి అంటే అది తప్పకుండా బ్రాహ్మణాధీనమై ఉండాలి. బ్రాహ్మణాధీనంలో క్షత్రియుడు కింది జాతులపై కత్తి ఝుళిపించాలి. కింది జాతులను  దండంతో అణచివేయాలని మనుస్మృతి చెబుతుంది. అందుకే మోడీ ఠాగూర్ కులానికి చెందిన ఆదిత్యనాథ్ యోగిని ముఖ్యమంత్రిని చేశారు. యోగి గుండెల్లో కత్తులు దాచుకున్న సన్యాసి, కౌటిల్యుని వంటివాడు.

అంబేడ్కర్ విగ్రహాన్ని దళితులు ఏర్పాటు చేసుకోవడాన్ని ఠాగూర్లు నిరాకరిస్తున్నారు. ఉత్తరప్రదేశ్‌లోని సహారన్‌పూర్ జిల్లాలో దళిత ఉద్యమం తాత్వికంగా ముందుకు నడుస్తుంది. దీనికి నరేంద్రగౌతమ్ నాయకత్వం వహిస్తున్నాడు. ఉత్తరప్రదేశ్‌లో దళితులు బౌద్ధ స్వీకారోద్యమానికి శ్రీకారం చుట్టారు. మాయావతి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నిర్మించిన అంబేడ్కర్ పార్కులోని ఆ గ్రామ తాజ్‌మహల్‌ను అధిగమించి ప్రత్యామ్నాయ సంస్కృతికి ప్రతీకగా ఉన్న సందర్భంలో అంబేడ్కర్ విగ్రహాల విధ్వంసానికి ఆర్ఎస్ఎస్ భారతదేశ వ్యాప్తంగా పూనుకొంటుంది. అంబేడ్కర్ రూపొందించిన రాజ్యాంగానికి ఆర్ఎస్ఎస్ మొదటి నుండి తూట్లు పొడుస్తుంది.

యోగి ఆదిత్యనాథ్ సన్యాసిగా ఉన్నా కుల, మత వర్ణాధిపత్యం గల ముఖ్యమంత్రి. అంబేడ్కరిజాన్ని ఉత్తరప్రదేశ్‌లో దెబ్బతీయాలనే అక్కడ దాడులు ముమ్మరం చేశారు. ఎందుకంటే హిందూ జీవన విధానానికి, బౌద్ధ జీవన విధానానికి ఉన్న వ్యత్యాసమే దీనికి కారణం. అంబేడ్కర్ బౌద్ధ ధర్మాన్ని ఆచరించడమంటే స్వేచ్ఛగా జీవితాన్ని గడపడమేనని స్వేచ్ఛ మనస్సులో, వాక్కులో, శరీరంలో ఉండాలంటాడు. సోమరితనానికి, జడత్వానికి ఉద్రిక్తతకి, దుందుడుకు తనానికి దూరంగా ఉండగలగడమే మానసిక స్వచ్ఛత అని బుద్ధుని ధర్మాన్ని అంబేడ్కర్ నివేదిస్తాడు. హింసను బలంగా వ్యతిరేకించాడు. బుద్ధుడు కాముకత్వాన్ని, అసత్యమాడడాన్ని, మత్తుపదార్థాలను సేవించి మందమతిగా జీవించడాన్ని వ్యతిరేకించాడని, బౌద్ధ ధర్మదీక్ష పొందడం వలన నీవు పరిపూర్ణ మానవుడవుతావని అంబేడ్కర్ తన బుద్ధుడు అతని ధమ్మంలో పేర్కొన్నాడు.

దురాశ, క్రోధం, భ్రమలను అధిగమించినట్లైతే మానవుడిలో బాధ, వేదనలు జయించవచ్చని, వాంఛలకు బలికాకుండా మానవుడు జాగ్రదావస్థలో ఉండాలన్నాడు బుద్ధుడు. మానవుడు నిర్వాణమార్గం చేరుకొనేందుకు కోరికలు అవరోధమని బుద్ధుడు హెచ్చరించాడు. అంబేడ్కర్ బుద్ధుని బోధనలను క్రమబద్ధీకరించడమేకాక దానిలోని అంతస్సారాన్ని సులభసాధ్యంగా నివేదించాడు. ఈనాడు ఆర్ఎస్ఎస్ వ్యూహాలు అన్ని కూడా అంబేడ్కర్ చెప్పిన బౌద్ధం భారతదేశంలో విస్తరిల్లకుండా ఉండే ప్రయత్నమే జరుగుతుంది.

భారతదేశంలో మొదటి నుంచి రాష్ట్రపతులు ఎక్కువ మంది ఏదో ఒక మతాన్ని ఆశ్రయించినవాళ్లే. మొదట 1952లో రాజేంద్రప్రసాద్ రాష్ట్రపతి అయిన తర్వాత 1957 వరకు ఆయన హిందూ దేవాలయాలను సందర్శిస్తూనే ఉన్నాడు. రాష్ట్రపతి కావడం మొదట ఆయన ప్రత్యక్షంగా రెండువందల మంది బ్రాహ్మణుల కాళ్లు కడిగారు.

1962లో రాష్ట్రపతి అయిన సర్వేపల్లి రాధాకృష్ణ భారతీయ తత్వశాస్త్రం రాసినవారు. అయితే అందులో ఆయన హిందూవాదంవైపే మొగ్గుచూపారు. 1962లో వచ్చిన జకీర్ హుస్సేన్ మతం పట్ల తటస్థంగా ఉన్నారు.

1969లో వచ్చిన వి.వి.గిరి ఇందిరాగాంధీకి తొత్తుగా మారారు. 1974లో పకృద్ధిన్ ఆలీ అహ్మద్ కూడా మతం పట్ల తటస్థంగా ఉన్నారు. 1982లో వచ్చిన జ్ఞానీ జైల్‌సింగ్ క్యాబినెట్ ఆమోదం లేకుండానే ఇందిరాగాంధీ ప్రవేశపెట్టిన ఎమర్జెన్సీ ఫైల్ మీద సంతకం చేశారు.

1987లో వచ్చిన ఆర్. వెంకట్రామన్ 1991 చుండూరు ఘటనలో 107 ఎంపిలు  సమర్పించే మెమోరాండంను స్వీకరించలేదు. అప్పుడు దళిత రాష్ట్రపతి అనే నినాదంను ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ చేసింది. ఆ తర్వాత 1992లో వచ్చిన శంకర్‌దయాల్ శర్మ హిందూ దేవాలయాల చుట్టూ ప్రదక్షిణలు చేశారు. ఆ తర్వాత 1997లో మొదటగా దళిత రాష్ట్రపతి కె.ఆర్.నారాయణన్ ఎన్నికయ్యారు.

2002లో వచ్చిన అబ్దుల్‌కలాం తానే స్వయంగా ఆర్ఎస్ఎస్ శిబిరానికి వెళ్లేవాడిని అని చెప్పుకున్నాడు. 2007లో వచ్చిన ప్రతిభాపాటిల్ సాంప్రదాయంగా కొనసాగింది. స్త్రీలకు ప్రత్యేకంగా ఏమీ మేలు జరగలేదు. 2012లో ప్రణబ్‌ముఖర్జీ వచ్చారు. విశ్వవిద్యాలయాల్లో వస్తున్న మతవాదం మీద ఆయన చర్యలు తీసుకోలేదు. ఎక్కువమంది విశ్వవిద్యాలయాల ఉప కులపతులను బ్రహ్మణులనే నియమించారు.

ఇప్పుడు మోడీ తీసుకొస్తున్న భారత 14వ రాష్ట్రపతిగా బీహార్ గవర్నర్, దళితుడు రామ్‌నాథ్ కోవింద్‌ను అభ్యర్థిగా నిలబెట్టిన మోడీ వ్యూహాత్మక చాతుర్యం ఉంది. రామ్‌నాథ్ కోవింద్ 1945 అక్టోబర్ 1న ఉత్తరప్రదేశ్ లోని పారాంఖ్ గ్రామంలో జన్మించాడు. 14 సంవత్సరాలు న్యాయవాద వృత్తి నిర్వహించారు. 1998 నుంచి 2002 వరకు భాజాపా దళిత మోర్చా అధ్యక్షునిగా ఉన్నాడు. 1994 నుంచి 2006 వరకు రాజ్యసభ సభ్యుడిగా ఉన్నారు. 2015 ఆగస్టు 8 నుంచి బీహార్ గవర్నర్‌గా ఉన్నారు. భావజాల పరంగా ఆర్ఎస్ఎస్ భావాలు కలిగినవాడు.

ఉత్తరప్రదేశ్‌లో ఒక పక్క ఠాగూర్లు షబ్బీర్‌పూర్ గ్రామంలో దళితులపై దాడులు చేసి 25 ఇళ్లు తగులబెట్టారు. దళిత వాడల్లో ఉన్న రవిదాస్ మందిరంలో కూడా అంబేద్కర్ విగ్రహాన్ని పెట్టనివ్వకపోగా అంబేద్కర్ వాదం నశించాలని నినాదం చేశారు. ఠాగూర్లు మారణాయుధాలతో దళితులపైన దాడులు, గృహ దహనాలు, దళిత స్త్రీలను మానభంగాలు చేస్తూ వెళ్తున్నారు.

ఈ దాడులను నిరసిస్తూ 2017, మే 21న ఢిల్లీలో జరిగిన భీమ్ఆర్మీ యాత్రను కూడా పోలీసులు అడ్డుకొని తర్వాత చంద్రశేఖర రావణ్‌ను అరెస్ట్‌చేశారు. ఈ సందర్భంగా ఉత్తరప్రదేశ్‌లో జరిగిన కులహింసకు నిరసనగా భీమ్‌సేన ఢిల్లీలో భారీ ప్రదర్శన చేపట్టింది. తమ సంస్థ అధినేత చంద్రశేఖర్‌ను విడుదల చేయాలని డిమాండ్ చేసింది. ఒక్క నెలలోనే రెండోసారి వీధుల్లోకి వచ్చి నిరసన తెలిపింది. భీమ్‌సేన పిలుపు మేరకు దళిత యువకులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. దాదాపు 2500 మంది తరలివచ్చినట్టు పోలీసులే తెలిపారు. చంద్రశేఖర్ తల్లి కమలేష్‌దేవి, బహుజన్ సమాజ్ పార్టీ (బిఎస్‌పి) వ్యవస్థాపకులు కాన్షీరామ్ సోదరి స్వర్ణకౌర్ కూడా పాల్గొన్నారు.

పార్లమెంట్ స్ట్రీట్ పోలీసు స్టేషన్ నుంచి న్యూఢిల్లీ మున్సిపల్ కౌన్సిల్ కన్వెన్షన్ సెంటర్ వరకు వీధులన్నీ నీలి (దళితుల రంగు) సముద్రాన్ని తలపించాయి. ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, హర్యానా, పంజాబ్ రాష్ట్రాల నుంచి యువకులు భారీగా తరలివచ్చారు. జైభీమ్ నినాదంతో ఢిల్లీ వీధులు మార్మోగింది. నేను నిరసన తెలుపుతా, ధర్నా చేస్తా, అవసరమైతే నిరవధిక దీక్ష చేపడతా, నా కుమారుడిని విడుదల చేసేంత వరకు పోరాడతాం. నరేంద్రమోడీ, యుపి ప్రభుత్వాల నుంచి నేనేమీ ఆశించలేదు. యోగి ఆదిత్యనాథ్ అధికారంలోకి వచ్చాకే కులహింస పెరిగిపోయింది అని కమలేష్‌దేవి అన్నారు.

ఇక ఇప్పుడు కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియాగాంధీ నేతృత్వంలో ఎన్‌డిఎలో లేని ఇతర పార్టీలు గురువారం పార్లమెంట్ లైబ్రరీ హాల్‌లో సమావేశమయ్యాయి. 17 పార్టీల నేతలు దీనికి హాజరయ్యారు. సుదీర్ఘ చర్చల తర్వాత ప్రతిపక్షాల తరుపున మీరాకుమార్‌ను పోటీకి నిలబెట్టడానికి సమావేశంలో ఏకాభిప్రాయం వ్యక్తమైంది. కాంగ్రెస్ వామపక్షాలు, మిత్రపక్షాలు ఈ పని మొదటే చేసి ఉండాల్సింది.

అయితే బిజెపికి ఇప్పుడు రెండు అనుకూలతలు వచ్చాయి. ఒకటి ముందు మేము దళిత అభ్యర్థిని నిలబెట్టాక వారు నిలబెట్టారనేది. రెండు ఇప్పటికీ చంద్రబాబు, కెసిఆర్, జగన్, తమిళనాడు ముఖ్యమంత్రి, ఒరిస్సా, బీహార్ ముఖ్యమంత్రుల చేత బిజెపికి అనుకూలంగా ఓటు వేయడానికి అంగీకరింపచేసుకోవడం. ఈ పరిస్థితుల్లో బిజెపి అభ్యర్థికే ఎక్కువ అవకాశాలు ఉన్నాయి.

**బిజెపి ఎందుకు కోవింద్‌ని తెస్తుంది?**

విశ్వవిద్యాలయాల్లో దళిత విద్య మీద రోహిత్ వేముల ఆత్మహత్య తరువాత పెద్దఎత్తున దాడులు, అణచివేతలు జరుగుతున్నాయి. మొత్తం శాస్త్ర, సాంకేతిక, ఆర్థిక చరిత్ర, రాజకీయ శాస్త్రాలన్నింటా దళితులకు సీట్లు తగ్గించారు. నరేంద్రమోడీ పుట్టిన బిసిలకు, చంద్రబాబు సామాజిక వర్గం శూద్రులకు కూడా పరిశోధనా రంగంలో కేంద్రీయ విశ్వవిద్యాలయాల్లో సీట్లు తగ్గాయి. ఉన్నత విద్యలో దళితులను పూర్తిగా దెబ్బ తీయడానికి 'హిందూతత్వాన్ని అంగీకరిస్తేనే మీరు విశ్వవిద్యాలయాల్లో ఉండండి, లేకుంటే లేదనే వరకు ఆర్ఎస్ఎస్ శ్రేణులు' ముందుకు వెళుతున్నాయి. ఈ చర్యలను సమర్థించే రాజముద్ర కోసమే కోవింద్‌ను ఉపయోగించే అవకాశం ఉంది.

ఈ మూడేళ్ల పాలనలో దళితులకు భూములు పంచలేదు, దళితులపై జరిగే అత్యాచారాల విషయంలో ఎటువంటి విచారణ లేదు. అస్పృశ్యతా నివారణ చట్టాన్నే గాక, 1989 ఎస్‌సి, ఎస్‌టి ప్రివెన్షన్ ఆఫ్ ఎట్రాసిటీ యాక్ట్‌ను నిర్వీర్యం చేసే సకల ప్రయత్నాలు చేస్తున్నారు. ఎస్‌సి, ఎస్‌టి రిజర్వేషన్లను తూట్లు పొడవాలని, బ్యాక్‌లాగ్ పోస్టులు పూర్తి చేయకుండా ఉండాలని, ప్రపంచీకరణలో భాగంగా ప్రైవేటీకరణను ముమ్మరం చేయాలనే ప్రయత్నం బీజేపీ ముమ్మరంగా చేస్తుంది.

ఇటువంటి వాటికి వీరికి అనుకూలమైన దళిత రాష్ట్రపతిని ఎంపిక చేయాలనే వీరు ఎప్పటినుండో ప్రయత్నిస్తున్నారు. ఆర్ఎస్ఎస్ భావజాలం ఎక్కాక తమ గొంతు తాము నులుముకొనే ఆత్మహత్యా సదృశ్యమైన భావాలుంటాయి. మనుస్మృతిలో చెప్పిన వర్ణవ్యవస్థ నిర్మాణాన్ని చెక్కు చెదరకుండా చేయడమే ఆర్ఎస్ఎస్ రాజ్య భావన. గుప్తుల కాలం నాడు ఎలా హిందూ పునరుద్ధరణ వాదం ముందుకు వచ్చిందో, బౌద్ధ చైత్యాలను, స్థూపాలను, ఆరామాలను విధ్వంసం చేశారో, అదే కార్యక్రమాన్ని ఇప్పుడు కొనసాగిస్తున్నారు.

కాన్షీరామ్, నేను ఇంకొందరితో కూర్చొని మాయావతి పాలించే సమయంలో బౌద్ధ విమానాశ్రమాన్ని లక్నోలో నిర్మించాలనుకొన్నాం. చైనా, టిబెట్, థాయ్‌లాండ్, మలేషియా వంటి బౌద్ధ దేశాలతో సంబంధాలను ముందుకు తీసుకువెళ్లాలనుకొన్నాం. దానికి భిన్నంగా హిందూ రాజ్య విస్తరణ కోసం, హిందూ భావజాల వ్యాప్తి కోసం వీళ్లు అన్ని పదవులను సృష్టిస్తున్నారు. ముఖ్యంగా దళితులు తినే ఆహారం, గోమాంసాన్ని నిషేధించి గుజరాత్‌లో దళిత హింసను ప్రారంభించారు. వామపక్షంపై విద్వేష పూరితంగా దాడులు చేస్తున్నారు. అయితే దళితులు, ముస్లింలు భారతదేశంలో పోరాట శక్తులు ఇప్పుడు మనుస్మృతి చేత పీడించబడుతున్న అన్ని శక్తులు లౌకిక వామపక్ష వాదులు కలసి మీరాకుమార్‌ను రాష్ట్రపతి అభ్యర్థిగా ముందు పెట్టుకుని పోరాటానికి ఉపక్రమించాయి. ఈ ఐక్య సంఘటన అంబేద్కర్‌ను బుద్ధుణ్ణి ముందు పెట్టుకోవడం వల్ల హిందుత్వానికి ప్రత్యామ్నాయాన్ని రూపొందించే అవకాశం ఉంది. బౌద్ధ సాంస్కృతిక విప్లవాన్ని కూడా కలుపుకుని ఈ పోరాటం సాగితే బౌద్ధ భారత నిర్మాణానికి తప్పక మార్గం సుగమం అవుతుంది. అణచివేత నుండి సామాజిక రాజకీయ విప్లవ ఆవిర్భావం అవుతుంది. మీరు రాజముద్రలు రూపొందించినా లౌకికవాద శక్తుల ఐక్యత రాజ్యాంగ రక్షణల పోరాట శిబిరంగా వెలసి నూతన సమాజ సృష్టికి పూనుకునే రోజులు వచ్చాయి. లౌకికవాద రాజ్యాధికార ఉద్యమానికి ఇదొక మలుపు కాక తప్పదు.

*(రచయిత సామాజిక తత్వవేత్త, వ్యవస్థాపక అధ్యక్షుడు, నవ్యాంధ్రపార్టీ)* వీ

# తత్వశాస్త్రం కొంతే, సొంత కవిత్వమే అంతా...

*రంగనాయకమ్మ రాసిన 'తత్వశాస్త్రం - చిన్న పరిచయం' పుస్తకం తప్పుల తడక అని విమర్శిస్తున్నారు*

**లంకా పాపిరెడ్డి**

రంగనాయకమ్మ రాసిన తత్వశాస్త్రం చిన్నపరిచయం అనే పుస్తకాన్ని ఎవరైనా చూస్తే, రంగనాయకమ్మ తత్వశాస్త్రాన్ని సులువుగా అర్థం చేసుకోవడానికి రాసిన పుస్తకం కావచ్చు అనుకుంటారు. కాని పుస్తకాన్ని కొద్దిగా చదవగానే అటువంటిది ఏమి కాదని, లేదని తెలిసి పోతుంది. ఇది "తత్వశాస్త్రం చిన్న పరిచయం" కాదు, తత్వశాస్త్రపు వక్రీకరణ మాత్రమే అని అర్థం అవుతుంది. తత్వశాస్త్రం పరిచయం పేరు మీదనే, తత్వశాస్త్రం పైన అర్థంపర్థం లేని దాడి దర్శనమిస్తుంది. తత్వశాస్త్రం పరిచయం పేరుమీదనే, తత్వశాస్త్రం పైన తనకున్న వ్యతిరేకతను, తెలవనితనాన్ని అంతా వెళ్లగక్కారు. తత్వశాస్త్రం పరిచయం పేరుమీద 224 పేజీల పుస్తకంలో తత్వశాస్త్రం అంటూ పరిచయం చేసింది 50 పేజీలే. అందులోనూ అవాకులు చవాకులు, వెక్కిరింతలు, సందేహాలు, ప్రశ్నలు అన్నీ తీసివేస్తే 30 పేజీల వరకు 'పరిచయం' ఉండవచ్చు. ఇక మిగతా 174 పేజీలలో తత్వశాస్త్రం మీద దాడి, తత్వశాస్త్రంతో సంబంధాలు లేని విషయాలే ఉన్నాయి. ప్రధానంగా తత్వశాస్త్రం పైన దాడియే ఉంది.

తత్వశాస్త్రం పైన రంగనాయకమ్మ దాడి, ముందుమాట నుండే మొదలైంది. నిజానికి తత్వశాస్త్రం చిన్న పరిచయం అంటూ పుస్తకంలో నాలుగవ వంతు తత్వశాస్త్రం 'పరిచయం' చేసి మిగతా అంతా సంబంధం లేని విషయాలు రాయడం అంటే పాఠకులను చీటింగ్ చేయడమే అవుతుంది. ఏ విషయం గురించైనా పరిచయం చేస్తున్నప్పుడు మూల రచయిత ఏమి చెప్పాడో, దానినే సులువుగా అర్థం అయ్యేలా చెప్పాలి. అంతే కాని ఒక పుస్తకాన్ని పరిచయం చేస్తున్న సమయంలోనే ఆ పుస్తకంలోని విషయాల పైన్నే సొంత వ్యాఖ్యలు చేయడం, హేళన చేయడం మూల రచయితలను అవమాన పరచడమే అవుతుంది. పరిచయం చేసే రచయితకు, ఆ పుస్తకంలోని విషయాల పైన ఏమైనా విమర్శలు ఉంటే వాటిని విడిగా ఒక చాప్టర్‌లో చెప్పవచ్చు. లేదా ఆ పుస్తకంలోని విషయాలను విమర్శిస్తూ ప్రత్యేకంగా ఒక పుస్తకమే రాసుకోవచ్చు. అంతేకాని పరిచయం పేరు మీద ఏ రచయిత అయినా తన సొంత అభిప్రాయాలను, మూల రచయిత అభిప్రాయాలతో కలిపేసి చెప్పితే అది పరిచయం కాదు, మూల రచయిత అభిప్రాయాలను వక్రీకరించడం అవుతుంది. రంగనాయకమ్మ గారికి మూల రచయితలకు పైన కాని పాఠకుల పైన కాని గౌరవం లేదు.

తత్వశాస్త్రం పైన దాడిని రంగనాయకమ్మ ముందు మాట నుండే మొదలు పెట్టారు. "తత్వశాస్త్రం మీద నాకు ఎప్పుడూ ఆసక్తి రాలేదు" అంటూ తత్వశాస్త్రం 'పరిచయం' మొదలు పెట్టడం నిజంగా అపూర్వం. అయ్యో మొదట్లో ఆసక్తి లేకుండా ఉండే వారు కాని, తరువాత ఆసక్తి ఏర్పడిందేమో, అది ఎలా ఏర్పడిందో కూడా చెపుతారేమో అనుకుంటారు అందరు. కాని రంగనాయకమ్మ మాత్రం "తత్వశాస్త్రం వ్యాసాలు గతంలో ఎలా చదివానో కాని, అది దండగ, 'టైంవేస్ట్' అనే అభిప్రాయంతోనే ఉండేదాన్ని. ఇపుడు ఆ అభిప్రాయం పూర్తిగా మారిందని కాదు" (పేజీ 7) అని సెలవిచ్చారు. ఎంత మారిందో వివరణ ఏమి ఇవ్వలేదు. మొత్తానికైతే ఆ అభిప్రాయం పూర్తిగా మారలేదు. తత్వశాస్త్రాన్ని చదవడం టైందండగ అనే అభిప్రాయం మారకుండానే రంగనాయకమ్మ ఈ తత్వశాస్త్రం పరిచయం పుస్తకాన్ని ఎందుకు అచ్చువేయించారు? ఎందుకంటే ఓ ఆర్నెల్ల కిందట అనుకోకుండా ఒక తత్వశాస్త్రం పుస్తకం రంగనాయకమ్మ గారి చేతిలో పడిందట. (అది మన చావుకు వస్తుందని మనకెలా తెలుస్తుంది?) అది కొద్దిగా అర్థం అయ్యి (మన ఖర్మ) కోపం వచ్చిందట. పోనీ పాపం ఈ తత్వశాస్త్రాన్ని చూడకుండా వదిలేయడం ఎందుకు, ఓ పట్టు పట్టి చూద్దామని అనుకున్నారట. అయితే ఎంత పట్టు పట్టినా మళ్లీ మొదటకే వచ్చారు రంగనాయకమ్మ."మళ్లీ మళ్లీ టైంవేస్ట్ టైంవేస్ట్". "జీవితం అతి చిన్నది", "నాకు మిగిలిన జీవితం ఎంత దాన్ని ఇలా ఖర్చు చేస్తానా?" "నా చిన్న జీవితాన్ని దండగ చేసుకోను" (పేజీ 8) అని ఆ పుస్తకాల మీద రాశారట. తత్వశాస్త్రం మీద ఇంత అమూల్యమైన అభిప్రాయాలు గల రంగనాయకమ్మ తత్వశాస్త్రాన్ని పరిచయం చేయడానికి ఎందుకు పూనుకున్నట్లు? అందరి టైంవేస్ట్ చేయడానికా?

తత్వశాస్త్రాల పుస్తకాలు చదివేటప్పుడు పుస్తకం రాయాలనే అభిప్రాయం అస్సలు లేదంట. కాని ఆ పుస్తకాలు చదువుతూ తన కోసం రాసుకున్న నోట్సును చూసేసరికి అయ్యో ఈ నోట్స్ అంతా వేస్ట్ అవుతుందే అని (ఇక్కడ టైంవేస్ట్ కాలేదు) పుస్తకంగా వేశారన్న మాట. మీకోసం రాసుకున్న నోట్స్‌తో మీ బాధ ఏదో మీరే భరించితే బాగుండేది కదా. మీ బాధను అందరిలో పలికించాలని అనుకోవడం ఎందుకండి. సాధారణ పాఠకులు ఏమి పాపం చేసుకున్నారు? తత్వశాస్త్రం పైన మీకున్న కోపాన్ని సాధారణ పాఠకుల పైన తీర్చుకుంటారా? తత్వశాస్త్రం పైన వ్యతిరేక వ్యాఖ్యలన్నీ చేసిన తరువాత చివరికి, "ఇది క్రీస్తు పూర్వం నుండి ఈనాటి వరకు ఉన్న తత్వాలను పరిచయం చేసే చిన్న ప్రయత్నం మాత్రమే, అంతే" అని చెప్పారు.

ఈ 'చిన్న ప్రయత్నం' కొరకు తత్వశాస్త్రాన్ని ఇంత వెక్కిరించాలా? ముందు మాట ముగింపు కూడా విచిత్రమే. తత్వశాస్త్రం గురించి బొత్తిగా తెలవకుండా ఉండడం ఎందుకనీ, ఎంతో కొంత తెలుసుకుంటే మంచిదే కదా (ఎందుకో) అనీ, కొంచెం పరిచయం అవసరమనీ చెప్పారు. అంతే మరి మొత్తం తెలుసుకోవద్దు. తెలుసుకుంటే టైంవేస్ట్ అవుతుంది. ఈ ముగింపులోనే "దాన్ని (తత్వశాస్త్రాన్ని) చెవిన పడకుండా ఇన్నాళ్లు నేను చేసిన తప్పు కొంచెం దిద్దుకున్నాను" అని చెప్పుకున్నారు రంగనాయకమ్మ. తత్వశాస్త్రం కొంచమే అవసరం కావున కొంచమే తప్పు దిద్దుకున్నారు. ఈ ముందు మాట ముగింపులోనే, కొంచెం అవసరం...సమాజానికి అవసరం... అని రాశారు కాని పుస్తకంలోకి వెళితే మాత్రం మళ్లీ అదే టైంవేస్ట్, దండగ మంత్రం అడుగడుగున దర్శనమిస్తుంది. ముందు

మాట ముగింపులో అయినా, తత్వశాస్త్రం కొంచమైనా అవసరం అని చెప్పకపోతే పుస్తకం ఎవరూ చదవరని మాత్రమే రంగనాయకమ్మ అలా చెప్పారు. "తత్వశాస్త్రం ఉంటే మంచిదే, లేకపోతే మరీ మంచిది" అని చెప్పే రంగనాకమ్మ గారికి తత్వశాస్త్రం ఎందుకు అవసరం అనిపించిందో మరి.

తత్వశాస్త్రాల పుస్తకాల భాష గురించి, అనువాదాల గురించి రంగనాయకమ్మ తీవ్రంగానే విమర్శించారు. అనువాదాల గురించి రంగనాయకమ్మ చేసిన విమర్శలో వాస్తవం ఉంది. అర్థం అయ్యే పదాలు ఉండగా అర్థం కాని పదాలతో అనువాదాలు చేయడాన్ని తీవ్రంగా విమర్శించాల్సిందే. అయితే తత్వశాస్త్రపు పుస్తకాల అనువాదాలు మాత్రమే అలా లేవు. మిగతా రాజకీయ, సైద్ధాంతిక, చారిత్రక పుస్తకాల అనువాదాలు కూడా అలాగే ఉన్నాయి. తత్వశాస్త్రాల అనువాదాలు ఇంకా కొద్దిగా ఎక్కువ సమస్యగా ఉన్నాయి. సాధారణ పాఠకులకు అర్థం అయ్యేలా అనువాదాలు ఉండవలసిందే. అందుకొరకు కృషి చేయవలసిందే. విమర్శించ వలసిందే. కాని భాష, అనువాదాల సమస్య పేరు మీద ఒక శాస్త్రాన్ని వ్యతిరేకించడం పూర్తిగా తప్పు.

రంగనాయకమ్మ ప్రకారమే "సమస్య అంతా భాషనే కాదు. అసలు విషయమే అలాంటిది. రాసిన పద్ధతే అలాంటిది." (పేజీ 8) అంటే విషయమే కఠినమైనదని రంగనాయకమ్మగారే ఒప్పుకుంటున్నారు. మరి అపుడు ఏమి చేయవలసి ఉంటుంది. విషయం కఠినమైనదైనా, అవసరం అనుకున్నపుడు, అటువంటి విషయాలను ఎలా అధ్యయనం చేయాలో చెప్పవలసి ఉంటుంది. అటువంటి విషయాలను అర్థం చేసుకునే స్థాయిని పెంచుకునేందుకు ఏమేమి చేయాలో సూచించాల్సి ఉంటుంది. అంతేకాని వెకిలి వ్యంగ్యంతో తత్వశాస్త్రం పైన వ్యతిరేకత కలిగేలా వ్యాఖ్యలు చేయడం పరిష్కారం కాదు. పరిచయం అంటే వ్యతిరేకతను కలిగించడం కాదు. మార్క్స్ పెట్టుబడి కూడా సులువుగా అర్థం అయ్యేగ్రంథం ఏమికాదు మరి. మొదటి భాగం అర్థం కావడం అంత సులువైన విషయం కాదంటారు. కాని మార్క్స్ పెట్టుబడి విషయంలో మాత్రం రంగనాయకమ్మ వేరే విధంగా చెపుతారు. తన కాపిటల్ పరిచయం పుస్తకంలో ముందు మాటలో పేజి 25లో ఇలా చెప్పారు "ఈ పరిచయం ఒరిజినల్ లాగా అంత ఇబ్బంది పెట్టదు. అయినప్పటికి ఇది ఒక సైన్సు కాబట్టి, దీని సాంకేతిక పదాల తోటి, దీని తర్కం తోటి, దీని ఇబ్బందులు దీనికి ఉంటాయి. పాఠకులు ఈ కష్టాన్ని ఓపిగ్గా, ఆనందంగా భరించవలసిందే". రంగనాయకమ్మ తత్వశాస్త్రం గురించి మాత్రం ఈ విధంగా ఆలోచించ లేదు. కాపిటల్ విషయంలో స్వయంగా మార్క్స్ ఈ విధంగా చెప్పాడు "సత్యాన్వేషకులైన పాఠకుల్ని ముందుగా హెచ్చరించడమూ వారిని సాయుధులను చేయడమూ తప్ప, నేనేమి చేయలేను. సైన్స్‌కు రాజమార్గం లేదు. ఎగుడు దిగుళ్లుగా, అలవగొట్టే కఠినమైన దారుల గుండా ప్రయాణించడానికి సాహసించే వారికే, వెలుగునిచ్చే శిఖరాలను చూసే అవకాశం ఉంటుంది." ఈ విషయం రంగనాయకమ్మ గారికి తెలియనిది కాదు. అసలు విషయం ఏమిటిటంటే, తత్వశాస్త్రం అనేది ఒక శాస్త్రమే కాదు, దానితో సమాజానికి ఏమి అవసరం లేదు, అనేది రంగనాయకమ్మగారి అవగాహన. ఆ అవగాహన నుండే వచ్చిన సమస్య, తత్వశాస్త్రం పైన వ్యతిరేకత. మిగతావి అన్ని సాకులే.

**1) కొన్ని పుస్తకాలు అర్థం కావు**

ఈ పుస్తకంలోని మొదటి చాప్టర్ పేరు "కొన్ని పుస్తకాలు అర్థం కావు". పుస్తకాలేం ఖర్మ కొందరు మనుషులు కూడా అర్థంకారు. కాని, పుస్తకాలు అర్థం కాకపోవడానికి, రంగనాయకమ్మ నాలుగు కారణాలను చెప్పారు. ఈ నాలుగు కారణాలను విశ్లేషించినారు. 1) పుస్తకం రాసిన రచయిత 'నిజంకాని' విషయాన్ని చెప్పడానికి ప్రయత్నించడం. 2) చెప్పే విషయం నిజమైనదే అయినా, దాన్ని సరిగా తెలియకుండా చెప్పడం. 3) రాసిన మనిషికి విషయం బాగా తెలుసు, కాని రాయడం రాదు. 4) చదివే వ్యక్తి గ్రహింపు స్థాయి అతి తక్కువగా ఉండడం. విచిత్రం ఏమిటంటే ఈ నాలుగు కారణాలలో 2వ కారణం స్వయంగా రంగనాయకమ్మ గారికే వర్తిస్తుంది. తత్వశాస్త్రంతో అవసరం ఏమిలేదు అనే అవగాహనతో, తత్వశాస్త్రాన్ని అర్థం చేసుకోకుండానే, తెలుసుకోకుండానే తత్వశాస్త్రం చిన్న పరిచయం అని పుస్తకం రాసేశారు. ఈ విషయాన్ని రంగనాయకమ్మ స్వయంగా గుర్తించారు. అంగీకరించినారు. ఇదే పుస్తకం 27వ పేజీ రెండవ పేరాలో ఇలా ఉంది."పుస్తకాలు అర్థం కాకపోవడానికి 4 కారణాలు ఉంటాయని చెప్పాను కదా? వాటిలో రెండవ కారణాన్ని చూడండి. తెలియని విషయాలు చెప్పడానికి ప్రయత్నించే విషయం అది. అది వర్తించేది నాకే. భావవాదం అంటే ఏమిటో నాకు అస్సలు కొరకుడుపడడం లేదు. అయినా, నాకు తెలియకుండానే, తెలిసినట్టు నమ్మకం లేకుండానే, దాన్ని చెపతున్నాను. నేను చదివిందే నేను చెపుతున్నాను". అవును మీకు పోయేది ఏముంది? బలి అయ్యేది సాధారణ పాఠకులే కదా? తనకు భావవాదం అర్థం కాలేదనీ, అది అర్థం కాదు కూడా అనీ ఈ పుస్తకంలో చాలా చోట్లనే చెప్పారు. అదీ పరిచయం.

**2) తత్వశాస్త్రం విసుగెత్తించే శాస్త్రం**

రెండవ హెడ్డింగ్ కూడా తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేయాలని అనుకునేవారిని నిరుత్సాహపరిచేదే. "తత్వశాస్త్రం విసుగెత్తించే శాస్త్రం" అని హెడ్డింగ్. ఇందులో తత్వశాస్త్రం అంటే ఏమిటి అనే దానికి నిర్వచనం ఇవ్వడానికి ప్రయత్నించారు రంగనాయకమ్మ. తను చదివిన తత్వశాస్త్రాల పుస్తకాల నుండి తీసుకున్న నిర్వచనానికి, తన సొంత కవిత్వాన్ని కలిపి చెప్పారు. "ఏ తత్వగ్రంథాలు చదవకపోయినా, ఇక్కడా అక్కడా రోజూ వినే సూక్తుల్ని బట్టి, తత్వాలు అంటే మన అభిప్రాయాలే తత్వాలు – అనుకోవచ్చు నిజంగా" "వీధి అరుగుల మీద చుట్టలు కాల్చుకుంటూ కూర్చుని ఎడా పెడా మాట్లాడుకునే పుల్లయ్యల, ఎల్లయ్యల మాటలు ఉంటాయే, అవన్నీ తత్వాల కిందకి చేరేవే." (12 పేజీ) అని సెలవిచ్చారు. తత్వశాస్త్రం నిర్వచనాన్ని సులువుగా అర్థం చేయించారన్న మాట. దీని తరువాత ప్రకృతి, మానవ సమాజం గురించిన మన అభిప్రాయాలే తత్వశాస్త్రం అన్నట్లుగా చెప్పారు. కాని అందులోనూ స్పష్టత లేదు. ప్రకృతి, మానవ సమాజానికి చెందిన ఏ అభిప్రాయాలు తత్వశాస్త్రం అవుతుంది అనేది అస్పష్టం. మరీ సాధారణీకరించి, దేవుడు ఉన్నాడంటే ఒక తత్వశాస్త్రం అనీ దేవుడు లేడు అంటే ఇంకో తత్వశాస్త్రం అనీ తేల్చివేశారు.

రంగనాయకమ్మ స్వయంగా కష్ట పడకుండా సులువుగా తత్వశాస్త్రాన్ని అర్థం చేసుకోవాలని అనుకున్నారు. కాదు కాదు, అర్థం కావాలనుకున్నారు. అందుకే సులువుగా అర్థం చేయించాలనుకుని అర్థం పర్థం లేకుండా వివరించారు."తత్వం అంటే, ఒక భావం అనీ, ఒక అభిప్రాయం అనీ ఎంత తేలికైన అర్థాలు చెప్పుకున్నా, "తత్వశాస్త్రం" అనే మాట చాలా విసుగెత్తించే మాటే. దొరికిన తత్వవ్యాసాలు చదవడం నేను ఎప్పుడూ మానకపోయినా, అసలు తత్వశాస్త్రాన్ని తెలుసుకోవలసిన అవసరం ఉందని నాకు ఎప్పుడూ అనిపించలేదు." (పేజీ 14) ఇదీ అసలు విషయం. తత్వశాస్త్రంతో ఈ సమాజానికి అవసరమేది లేదని రంగనాయకమ్మ అభిప్రాయం. తెలుసుకోవలసిన అవసరం లేని ఒక

శాస్త్రం గురించి, పరిచయం అంటూ ఒక పుస్తకం ఎందుకు రాయవలసి వచ్చింది అని మరోసారి అనిపించక తప్పదు. రంగనాయకమ్మ తత్వశాస్త్రాన్ని అర్థం చేయించడానికి 'చిన్నపరిచయం' రాయలేదు, తత్వశాస్త్రంతో అవసరం ఏమిలేదని చెప్పడానికే రాశారు. అసలు రంగనాయకమ్మ "తత్వశాస్త్రం పెద్ద విమర్శ" అని పుస్తకం పేరు పెట్టాల్సింది. ఒక శాస్త్రాన్ని చదివి అర్థం చేసుకున్న తరువాతనే ఆ శాస్త్రం అవసరం ఉందా, లేదా అనే విషయం తేలుతుంది. కాని ఒక శాస్త్రాన్ని అరకొర అధ్యయనంతో, అర్థం చేసుకోకుండానే అవసరంలేని శాస్త్రమని ఎలా చెప్పగలుగుతారు ? అందుకే మావో, ఏ విషయాన్ని అయినా అధ్యయనం చేయనివారికి ఆ విషయం గురించి మాట్లాడే హక్కు లేదంటాడు. అధ్యయనం చేయకుండా ఏమి మాట్లాడుతారు, ఉత్తచెత్త తప్ప అని కూడా అంటాడు, మావో.

నిజానికి ఒక శాస్త్రం అర్థం కానపడు, అధ్యయనం చేయలేక పోయిననపడు, ఆ శాస్త్రం అవసరం ఉన్నదా లేదా అన్నవిషయాన్ని చెప్పలేరు. నిజాయితీ పరులైతే, ఫలానా శాస్త్రం నాకు అర్థం కాలేదు, దాని అంతు చిక్కలేదు, కావున దాని అవసరం ఉన్నదా లేదా అనే విషయాన్ని నేను ఎలా చెప్పగలుగుతాను, అని మాత్రమే అంటారు. అంతేకాని మనకు అర్థం కాని వాటినన్నింటిని పనికి రాని శాస్త్రాలు, అవసరం లేని శాస్త్రాలు అని చెప్పరు. రంగనాయకమ్మ తన కాపిటల్ పరిచయంలో కూడా తత్వశాస్త్రం గురించి తెలవకుండానే తత్వశాస్త్రం గురించి రాశారు. వారి ప్రకారమే "కాపిటల్ పరిచయంలో మార్క్సిజం, ఆర్థికశాస్త్రమే కాదు, తత్వశాస్త్రం కూడా అనే పేరుతో ఒక చాప్టర్ రాశానంటే, మార్క్సిజం గురించి తెలిసి ఉన్న అవగాహనతో చెప్పడమే గానీ, అది, తత్వశాస్త్ర చరిత్రేదో తెలుసుకుని రాశానని కాదు." (పేజీ 14) ఇక్కడ కూడా విచిత్రమే. మార్క్సిజం తెలిసింది కాని తత్వశాస్త్రం తెలవదు. అంటే రంగనాయకమ్మ గారి మార్క్సిజంలో తత్వశాస్త్రం లేదన్నమాట. తత్వశాస్త్రం, దాని చరిత్ర తెలవకుండా మార్క్సిజం తెలవడం విచిత్రమే. అవును మరి అవసరంలేని ఆ శాస్త్రం మార్క్సిజంలో ఎందుకు ఉంటుంది.

ఇక ఈ రెండవ చాప్టర్ నుండే మార్క్స్ మీద విసుక్కోవడం ప్రారంభం అవుతుంది. తత్వశాస్త్ర వ్యాసాలు ఎన్ని రకాలవి చదివినా 'భావవాదం' అర్థం ఏమిటో తెలిసిందేమి లేదు అంటారు. భావవాది అయిన హెగెల్‌కు, మార్క్స్ అంత విలువ ఎందుకు ఇచ్చాడు అని భాదపడుతారు రంగనాయకమ్మ. హెగెల్‌కు అంత విలువ ఎందుకు ఇవ్వాలో అని మార్క్స్ చెప్పిన కారణం కూడా తెలుసట. అయినా 'అఖండ భావం' గురించి మాట్లాడిన వ్యక్తికి అంత విలువ ఇవ్వాలా– అనే ప్రశ్న నన్ను వదలదు అంటారు. మార్క్స్, హెగెల్‌ను తన గురువుగా ప్రకటించుకున్నాడు. రంగనాయకమ్మ గారికి, హెగెల్ అంటే పడదు. కాని రంగనాయకమ్మ గారికి గురువైన మార్క్స్, స్వయంగా హెగెల్‌ను తన గురువుగా ప్రకటించుకున్నాడు. అంతేకాదు హెగెల్ తత్వశాస్త్రాన్ని చదవాలని కూడా చెప్పాడు. దానితో కోపం ఆగని రంగనాయకమ్మ, మరోసారి తత్వశాస్త్రం పైన విరుచుకు పడినారు. "పఠిస్తే తలకెక్కే తత్వాలా అవి ? ...... కొరుకుడు పడని శాస్త్రం ఏదైనా ఉందంటే అది తత్వశాస్త్రం ఒక్కటే ." (పేజీ 15) అంటారు. గురువు గారి (మార్క్స్) మాట కొరకు దజను తత్వశాస్త్ర గ్రంథాలు చదివినా ప్రయోజనం ఏమి లేదంటారు. కొంత ముందుకు వెళ్లి "అణువంత ప్రయోజనమైనా లేకపోతేనే కదా విసుగు పుట్టేది."అంటారు. ఇంతకు రంగనాయకమ్మ గారికి, కొరుకుడు పడక పోవడం వల్ల తత్వశాస్త్రం పనికి రాదంటున్నారా ? లేక దానితో ప్రయోజనమేమి లేదనుకోవడం వల్ల తత్వశాస్త్రం పనికి రాదంటున్నారా ?.. అనేది మనకు కొరుకుడు పడదు. అయినా ఎంత కష్టపడి చదివినా తత్వశాస్త్రంలో మనకు డిగ్రీలు ఏమైనా వస్తాయా చస్తాయా అన్నట్లు ఉంటుంది రంగనాయకమ్మ గారి ధోరణి. ఎంత పఠించినా "తత్వశాస్త్ర పండితులమై పోయేదేమి ఉండదు. ఆ గ్రంథాల ముందు ఎప్పుడూ ఒకటో తరగతి విద్యార్థుల్లా ఉండి పోవలసిందే. ఆ తరగతి దాటే పరిస్థితి నాకైతే ఎప్పటికీ రాదు." (పేజీ 15) అని తేల్చేశారు. అంటే తత్వశాస్త్రంలో ఒకటో తరగతి విద్యార్థి తత్వశాస్త్రాన్ని పరిచయం చేస్తున్నారన్నమాట. ఇంతే కాదు తత్వశాస్త్రం పైన రంగనాయకమ్మ గారికి అమూల్యమైన సందేహాలు కూడా చాలానే ఉన్నాయి. ఈ 2 వ చాప్టర్ కూడా సందేహంతోనే ముగుస్తుంది. "పాఠకుల్ని పండితుల్ని చేసే లక్షణం తత్వశాస్త్రానికి నిజంగా ఉందా ? – అని నా సందేహం. పండితుల్ని చేసేదాక ఎందుకు, పాఠకుల్ని పాఠకులుగా నిలబెట్టే లక్షణం అయినా ఆ శాస్త్రానికి ఉందా ? నా సందేహాలు నావి కదా ?" (పేజీ 15) తనకు తెలిసిన నిర్వచనం దగ్గర మొదలు పెట్టి ఈ రెండవ చాప్టర్‌ను, సందేహం దగ్గర ముగించారు. సందేహాలు తప్ప సందేశాలు లేని ఈ పుస్తకాన్ని ఎందుకు రాశారో అనే సందేహం నన్ను వదలడం లేదు.

### 3) తత్వశాస్త్రం అంటే ఏమిటి ?

రెండవ చాప్టర్‌లోనే తత్వశాస్త్రానికి నిర్వచనం చెప్పడానికి ప్రయత్నించినా, దాన్ని ఈ మూడవ చాప్టర్ ప్రారంభంలో మాత్రమే ముగించారు. తత్వశాస్త్రం అంటే ఏమిటి అనే ప్రశ్నకు ఇలా జవాబు ఇచ్చారు. "ఈ ప్రశ్నలకు జవాబుల కోసం, చాలా వ్యాసాలు, గ్రంథాలు చూసాను. చూడ్డమే కాదు, చదివాను. ఎక్కడా నాకు స్పష్టమైన జవాబులు దొరక లేదు. నాకే కాదు, నాలాంటి సాధారణ పాఠకులకు ఎవ్వరికైనా ఆ జవాబులు దొరుకుతాయని నేనైతే నమ్మను." (పేజీ 16) తత్వశాస్త్రం చిన్న పరిచయంలో మూడవ చాప్టర్ వరకు వచ్చేసరికి, అసలు తత్వశాస్త్రం అంటే ఏమిటి ? అనే దానికి, నిర్వచనమే లేదు అని తేల్చినారు. మొత్తానికి తత్వశాస్త్రానికి నిర్వచనమే లేదని చెప్పి, తత్వశాస్త్రాన్ని 'పరిచయం' చేయడం తక్కువ గొప్ప విషయం కాదు. పీడా పోయింది అని మాత్రం అనుకోకండి. తత్వశాస్త్రానికి నిర్వచనమే లేదు, ఇక చెప్పేదేమి ఉంటుందని, పుస్తకాన్ని మాత్రం ముగించలేదు రంగనాయకమ్మ. పుస్తకాన్ని కొనసాగించాలి కావున, ఇదీ తత్వశాస్త్రమే, అదీ తత్వశాస్త్రమే అంటూ మధ్య మధ్యలో చెపతూ కొనసాగించారు. ఇంత కంటే గొప్ప విషయం ఏమిటంటే, తత్వశాస్త్రం నిర్వచనం ఏమిటో తెలవకుండానే, తత్వశాస్త్రం నిజానికి ఒక శాస్త్రం కాదు అని నిర్ధారించి వేశారు. "ఇంగ్లీషులో ప్రకృతి శాస్త్రం అనేది ' సైన్స్'. తత్వశాస్త్రం అనేది ' ఫిలాసఫి'. ఆ పేర్ల తేడా వల్ల, ఆ రెండు ఒకటి కాదని ఇంగ్లీషు పాఠకులకు తెలుస్తుంది. అంటే తత్వాలకు 'శాస్త్రం' అనే పేరు ఉన్నా అది సైన్స్ లాంటిది కాదన్న మాట. సైన్స్ కాని తత్వశాస్త్రం దేన్ని గురించి చెపుతుంది. ? చెప్తే సైన్స్‌కి ఉన్న బలం దానికి ఉంటుందా." (పేజీ 16) ముందేమో నిర్వచనమే లేదు అన్నారు. తరువాత అది సైన్స్ కూడా కాదు పొమ్మన్నారు. అది దేని గురించి చెపుతుందో తెలవదు అంది. అది దేని గురించి చెప్పినా సైన్స్‌కు ఉన్నంత బలం ఉంటుందా అన్నారు. ఇది తత్వశాస్త్ర పరిచయం కాదు, ఇది రంగనాయకమ్మ గారి తత్వశాస్త్రం మాత్రమే. తత్వశాస్త్రం చెప్పేది ఏమి లేదనుకుంటూనే ఏదో ఒకటి చెప్పడానికి చేసిన ప్రయత్నం చూస్తే, రంగనాయకమ్మలో ఎంత గందరగోళం ఉందో అర్థం అవుతుంది. "తత్వాలు చెప్పే వాల్లే తత్వవేత్తలు. మానవులు సత్యమే

పలకాలి అని ఎవరైనా అంటే అది ఒక తత్వం" (తత్వం అంటే తత్వశాస్త్రం). అంటే తత్వశాస్త్రం, మానవులు సత్యమే పలకాలి, రోజూ స్నానం చేయాలి, చక్కగా తల దువ్వుకోవాలి లాంటి సూక్తులు చెపతుందన్నమాట. పోనీ మొత్తానికి రంగనాయకమ్మ తత్వశాస్త్రానికి ఏదో ఒక పని చూపించారు. కాని కొంత ముందుకు వెల్లగానే "ఆ సూక్తి సామాజిక శాస్త్రం చెపుతుందా ? నిజానికి అది సామాజిక శాస్త్రంలోకి చేరవలసిన సంగతే" (పేజీ 17) అంటారు. మళ్లీ ఒకసారి తత్వశాస్త్రం నిరుద్యోగం పాలవుతుంది. నాకూ ఒక ఉద్యోగం ఇవ్వండమ్మా అంటూ అది ఏడుస్తూ ఉండగానే, మళ్లీ ఏమి జరిగిందో తెలవదు కాని, తరివాతి పేరా మొదట్లోనే, "చెడు వినకు, చూడకు, మాట్లాడకు అన్న గాంధీ సూక్తి గొప్ప తత్వం అయిపోయింది." అని రాశారు. ఇటువంటివి సామాజిక శాస్త్రంలోకి వెళ్లాలి కదా? తత్వశాస్త్రంలోకి ఎలా వచ్చాయి ? బహుశా తత్వశాస్త్రం చెప్పేది ఏమీలేదంటే కుదిరేలా లేదనుకున్నారేమో, తత్వశాస్త్రానికి ఒక సారి ఉద్యోగం ఇస్తూ, మరో సారి లాక్కుంటూ చివరికి (తాత్కాలిక చివరికి) యురేకా అంటూ సమస్యను పరిష్కరించేశారు.

"మానవుల మధ్య సమానత్వ సంబంధాలు ఏర్పడాలి అని చెప్తే అది ఒక తత్వమే. ఆ తత్వాన్ని చెప్పే సామాజిక శాస్త్రం, మానవుల మధ్య ఆ మంచి సంబంధాలు ఎందుకు లేవో, అవి ఎలా ఏర్పడాలో కూడా చెప్ప గలుగుతుంది." అన్నారు. అంటే తత్వశాస్త్రం సూక్తులు మాత్రమే చెపుతుంది. సామాజిక శాస్త్రం ఆ సూక్తులను విశ్లేషించి, సమస్యలను పరిష్కరిస్తుంది. ఈ విధంగా రంగనాయకమ్మ తత్వశాస్త్రానికి, సామాజిక శాస్త్రానికి పనివిభజన చేసి సమస్యను తాత్కాలికంగా పరిష్కరించారు.

సైన్స్ – శాస్త్రాలు అభివృద్ధి కాని ఆదిమ కాలంలో, ఆదిమానవులు ఆకాశం వైపు చూసి ఈ సూర్యుడేమిటి, చంద్రుడేమిటి, నక్షత్రాలు ఏమిటి అనీ, ఇవన్నీ ఎలా వచ్చాయి అని చేసిన ఆలోచనలే తత్వశాస్త్రం అయ్యింది. కాని క్రమంగా వివిధ శాస్త్రాలు అభివృద్ధి చెందాయి. కావున ఇపడు కూడా ఆదిమకాలం నాటి తత్వశాస్త్రం అవసరమా, అనేది రంగనాయకమ్మ గారి ప్రశ్న. అది ప్రశ్ననా, సందేహమా, విమర్శనా అని చెప్పడం కూడా కష్టమే. రంగనాయకమ్మ గారి తత్వం కొరుకుడు పడితే గదా, ఎవరైనా స్పష్టంగా చెప్పగలిగేది. "సైన్స్ ల ద్వారా ఇన్ని జరుగుతుంటే, ఇంకా తత్వశాస్త్రం పాత్ర ఏమిటి ? ఇంకా తత్వశాస్త్రాలు ఎందుకు ? – ఇలాంటి సందేహాలతో నాలాగే ఇంకా చాలా మంది ఉన్నట్టు తత్వశాస్త్ర వ్యాసాలే చెపతున్నాయి." అంటారు రంగనాయకమ్మ. కాని మళ్లీ వెంటనే "పాఠకుల్ని, తత్వశాస్త్రం ఎందుకు ? అనే రకం సందేహాలు ఎందుకు వదలవంటే, అసలు తత్వశాస్త్రం అంటే ఏమిటో చక్కగా చెప్పిన గ్రంథాలు లేక. ముందు అది తెలిస్తేనే కదా, అది అవసరమో కాదో, ఎంత అవసరమో తెలిసేది." (పేజీ 18) అంటారు. మిగతా శాస్త్రాలన్నీ అభివృద్ధి చెందడంతో, తత్వశాస్త్రం అవసరం లేకుండా అయ్యిందని అంటున్నారా ? ... లేక చక్కగా చెప్పిన తత్వశాస్త్ర గ్రంథాలు లేకపోవడం వలన అవసరమో, అనవసరమో తెలియడం లేదని అంటున్నారా ? ఒకే సారి చెపుతున్న ఈ రెండు విషయాలలో దేనిని నమ్మాలి ? కఠినమైన పాషాణ భాషలో ఉన్న వ్యాసాలైనా, రెండు కాకపోతే పది డిక్షనరీలను పెట్టుకుని చదివితే ఈ రోజు కాకపోతే రేపైనా అర్థం అవుతాయి. లేకపోతే తెలిసిన వారినెవరినైనా అడిగితే ఇంకో రెండు రోజుల తరువాత అయినా తెలుస్తుంది. కాని రంగనాయకమ్మ గారి ఈ తత్వశాస్త్రం, వంద డిక్షనరీలు పెట్టుకుని చదివినా అర్థం కాదు. తెలిసిన వారు ఎవరూ ఉండరు కావున, తెలిసిన వారిని అడిగే ప్రశ్న కూడా ఉండదు.

తత్వశాస్త్రం ప్రత్యేకంగా చెప్పేది ఏమి లేదు అనే తన విమర్శకు కూడా, తత్వశాస్త్ర సమర్థకులు జవాబులు చెపుతారు, అంటూ రంగనాయకమ్మ ఇలా చెప్పారు. "దీనికీ జవాబులూ ఉంటాయి" అంటూ, మిగతా శాస్త్రాలన్నీ, ఆయా శాస్త్రాలకు సంబంధించిన విషయాల గురించే చెపుతాయి. ఒక్క తత్వశాస్త్రం మాత్రమే, 'సత్యం పలకాలి', 'సమానత్వం గొప్పది', 'ఏ పదార్థం అయినా మారుతూ ఉంటుంది, గానీ స్థిరంగా ఉండదు' లాంటి అన్ని శాస్త్రాలకు ఉమ్మడిగా వర్తించే నియమాలను చెపుతుంది, అని తన దాడికి అనుకూలంగా వివరించారు. సమానత్వం గొప్పది, అబద్దాలు ఆడరాదు అనేవి కూడా అన్ని శాస్త్రాలకు వర్తించే నియమాలేనా? వృక్షశాస్త్రంలో చెట్లకు కూడా, సత్యమే పలకాలని తత్వశాస్త్రం చెపుతుందన్నమాట. తత్వశాస్త్రాన్ని వక్రీకరించడమే ఇది. పదార్థం మారుతూనే ఉంటుందనే ఒక తత్వశాస్త్ర నియమాన్ని చెప్పినా కూడా, "అయితే ఆ నియమాన్ని చెప్పిన తత్వవేత్త దాన్ని ఎలా చెప్ప గలిగాడు? అన్ని పదార్థాలు ఎలా మారుతాయో ప్రతీదాన్ని పరిశీలించి చూశాడా?", (పేజీ 18) వాటికి ఆధారాలు ఉండవచ్చు, ఉండకపోవచ్చు అంటూ కొట్టి వేస్తారు రంగనాయకమ్మ. దీనికి ఉదాహరణనా, కొనసాగింపో తెలవదు కాని, ఎల్లయ్యల పుల్లయ్యల కథగా, ఒకే నదిలో రెండు సార్లు స్నానం చేయలేము అనే విషయాన్ని గొప్ప చాదస్తంతో (+అహంభావంతో) విశ్లేషించి గొప్ప మేధావిగా మురిసి పోయారు. హిరాక్రిటస్ భావం ఏమిటంటే పదార్థం నిత్యమూ, ప్రతి క్షణమూ మారుతూ ఉంటుందని. తను చెప్పదలుచుకున్న విషయాన్ని సులువైన ఉదాహరణతో చెప్పాడు. అలాగే చెపుతారు ఎవ్వరైనా. షవర్ కింద స్నానం చేసినా, బకెట్‌లో నీల్లతో స్నానం చేసినా ఒకే నీటితో రెండుసార్లు స్నానం చేయలేరు అని రంగనాయకమ్మ చెప్పిన విషయం, హిరాటస్ చెప్పిన విషయాన్ని ఖండించదు కదా.. కాకపోగా బలపరుస్తుంది.

అసలు సమస్య ఏమిటంటే, వేలు చూపిస్తే కొండ ఎక్కడం కాకుండా రంగనాయకమ్మ వేలునే ఎక్కి గోల చేశారు. అసలు విషయానికి వస్తే, అన్ని శాస్త్రాలకు వర్తించే నియమాలు ఉంటాయా ? ఉండవా ? లేనట్లైతే ఆ విషయాన్ని స్పష్టంగా చెప్పి, అప్పుడు తత్వశాస్త్రం అవసరం లేదని నిరూపించాలి. అంతేకాని పిట్ట కథలు చెపుతూ, ఆకుకు అందకుండా పోకకు పొందకుండా చెప్పడం పాఠకుల్ని మోసం చేయడమే అవుతుంది.

దీని తరువాత తత్వశాస్త్రం అవసరం లేదనే మరో వాదన చేశారు. తత్వశాస్త్రం వల్ల ఉపయోగం ఏమీలేకపోతే, అది ఒక శాస్త్రంగా ఎలా ఏర్పడుతుంది ? అలా ఏర్పడి ఉండేది కాదు కదా ? అని, ఖండించడం కొరకు తనే ప్రశ్న వేసి జవాబు ఇచ్చారు. మత గ్రంథాలు, జ్యోతీష్యాలు వేల సంవత్సరాల నుండి ఉండడం లేదా ?ఎంతో కాలం నుండి ఉండడమే ఉత్తమత్వానికి గుర్తు కాదు కదా ?అంటారు. మొత్తానికి తత్వశాస్త్రం ఏవిధంగానూ పనికిరానిది, పనిలేనిది అని చెప్పారు. అసలు ప్రశ్న ఏమిటంటే ఎంతో కాలం నుండి తత్వశాస్త్రం ఉండడమే ఉత్తమత్వానికి గుర్తు అని ఎవరన్నారు. అస్తిత్వంలో ఉన్న ప్రతిదాన్ని, దాని అస్తిత్వానికి అర్హత ఏమిటని ప్రశ్నించాలనే మార్క్స్ ఎంగెల్స్‌లు ఎపుడూ బోధించారు. తత్వశాస్త్రానికి అస్తిత్వంలో ఉండడానికి అర్హత లేకపోతే ఆ విషయాన్ని నిరూపించాలి, వక్రీకరించకుండ. కాని తత్వశాస్త్రం గురించి తెలియని రంగనాయకమ్మ, అర్థం చేసుకోలేని రంగనాయకమ్మ పిట్ట కథలు చెప్పడం తప్ప తత్వశాస్త్రం గురించి ఏమి చెప్పగలరు.?

*(ఇంకా ఉంది)*

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# ఖతార్ దిగ్బంధంతో గల్ఫ్ సంక్షోభం

***పశ్చిమాసియా దేశాలలో ఉన్న చమురు నిల్వలు, సహజ వాయువులపై ఆధిపత్యం సాధించడానికి అమెరికా అరబ్ దేశాల మధ్య వైరం పెంచుతోందనీ, ఈ కుతంత్రాల వల్ల ప్రజలు తీవ్రంగా నష్టపోతున్నారనీ అంటున్నారు*** **సంతోష్**

**1991** నాటి ఇరాన్–ఇరాక్ యుద్ధం తర్వాత ఎన్నడూ లేనంత అతిపెద్ద దౌత్య సంక్షోభం తాజాగా ఖతార్‌ను చుట్టుముట్టింది. అరేబియా ద్వీపకల్పంలో చిన్న దీవి మాదిరిగా ఉండే ఖతార్ జనాభా 23 లక్షలు. మూడు వైపులా సముద్రం కలిగి ఉంది. ప్రపంచంలోనే మూడవ అత్యధిక సహజ వాయువు, ముడి చమురు నిల్వలు కలిగిన ఖతార్ అత్యధిక ఆదాయం కలిగిన సంపన్న దేశం. ప్రపంచంలో అత్యధిక తలసరి ఆదాయం (1,29,700 డాలర్లు) కలిగిన దేశం. మొత్తం జిడిపి 156.6 బిలియన్ డాలర్లు. అత్యధిక మానావాభివృద్ధి కలిగిన దేశాల కోవకు చెందిన ఖతార్ గల్ఫ్ దేశాలలో ఆధునిక దృక్పథం కలిగిన దేశంగా పేరు పొందింది. ఖతార్ అరబ్ వసంతం (2011) కాలంలో ఎన్నో తిరుగుబాటు వర్గాలకు నైతికంగా మద్దతిచ్చి ఆర్థికంగా సహకరించింది. ప్రపంచవ్యాప్తంగా విస్తరించిన తన అల్ జజీరా మీడియా నెట్‌వర్క్ ద్వారా మద్దతు అందించింది.

19వ శతాబ్దం నుంచి ఖతార్‌లో రాజ్యాంగబద్ధ రాచరిక వ్యవస్థ కొనసాగుతోంది. 1916 నుంచి బ్రిటిష్ రక్షణలో ఉంది. ఖతార్ అమీరే దేశాధిపతిగా పాలన సాగిస్తారు. ఎన్నో ఏళ్ల పాటు బ్రిటిష్ సంరక్షణలో ఉన్న ఈ దేశానికి 1971 సెప్టెంబర్ 3న స్వాతంత్ర్యం లభించింది. అప్పటి నుంచి అల్–థనీ కుటుంబం ఖతార్‌ను పరిపాలిస్తోంది. ఖతార్‌కు ఒకవైపు సౌదీ అరేబియా, సముద్రానికి అవతలివైపు ఇరాన్. సౌదీ అరేబియా, కువైట్, ఖతార్, యుఏఇ, బెహ్రాన్, ఒమన్‌లు కలిసి పశ్చిమ దేశాల అండ దండలతో 1981లో గల్ఫ్ సహకార మండలి (గల్ఫ్ కోఆపరేషన్ కౌన్సిల్ –జిసిసి)గా ఏర్పడ్డాయి. తమలో తాము సహకారం వృద్ధి చేసుకుంటూ విదేశీ శక్తులపై ఆధారపడడం తగ్గించుకుంటూ రావడం ఈ మండలి లక్ష్యం. కాగా, రాజకీయ ఇస్లామిక్ ఉద్యమ సంస్థ అయిన ముస్లిం బ్రదర్‌హుడ్ కార్యకలాపాలను ఖతార్ బలపరచడం ప్రారంభించిన గత ఆరు సంవత్సరాల కాలం నుంచి గల్ఫ్ సహకార మండలి సభ్య దేశాలలో ఉద్రిక్తతలు మొదలయ్యాయి. ముస్లిం రాజరిక దేశాల్లో ముస్లిం బ్రదర్‌హుడ్ బలపడితే తమ రాచరిక వ్యవస్థలకు ముప్పు ఏర్పడుతుందని, పశ్చిమాసియాలో అస్థిరత్వానికి దారి తీస్తుందని సౌదీ అరేబియా దాని మిత్ర దేశాలు భయపడుతున్నాయి.

ముస్లింలను టెర్రరిస్టులుగా చిత్రీకరించి ఆరు ముస్లిం దేశాల నుండి అమెరికాలో ప్రవేశాన్ని నిషేధించిన ట్రంప్ మొదటి విదేశీ పర్యటన మొదటిసారిగా మే 20న కరుడుగట్టిన ఛాందసవాద ముస్లిం దేశమైన సౌదీ అరేబియాలో ప్రారంభించడం ఆశ్చర్యకరం. రాజరిక వ్యవస్థలో మానవ హక్కులను ఘోరంగా హరిస్తున్న సౌదీలో తన పర్యటన ప్రారంభించడం విశేషం. దీనికి కారణం మధ్య ప్రాచ్యంలో అమెరికాకు వంతపాడే దేశం సౌదీ అరేబియ కావడమే. 2016 సంవత్సరం వరకూ ప్రపంచంలో మిలిటరీకి ఖర్చు చేస్తున్న దేశాల్లో అమెరికా, చైనాల తర్వాత తృతీయ స్థానంలో సౌదీ ఉంది. ప్రపంచ దేశాలలో అత్యధిక రక్షణ వ్యయం సౌదీదే. తన జిడిపిలో 12 శాతం పైగా ఏటా 8500 కోట్ల డాలర్లు సౌదీ మిలిటరీ ఖర్చు చేస్తున్నది.

సౌదీతో ఆయుధ వ్యాపారమంటే అమెరికా ఆయుధ ఉత్పత్తి సంస్థలకు కాసులపంటే. ట్రంప్ సౌదీకి రాగానే కుదిరిన మొదటి ఒప్పందం ఆయుధ ఎగుమతుల, అమ్మకాలకు సంబంధించినది. నూటపది బిలియన్ల (11000 కోట్లు) డాలర్ల ఆయుధ దిగుమతులకు 9 ఒప్పందాలు సౌదీ కుదుర్చుకుంది. ఇది రానున్న 10 సంవత్సరాల్లో 350 బిలియన్ డాలర్లకు చేరుతుందని శ్వేతసౌధం ప్రెస్ సెక్రటరీ సారాహ్ సాండర్స్ చెప్పకనే చెప్పారు.

అమెరికా అధ్యక్షుడు ట్రంప్ మొరటు రాజకీయార్థిక విధానం పశ్చిమాసియాలో కూడా కనిపిస్తున్నది. సౌదీ అరేబియా, బహ్రాయిన్, ఈజిప్ట, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్(యుఎఇ) మొదలైన దేశాలు జూన్ 5 నుంచి ఖతార్ దేశంతో దౌత్య సంబంధాలను తెగతెంపులు చేసుకున్నాయి. జి.సి.సి. దేశాలు తమ దౌత్యవేత్తలను వెనక్కి రప్పించాయి. వెంటనే ఖతార్‌పై ఆర్థిక దిగ్బంధనం ప్రకటించాయి. ఇప్పటివరకు మొత్తం తొమ్మిది దేశాలు ఖతార్‌తో సంబంధాలను తెంచుకున్నప్పటికీ, నాలుగు దేశాల ఎడబాటు ప్రభావం ఖతార్ ఆర్థిక వ్యవస్థపై ఎక్కువగా ఉంటుంది. ఖతార్‌కు మూడు వైపులా పర్షియన్ జలసంధి ఉన్నందున, భూమార్గాన రాకపోకలన్నీ సౌదీ అరేబియా నుంచి సాగించాల్సిందే. ఈజిప్ట మినహాయిస్తే మిగతా మూడు దేశాలు సమీపంలో ఉండేవే. చమురు, సహజవాయువు నిక్షేపాలు ఎక్కువగా ఉండే ఖతార్ ఆహారాన్ని 40 శాతం సౌదీ అరేబియా నుంచి దిగుమతి చేసుకుంటుంది. సమీప అరబ్ దేశాలతో ఆర్థిక, వాణిజ్య సంబంధాలు, రాకపోకలు ఎక్కువ.

ఖతార్ పౌరులు 14 రోజుల్లోగా తమ దేశాన్ని వీడి వెళ్లాలని సౌదీ అరేబియా జూన్ 5న ఆదేశించడంతో పాటు ఖతార్‌తో ఉన్న సరిహద్దులను మూసివేసింది. ప్రస్తుత సంక్షోభం నేపథ్యంలో ఖతార్‌లోని తమ దేశీయులు వెనక్కి రావాలని సౌదీ సహా అనేక దేశాలు పిలుపిచ్చాయి. అదే విధంగా తమ దేశాల నుంచి ఖతార్ వాసులు వెళ్లిపోవాలని అవి ఆదేశించాయి. దీంతో అరేబియా ద్వీపకల్పంతో ఆ దేశానికి సంబంధాలు పూర్తిగా తెగిపోయాయని సౌదీ అరేబియా పేర్కొంది. గల్ఫ్ దేశాలు ఖతార్‌పైన ఆంక్షలను విధించిన తరువాత బ్రిటన్‌కు చెందిన కొన్ని బ్యాంకులు ఖతార్ కరెన్సీ రియల్‌తో లావాదేవీలను నిలిపివేశాయి. భూతల, వైమానిక, సముద్ర మార్గాల ద్వారా ఖతార్‌కు ప్రయాణికుల

రాకపోకలను నిలిపివేస్తామని ఆరు అరబ్ దేశాలు హెచ్చరించాయి. ఈ ఆకస్మిక నిర్ణయంతో మధ్య ప్రాచ్య దేశాల్లో పెను సంక్షోభం తలెత్తే పరిస్థితి ఏర్పడింది.

ఖతార్ అరబ్బు దేశాల మధ్య ఏకాకిగా మారినందున, ఆహారానికి, ఇతరత్రా ఇబ్బందులు ఎదుర్కొంటుంది. ఖతార్‌ను సంక్షోభ సమయంలో ఇరాన్, టర్కీ దేశాలు ప్రత్యక్షంగా రష్యా, ఒమన్, కువైట్‌లు పరోక్షంగా ఆదుకుంటున్నాయి. ఆహారం, ఇతర సరుకులు పంపుతున్నాయి. దిగ్బంధాన్ని విధించిన తర్వాత ఖతార్‌కు ఇరాన్ దిగుమతులు మూడు రేట్లు పెరిగాయి. అంతేగాక టర్కీ సైనిక స్థావరంలో ఆ దేశ బలగాల సంఖ్యను కూడా పెంచారు. మరోవైపు ఇరాన్ నుంచి 1100 టన్నుల కూరగాయలు, పండ్లు ప్రతీ రోజూ నౌకలద్వారా ఖతార్‌కు చేరుతున్నాయి. విమాన సర్వీసులను కూడా ఇరాన్ పెంచింది. గల్ఫ్ దేశాల మధ్య ఏర్పడ్డ సంక్షోభం ఎటు తిరిగి... ఎటు వెళ్తుందోనన్న ఆందోళన వ్యక్తమవుతోంది. ఖతార్ సమస్య గల్ఫ్‌లో మరో యుద్ధం ప్రజ్వరిల్లే ప్రమాదాన్ని కొనితెచ్చింది.

సౌదీ అరేబియా, లిబియా, ఈజిప్టు దేశాల్లో ఇస్లాం తీవ్రవాదులకు ఇరాన్ మద్దతుతో ఖతార్ అండదండలు అందిస్తోందనేది ప్రధానమైన ఆరోపణ. ముస్లిం బ్రదర్‌హుడ్, ఆల్-ఖైదా, ఇస్లామిక్ స్టేట్, మరికొన్ని ఇతర సంస్థలకు ఖతార్‌తో సన్నిహిత సంబంధాలున్నట్లు పొరుగు దేశాలు భావిస్తున్నాయి. వీటిని ఖతార్ తోసిపుచ్చుతోంది. నిజానికి తాలిబన్, ఆల్‌ఖైదా, ఐఎస్ సృష్టికర్త అమెరికానే. ఇరాన్ విషయంలో ఖతార్ మెతక వైఖరి అనుసరించడం సౌదీ అరేబియాకు నచ్చడం లేదు. ఇరాన్-సౌదీ అరేబియాకు మధ్య సత్సంబంధాలు లేవు. సౌదీలోని ఖతిఫ్ ప్రాంతంలో ఇటీవల కాలంలో అలజడులు అధికమయ్యాయి. ఇందుకు ఇరాన్ మద్దతు ఉన్న ఇస్లామిక్ తీవ్రవాద సంస్థలు ప్రధాన కారణమని సౌదీ అరేబియా అంటోంది. ట్రంప్ పర్యటన సందర్భంగా ఇరాన్‌కు వ్యతిరేకంగా సున్నీ అరబ్ దేశాల సైన్యాన్ని కూడగట్టాలనే వ్యూహరచన ఏదో జరిగిందనే అభిప్రాయాలు సర్వత్రా వెలువడుతున్నాయి.

అల్-ఖైదా మొదలుకొని ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్) వరకూ అన్ని సంస్థలకూ సౌదీ నుంచే నిధులందుతున్నట్టు యూరప్ యూనియన్ (ఇయు) ఇంటలిజెన్స్ నిపుణులు నిరుడు ప్రకటించారు. వివిధ ధార్మిక సంస్థల మాటున అనేక దేశాల్లో సౌదీ పాలకులు వెచ్చిస్తున్న నిధులు ఉగ్రవాద సంస్థలకు చేరుతున్నాయని అమెరికా సైతం తెలిపింది. అయినా తమ విధానాలను అది సరిదిద్దుకున్న జాడలేదు. ఖతార్ సిరియాలో కొన్ని ఉగ్రవాద సంస్థలతో చర్చలు జరిపి వారి చేతుల్లో బందీలుగా ఉన్నవారిని విడిపించిన సందర్భాలున్నాయి. అది ఆఫ్ఘనిస్తాన్ సర్కార్‌కూ, తాలిబన్‌లకూ మధ్య రాయబారాలు నడిపింది. 2015లో ఇరాక్‌లో కిడ్నాపుకు గురైన ఖతార్ రాజ బంధువులు 26 మందిని ఇరాక్‌లో కిడ్నాప్ చేసి ఇరాన్‌లో ఏడాదిన్నర కాలం పాటు బందీలుగా ఉంచిన వారిని విడిపించింది.

సౌదీ అరేబియాకు ఇరాన్ మొదటి నుంచి బద్ధ శత్రువు. ఖతార్ కొంతకాలంగా ఇరాన్‌తో సన్నిహితంగా వ్యవహరిస్తోందన్నది సౌదీ అభ్యంతరం! సున్నీ మెజారిటీ కలిగిన ఖతార్ గడిచిన కొన్నేళ్లుగా భిన్నమైన పంథాలోనే పయనిస్తోంది. సిరియా, లిబియా, ట్యునీసియా, ఈజిప్ట్‌లకు వ్యతిరేకంగా 2011లో (అరబ్ వసంతం) తిరుగుబాట్లు తలెత్తినప్పుడు ఆయా దేశాల్లోని ఉద్యమకారులకు ఖతార్ బహిరంగంగానే మద్దతు పలికింది. అరబ్ గడ్డపై చెలరేగిన ఆ తిరుగుబాట్లకు గట్టి ఆర్థిక మద్దతు ఇవ్వడంతోపాటు, ప్రభుత్వానికి చెందిన అల్‌జజీరా టివి ఛానల్‌లోనూ విస్తృత ప్రచారం కల్పించింది. అరబ్ తిరుగుబాట్లు సమసిపోయాక ఏర్పడిన ప్రభుత్వాలకూ ఖతార్ తన మద్దతు కొనసాగించింది. ఈజిప్ట్ మాజీ అధ్యక్షుడు, ముస్లిం బ్రదర్‌హుడ్ సంస్థకు చెందిన మహమ్మద్ మోర్సీకి ఖతార్ ప్రభుత్వం బలమైన దన్నుగా నిలిచింది. ఆ కారణంగా 2014 మార్చిలో సౌదీ అరేబియా-ఖతార్‌ల మధ్య దౌత్య సంబంధాలు తీవ్రంగా దెబ్బతిన్నాయి. దాదాపు ఎనిమిది నెలలపాటు ఉభయ దేశాల మధ్య ఉద్రిక్తతలు కొనసాగాయి. ఆఫ్ఘాన్ తాలిబన్లకూ ఖతార్ ప్రస్తుతం గట్టి మద్దతుదారుగా నిలుస్తోంది. తాలిబన్లు తమ గడ్డపై కార్యాలయం ఏర్పాటు చేసుకొనేందుకు ఖతార్ సర్కారు అనుమతించడం గమనార్హం!.

షియా ప్రాబల్య ఇరాన్ గల్ఫ్ ప్రాంతంలో బలమైన శక్తిగా ఆవిర్భవించింది. ఆ దేశంతో ఖతార్ అనుబంధం అంతకంతకూ బలపడింది. ఇవన్నీ సౌదీ అరేబియాను తీవ్ర కలవరానికి గురిచేశాయి. ఈజిప్ట్‌లో ముస్లిం బ్రదర్‌హుడ్‌కు, సిరియాలో అల్ ఖైదాకు, ఆఫ్ఘాన్‌లో తాలిబన్లకు మద్దతు పలికిన ఖతార్‌ను సౌదీ అరేబియాతో పాటు అరబ్ సమాజంలోని మిగిలిన సున్నీ ప్రాబల్య దేశాలన్నీ ప్రమాదకారిగా పరిగణిస్తున్నాయి.

అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ సౌదీ అరేబియాలో పర్యటించిన వెంటనే అక్కడి పరిస్థితిలో ఒక్కసారిగా మార్పు వచ్చింది. ఖతార్‌పై దౌత్యపరమైన ఒత్తిడి తేవాలని, అందుకుగాను అరబ్‌లోని సున్నీ మిత్ర రాజ్యాలన్నీ ఒక్క తాటిపైకి రావాలని, ఆ బాధ్యతను సౌదీ అరేబియా నెత్తికెత్తుకోవాలని ఆయన సూచించినట్లు విధితమవుతుంది. ఆ తరువాతనే ఖతార్ పట్ల సౌదీ వైఖరిలో గణనీయమైన మార్పును గమనించవచ్చు.

సౌదీ అరేబియా, ఇజ్రాయిల్‌లో పర్యటించిన అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ రెండు ప్రధాన విషయాలపై దృష్టిని కేంద్రీకరించి తన పర్యటన కొనసాగించారు. మొదటిది ఈ దశాబ్దానికి సౌదీతో 35,000 కోట్ల డాలర్ల ఆయుధాల అమ్మకాలు. రెండవది ఇరాన్‌ను టెర్రరిస్టు దేశంగా పిలిచి ఇరాన్ వ్యతిరేక ఫ్రంట్‌ను ఏర్పాటు చేయమని అరబ్ దేశాలకు సందేశమివ్వడం. యూరప్‌లో రష్యా వ్యతిరేక నాటో వంటి మిలిటరీ కూటమిని మధ్యప్రాచ్యంలో ఇరాన్‌ను వ్యతిరేకించే సున్నీ ముస్లింల కూటమిని ఏర్పాటు చేసుకోవాలని ట్రంప్ బహిరంగంగా పిలుపునిచ్చాడు.

అమెరికా కూటమిలోని మిగతా అరబ్బు దేశాల మాదిరిగా కాకుండా ఖతార్ కొంత స్వతంత్రంగా వ్యవహరిస్తున్నది. ఖతార్ అమెరికాతో ఆర్థిక, వాణిజ్య, సైనిక సంబంధాలు కొనసాగిస్తూనే ఇరాన్‌తో కూడా సన్నిహితంగా ఉంటోంది. పాలస్తీనాపై ఇజ్రాయిల్ సాగిస్తున్న దురాగతాలను ఎదురిస్తున్న హమస్‌కు ఖతార్ మద్దతివ్వడం కూడా అమెరికా, సౌదీలకు నచ్చడం లేదు. దీంతో అమెరికా కనుసైగల మేరకే ఖతార్‌ను ఏకాకిని చేసే వ్యూహం గల్ఫ్‌లో అమలవుతున్నది.

బెహ్రాన్‌లో రాచకుటుంబ వ్యతిరేకులను, యెమెన్‌లో సౌదీ వ్యతిరేక హౌతీ తిరుగుబాటుదారులను, సౌదీ అరేబియాలో షియాలు నివసించే ప్రాంతంలో సౌదీ పాలనకు వ్యతిరేకులను, ఇరాన్ అండ ఉన్న గ్రూపులతో పాటు పలు ముస్లిం తీవ్రవాద సంస్థలను ఖతార్ సమర్థిస్తున్నదని సౌదీ అరేబియా ఆరోపిస్తున్నది. ఖతార్ ఈ ఆరోపణలను నిర్ద్వందంగా ఖండిస్తున్నది. సౌదీ తన ఆర్థిక వ్యవస్థను నాశనం చేసే ఉద్దేశంతో ఖతార్‌ను దిగ్బంధానికి గురి చేసిందని, తమను ఒక సామంత రాజ్యంగా మార్చడానికి సౌదీ ప్రయత్నిస్తున్నదని ఖతార్ అంటుంది.

ఖతార్ కేంద్ర స్థానంగా మొదలైన ఈ వివాదంలో ఒకపక్క సౌదీ అరేబియా, మరోపక్క ఇరాన్ వైరి పక్షాలుగా నిలిచాయి. ఈ వివాదం ఎటుతిరిగి ఎటు వెళ్తుందోననేది అర్థంకాని స్థితి. ఇప్పటికిప్పుడు పరిష్కారం దొరికే సంకేతాలు కనిపించటం లేదు. ఈ వివాదం దీర్ఘకాలం కొనసాగితే గల్ఫ్ దేశాలు ఆర్థికంగా కుంగిపోవడం ఖాయం. దీని ప్రభావం ప్రపంచ దేశాలపై పడక తప్పదు.

వాస్తవానికి ఖతార్ గల్ఫ్‌లో ఒక ఆర్థిక శక్తి. అమెరికా మిలటరీ సెంట్రల్ కమాండ్ ప్రధాన కార్యాలయం కూడా ఖతార్‌లోనే ఉంది. ఇరాక్, సిరియాలో ఉన్న ఇస్లామిక్ స్టేట్ ఉగ్రవాదులపై విమాన దాడులు జరిపే అమెరికా ఎయిర్ వార్ కమాండ్ కూడా ఖతార్‌లోనే ఉంది. అందువల్ల ఖతార్ దీర్ఘకాలంగా ఏకాకిని చేసే ఏ ప్రయత్నమైనా ఇస్లామిక్ స్టేట్‌పై జరిపే పోరును పరోక్షంగా బలహీనం చేసినట్టే అవుతుందన్నది ఖతార్‌ను సమర్థించే దేశాలు భావిస్తున్నాయి. ఖతార్‌ను బహిష్కరించడం వల్ల తక్షణ పర్యవసానం చమురు ధరలు పెరగడం. ద్రవీకృత సహజ వాయువు (ఎల్‌పిజి) ను, సహజ వాయువును నుంచి శుద్ధిచేసిన ఘన, తక్కువ సాంద్రత ద్రవీకృత ఇంధనాన్ని ప్రపంచ దేశాలకు భారీ ఎత్తున సరఫరా చేసే ఖతార్‌ను దూరంగా పెట్టడం వల్ల అనేక దేశాలపై ఆర్థిక ప్రభావం చూపుతుంది.

ఖతార్‌లో ఇప్పటికీ అమెరికా సైనిక స్థావరం ఉన్నది. ఖతార్‌లో తన సైనికులను కొనసాగిస్తూనే, ఆ దేశాన్ని ఏకాకిని చేయడానికి అమెరికా పావులు కదుపుతున్నది. విస్తారమైన చమురు వనరులున్న పశ్చిమాసియాను గుప్పిట పెట్టుకోవడానికి అమెరికా కొన్ని దశాబ్దాలుగా అక్కడి రాజకుటుంబాలను కాపాడుతున్నది. ఇరాక్, సిరియా, లిబియా మొదలైన దేశాల్లో అరబ్బు జాతీయవాదం, సామ్యవాదం ప్రాతిపదికగా ఉద్యమాలు వచ్చి కొత్త ప్రభుత్వాలు ఏర్పడినప్పుడు, సౌదీ అరేబియా, కువైట్, ఎమిరేట్స్, ఖతార్ దేశాలలో రాచరికాలను తమ సైన్యాలను పెట్టి కాపాడింది. ఈ విధంగా చమురు గనులపై పట్టును సాధించింది. ఇరాన్‌లో వచ్చినట్టుగా తిరుగుబాట్లు రాకుండా, సున్నీ షియా విభేదాలను సృష్టించింది. ఇరాన్ షియా దేశమైనందున, సౌదీ అరేబియా నాయకత్వంలో సున్నీ మిలిటెంట్లను తయారుచేసి పోరాటాలను సృష్టించడం అమెరికా వ్యూహంలో భాగమే.

ఖతార్‌లో ఉన్నది కూడా రాచరిక పాలనే. కానీ సామాజికాభివృద్ధి సాధించడంతోపాటు, దేశాన్ని అన్నివిధాలా అభివృద్ధి చేస్తున్నది. సౌదీ అరేబియా మాదిరిగా అమెరికా–ఇజ్రాయెల్ కూటమికి అనుగుణంగా పనిచేయకుండా, స్వతంత్ర్యంగా వ్యవహరిస్తున్నది. పశ్చిమాసియా వివాదాలలో మధ్య వర్తిత్వం వహిస్తున్నది. అరబ్బు దేశాలలో ఆధునిక వ్యవస్థలు ఏర్పడడానికి కృషి చేస్తున్నది. అల్ జజీరా వార్తా ఛానల్ ఏర్పాటు చేసి పాశ్చాత్య మీడియాకు పోటీగా నిలిపింది. ఇరాక్‌పై దాడి సందర్భంగా పాశ్చాత్య టీవీ ఛానెల్స్ తటస్థంగా ఉన్నట్టు కనిపిస్తూనే తప్పుడు వార్తలు ఇచ్చే తీరును అల్ జజీరా ఎండగట్టింది. ఇరాన్‌తో శత్రుత్వాన్ని పెంచుకోకుండా సత్సంబంధాలు నెలకొల్పుకుంటున్నది. ఇవన్నీ అమెరికా కూటమి ఆగ్రహానికి కారణమయ్యాయి. ఇంతకాలం పశ్చిమాసియాలో నెలకొన్న సంక్లిష్ట పరిస్థితుల కారణంగా ఖతార్‌ను తటస్థంగా ఉంచడానికి అమెరికా ప్రాధాన్యమిచ్చింది. అయితే ట్రంప్ అధికారానికి వచ్చిన తరువాత అతడి యుద్ధోన్మాద ఫలితమే ఖతార్‌ను ఏకాకిని చేయడం.

డొనాల్డ్ ట్రంప్ సౌదీ పర్యటన సందర్భంగా జిసిసిలోని ఆరు దేశాలతో పాటు ఇతర దేశాలకు చెందిన 50 మంది అరబ్, ముస్లిం నాయకుల నుద్దేశించి ప్రసంగించారు. ఉగ్రవాదానికి వ్యతిరేకంగా పోరాడండని పిలుపునిచ్చారు. గల్ఫ్‌లో మళ్లీ తన పెత్తనాన్ని పటిష్టం చేసుకోవడానికి సౌదీకి ఇంతకన్నా అవకాశం దొరకదు. అందుకే అందరినీ పోగేసి ఖతార్‌పై కత్తిగట్టింది. అయితే ఖతార్ చెప్పుకుంటున్నట్టు దానికి ఉగ్రవాద సంస్థలతో నిజంగా ఎలాంటి ప్రమేయమూ లేదా? ఖతార్ గురించి అయినా, ఆ మాటకొస్తే సౌదీతో సహా గల్ఫ్‌లోని ఏ దేశానికైనా ఆ విషయంలో క్లీన్ చిట్ ఇవ్వడం అంత సులభమేమి కాదు. ఆ దేశాల్లోని పాలకులందరూ అమెరికా చెప్పుచేతల్లో నడిచేవారే. అమెరికా ప్రయోజనాలకు అనుగుణంగా నడుచుకునేవారే. 'ఉగ్రవాదంపై యుద్ధం' పేరిట 2001 నుంచి అమెరికా ప్రపంచవ్యాప్తంగా సాగిస్తున్న చర్యలన్నిటికీ అండగా నిలుస్తున్నవారే. మరోపక్క తమ తమ ప్రయోజనాల పరిరక్షణ కోసం అవసరమైతే ఆ ఉగ్రవాద సంస్థలతో లాలూచీ పడడానికి వెరవని నైజం అక్కడి పాలకులది.

ఖతార్ నుంచి ఒక్కసారిగా వివిధ అరబ్ దేశాలకు చెందిన కార్మిక శక్తి వెనక్కి మరలితే తాత్కాలికంగానైనా కార్మికులకు కటకట ఏర్పడవచ్చు. అయితే గల్ఫ్ అరబ్ సంక్షోభం వల్ల భారత్‌పై రెండు రకాలుగా ప్రతికూల ప్రభావం పడనుంది. ఖతార్‌లో పారిశ్రామిక, నిర్మాణ రంగాల మనుగడకు విఘాతం కలుగవచ్చు. ఆయా రంగాల అస్తిత్వానికి కీలకమైన నిర్మాణ, ఇతర సామాగ్రిని ఖతార్‌కు సరఫరా చేయడం కుదరదు.

ఖతార్‌లో నిర్మాణ పరిశ్రమను అంటిపెట్టుకుని పెద్దసంఖ్యలో పనిచేస్తున్న భారతీయులు దీనివల్ల తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొనవచ్చు. పైపెచ్చు ఖతార్‌లో 210 కోట్ల డాలర్ల విలువైన రహదారి ప్రాజెక్టును, ఆ దేశ రాజధాని దోహాలో 74 కోట్ల డాలర్ల విలువైన మెట్రో రైల్ ప్రాజెక్టును భారతీయ నిర్మాణ కంపెనీలు నిర్మిస్తున్నాయి. లక్షల మంది భారతీయులు ఆ ప్రాజెక్టు పనుల్లో పాల్గొన్నారు. అక్కడి నిర్మాణ రంగం ఇబ్బందుల్లో పడితే భారతీయ కంపెనీలతోపాటు, ఉద్యోగులూ పెద్దఎత్తున నష్టపోతారు. ఖతార్‌లో భారతీయ కంపెనీలైన ఎల్అండ్‌టి, వోల్టాస్, సింప్లెక్స్, టిసిఎల్, విప్రో, హెచ్‌సిఎల్, షాపూర్జీ పల్లోంజీ తదితర కంపెనీలు, ఎస్‌బిఐ, ఐసిఐసిఐ బ్యాంకు, కొన్ని ఇతర బ్యాంకులు కార్యకలాపాలు సాగిస్తున్నాయి.

జూన్ 23న తాజాగా ఐదు దేశాల కూటమి ఖతార్‌కు 10 రోజుల వ్యవధినిచ్చి 13 డిమాండ్లతో కూడిన ఫర్మానా జారీ చేసింది. ఈ డిమాండ్లకు ఖతార్ ఆమోదం తెలపకపోతే తీవ్ర పరిణామాలుంటాయని సౌదీ అరేబియా, తన మిత్రదేశాలు హెచ్చరించాయి. తద్వారా ఖతార్‌ను రాజకీయ, మిలిటరీ, ఆర్థిక ఒత్తిడికి సౌదీ అరేబియా గురిచేస్తున్నది. ఖతార్ టెర్రరిస్టుల పేర్లను తక్షణమే చెప్పాలని డిమాండు చేయగా, టెర్రరిస్టులతో సంబంధాలు లేవని చెప్పింది.

ముఖ్యంగా అరబ్ దేశాల్లోనేగాక, ప్రపంచమంతా మధ్యప్రాచ్య వార్తలకు తాజా సమాచారం అందించే అల్–జజీరా టెలివిజన్ సంస్థ ప్రసారాలను తక్షణమే ఆపివేయాలని సౌదీ హుకుం జారీ చేయడం పత్రికా, మీడియా స్వేచ్ఛపై సౌదీకి ఉన్న నిరంకుశత్వాన్ని తెలియజేస్తోంది. మరోవైపు అమెరికా గల్ఫ్ మిత్రదేశాల మధ్య రగిలిన చిచ్చు అమెరికా సైన్యానికి సమస్యలను కొనితెస్తుందని న్యూయార్క్‌టైమ్స్ పత్రిక రాసింది. ఖతార్ దిగ్బంధంపైన వైట్ హౌస్, విదేశాంగ శాఖల మధ్య విభేదాలు ఉన్నట్లు తెలుస్తోంది.

ఇరాన్‌తో సంబంధాలను రద్దు చేసుకోవడమేగాక ఇరాన్‌లోని ఖతార్ రాయబార కార్యాలయాన్ని తక్షణమే మూసివేయాలనడం ఖతార్ సార్వభౌమాధికారాన్నే ప్రశ్నించడంగా ఉంది. అలాగే ఖతార్‌లో ఉన్న టర్కీ సైన్యాన్ని వెంటనే బహిష్కరించి సౌదీ అరేబియా నిర్దేశించే విధంగా తన దౌత్య, సైనిక, ఆర్థిక విధానాలను రూపొందించుకోవాలని, ఖతార్ ఇప్పటిదాకా అవలంభించిన విధానాలవల్ల జరిగిన నష్టానికి పరిహారాన్ని చెల్లించాలని, ఈ చర్యలు అమలవుతున్న తీరుపై రాబోయే పదేండ్లపాటు లోతైన పర్యవేక్షణ ఉంటుందని కూడా హెచ్చరించింది.

కాగా ఖతార్ రాజకీయంగా, మిలిటరీ పరంగా, ఆర్థికపరంగా మిగతా సౌదీ అరేబియా మిత్ర దేశాలవైపే ఉండాలని కోరుకోవడం ద్వారా ట్రంప్ మే నెల పర్యటనలో ఇరాన్ వ్యతిరేక కూటమిని ఆచరణలోకి తెస్తున్నట్లుంది. సౌదీ అరేబియా ఖతార్‌పై తీసుకున్న చర్య ఇరాన్‌ను బలహీనపరుస్తుందనే భావనతో ఇజ్రాయిల్ స్వాగతిస్తున్నది. సౌదీ అరేబియా వలెనే ఇజ్రాయిల్ కూడా ఇరాన్‌ను తన వ్యూహాత్మక శత్రువుగా పరిగణిస్తున్నది.

సౌదీ రాచరిక వ్యవస్థ జారీ చేసిన డిమాండ్లు ఆచరణ యోగ్యంగా లేవు. జూలై 3 తర్వాత ఖతార్‌పై విధించిన దౌత్య, ప్రయాణ, వ్యాపార దిగ్బంధాన్ని దాటి ఆ దేశాన్ని శిక్షించాలనే దురుద్దేశంతో సౌదీ అరేబియా, దాని మిత్ర దేశాలు ఇటువంటి డిమాండ్లను ముందుకు తెచ్చాయి. సౌదీ డిమాండ్లను గనుక ఖతార్ ఒప్పుకుంటే ఆ దేశం సౌదీ అరేబియాకు సామంత రాజ్యంగా మారుతుంది. సౌదీ డిమాండ్లను తిరస్కరించి అష్ట దిగ్బంధంలో ఉక్కిరిబిక్కిరి అవుతున్న ఖతార్‌ను ఇరాన్, టర్కీలు ఆదుకుంటున్నాయి. టర్కీ సైన్యాన్ని బహిష్కరించాలని డిమాండ్ చేయడం 'టర్కీని అవమానించడం'గా ఆ దేశ అధ్యక్షుడు టయ్యిప్ ఎర్డోగన్ పేర్కొన్నారు. సౌదీ అరేబియా అంతిమ హెచ్చరిక వెనుక గల్ఫ్ ప్రాంతంలో ఇరాన్ పలుకుబడిని కాలరాయాలనే వ్యూహం ఉంది.

13 డిమాండ్లతో గల్ఫ్ దేశాలు ఇచ్చిన అల్టిమేటంను ఖతార్ జూలై 3న నిర్ద్వంద్వంగా తిరస్కరించింది. అంతేకాదు.. ఎలాంటి పర్యవసానాలు కలిగినప్పటికీ వాటిని ఎదుర్కొనేందుకు తాము సిద్ధంగా ఉన్నామని ఖతార్ ప్రకటించింది. సౌదీ అరేబియా, ఈజిప్టు, బెహ్రాన్, యునైటెడ్ అరబ్ ఇమిరేట్స్ ఇచ్చిన అల్టిమేటంలోని డిమాండ్లు తాము తిరస్కరించడానికే చేసినట్టుగా ఉన్నాయని ఆ దేశం పేర్కొంది. ఖతార్ విదేశాంగమంత్రి షేక్ మహమ్మద్‌బిన్ అబ్దుల్ రహమాన్ అల్‌థాని మాట్లాడుతూ అరబ్ దేశాల డిమాండ్లు అంగీకరించదగినవి కావని, అంతర్జాతీయ చట్టాలు ఉన్నాయని అవి చిన్నచిన్న దేశాలను పెద్ద దేశాలు వెంటాడడానికి, ఒక స్వతంత్ర దేశానికి అల్టిమేటం ఇచ్చే అధికారం ఎవరికీ లేదని తెలిపారు. రోమ్‌లో ఆయన విలేకరులతో మాట్లాడుతూ అమెరికా విదేశాంగ శాఖమంత్రి రెక్స్ టిల్లర్సన్‌తో తాను ఈ అంశాన్ని చర్చించానని కూడా తెలిపారు.

మధ్యప్రాచ్యం, గల్ఫ్ దేశాలలో చమురు, సహజ వాయు వనరులపై, ఆధిపత్యం చెలాయించడానికి పచ్చి అభివృద్ధి నిరోధక ప్రభుత్వాలకు మద్దతునిస్తున్న అమెరికా సామ్రాజ్యవాదం ఈ ప్రాంతాన్ని ఎడతెగని యుద్ధాలకు నిలయంగా మారుస్తున్నది. దీనితో ఇప్పటికే లక్షలాది ప్రజలు విగతజీవులయ్యారు.

మధ్యప్రాశ్చ్యంలో ఇరాన్ ఒక బలమైన శక్తిగా ఎదగనీయకుండా ఉండడానికే సౌదీ ప్రయత్నం. దీని నిమిత్తం ముస్లింల మధ్య సున్నీ-షియాల కార్డును సౌదీ, అమెరికాలు ప్రయోగిస్తూ నూతన ఉద్రిక్తతలను ప్రోత్సహిస్తూ, మధ్యప్రాశ్చ్యాన్ని ఆరని జ్వాలగా ఉంచి, రావణాకాష్టం చేసి చమురు దోచుకోవడానికి తద్వారా ఈ దేశాల్లో సామ్రాజ్యవాద ఉత్పత్తులను అధిక ధరలకు అమ్ముకోవడానికి మార్కెట్లను పదిలపర్చుకోవడమే అమెరికా తాపత్రయం. ఏతావాతా ఆధిపత్యం కోసం జరుగుతున్న కుమ్ములాటకు ఉగ్రవాద వ్యతిరేక రంగు పులిమి ప్రపంచ ప్రజలను వంచించడానికి సౌదీ ప్రయత్నిస్తోంది. ఈ దేశాలన్నీ అమెరికాకు కావలసినవే. మొత్తంగా చూస్తే రష్యా-ఇరాన్-సిరియాలను బలహీన పర్చడమే ఖతార్ నిర్బంధ ధ్యేయం.

ఇవాళ రెండవ ప్రపంచ యుద్ధం నాటి రాజకీయార్థిక పరిస్థితులు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ఒకవైపు ఆర్థిక సంక్షోభం మరోవైపు ప్రజా ఆందోళనలు విస్తృతమవుతున్నాయి. ఇవాళ ప్రపంచ ఆర్థిక సంక్షోభం చాలా తీవ్రంగా ఉన్నది. మార్కెట్ల కోసం, చౌక శ్రమ కోసం, సహజ వనరులపై ఆధిపత్యం కోసం, వ్యూహాత్మక భౌగోళిక ప్రయోజనం కోసం సామ్రాజ్యవాద దేశాలు తమపై గల భారాన్ని ఇతర దేశాలపై రుద్దడానికి వెనుకాడడం లేదు. పెట్టుబడిదారీ వ్యవస్థ విచ్ఛిన్నమవుతున్న స్థితిలో సామ్రాజ్యవాద దేశాల మధ్య వైరుధ్యాలు పరిష్కరించ వీలులేని స్థితికి చేరుకుంటాయని మార్క్స్ తెలిపాడు. అటువంటి స్థితిలో తలెత్తే వేరువేరు స్థానిక ఘర్షణలు ప్రపంచ స్థాయి ఘర్షణలుగా మారతాయి. అలాంటి యుద్ధాలు తన ఆధిపత్యానికి ప్రమాదకారిగా మారతాయని పెట్టుబడిదారీ వర్గానికి తెలిసినప్పటికీ వాటిని నివారించే శక్తి ఆ వర్గానికి ఉండదని లెనిన్ పేర్కొన్నాడు. అటువంటి పరిస్థితులలోనే ప్రపంచ యుద్ధాలు సంభవిస్తాయి.

ఈ నేపథ్యంలోనే మధ్యప్రాచ్యంలోని రాచరికాలను, సైనిక పాలకులను కూడగట్టి ఇజ్రాయిల్ సహకారంతో ఖతార్‌ను దిగ్బంధించాలని సౌదీ అరేబియా ప్రయత్నిస్తున్నది. మరోవైపు సిరియాలో అసద్ ప్రభుత్వాన్ని ఎలాగైనా కూలదోయాలని అమెరికా ప్రయత్నిస్తున్నది. ఇంకొకవైపు టర్కీ, ఇరాన్‌లు ఖతార్‌కు క్రియాశీలంగా తమ మద్దతు ఇస్తున్నాయి. సిరియాలో అణ్వస్త్ర అమెరికా, రష్యా సైన్యాలు ఎదురెదురుగా మోహరించి ఉన్నాయి. నేటి ప్రపంచ రాజకీయాలలో అస్థిరతకు అమెరికా సామ్రాజ్యవాదం ప్రధానకారణం. 1914లో ఆస్ట్రియాకు జర్మనీ ఎలా మద్దతు ఇచ్చిందో అలానే పర్షియన్ గల్ఫ్ ప్రాంతంలో సౌదీ అరేబియాను అమెరికా ఎగదోస్తున్నది. సౌదీ అరేబియా దూకుడును అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ ప్రోత్సహిస్తున్నారు. అమెరికా దన్నుతోనే ఖతార్‌పై సౌదీ అరేబియా కయ్యానికి కాలు దువ్వుతున్నది.

చమురు నిల్వలతో కళకళలాడుతున్న గల్ఫ్ దేశాలు విజ్ఞత ప్రదర్శించి సమస్యను శాంతియుతంగా చర్చల ద్వారా పరిష్కరించుకుంటారో లేక సామ్రాజ్యవాద అమెరికా ఉచ్చులో చిక్కుకుని మరో యుద్ధాన్ని కొని తెచ్చుకుంటారో వేచిచూడాలి. ఖతార్‌లో సౌదీ అరేబియా ప్రారంభించిన యుద్ధక్రీడ మానవాళి భవితనే ప్రశ్నార్థకం చేసే మహాయుద్ధంగా పరిణమించే ప్రమాదం పొంచి ఉంది.

యావత్ ప్రపంచ ప్రజల క్రియాశీల జోక్యంతో మాత్రమే ఈ ఘర్షణాయుత వాతావరణం మహా యుద్ధంగా మారకుండా నివారించాల్సి ఉంటుంది. అందుకోసం ప్రజాతంత్ర శక్తులు శాంతికాములు, బుద్ధిజీవులు ప్రజలను సమీకరించడం నేటి బృహత్తర కర్తవ్యం.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ప్రాధాన్యతను కోల్పోతున్న మీడియా

***ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలో ప్రాధాన్యత కలిగిన వార్తలకు స్థానం లేకుండా పోతోందనీ, ప్రచారార్భాటాలకు పోయి విలువలు కోల్పోతోందనీ అంటున్నారు విద్యాభూషణ్***

నిన్నటి మధ్యప్రదేశ్ రైతాంగ ఆందోళన కాల్పుల్లో ఆరుగురు మృతి. మరోవైపు పంటకు గిట్టుబాటు ధర లభ్యం కాక రైతాంగం రోడ్డున పడుతుంది చాలా కాలంగా. కడకు ఆత్మహత్యలకు పాల్పడి అసహజ మరణాలు గురయిన వారు లక్షల్లో ఉన్నారు. దేశ వ్యాప్తంగా జరుగుతున్న ఈ అన్నదాతల బలిదానాలు మన మీడియాను కదిలించలేక పోయాయి. కానీ మాదక ద్రవ్యాలకు బానిసైన ఓ నలుగురు సినిమా వాళ్లకు ఎక్సైజ్ అధికారులు నోటీసులు ఇస్తే మాత్రం అదో ప్రపంచ సమస్య అయిపోయింది వీరికి. ఇక రోజంతా టివి మాధ్యమాలన్నింటిలోనూ మార్చి మార్చి 24 గంటలూ చూపిస్తూ, స్క్రోలింగులిస్తూ, దానిపై పండిత ప్రకర్ష చర్చల కొనసాగింపు. ఇంత ప్రయాస ఈ ప్రచార మాధ్యమాలకు అవసరమా? అవసరమే! ఎందుకంటే? ఇదో బంగారు బాతుగుడ్డు వారికి. వారికే కాదు అటు ఎక్సైజ్ అధికారులకు – పాలక పార్టీ శ్రేణులకు, వీరితో పాటు మీడియా మిత్రులకు. ఎలా అంటే ఈ మాదక ద్రవ్యాల వినికిడి ఈనాటిది కాదు. సుమారు రెండు దశాబ్దాల క్రితమే వెల్లడైంది. అయితే ఇప్పుడు గుట్టు చప్పుడు కాకుండా మరోమారు వెలుగు చూసింది. ఈ వెల్లడికి ఓ ప్రేరణ ఉంది. అటు రైతాంగ ఆందోళనలు – సరిహద్దుల్లో యుద్ధ ప్రతీకారాలు – మరోవైపు భక్తి పారవశ్యంతో యాత్రికుల ప్రమాద మరణాలు – టెర్రరిస్టుల ఉనికిని చాటుకునే తీవ్ర యత్నాలు. వీటన్నింటి నుంచి దృష్టి మరలిస్తూ, ప్రభుత్వాలు తాము నిర్దేశించుకున్న వస్తు సేవల పన్నుల అమలుకు మార్గాన్ని సుగమం చేసుకోవాలనే యావ. అందుకు దేశ ప్రజల దృష్టిని మళ్లించాలి. అందుకో మంచుకొండ కావాలి. మాదక ద్రవ్యాలను మించిన 'మంచుకొండ' మరోటి ఉండదు. ఎలాగంటే ఇందులో పాత్రదారులైంది యువత, వారి ఆరాధ దైవాలే కనుక. వారి ఉత్తేజానికి సరిసమాన స్థాయిలో తాళం వేసేందుకు, మన మీడియా సరిజోడైంది. ఇదీ కథ.

గతంలో ఎన్నడూ లేని విధంగా ఈనాటి జనాభాలో సుమారు 17 – 18 శాతం యువతేనని ఇటీవల గణాంకాలు వెల్లడిస్తున్నాయి. వారు ప్రజా సమస్యల పట్ల కళ్లు తెరిస్తే, పాలకుల మనుగడే ప్రశ్నార్థక మవుతుంది. అందుకు వారి దృష్టి మళ్లించేందుకు ఇదే అనువైన సమయం. అందుకే పాఠశాలల స్థాయి వరకూ మాదక ద్రవ్యాల ప్రభావం చేరే వరకూ, చూసి చూడనట్లు ఉపేక్షించి, ఇంతలోనే అంతా ఉలిక్కి పాటుగా కళ్లు తెరిచేశారు. ఇది కొంత కాలం సాగుద్ది. ఖండనలు, మండనలు ఆరోపణలు, దర్యాప్తులు, బ్యాంకాక్ ట్రిప్పులు పర్యావసానాలు. మాఫియాలు చేతులు మార్చుకుంటాయి. అనేక విదాలుగా చివరికి 'సున్నకు సున్న – హుళిక్కి హుళిక్కి' ఏమీకాదు. అనేక దర్యాప్తుల్లానే ఇదీ నీరుగారి పోతుంది. లభ్యపడిన వారు లభ్యపడతారు. ఇక కథ కంచికి మనమింటికి. జరిగేదిదే!

గతంలో 2001లోనే మాదక ద్రవ్యాల విస్తృతి వెల్లడైంది ఎక్కడో కాదు దేశ రాజధానిలోనే. ఓ అఫ్గాన్ మాదకద్రవ్య వ్యాపారి నకటుల్లా ఉరఫ్ ఆలీ అరెస్టుతో. దీంతో పాటు దేశ రాజధానిలోని గ్లామర్ గణపు సుఖాలాలన జీవితాల మకిలిని సైతం పోలీసులు వెలికి తీశారు. భరించలేని వాస్తవాలు వెల్లడైనాయి. గమ్మత్తుగా మత్తులో చిత్తవడాన్ని, అంతులేని ఆనందాన్ని పొందేందుకు నిరంతరం అన్వేషించే ధ్యాసే వారిది. కారణం బహు విధాలుగా పొందుతున్న సంపద వారి సొంతం. దాన్ని మనసారా అనుభవించాలన్నదే వారి లక్ష్యం. హైక్లాస్ డిస్కోలు, నైట్ క్లబ్‌లు, మందుతో పాటు కొత్త కొత్తగా ఈ మత్తు. ఇందుకు ఆరాటపడేది సినీ గ్లామర్ జనాలు – యువ పారిశ్రామిక వేత్తలు – సంఘ ప్రముఖులు. మెర్సిడెస్ – బిఎండబ్ల్యూ కార్ల యజమానులు – రాజకీయ అనుచరగణం. 'ఆనందో బ్రహ్మ' అంటూ ఆడుతూ పాడుతున్నారు. అటువంటి వీరికి ఈ దర్యాప్తులు ఓ లెక్క? ఏం కాదు! కొంత చేతి 'చిలుం' వదులుద్ది. అంతే! 'డ్రగ్స్' నివారణ చట్టాలు ఎన్నో ఉన్నాయి. ఈ మాదకద్రవ్య వినియోగం వల్ల ఆరోగ్యం చెడుతుంది. ఇదే విషయాన్ని ఒకాయనతో ప్రస్తావిస్తే 'నీవు పీల్చిన గాలి స్వచ్ఛమైంది కాదు, తిన్న తిండి స్వచ్ఛమైంది కాదు. వాటన్నింటికి విరుగుడుగా ఇవి తీసుకో నీ శరీర 'సామర్థ్యం' పెరుగుద్ది.' అని ఓ పది నిమిషాల లెక్చర్ ఇచ్చాడు. కొకైన్‌ను ఒక్కసారి సరదాగా పీలిస్తేనే అది వ్యసనంగా మారుద్దట. చట్టం వెంటపడుతుంది. సామాన్యులందుకు బరితెగిస్తే 'జైలు శిక్ష' పడుద్ది. అయితే ఎందుకు ఈ కొకైన్ వంటివి తీసుకుంటారు అంటే, దీంతో వెర్రి ఆనందం కలుగుద్ది. తీసుకున్న ఓ పది నిమిషాల్లో ఉత్తేజాన్ని, అజేయులమనే భావనను కలిగిస్తుందని పరిశోధనలు తెల్పాయి. కోరికలను పెంచి, ఆందోళనలను పటాపంచలు చేస్తాయి. ఆత్మ విశ్వాసాన్ని పెంచి, వాగుడు కాయగా మారుస్తాయి. శక్తిని తార స్థాయికి చేర్చి 'బాహుబలి'ని తలపింప చేస్తాయి. ఇదంతా కొన్ని గంటలే. ఆపైన హఠాత్తుగా, తీవ్రమైన నిరాశ, నిస్పృహల్లో కూరుకు పోవడం జరుగుతుంది. ఈ క్రమం మోతాదు స్థాయిని క్రమంగా పెంచేస్తూ కడకు గుండె ఆగిపోవడానికి దోహదపడొచ్చు లేదా శాశ్వత మానసిక వైకల్యానికి దారి తీయవచ్చునట.

ఈ కొకైన్ ప్రవాహం కొలంబియా దేశపు అటవీ ప్రాంతాల్లో మొదలై ఆఫ్రికా మీదుగా భారతదేశం చేరుతుంది. అందుకే ఈ మాదకద్రవ్య బేహారుల్లో ఆఫ్రికన్స్ – నైజీరియన్స్ కీలకమవుతుంటారు. భవిష్యత్తు లేని ఈ వ్యాపారంలో శ్రమలేని తేలికపాటి ఆదాయం (ఈజీ ఎర్నింగ్) ఆకర్షణవుతుంది. కొలంబియా – బ్రెజిల్ వంటి దేశాల్లోనే కిలో ధర వేల డాలర్లలో ఉంటుంది అంటే ఇంచు మించు ఆరేడు వేల డాలర్లు. దక్షిణాఫ్రికా – ఆస్ట్రేలియాకొచ్చే సరికి ఈ మాదకద్రవ్యం కిలో ధర 20 వేల డాలర్ల పైమాటే. ఇక పాకిస్తాన్ – భారతదేశానికి వచ్చేసరికి సుమారు 40 వేల డాలర్ల పైమాటేనట. చిల్లర ధరలను పరిశీలిస్తే, ఒక గ్రాము ఢిల్లీలో రు. 5 వేల నుంచి రు. 7 వేల వరకు ఉంటుంది. ముంబాయిలో అయితే మూడు వేల నుంచి ఐదు వేల వరకు ఉంటుంది. హైదరాబాద్‌లో సుమారు పది వేల రుపాయలను తాకుతుంది. ఇందులో మళ్లీ కల్తీ –

తూకాల్లో తేడాలు సర్వసామాన్యం. ఒక గ్రాముకు 0.7 లేదా 0.8 గ్రాము వరకే ఇస్తారు. వినియోగదారులు సైతం దొరికిందే తడవుగా ఉడాయిస్తారు. ఇందులో గ్లూకోజ్ కానీ సోడియం బైకార్బనేట్ కానీ సుమారుగా మూడో వంతు వరకూ కల్తీ చేసి అమ్ముతారనీ వెల్లడైంది.

ఈ మాదక ద్రవ్యాల వినియోగాన్ని నివారించేందుకు అనేక చట్టాలున్నాయి. సెక్షన్ 21, ఎన్‌డిపిఎస్ చట్టం. కొకైన్‌ను కొనడం, దగ్గరుంచుకోవడం, అమ్మడం, రవాణా చేయడం శిక్షార్హం. కనీసం పదేళ్లు – గరిష్టంగా 20 ఏళ్లు జైలు శిక్ష. ఒకటి నుంచి రెండు లక్షల వరకూ జరిమానా. కొద్ది మొత్తంలో సొంత వినియోగానికై ఉంచుకున్న వారికి సెక్షన్ 27 వర్తిస్తుంది. అయితే అది పంపిణీకి, వ్యాపారానికి కాదని నిరూపించుకునే బాధ్యత నిందితుని మీదే ఉంటుంది. ద్రవ్యం ఒక గ్రాము ఉన్నా అది కొద్ది మొత్తం కాదట. ఇంకా ఆ లోపే ఉండాలట. ఇందుకు ఆరు నెలల జైలు శిక్ష, ప్లస్ జరిమానా. సెక్షన్ 29 – కొకైన్ వినియోగాన్ని, వ్యాపారాన్ని ప్రోత్సహించడం వంటివి అరికట్టడానికి ఉద్దేశించింది. దీనికి ఐపిసి 116వ సెక్షన్ సైతం జత కలుస్తుంది. శిక్షార్హం నేరానికి విధించవలసిన గరిష్ట శిక్షలో నాలుగో వంతుకు శిక్షా కాలాన్ని పొడిగించడానికి ఈ ఐపిసి సెక్షన్ వీలు కల్పిస్తుంది. 107/108 ఐపిసి నేరాన్ని ప్రోత్సహించడానికి, ఇతరులను భాగస్వాములను చేసే వాళ్లకు వర్తించే చట్టాలు ఇవి. ఈ సెక్షన్ల కింద శిక్ష పడడానికి నేరం జరగాలని లేదు. నేరం జరుగుతున్నట్లు తెలిసినా చాలు. ఇన్ని చట్టాలు కంచె కాస్తున్నా, మాదకద్రవ్య వినియోగం 'ఆక్టోపస్'లా పాఠశాలల స్థాయికి చేరిందంటే కంచె చేను మేస్తుందేమో? అన్న అనుమానం రాకమానదు.

ఇంతటి ప్రాపకం – విస్తృతి ఉన్న ఈ సమస్య మీడియాకు ప్రధానమై పోయింది. కానీ కశ్మీర్ ప్రజా జీవనం ఏళ్లతరబడి అతలా కుతలం అయిపోతుంటే వీరికి పట్టదు. డార్జిలింగ్‌లో గూర్ఖాల జీవనం, జీవన్మరణం అయిపోతుంటే వీరికి స్పందనుండదు. నగర జీవనంలో కిలో టమోటాల ధర 80 రూపాయలైతే వీరికి చలనం ఉండదు. పచ్చిమిర్చి కిలో వందను దాటినా వీరికి ఏం కాదు. అందుకే ప్రజానీకం ప్రచార మాధ్యమాలను పాలక వర్గ బాకాలని, భజనపరులని (నేడు) కీర్తిస్తున్నారు. సానుకూలంగా లేని మీడియాపై ఆంక్షలను విధిస్తున్న పాలక వర్గ ధోరణులకు భయపడి, తమ ఉనికిని కాపాడుకునే యత్నానికి మీడియా పాల్పడుతుందన్న వినికిడి సైతం విస్తృతంగానే ఉంది ఈ సమాజంలో. అందుకని ప్రజా పక్షాన్ని వహించి, ప్రజా సమస్యల పరిష్కారానికై కృషి చేస్తూ, ప్రజల పట్ల బాధ్యతాయుతంగా వ్యవహించిన్నాడే మీడియా మీదున్న వ్యాఖ్యానాలు ఆరోపణలుగానే మిగులుతాయి. లేకుంటే సార్థకం కాగలుగుతాయి.

ఇది సాటి పాత్రికేయ లోకానికి నా విజ్ఞప్తి మాత్రమే. అయితే ఇదంతా పాత్రికేయ మిత్రుల వ్యక్తిగత పొరపాటు సైతం కాదేమో. ఎందుకంటే, వార్తా ప్రాధాన్యతలను నిర్ధారించే విషయాల్లో ఓ అదృశ్య శక్తి అంతర్గతంగా వారిని నిర్దేశిస్తుందన్నది అక్షర సత్యం. బతుక్కు ఆలంబననిచ్చే, మధ్యే మార్గంగా వ్యవహరిస్తూ, బతుకు బండిని నెట్టుకు రావాల్సిన పరిస్థితులను నేటి సమాజం కల్పించింది. ఇందుకు ధీటుగా పాత్రికేయ అగ్రస్థాయి గణం, పాత్రికేయ సంఘాలు నడుం బిగించి, బాధ్యతనెరిగి వ్యవహరించాల్సి ఉంది. ఈ పరిస్థితుల్లో ఇది సాధ్యమేనా? అని అనిపిస్తుంది. సాధ్యమే. అదీ ఎప్పుడు? సమస్య తీవ్రతను సరిగ్గా పసిగట్టిన నాడు. సమస్యలు అనేకం. జాతీయ, అంతర్జాతీయ ప్రాంతీయ స్థాయిల్లో. అదే సందర్భంలో వీటి ప్రభావిత శాతం ఎంత? అదీ ఏ వర్గం అన్న అంశాలను పరిగణనలోకి తీసుకోవాలి. ప్రజాస్వామ్య ముసుగులో కశ్మీరం కల్లోలమై దశాబ్దాలుగా మగ్గుతూ ఉంది. వేలాది మంది యువత వారి భవిత కోసం బలైపోతున్నారు. వీరిని పలు రకాలుగా దారి మళ్లించడం జరుగుతా ఉంది. మత ప్రాతిపదికన, యుద్ధ బూచిని చూపించి ప్రకోపించి పలు రకాలుగా.

ఇక దేశానికి పట్టెడన్నం పెట్టే రైతన్న ఆత్మహత్యలకు పాల్పడుతున్నాడు. నేటికి లక్షలాదిగా రైతులు బలైపోయారు ఈ ప్రపంచీకరణ ప్రయోగానికి. పోతే మాదకద్రవ్య పరిణామం ఓ కుట్ర. జనాభాలో అధిక శాతంగా ఉన్న యువత శక్తి – యుక్తులు నిర్వీర్యం కావాలి. అందుకే ఈ ప్రాచుర్యం. ప్రజాదృష్టి మళ్లింపుకు ఇదో సాకు. ఎందుకంటే దీని ప్రభావానికి పాల్పడ్డ వర్గ శాతం అత్యల్పం. దీన్ని మనం గుర్తెరగాలి.

వ్యవస్థీకృత ఉనికిలో భాగంగానే ప్రతీ ఒక్కరి ఉనికి – మనుగడ ముడిపడి ఉంటుందన్నది వాస్తవం. దీన్ని సామాజిక స్పృహతో అవగతం చేసుకోవాల్సి ఉంది. పాత్రికేయ బాధ్యతను ఎవరికి వారు వ్యక్తిగతంగా, ఆత్మవిమర్శా ధోరణితో, వృత్తి ధర్మాన్ని 'ప్రజాపక్షం' దిశగా మళ్లించగలిగితే పాత్రికేయ వృత్తికి న్యాయం చేకూరుతుంది. మిత్రులారా! ఆలోచించండి!!

*(రచయిత పాత్రికేయులు)* వీ

*(... 4వ పేజీ తరువాయి)*

*భవనం నిర్మించారు. భారతజాతి ఒకటే అనేది వలసవాదం ఉమ్మడి మార్కెట్ కోసం సృష్టించిన ఒక పెద్ద అబద్ధం. ఇవాళ సామాజిక శాస్త్రాలన్నీ కూడ అంగీకరిస్తున్న స్టాలిన్ నిర్వచనం ప్రకారం, "ఒక జాతి అనేది చారిత్రకంగా రూపొందిన, ఉమ్మడి భాష, ఉమ్మడి భౌగోళిక ప్రాంతం, ఉమ్మడి ఆర్థిక జీవనం, ఉమ్మడి సంస్కృతిగా వ్యక్తమయ్యే మానసిక స్థితి కలిగిన స్థిరమైన ప్రజాసమూహం". కశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా, కచ్ నుంచి అరుణాచల్ దాకా కలిపి కుట్టిన భూభాగానికి ఈ ఐదు లక్షణాలూ లేవు. సువిశాల సామ్రాజ్యాలను పాలించిన అశోకుడి కాలంలో, మొఘల్ ల కాలంలో కూడ ఇవాళ్టి భారతదేశం ఒకే పాలనా ప్రాంతంగా లేదు. ఒకే ఉత్పత్తి విధానంతో లేదు. ఒకే భాషతో లేదు. ఈ భారత ఉపఖండం చరిత్ర పొడవునా చప్పన్నారు దేశాలుగా ఉంది. అవన్నీ జాతులు కాకపోవచ్చు, ఎదుగుతున్న జాతులు కావచ్చు. ఉపజాతులు కావచ్చు, తెగలు కావచ్చు, భాషా సమూహాలు కావచ్చు. వలసవాదంగా మారిన పెట్టుబడిదారీ విధానం సువిశాల మార్కెట్ దాహంతో ఈ అన్ని ప్రాంతాలనూ నయాన, భయాన ఆక్రమించి ఒక్క దేశంగా మార్చింది. ఆ వలసవాదం కూడ వివిధ ప్రాంతాల ప్రత్యేకతలను అంగీకరించక తప్పలేదు గనుకనే ఉపఖండంలో మూడో వంతు భాగాన్ని స్వతంత్ర పాలకులకే అప్పగించింది. బ్రిటిష్ వ్యతిరేక పోరాటంలో ఈ అన్ని ప్రాంతాల ప్రజలు ఒకే జాతి అనుకున్నా అనుకోకపోయినా ఒకే పోరాటంలో ఏకమయ్యారు. 1947 తర్వాత అధికారానికి వచ్చిన దళారీ పాలకులకు కూడ ఈ సువిశాల మార్కెట్ ను, భూభాగాన్ని పాలించాలనే కోరిక ఉంది గనుక భిన్నత్వంలో ఏకత్వం అనే సమర్థనతో భారత జాతి భావనను పెంచి పోషించారు. మతవాదాన్నే సాంస్కృతిక జాతీయవాదంగా చెప్పుకునే సంఘ్ పరివార్ కూడ ఈ ఏకజాతి అనే అబద్ధం మీదనే ఆధారపడింది. నిజానికి భారతదేశం ఒక జాతి కాదు, అనేక జాతుల, ఎదుగుతున్న జాతుల బందిఖానాగా ఉంది. రెండు, రచయిత తనను తాను ప్రజాతంత్ర జాతీయవాదిగా చెప్పుకున్నప్పటికీ, ఈశాన్య రాష్ట్రాలలో, పంజాబ్ లో జరిగిన ప్రజా ఉద్యమాలను వేర్పాటువాద ఉద్యమాలుగా అభివర్ణించడం, దేశ సమగ్రత, సమైక్యత అనే బోలు మాటలు వాడడం ద్వారా ఇతర జాతులను కబళించే, పెత్తనం చేయాలనుకునే అగ్రజాతి జాతీయవాదానికి, అంటే సంఘ్ పరివార్ ప్రాతినిధ్యం వహించే జాతీయవాదానికి దగ్గరగా ఉన్నానని చెప్పకనే చెప్పుకున్నారు. ఈ వ్యాసం పునాదిగా భారత జాతి భావన గురించి చర్చ జరిగితే బాగుంటుంది.*

**– ఎ. వీరస్వామి,**
కోతుల నడుమ

# భారత విద్యారంగంపై భౌగోళీకరణ ప్రభావం-2

***మౌలిక హక్కుగా అందాల్సిన విద్యారంగంపై ప్రపంచీకరణ ప్రభావం పడి అది వ్యాపార సరుకుగా మారిపోయిందనీ, ప్రజలకు ఉన్నత విలువలు గల విద్య అందకుండా పోయిందనీ అంటున్నారు*** **రమేష్ పట్నాయక్**

*(...జూన్ 2017 సంచిక తరువాయి)*

**2000**లో విద్యారంగంలో విదేశీ పెట్టుబడులకు కేంద్ర ప్రభుత్వం ఆటోమాటిక్ రూట్‌లో అనుమతించడం, ఆ మేరకు ప్రభుత్వ ఆదేశాలు విడుదల కావడం భౌగోళీకరణ ఒక నిర్దిష్టరూపంగా వ్యక్తమయింది. అనంతరం అనేక విదేశీ విశ్వవిద్యాలయాలు మన దేశంలో తమ బ్రాంచీలను తెరవడం లేదా మన దేశంలో ఉన్న ప్రభుత్వ, ప్రైవేట్ విశ్వవిద్యాలయాలతో కలసి కోర్సులు నిర్వహించడం మనం చూస్తాం. 2005లో భారత ప్రభుత్వం ఒక పెద్ద అడుగు ముందుకువేసి, ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఒ) ఒప్పందాల కిందకు భారత ఉన్నత విద్యారంగ విభాగాన్ని తీసుకురావడానికి తన 'సంసిద్ధత' తెలియజేసింది. అయితే ఇతర రంగాలలో బేరసారాలు కుదరక ఇంతవరకు 'ఒప్పుకోలు' పై సంతకం పెట్టలేదు.

అదలా ఉండగా కేంద్ర ప్రభుత్వం 2010లో విదేశీ విశ్వ విద్యాలయాల బిల్లు, సంబంధిత ఇతర బిల్లులు పార్లమెంటులో ప్రవేశపెట్టింది. దీనిని విద్యావేత్తలు విమర్శించారు, విద్యర్థి, ఉపాధ్యాయ సంఘాలు వ్యతిరేకించాయి. అంతకంటే ప్రధానంగా పాలక పక్షంలోనే విధానేతర కారణాల వల్ల వచ్చిన వ్యతిరేకత వలన ఆ బిల్లులు పాస్ కాలేదు. అవి మురిగి పోయాయి లేక ఉపసంహరించబడ్డాయి. ప్రస్తుత ప్రభుత్వం ఆ బిల్లులను మారు పేర్లతో తీసుకురావడానికి ప్రయత్నిస్తుంది. ఈ మధ్యకాలంలో విదేశీ విశ్వవిద్యాలయాల కార్యకలాపాలు బహుళం గానే పెరిగాయి.

భారతదేశంలో విదేశీ విద్యా వ్యాపారానికి కొన్ని ప్రధానమైన ఆటంకాలున్నాయి. భారతదేశంలో విద్య ఎంత వ్యాపారమైనా ఇంతవరకు కేంద్ర ప్రభుత్వం గాని, ఏదేని రాష్ట్ర ప్రభుత్వం గాని విద్యను వ్యాపారంగా ప్రకటిస్తూ చట్టం చేయలేదు. భారతదేశంలో ఏ కోర్టుకూడా విద్యను వ్యాపారంగా ప్రకటిస్తూ తీర్పుచెప్పలేదు. నిందాపూర్వకమైన టి.ఎం.ఎ పాయ్, ఇనాందార్ తీర్పులలో కూడా ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు విద్యాసంస్థలను స్థాపించే, నిర్వహించే 'ప్రాథమికహక్కు' గుర్తించబడింది గాని, విద్యతో వ్యాపారం చేయకూడదని స్పష్టంగా చెప్పబడింది. అయితే విద్యాసంస్థలు లాభం చేసుకోవచ్చని వెసులుబాటు కల్పించింది. ఇది వైరుధ్యంగా కనిపిస్తుంది.

లాభాలను అనుమతిస్తూ లాభాల వినియోగంపై నిబంధనలు పెట్టింది కోర్టు. లాభాల వినియోగంపై నిర్దేశించిన నిబంధనలే వ్యాపార నిషేధంగా కోర్టు భావించింది. ప్రైవేటు విద్యా సంస్థలు ఫీజులు ఇతర వసూళ్లు సరిగా నమోదు చేయకపోవడం ద్వారా ప్రధానంగా అత్యధిక లాభాలు వెనుకవేసుకుంటున్నాయి. లాభం చేసుకోవడానికి అవకాశం ఇవ్వడంతో చట్టబద్ధంగా కొంత, చట్టం కళ్లు తప్పించి మరింత లాభాలు చేసుకోవడం జరుగుతుంది. ఈ విధంగా విదేశీ కార్పొరేట్లు చేయలేవు.

మంత్రులకు, సెక్రటరీలకు, డి.ఇ.ఒ. లకు, ప్రతి టేబుల్ వద్ద లంచం ఇవ్వడానికి అవసరమైన యంత్రాంగం విదేశీ కార్పోరేట్ సంస్థలకుండదు. ఆకారణంగా విదేశీ కార్పోరేట్లు ఎప్పుడూ పాలనా రంగంలో అవినీతిని వ్యతిరేకిస్తాయి. అందుకే అవి అన్నా హజారే ఉద్యమానకి మద్దతు ఇస్తాయి. అవి చట్టపరమైన దోపిడీ ప్రత్యామ్నాయాన్ని ఇష్టపడతాయి. దోపిడీని చట్టబద్ధం చేసుకోవడానికి విధాన నిర్ణేతలకు లంచం ఇస్తాయి. అమలు స్థాయిలో కాకుండా చట్టంస్థాయిలో అవినీతి కార్పొరేట్ పద్ధతి. చట్టం గట్టిగా ఉండి, అమలులో అవినీతిద్వారా లాభాలు చేసుకోవాలంటే చిల్లర వ్యాపారస్తులకంటె కార్పొరేట్ సంస్థలకు, స్వదేశీ కార్పొరేట్లకంటె విదేశీ కార్పొరేట్లకు ఇబ్బంది ఎక్కువ. ప్రస్తుత పరిస్థితికి వస్తే విద్యాసంస్థలు లాభాలు చేసుకోవచ్చు. కాని, వాటిని అదే విద్యాసంస్థ అభివృద్ధికి ఉపయోగించాలి.

ఇది కోర్టు విధించిన నిబంధన. ఈ నిబంధన స్వదేశీ కార్పొరేట్లకంటె విదేశీ కార్పొరేట్లకు ఎక్కువ ఇబ్బందికరమైనదని వేరుగా చెప్పనవసరం లేదు. విదేశీ కార్పొరేట్లకు మరొక అదనపు నిబంధన ఉంది. వారు లాభాలను దేశం నుండి తరలించకూడదు. ఇది వదులు కాళ్లుగల పెట్టుబడికి కష్టమైన విషయమేకదా! ఈ నిబంధనలను మార్చడానికి 2010 నుండి గట్టి ప్రయత్నాలు జరుగుతున్నాయి. వీటన్నింటికి మించి 2005లో ప్రారంభమయిన ప్రపంచ వాణిజ్య సంస్థ ప్రక్రియ మరింత ప్రమాదకరమైనది. అంతేకాదు, డబ్లుటిఒ బయిట ట్రేడ్ ఇన్ సర్వీసెస్ అగ్రిమెంట్ (టిఐఎస్ఎ) ఒప్పందాన్ని రుద్దడానికి అమెరికా ప్రయత్నిస్తుంది. ఇది పులిమీద బుట్ర లాంటిది.

**విద్యారంగ ప్రైవేటీకరణ:** భారతదేశంలో విద్యారంగం వ్యాపారీకరణ 1980లలోనే ప్రారంభమైంది. 1986 పాలసీ విద్యా వ్యాపారీకరణకు పెద్దపీట వేసింది. ఆనాటి ప్రధానమంత్రి రాజీవ్ గాంధీ 'ఒక విద్యార్థి, డాక్టరో, ఇంజనీరో అయితే, సంపాదించిన ధనాన్ని తన జేబులో వేసుకుంటాడు, కాని ఆ విద్యార్థి డాక్టర్ లేదా ఇంజనీర్ అవడానికి ప్రజాధనం పెద్దగా వెచ్చించబడుతుంది. ఇది ఎంతవరకు సమంజసం? ఇంజనీర్ లేదా డాక్టర్ కావలసిన విద్యార్థి అందుకవసరమైన ధనాన్ని తానే వ్యయం చేయడం సరిగ్గా ఉంటుంది' అని అన్నారు. ఆ మాటలు విధాన పత్రంలో చేరకపోయినా, అదే అభిప్రాయం నాటినుంచి విద్యా విధానాన్ని నడిపిస్తుంది. రాజీవ్ గాంధీ చెప్పిన మొదటి మాట వాస్తవమే.

కాని దాని నుండి రాబట్టిన పరిష్కారం మాత్రం సరియైనదికాదు. యువతను విద్యావంతులను చేసుకోవడం, వృత్తినిపుణులుగా తయారు

*ఈ వ్యాసం మొదటి భాగం జూన్ 2017 సంచికలో అచ్చయింది. ఈ భాగం జూలై 2017 సంచికలో రావల్సింది. సాంకేతిక కారణాల వల్ల అచ్చుకాలేదు. రచయితను, పాఠకులను క్షమాపణలు కోరుతున్నాం. – సం.*

చేసుకోవడం సమాజానికి అవసరం. అలాగే విద్యావంతుడైన విద్యార్థి, వృత్తి నిపుణుడు సమాజానికి తన రుణం తీర్చుకోవాలి. ఇది ఒక సామాజిక ఒప్పందం. ఇది లేకపోతే దానిని సమాజం అని ఎలా అనగలం? నాటి ప్రధానమంత్రి ఈ సామాజిక ఒప్పందానికి వ్యతిరేకంగా మాట్లాడారు. ఒక వ్యక్తిని డాక్టర్ చేయడానికి సమాజం ఖర్చు చేయనక్కర లేదు! సమాజం కొరకు డాక్టర్ పనిచేయనక్కరలేదు! అటువంటప్పుడు సమాజం ఎక్కడుంటుంది, మార్కెట్టే ఉంటుంది. సమాజంలేదు, మార్కెట్టు మాత్రమే ఉందని బ్రిటిష్ ప్రధాని అంటే ప్రపంచమంతా గగ్గోలుపెట్టింది. కాని భారత ప్రధాని ఈ మాట1985లోనే అన్నారు. ఉన్నత విద్యా ఖర్చులు, ప్రధానంగా వృత్తివిద్య ఖర్చులు విద్యార్థే భరించుకోవాలంటే దానికుండే అర్థమేమంటే, డబ్బున్నవారే చదువుకోవాలి, వారు చదువుతో డబ్బు సంపాదించుకోవాలి అని మాత్రమే.

1986 జాతీయ విద్యా విధానం ఉన్నత విద్యా రంగాన్ని విస్తరించడం కాదు, సంఘటితం చేయాలని నిర్దేశించింది. ఆశ్చర్యకరమైన విషయమేమంటే అదే విధానపత్రంలో సెకండరీ విద్య విస్తరించిన విషయం ప్రస్తావించబడింది. సెకండరీ విద్య విస్తరించబడి ఉన్నప్పుడు ఉన్నత విద్యకు డిమాండ్ పెరుగుతుంది. కాని ఉన్నత విద్యను విస్తరించకూడదని నిర్ణయించారు. ఉన్నత విద్యకు డిమాండ్ పెరగడం, ప్రభుత్వ రంగంలో ఉన్నత విద్యను విస్తరించకూడదనుకోవడం, (అనేక రాష్ట్రాలలో ప్రభుత్వ రంగంలో కొత్త కళాశాలల స్థాపనపై నిషేధం విధించబడింది), ఉన్నత విద్య సామాజిక అంశంకాదు, వ్యక్తిగత అంశం అని భావించడం, ప్రైవేట్ రంగంలో కళాశాలల స్థాపనకు ఉదారంగా అనుమతులివ్వడం, ఈ క్రమంలో విద్యారంగం ఎంత ప్రైవేటీకరణకు గురయ్యిందో అందరికీ తెలిసిందే.

1948 రాధాకృష్ణ కమిషన్ కాలానికి మధ్యతరగతి వర్గం చాలా తక్కువుగా ఉంది. సమాజంలో 10శాతం జనాభా కూడా చదువును కొనుగోలుచేసే పరిస్థితిలో ఆనాడు లేదు. ఆనాడు ప్రభుత్వ నిర్వహణకు, ప్రభుత్వ, ప్రైవేట్ రంగ పరిశ్రమలలో పనిచేయడానికి, రక్షణ, పరిశోధన రంగాలలో అవసరమైన 'మానవ వనరుల' ఉత్పత్తికి– ఒక్కమాటలో చెప్పాలంటే పెట్టుబడిదారీ రాజ్యానికి, పెట్టుబడిదారీ పరిశ్రమలకు, పెట్టుబడిదారీ వ్యవస్థకు అవసరమైన 'మానవ వనరుల' ఉత్పత్తికి రాజ్యం ముందుకు వచ్చింది.

1986 నాటికి 10శాతం జనాభా ఉన్నత విద్య కొనుగోలు చేయగలిగే స్థితికి చేరారు. ఆకారణంగా పాలక వర్గాలు ప్రభుత్వ రంగ విస్తరణను అక్కడికి ఆపి, ప్రైవేట్ రంగవిస్తరణకు బాట వేశారు. దీనిని మరొక కోణం నుంచి చూస్తే, 1983లో ప్రపంచ బ్యాంక్ నుంచి భారత ప్రభుత్వం అప్పుతీసుకువచ్చిన తరువాత, ప్రపంచ బ్యాంకు, ఐ.ఎం.ఎఫ్.ల ఒత్తిడి మేరకు, సామాజిక రంగాల నుండి ప్రభుత్వం వైదొలగడం ప్రారంభించింది అని చెప్పవచ్చు. అత్తచెప్పిందీ అదే కోడలికి కావలసిందీ అదే!

### విద్య ప్రైవేటీకరణ రెండవదశ సంస్కరణలు

భారతదేశంలో విద్యా రంగంలో మొదటిదశ మార్కెట్ సంస్కరణలు ఒకరకంగా పూర్తయినాయని చెప్పాలి. ఈ దశలో దేశసరిహద్దులలో విద్యావ్యాపారాన్ని సుమారు నిర్నిబంధం చేశారు. హైస్కూల్ నుంచి పరిశోధన స్థాయి వరకు విద్య ఒక వ్యాపార సరకు అయింది. రెండవదశ మార్కెట్ సంస్కరణలలో భాగంగా విద్యావ్యాపారానికి దేశ సరిహద్దులు అడ్డురాకుండా చట్టాలు, ఒప్పందాలు చేస్తున్నారు. మొదటి దశ సంస్కరణలలో భాగంగా ప్రైవేట్ రంగంలో విద్యా వ్యాపారాన్ని ప్రోత్సహించారు.

రెండవ దశ మార్కెట్ సంస్కరణలలో ప్రభుత్వ విద్యా సంస్థలను వ్యాపార సంస్థలుగా దిగజార్చనున్నారు. మొదటిదశ మార్కెట్ సంస్కరణల ఫలితంగా డబ్బున్న ధనిక, మధ్యతరగతివారంతా ప్రైవేట్ విద్యా సంస్థలకు తరలిపోయారు, ప్రైవేట్ సంస్థలకు మార్కెట్‌ను అందించారు. ధనిక, మధ్యతరగతి ప్రజలందరూ ప్రైవేట్ విద్యా సంస్థలకు వెళ్లిపోవడమనే ప్రక్రియ ముగియడంతో మార్కెట్ మరింత విస్తరించే అవకాశాలు లేకుండా పోయాయి.

ఇప్పుడు రెండవదశ మార్కెట్ సంస్కరణలలో భాగంగా ప్రైవేట్, కార్పొరేట్‌ల మార్కెట్‌లు విస్తరించడానికి ప్రభుత్వం ప్రజలనుండి పన్నుల రూపేణా వసూలుచేసిన నిధులను ప్రైవేట్ యాజమాన్యాలకు రియింబర్స్‌మెంట్‌ల రూపంలో దారాదత్తం చేస్తుంది. ఆ విధంగా మార్కెట్ల విస్తరణకు అవకాశం కల్పిస్తుంది.

విద్యారంగంలో మొదటిదశ మార్కెట్ సంస్కరణల కాలంలో చట్టాలలో, యంత్రాంగంలో ఉన్న లొసుగులను ఉపయోగించుకుంటూ వాటిని అవినీతిమయం చేస్తూ వ్యాపార అవకాశాలను పెంచుకున్నారు. రెండవదశ మార్కెట్ సంస్కరణలలో విద్యా వ్యాపారానికి అవసరమైన చట్టాలను యంత్రాంగాన్ని తయారు చేసుకుంటున్నారు. అలాగే విద్యా వస్తువు, పరిశోధనలను మార్కెట్ ప్రయోజనాలకు అనుకూలంగా మార్చడానికి మొదటిదశలో జాబ్ మార్కెట్ నుంచి అంటే బయటనుంచి వత్తిడి తీసుకువచ్చారు.

ప్రస్తుత రెండవదశ సంస్కరణలలో భాగంగా అక్రిడిటేషన్ ఏజన్సీల ద్వారా వత్తిడి తీసుకురావడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నారు. ఈ ప్రక్రియ సజావుగా సాగడానికి విశ్వవిద్యాలయ ప్రాంగణ ప్రజాస్వామ్యాన్ని గొంతు నులుముతున్నారు. ఢిల్లీ జె.యన్.యు, డి.యు.ల నుంచి హైదరాబాద్ సెంట్రల్ యూనివర్శిటీ వరకు ఇదే మనకు కనిపిస్తుంది.

సందర్భవశాత్తూ రీయింబర్స్‌మెంట్ గురించి ప్రస్తావించుకున్నాం. రీయింబర్స్‌మెంట్ గురించి మరొక్క విషయం చెప్పవలసి ఉంది. రీయింబర్స్‌మెంట్ విధానంలో యాజమాన్యాలకు డబ్బు గ్యారంటీ. విద్యార్థులకు సర్టిఫికేట్లు మాత్రం గ్యారంటీ. ఈ నాడు 80 శాతం మంది ఇంజనీరింగు గ్రాడ్యుయేట్‌లకు సబ్జక్టుపై కనీస అవగాహన లేదు. ఇన్‌ఫోసిస్ సర్వే ఈ విషయాన్ని బహిర్గతం చేసింది.

ఈ రెండవదశ సంస్కరణలకే కులతత్వం, మతతత్వం కలిపి బి.జె.పి నాయకత్వాన ఉన్న నేటి కేంద్ర ప్రభుత్వం నూతన విద్యా విధానాన్ని రూపొందించే ప్రయత్నంలో ఉంది, నూతన విధానంపై ఒకవైపు చర్చచేస్తూ రెండవవైపు అందులో వివాస్పద అంశాలను అమలుచేసే ప్రయత్నంలో ప్రభుత్వం ఉంది.

కేంద్ర ప్రభుత్వం 2016లో చర్చకు విడుదలచేసిన ముసాయిదా విద్యా విధానంలో విద్యావ్యాపారీకరణ, భౌగోళీకరణ, ఫెడరలిజానికి వ్యతిరేకంగా అధికార కేంద్రీకరణ, విద్యారంగ పాలనలో ఉద్యోగస్వామ్యం, విద్యావస్తువును సరుకుగా మార్చడమేగాక, స్కాలర్‌షిప్‌లను కుదించడంద్వారా దళిత, బలహీన వర్గాలవారికి విశ్వవిద్యాలయాల ప్రవేశ నిరాకరణ కనిపిస్తున్నాయి. దళితులకు పాఠశాల విద్యను కూడా నిరాకరించే నైపుణ్య విద్య 6వ తరగతి నుంచే ఇందులో చేర్చారు.

### విద్య భౌగోళీకరణ

దేశాల మధ్య విద్యా వ్యాపారాన్నే విద్య భౌగోళీకరణ అని మనం వ్యవహరిస్తున్నాం. ప్రస్తుత చర్చమేరకు మనం ఉన్నత విద్యను మాత్రమే దృష్టిలో పెట్టుకుని పరిశీలిస్తున్నాం. విద్య దేశసరిహద్దులలో ప్రైవేటీకరణ జరగడం భౌగోళీకరణకు కనీస పాదార్థిక అవసరం. అది సుమారు

జరిగింది. దేశంలో విద్యావ్యాపారానికి అనుకూలమైన వాతావరణం బలంగానే ఏర్పడింది. దీనర్థం అందరూ విద్యావ్యాపారాన్ని ఆమోదిస్తున్నారని కాదు. తదితరమైన మార్గంలేదని మెజారిటీ భావిస్తున్నారు. అది చాలు. మరి విద్యావ్యాపారం భౌగోళీకరణ జరగాలంటే, అది ప్రపంచ వాణిజ్య సంస్థలో భాగమైన 'జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్' (గ్యాట్స్) ద్వారా అయినా లేదా ఈ మధ్యకాలంలో అమెరికా ముందుకు తీసుకువస్తున్న ట్రేడ్ ఇన్ సర్వీసెస్ అగ్రిమెంట్ (టిసా)ద్వారా అయినా లేదా ఇతర మార్గాలద్వారా అయినా కావచ్చు. విద్యా భౌగోళీకరణ ఏవిధంగా జరగాలన్నా భారత విద్యా చట్ట వ్యవస్థను, పరిపాలనా వ్యవస్థను అందుకు అనుకూలంగా మార్చవలసి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వం ఆ ప్రయత్నంలోనే ఉంది.

**విద్య భౌగోళీకరణకు**

1) విద్య వ్యాపారం చేయదగ్గ సేవగా ప్రభుత్వం చట్టం ద్వారా గుర్తించాలి – ఇటువంటి చట్టం ఇంతవరకు తీసుకురాబడలేదు;

2) ఒక విద్యాసంస్థలో వచ్చిన లాభాలు ఇతరత్రా ఉపయోగించడానికి అవకాశం ఉండాలి – ప్రస్తుత చట్టాల ప్రకారం ఏ విద్యా సంస్థలో వచ్చిన లాభాలు ఆ విద్యాసంస్థ అభివృద్ధికే ఖర్చుచేయాలి;

3) విద్యా వ్యాపారంలో వచ్చిన లాభాలను దేశం నుండి బయటకు తీసుకుపోవడానికి అనుమతి ఉండాలి – అటువంటి అనుమతిలేదని వేరుగా చెప్పనవసరంలేదు;

4) విదేశీ విద్యా సంస్థలకు ఈ దేశంలో వారి సంస్థలో పనిచేస్తున్న ఉపాధ్యాయులతో గాని లేదా విద్యార్థులతో గాని ఎటువంటి వివాదాలు వచ్చినా వారు కోర్టుకు వెళ్లే అవకాశం లేకుండా విద్యారంగ వ్యాజ్యాల కొరకు ట్రిబ్యునల్ ఏర్పాటుచేయాలి – ఇందుకు కాంగ్రెస్ ఒకసారి ప్రయత్నించి ఎడ్యుకేషన్ ట్రిబ్యునల్ బిల్లుతెచ్చి విఫలమైంది, ఇప్పుడు బి.జె.పి ప్రభుత్వం అందుకు ప్రయత్నిస్తుంది (ట్రిబ్యునలైజేషన్ ఆఫ్ జస్టిస్);

5) విద్యా ప్రమాణాల కొలత ప్రైవేటీకరించబడాలి, భౌగోళీకరించ బడాలి – ఇందుకొరకు కూడా గతంలో కాంగ్రెస్ ప్రభుత్వం అక్రిడిటేషన్ తీసుకురావడానికి ప్రయత్నించింది, విఫలమయింది, నేడు బి.జె.పి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది;

6) అధ్యాపకుల జీతభత్యాలు, హక్కుల గురించి గాని, అలాగే విద్యార్థుల అడ్మిషన్ల విషయంలో కాని, ఫీజుల విషయంలో గాని వారి ఇతర హక్కుల విషయంలో గాని ఎటువంటి నిబంధనలు ఉండకూడదు – ప్రస్తుతం కూడా ప్రైవేట్ రంగంలో అధ్యాపకుల లేదా విద్యార్థుల హక్కుల గురించి ఎటువంటి నిబంధనలు లేవు కాని విదేశీ పెట్టుబడిదారులకు అది చాలదు, అటువంటి నిబంధనలు ప్రజా ఉద్యమాల ఒత్తిడికి లొంగి ప్రభుత్వాలు భవిష్యత్‌లో కూడా పెట్టకూడదు. అందుకై వారు విద్యా రంగాన్ని ప్రభుత్వం నుంచి తప్పించి స్వతంత్ర నియంత్రణ సాధికార సంస్థకు అప్పజెప్పాలని అడుగుతున్నారు. అటువంటి సంస్థ ప్రజా ఉద్యమ ఒత్తిడికి తలొగ్గకుండా (నిరాజకీయాకరణ) పెట్టుబడి ప్రయోజనాలకు అనుకూలంగా విద్యారంగాన్ని నియంత్రించ గలుగుతుంది – ఇటువంటి సంస్థను నేషనల్ కౌన్సిల్ ఫర్ హైయ్యర్ ఎడ్యుకేషన్ అండ్ రీసెర్చ్ అనే పేరున స్థాపించడానికి కాంగ్రెస్ ప్రయత్నించింది, సఫలం కాలేదు. ప్రస్తుత బి.జె.పి ప్రభుత్వం కూడా తొలినాళ్లలో కొంత ప్రయత్నించి తరువాత విరమించుకుంది. ఆ లక్ష్యాన్ని యు.జి.సి, ఉనికిలో ఉన్న ఎ.ఐ.సి.టి.ఇ వంటి రెగ్యులేటరీ సంస్థల ద్వారా చేయాలని ఆలోచిస్తున్నట్లు, ఆ దిశలో నీతి ఆయోగ్ నివేదిక ఇచ్చినట్లు వార్తలు వచ్చాయి;

7) విదేశీ విద్యాకార్పొరేట్ సంస్థలు అన్ని రాష్ట్రాలతో వేరువేరుగా వ్యవహరించాలంటే వారికి కష్టం. అందుకే వారు సర్వాధికారాలు కేంద్రానికే ఉండాలని కోరుకుంటారు. భౌగోళీకరణకు అధికార కేంద్రీకరణ అవసరం. – ప్రస్తుత బి.జె.పి ప్రభుత్వం తీసుకువస్తున్న నూతన విద్యా విధానంలో అధికార కేంద్రీకరణ ఒక ప్రధాన అంశం. అఖిల భారత ఎడ్యుకేషన్ సర్వీస్ క్యాడర్‌ను సృష్టించి వారిని కేంద్ర మానవ వనరుల శాఖ ఆధ్వర్యంలో ఉంచి రాష్ట్రాల విద్యావ్యవస్థను పరిపాలించాలని ప్రయత్నం సదరు ముసాయిదాలో కనిపిస్తుంది;

8) గ్యాట్స్, ఇంకా టిసా లైతే ప్రభుత్వ విద్యా సంస్థలను ప్రైవేట్ విద్యా సంస్థలను సమానంగా చూడాలని, ప్రభుత్వవిద్యా సంస్థలకిచ్చే రాయితీలు ప్రైవేటు విద్యాసంస్థలకు కూడా ఇవ్వాలని (డొమెస్టిక్ రెగ్యులేషన్ నిబంధన ఆశయం), దేశీయ విద్యా సంస్థలకిచ్చే రాయితీలన్నీ విదేశీ విద్యా సంస్థలకివ్వాలని (నేషనల్ ట్రీట్‌మెంట్ నిబంధన ఆశయం) కోరుతున్నాయి.

పై విషయాలను బట్టి విద్యారంగ భౌగోళీకరణ క్లిష్టమైనదిగా తోస్తుంది కాని గుర్తించవలసిన విషయం ఏమంటే అది అసాధ్యమైనది మాత్రం కాదు. విద్యా భౌగోళీకరణకు అవసరమైన చట్ట వ్యవస్థను ఏర్పాటు చేయడానికి భారత రాజ్యం కంకణ బద్ధమై ఉంది. అయితే వివిధ దేశాలలో ప్రజలు విద్యారంగ భౌగోళీకరణను ఇంతవరకు విజయవంతంగానే నిలువరించారు. అనేక దేశాలలో ప్రజలు తమతమ విద్యా రంగాలను ప్రపంచ వాణిజ్య సంస్థలో చేర్చడాన్ని అడ్డుకుంటూ ఉన్నారు.

విదేశీ విద్యా సంస్థలలో ఫీజులు ఎక్కువగా ఉంటాయని, వారు రిజర్వేషన్ పాటించరని అంటే విదేశీవిద్యాలయాలు సమానత్వానికి సామాజిక న్యాయానికి పాతర వేస్తాయని వేరుగా చెప్పనవసరంలేదు. ఈ విషయాన్ని లేవనెత్తుతూ నీతి ఆయోగ్ ప్రధాని మంత్రి కార్యాలయానికి గత 2016 ఏప్రిల్ 16న అందజేసిన నివేదికలో స్కాలర్‌షిప్‌లు, రుణాల ద్వారా ఈ లోటును పూడ్చవచ్చని ప్రతిపాదించింది. అది ఎంతవరకు సాధ్యమో అందరికీ తెలిసిందే. విదేశీ విద్యాసంస్థలు ప్రధానంగా భౌగోళీకరణ ఆర్థిక, రాజకీయ, విలువుల అవసరాలనే తీరుస్తాయని ఫలితంగా దేశ స్వావలంభనకు, సార్వభౌమాధికారానికి, దేశంలో ప్రజల ప్రజాస్వామిక హక్కులకు ప్రమాదం కలుగుతుందని వేరుగా చెప్పనవసరం లేదు. ఈ విదేశీ పెట్టుబడి అవసరాలన్నీ తీరిస్తే ఎటువంటి విద్యా వ్యవస్థ, దాని ఫలితంగా ఎటువంటి సామాజిక వ్యవస్థ ఏర్పడుతుందో సులభంగా ఊహించవచ్చు. రాష్ట్రవిభజనకు ముందు జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ ఇన్ సర్వీసెస్‌పై రాష్ట్రవిభజనకు పూర్వం ఆంధ్ర ప్రదేశ్ విద్యా పరిరక్షణ కమిటీ ఒక పూర్తి పుస్తకాన్నే ప్రచురించి ఉంది. చీకటి నుంచి చిమ్మచీకటిలోనికి అనే ఆ పుస్తకం భౌగోళీకరణ ప్రమాదాన్ని పూర్తిగా వివరించింది.

ముగింపుగా ఒక్కమాట చెప్పుకుందాం. 2000లో ప్రపంచ బ్యాంకు, యునెస్కో సంయుక్తంగా ఒక టాస్క్‌ఫోర్స్‌ని నియమించాయి. ఆ టాస్క్‌ఫోర్స్ 'అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఉన్నత విద్య – ప్రమాదం, వాగ్దానం' అన్న తన నివేదికలో 'అభివృద్ధి చెందిన దేశాలలో ఉన్న పేరెన్నిక గల విశ్వవిద్యాలయాలు వెనుకబడిన దేశాలలో హీనస్థాయి కోర్సులను మాత్రమే అందిస్తున్నాయని' పేర్కొంది. నివేదిక సూచించిన ప్రమాదం వాస్తవం కాగా వాగ్దానం ఒక నమ్మకం మాత్రమే. నిజానికి భారత ఉన్నత విద్యారంగంపై భౌగోళీకరణ ప్రభావాన్ని చర్చించడానికి మరింత సోదాహరణమైన చర్చ అవసరం.

*(అయిపోయింది)*

*(రచయిత కన్వీనర్ ఆంధ్రప్రదేశ్ విద్యాపరిరక్షణ కమిటీ)* వీ

# వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం - మహబూబ్ నగర్

వీక్షణంను మరింతగా ప్రజల దగ్గరికి తీసుకుపోవాలని, తెలుగు రాష్ట్రాలలోని వివిధ ప్రాంతాలలో సమావేశాలు ఏర్పాటు చేసి, పాఠకుల, అభిమానుల సలహాలూ సూచనలూ స్వీకరించాలని ఆలోచనతో వీక్షణం కలెక్టివ్ ప్రారంభించిన ప్రయత్నంలో తొలి అడుగుగా వీక్షణం రచయితల, మిత్రుల సమావేశం జూలై 9న మహబూబ్‌నగర్ లోని టిఎన్ జిఒ భవన్ లో జరిగింది. ఈ సమావేశానికి నలభై మందికి పైగా హాజరయ్యారు.

ఈ సందర్భంగా నిర్వహించిన 'మూడేళ్ల తెలంగాణ తీరుతెన్నులు' అనే చర్చా కార్యక్రమానికి కవి, రచయిత మహమ్మద్ ఇక్బాల్ అధ్యక్షత వహించారు. ఎ. నర్సింహారెడ్డి, బి. సతీష్ ప్రసంగించారు.

నీళ్లు, నిధులు, నియామకాల కోసం పోరాడి సాధించుకున్న తెలంగాణలో నేడు ప్రజలు అసంతృప్తితో ఉన్నారు, మేధావులు అనుకునే వాళ్లు ప్రభుత్వాన్ని సమర్థిస్తున్నారు, కాంట్రాక్టర్లు, కార్పొరేట్ సంస్థలు మాత్రమే లబ్ధి పొందాయి అని వక్తలు అన్నారు. రెండు తెలుగు రాష్ట్రాలలోను ప్రజల ఆకాంక్షలను వ్యక్తం చేస్తున్న వాళ్ల నోరు నొక్కడానికి ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. ప్రచార సాధనాలు కూడ ప్రజా సమస్యలను తగినంతగా పట్టించుకోవడం లేదు. అటువంటి సమస్యలకు, ప్రజా గళానికి వీక్షణం వేదికగా నిలుస్తున్నది అని వక్తలు అన్నారు.

గత మూడు సంవత్సరాలలో ప్రభుత్వం నెరవేర్చలేకపోయిన అంశాలు, ఉల్లంఘించిన హామీలు వివరించారు. దళితుణ్ణి ముఖ్యమంత్రిని చేస్తానని అమలు చేయలేదు. భూమిలేని దళిత కుటుంబాలకు 3 ఎకరాల భూమి ఇంతవరకు అమలు కాలేదు. తెలంగాణ రావడం కోసం నిరసనల్లో పాల్గొని ధర్నాలు చేసి, తెలంగాణ వచ్చిన తరువాత మాత్రం ధర్నాలే లేకుండా ధర్నా స్థలాన్ని ఊరవతలికి మార్చే ప్రయత్నం చేస్తున్నారు. రు. 46,000 కోట్ల రూపాయల మిషన్ భగీరథ చేపట్టారు గాని రు. 16,000 కోట్ల రూపాయలతో మాత్రమే తెలంగాణ ప్రజలకు తాగునీటి సరఫరా చేయవచ్చని నిపుణులు చెపుతున్నారు. రెండున్నర లక్షల ఉద్యోగాలు వస్తాయని ప్రచారం చేశారు. కొన్ని వేల ఉద్యోగ నియామకాలు కూడ జరగలేదు. నిరుద్యోగుల అసంతృప్తి వచ్చిన ప్రతి సందర్భంలో డిఎస్ సి ప్రకటిస్తామంటున్నారు. జిల్లాల విభజన వల్ల ఉద్యోగుల బదిలీలకు ఇబ్బంది ఎదురైంది. ప్రజా ఉద్యమాల మీద దేగ కళ్లు వేయడానికే జిల్లాల విభజన చేశారు. గతంలో మూతబడిన అనేక ఫ్యాక్టరీలను ఈరోజు తెరిపించే ప్రయత్నం చేయడం లేదు. ప్రజల భావోద్వేగాలను తీర్చడానికి మాత్రమే ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది తప్ప దీర్ఘకాలిక ప్రయోజనాలను నెరవేర్చడంలో విఫలమైంది. మోడీ కూడ చేయనంత హిందుత్వ ప్రచారం కెసిఆర్ మొక్కుల పేరుతో, యజ్ఞాల పేరుతో చేస్తూ, ప్రజల నమ్మకాలను ఆసరా చేసుకొని ప్రజలను మోసం చేస్తున్నాడు అని వక్తలు అన్నారు.

ఆ తర్వాత వీక్షణం మీద సభికులు తమ అభిప్రాయాలు వ్యక్తం చేశారు:

**డి.ఎస్.ఎస్.ఆర్. కృష్ణ:** మూడు సంవత్సరాలుగా వీక్షణం పాఠకుడిని. జిల్లాల సమస్యలు ఇంకా ఎక్కువ రావాలి. చందాదారుల్ని పెంచుకోవాలి. మిత్రుల ద్వారా పంపిణీని విస్తృతం చేయాలి. చైతన్యవంతమైన పాఠకుల కోసమే ఉద్దేశించి ఉన్నా సోషల్ మీడియా ద్వారా పత్రిక వ్యాసాల్ని, పుస్తకాల్ని, ప్రచురణల్ని వ్యాప్తి చేయాలి. కాలేజీలు, యూనివర్సిటీల్లో కూడా ఇలాంటి మీటింగ్స్ పెట్టాలి.

**ఉదయమిత్ర:** వీక్షణం రాకముందు మాకు ఇపిడబ్ల్యు అందుబాటులో ఉండేది. విస్తరించడానికి సాహిత్యం, నవలలు, కథలు ఒక పేజీ అయినా పరిచయం చేస్తే బావుంటుంది. ఇపిడబ్ల్యు లాగా చివరి పేజీలో ఒక రచయిత జీవితం, విశేషాలు, ప్రత్యేకతలు వ్యాసాలుగా రాయాలి. అలా ఒక పేజీ సినిమాను గురించి అయినా విశ్లేషిస్తూ వ్యాసాలుంటే బావుంటుంది. రెగ్యులర్‌గా కొందరి రచనలే కాకుండా కొత్త వాళ్లవి రావాలి. అనువాద వ్యాసాలు వేయాలి.

**కె.సి. వెంకటేశ్:** ప్రజల పక్షాన నిలిచే దృక్పథం వీక్షణంది. మిగతా పత్రికలకు వీక్షణానికి స్పష్టమైన బేధముంది. విశ్లేషణ ఉంటుంది. కాని మనం ఏం చేయాలి అనే కర్తవ్యం కూడా తెలిపేట్లు ఉండాలి. ప్రపంచవ్యాప్త పరిణామాలు, సమస్యలు, ఉద్యమాలు, వైఫల్యాలు, మన దగ్గర వాటి ఛాయలు సందర్భోచితంగా వివరించడంలో స్ఫూర్తినిస్తుంది వీక్షణం. ఆత్మ బలిదానాలు ఉధృతంగా జరిగిన తెలంగాణ ఉద్యమ సందర్భాన్ని విశ్లేషిస్తూ వ్యాసాలుండాలి. వ్యాసాల్లో సరళ వాక్యాలుండాలి. వ్యాసాలకు అనుబంధంగా వివరణలూ ఉండాలి. లైబ్రరీల్లో అన్నీ ఆధ్యాత్మిక పుస్తకాలే. ప్రతి లైబ్రరీ, కాలేజీ, స్కూల్ కు వీక్షణం వచ్చేట్లు మనం ప్రయత్నిద్దాం. రీడర్స్ గ్రూప్ ఏర్పడాలి.

**ఎం. వెంకటేశ్వర్లు:** ఇరవై కోట్ల మంది ఉన్న దళితుల సమస్యలపై, ఆదివాసులపై హింస, ముస్లింలపై దాడులు వీటన్నింటిపై దృష్టి పెట్టి వీక్షణంలో వ్యాసాలు వచ్చేలా చూడాలి.

**పి. బిచ్చారెడ్డి:** ఇది ప్రజల, ప్రజాస్వామిక తెలంగాణ కాదు. ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమంపై, కార్యకర్తలపై జరుగుతున్న ప్రభుత్వ హింసను బయటి పత్రికలు కూడా రాస్తున్నాయి. మన పత్రికలో ఇంకా రచనలు రావాలి. జి ఎన్ సాయిబాబాపై పాశవిక నిర్బంధాన్ని మనం గర్హించాలి. కార్పొరేట్ కాలేజీల్లో జరుగుతున్న విద్యార్థుల ఆత్మహత్యలపై విశ్లేషణాత్మక వ్యాసాలు రావాలి.

**ఆదిత్య:** వ్యాసాల్లోని భాష స్పష్టంగా, సరళంగా ఉండాలి. వీక్షణం రెఫరెన్స్ పుస్తకంలా ఉంటుంది. విద్యారంగం-పాఠశాలలు మూతపడే పరిస్థితులు వ్యాసాలు రావాలి.

**ఎస్. ఫరీదా బాను:** విలక్షణమైన పత్రిక. స్థాయి బాగుంది. వ్యాసాలు భిన్నంగా ఉండాలి. సాధారణ పాఠకుల స్థాయిని కూడా దృష్టిలో పెట్టుకోవాలి. విస్తృత ప్రచారం జరగాలి. చిత్రాలు ఉండాలి. మహిళా అంశాలు పెరగాలి. కర్తవ్యం కూడా చూయించాలి.

**పి. సృజన:** పిల్లల్లో శాస్త్రీయ దృక్పథాన్ని పాదుకొల్పేట్లుండాలి. పత్రిక రెగ్యులర్‌గా వస్తున్నందుకు ధన్యవాదాలు.

**కె. శ్రీదేవి:** స్థాయి అందుకోలేనంతగా ఉంది. మేధావులే చదువుతారు అనుకునేదాన్ని. వివిధ స్థాయి పాఠకులుంటారు. లర్నర్స్ కొరకు ఒక పేజీ అయినా ఉండాలి. మహిళా సమస్యలపై కూడా రచనలు ఉండాలి. విద్యార్థులతో రౌండ్ టేబుల్ జరగాలి.

**వామన్ కుమార్:** వ్యాసాలుగానే కాక చిత్రాలు, కథ, కవిత, ఆర్థిక విశ్లేషణ భిన్న రూపాలుగా ఉండాలి. రచనల భాషా స్థాయి సామాన్య పాఠకులకు అర్థమయ్యేట్లుగా ఉండాలి. లేటెస్ట్ ఇష్యూ చాలా బాగుంది. పశువధ ఇష్యూ, మతోన్మాద సమస్య, ఉత్తర భారతంలో బిజెపి వైరివర్గాలుగా చెబుతున్న వాళ్లతో ఎట్లా ఆర్థిక లావాదేవీల్లో ఉందో వివరణాత్మక వ్యాసాలుండాలి.

**యాదగిరి టివివి:** పత్రిక కవర్ పేజీ కలర్‌ఫుల్‌గా ఉండాలి. కొత్త రచయితలకు అవకాశం ఇవ్వాలి. సోషల్ మీడియాలో పత్రిక ప్రచారం జరగాలి. వ్యాసాలతో పాటు కథ, గల్పిక ఉండాలి.

పాఠకుల అభిప్రాయాలపై వీక్షణం సహాయ సంపాదకులు వై. రామచంద్రం వివరణ ఇచ్చారు. ఎ. నర్సింహారెడ్డి పత్రిక పరిమిత వనరులను, ఆర్థిక ఇబ్బందుల్ని వివరిస్తూ పాఠకులుగా, రచయితలుగా పత్రికను కాపాడుకోవాల్సిన బాధ్యతను గుర్తు చేస్తూ సభను ముగించారు. వీ

### ఎంఆర్‌పిఎస్ కురుక్షేత్ర సభకు అనుమతి నిరాకరణ

ఎస్‌సి వర్గీకరణ కోరుతూ మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి (ఎంఆర్‌పిఎస్) జూలై 7న నిర్వహించ తలపెట్టిన 'ఛలో అమరావతి' కార్యక్రమాన్ని పోలీసులు అడ్డుకున్నారు. నాగార్జున యూనివర్సిటీ ఎదుట ఎంఆర్‌పిఎస్ నిర్వహించాలనుకున్న కురుక్షేత్ర సభకు వస్తున్న కార్యకర్తలను అనుమతి లేదనే కారణంతో పోలీసులు ఎక్కడికక్కడ అడ్డుకున్నారు. దీంతో కోపోద్రిక్తులైన కార్యకర్తలు పోలీసుల చర్యలను నిరసిస్తూ పోలీసు వాహనాన్ని తగులబెట్టారు. ప్రకాశం బ్యారేజీ వద్ద చెక్‌పోస్టు ఏర్పాటుచేసి వాహనాల్లో వస్తున్న ఎంఆర్‌పిఎస్ కార్యకర్తలను సభకు రాకుండా అడ్డుకున్నారు. పోలీసుల నిఘాను ఛేదించుకొని వేలాది మంది కార్యకర్తలు జాతీయ రహదారిపై కాజ టోల్ గేట్ వద్ద బైటాయించి రాస్తా రోకో చేశారు. వేలాది మంది కార్యకర్తలు రావడంతో పోలీసులు లాఠీ చార్జీ చేసి నాయకులను అరెస్టు చేశారు.

### వి. చంద్రశేఖరరావు మృతి

ప్రముఖ కథా, నవలా రచయిత డా. వి. చంద్రశేఖరరావు జూలై 8న మృతిచెందారు. గత కొంత కాలంగా గుండె పోటుతో బాధపడుతూ ఆయన హైదరాబాద్‌లోని కేర్ బంజారా ఆస్పత్రిలో చికిత్స పొందుతూ మరణించారు. ఆయన ప్రకాశం జిల్లా మైనంపాడు గ్రామంలో 1959 ఏప్రిల్ 14న పుట్టారు. గుంటూరు మెడికల్ కాళశాలలో ఎం.బి.బి.ఎస్ చదివారు. రెండు దశాబ్దాల పాటు తెలుగు కథను ప్రభావితం చేశారు. ఆయన వెలువరించిన 'జీవని', 'లెనిన్ ప్లేస్', 'మాయా లాంతరు', 'చిట్ట చివరి వీడియో నాటకం', 'ద్రోహ వృక్షం', 'ఆకుపచ్చని దేశం' తదితర పుస్తకాలు విశేష ఆదరణ పొందాయి. మార్క్సిస్టు సిద్ధాంతం నేపథ్యంగా ఆయన కథలు రాశారు. కొన్ని రచనలు సాహితీ ప్రపంచంలో  చర్చకు దారి తీశాయి. ఆయన ఇండియన్ రైల్వేస్‌లో పనిచేసి పదవి విరమణ పొందారు.

### తెలంగాణలో విద్యాసంస్థల బంద్

విద్యారంగ సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ విద్యార్థి సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ జూలై 21న తెలంగాణలోని విద్యా సంస్థల బంద్‌కు పిలుపునిచ్చింది. బంద్ కారణంగా రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న ప్రైవేట్ విద్యాసంస్థలు ముందే మూసివేశారు. ప్రభుత్వ విద్యాసంస్థలను విద్యార్థి సంఘాలు మూసివేయించాయి. రాష్ట్ర వ్యాప్తంగా విద్యార్థి సంఘాల ఐక్య కార్యాచరణ కమిటీ ఆధ్వర్యంలో ర్యాలీలు, ధర్నాలు, ప్రభుత్వ దిష్టి బొమ్మల దహనాలు చేశారు. ప్రభుత్వ విద్యాసంస్థల్లో ఉపాధ్యాయ, అధ్యాపక పోస్టులు ఖాళీగా ఉన్నా భర్తీ చేయడంలేదన్నారు. కెజి టు పిజి అని చెప్పి 4637 ప్రభుత్వ పాఠశాలలను మూసివేసే నిర్ణయాన్ని విరమించుకోవాలన్నారు. పెండింగ్‌లో ఉన్న స్కాలర్‌షిప్‌లు, ఫీజు రీయింబర్స్‌మెంట్ బకాయిలు వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేశారు. ఫీజు నియంత్రణ చట్టం తేవాలని డిమాండ్ చేశారు.

### జి.ఎన్. సాయిబాబాను విడుదల చేయాలి

డా. జి.ఎన్. సాయిబాబాను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ జూలై 15న నెల్లూరు కలెక్టర్ కార్యాలయం ముందు ఆంధ్రప్రదేశ్ ప్రజాస్వామిక వేదిక ఆధ్వర్యంలో ధర్నా నిర్వహించారు. ధర్నాలో పౌరహక్కుల సంఘం, ఎపిటిఎఫ్, డిటిఎఫ్, కెవిపిఎస్, ఎంఆర్‌పిఎస్, ఎఎస్‌ఎ, ఆల్ ఇండియా ఇమామ్స్ కౌన్సిల్, ఒపిడిఆర్, విరసం, పిడిఎస్‌యు తదితర సంస్థలు పాల్గొన్నాయి. దీనికి పోలీసులు పోటీ ధర్నా చేశారు. ధర్నా శిబిరం చుట్టూ మావోయిస్టుల గురించి పోస్టర్లు వేశారు. ఎబివిపి, విశ్వహిందూ పరిషత్ వాళ్లు, కేసులతో స్టేషన్లకు వచ్చేవాళ్లు ధర్నాలో పాల్గొన్నారు. ఈ ధర్నాలో పాల్గొన్న వారు సాయిబాబాను ఉరి తీయాలని, కాలం చెల్లిన కమ్యూనిస్టు సిద్ధాంతాలు వదలాలని నినాదాలు ఇచ్చారు.

### తెలంగాణలో దళితుల బహిష్కరణ

నిజామాబాద్ జిల్లా ఆర్మూర్ మండలం మంథనిలోని 150 దళిత కుటుంబాలను గ్రామ అగ్రకుల పెత్తందార్లు బహిష్కరించారు. ఇదే గ్రామానికి చెందిన దామోదర్ రెడ్డి అనే వ్యక్తి 20 ఏళ్ల క్రితం దళితులకు 24 ఎకరాల భూమిని కానుకగా ఇచ్చారు. ఆ భూమిలో దళితులు పశువులను మేపుకుంటున్నారు. ఆ భూమిని సాగులోకి తెచ్చేందుకు హద్దులు నిర్ణయించుకునే క్రమంలో గ్రామ పెత్తందారులు అడ్డుకున్నారు. అందులో నుంచి పది ఎకరాలు గుడికి ఇవ్వాలని లేకుంటే ఈ భూమి మీకు చెందనీయ మన్నారు. భూమిని ఇవ్వమని దళితులు తెలుపడంతో గ్రామ అభివృద్ధి కమిటీని తెరపైకి తెచ్చి దళితులను అగ్రకులస్తులు గ్రామం నుంచి వెలివేస్తున్నట్లు జూలై 18న తెలిపారు. అప్పటి నుండి దళితులకు చెందిన ఆటోల్లో ఎక్కడం మానేశారు. వ్యవసాయ పనులకు ట్రాక్టర్లు రాకుండా హెచ్చరిస్తున్నారు. పాల కేంద్రాల్లో దళితులకు పాలు పోయడంలేదు. దుకాణాల్లో నిత్యావసర సరుకులు ఇవ్వడంలేదు. గ్రామంలోని కార్యక్రమాలకు ఇతర గ్రామాల నుంచి డప్పులు తెచ్చుకుంటున్నారు.

### ఆక్వా ఫుడ్‌పార్క్‌ను వ్యతిరేకించిన గ్రామస్థులపై దాడి

పశ్చిమ గోదావరి జిల్లా తుందుర్రులో నిర్మిస్తున్న మెగా ఆక్వా ఫుడ్ పార్కుకు యంత్రాలను తరలించేందుకు ముందుగానే జూలై 20న వేలాది మంది పోలీసులు మోహరించారు. ఆక్వా ఫుడ్ పార్క్‌ను వ్యతిరేకిస్తున్న స్థానిక ప్రజలను ముందుగానే అరెస్టులు, లాఠీచార్జీ చేశారు. అరెస్ట్ చేసిన 40 మందిని స్థానిక పోలీసు స్టేషన్లకు తరలించారు. ఆందోళనకారులను అరెస్ట్ చేసి తీసుకెళుతున్న జీపులకు అడ్డంగా మహిళలు బైటాయించారు అయినా వదిలిపెట్టలేదు. మత్స్యపురి నుంచి కంసాలబేతపూడి మధ్య మూడుచోట్ల చెక్‌పోస్టులు ఏర్పాటు చేసి గ్రామంలోకి ఎవ్వరినీ రానీయలేదు. తుందుర్రులో ఇంటికి ఇద్దరు పోలీసులను కాపలా పెట్టి ఆక్వా మెగా ఫుడ్‌పార్క్‌లోకి భారీ యంత్రాలతో కూడిన ఏడు కంటైనర్లను తరలించారు.

### అమరుల బంధు మిత్రుల సంఘం సభ

అమరుల బంధు మిత్రుల సంఘం (ఎబిఎంఎస్) ఏర్పడి జూలై 18 నాటికి 15 సంవత్సరాలు పూర్తి అవుతున్న సందర్భంగా హైదరాబాద్‌లోని సుభాష్ నగర్‌లోని అమరుల స్థూపం వద్ద ఉదయం అమరులను స్మరించుకొని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో మధ్యాహ్నం తరువాత బహిరంగ సభ నిర్వహించారు. వక్తలు మాట్లాడుతూ నక్సల్బరీ స్ఫూర్తిగా విప్లవోద్యమంతో ముందుకు వెళ్లాలన్నారు. ప్రశ్నించే వారిని హతమార్చడమే రాజ్యహింస లక్షణమన్నారు. ఈ సభకు ఎబిఎంఎస్ అధ్యక్షురాలు అంజమ్మ అధ్యక్షత వహించారు. ఈ సభకు రెండు తెలుగు రాష్ట్రాల విప్లవ అభిమానులు, విప్లవోద్యమంలో మరణించిన వారి కుటుంబ సభ్యులు హాజరయ్యారు. వక్తలుగా కేరళ నుంచి రావుణ్ణి, శ్రీదరన్, కళ్యాణ్‌రావు, వరవరరావు, తదితరులు హాజరయ్యారు.

### మూతపడనున్న 5000 ప్రభుత్వ పాఠశాలలు

తెలంగాణలోని ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలను విద్యాశాఖ ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు విలీనం, సర్దుబాటు పేరుతో మూసివేస్తున్నారు. 10 మంది లోపు విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలలను పక్క స్కూళ్లలో విలీనం చేస్తున్నారు. అక్కడి విద్యార్థులను సమీప పాఠశాలలకు తరలిస్తున్నారు. చాలా జిల్లాలో ఈ ప్రక్రియ నడుస్తోంది. సూర్యాపేట జిల్లాలో ఇప్పటికే పూర్తిచేశారు. సర్దుబాటు చేస్తున్నట్లు మరో పది జిల్లాల విద్యాధికారులు జిల్లా స్థాయిలో ఉత్తర్వులు జారీ చేశారు. ఈ సర్దుబాటు ప్రక్రియ ద్వారా ఐదో వంతు పాఠశాలలు మూతపడనున్నాయి. మొదట ప్రాథమిక పాఠశాలల సర్దుబాటు ప్రక్రియ ప్రారంభించారు. వీ

## అమలులోకి వచ్చిన వస్తు, సేవల పన్ను

దేశంలో ఒకే పన్ను విధానాన్ని జూన్ 30న అర్ధరాత్రి కేంద్ర ప్రభుత్వం అమలులోకి తెచ్చింది. పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో రాజకీయ నాయకులు, పారిశ్రామికవేత్తల సమక్షంలో రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ, ప్రధానమంత్రి నరేంద్ర మోడీ వస్తు, సేవల పన్ను విధానానికి ఆమోదం తెలిపారు. ఈ కొత్త పన్నుల విధానం 2017 జూలై 1 నుండి అమలులోకి వచ్చింది. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు విధించే పన్నులన్నింటిని తొలగించి వాటి స్థానంలో కొత్త పన్నుల విధానం అమలులోకి వచ్చింది.

## జిఎస్‌టిని వ్యతిరేకిస్తూ గుజరాత్‌లో సమ్మె

గుజరాత్ ఆర్థిక రాజధాని సూరత్‌లో వస్తుసేవల పన్ను (జిఎస్‌టి)కి వ్యతిరేకంగా జూలై 1 నుండి నిరవధిక సమ్మె కొనసాగుతోంది. సమ్మె కారణంగా టెక్స్‌టైల్ మార్కెట్ మూతబడింది. మిల్లులు, వస్త్ర దుకాణాల మూసివేతతో 15 లక్షల మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. దేశంలోనే అతిపెద్ద టెక్స్‌టైల్ మార్కెట్ అయిన సూరత్‌లో జిఎస్‌టిని కోరుకోవడం లేదని జిఎస్‌టి సంఘర్ష్ సమితి స్పష్టం చేసింది. జూలై 15న గుజరాత్‌లోని వస్త్ర పరిశ్రమ వ్యాపారులు 'జిఎస్‌టి గో బ్యాక్, జిఎస్‌టి నుంచి వస్త్ర పరిశ్రమను మినహాయించాలి' అని అహ్మదాబాద్‌లోని వీథుల్లో ర్యాలీ తీస్తూ నినాదాలు ఇచ్చారు. సేల్స్ ట్యాక్స్ భవన్ వరకు 50 వేల మంది వ్యాపారులు ర్యాలీలో పాల్గొని గుజరాత్ జిఎస్‌టి కమిషనర్‌కు వినతిపత్రం అందజేశారు.

## కొనసాగుతున్న గూర్ఖాలాండ్ ఉద్యమం

ప్రత్యేక గూర్ఖాలాండ్ కోసం డార్జిలింగ్ కొండల్లో నిరవధిక బంద్ జూలై 13 నాటికి 29 రోజులకు చేరుకుంది. ఇదే రోజు డార్జిలింగ్‌లోని గూర్ఖాలాండ్ ప్రాదేశిక పరిపాలన (జిటిఏ) కార్యాలయంతో పాటు, గాయాబారి రైల్వేస్టేషన్, తీస్తా నది సమీపంలోని అటవీ శాఖ బంగ్లాలకు నిప్పు పెట్టారు. పలు ప్రభుత్వ వాహనాలను ధ్వంసం చేశారు. సిఆర్‌పిఎఫ్ శిబిరానికి నీటి సరఫరాను నిలిపివేశారు. మందుల దుకాణాలు తప్ప మిగతావి మూసివేశారు.

## గుజరాత్‌లో దళితులపై కాల్పులు

నాగ్‌పూర్‌లోని కటోల్ ప్రాంతానికి చెందిన సలీమ్ ఇస్మాయిల్ బైక్‌పై ఇంటికి వెళుతున్నాడు. జూలై 12న భర్సింగి గ్రామ బస్‌స్టేషన్ వద్ద అతన్ని హిందుత్వవాదులు అడ్డగించి బైక్ డిక్కీలో బీఫ్ తరలిస్తున్నావంటూ నిలదీశారు. అది బీఫ్ కాదని ఇస్మాయిల్ ఎంత చెప్పినా వినకుండా తీవ్రంగా కొట్టారు. దీంతో తీవ్ర గాయాలై ఇస్మాయిల్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. ఇదే రోజు ద్వారక జిల్లాలోని మేవాసా గ్రామంలో 32 ఎకరాల భూమిని కొందరు దళితులు కొనుగోలు చేసి సాగు చేసుకుంటున్నారు. కాగా ఆ భూమిని వదులుకోవాలంటూ వారిపై మష్రీ గదేర్ అనే వ్యక్తి ఒత్తిడి చేశాడు. దళితులు వ్యవసాయ పనుల్లో నిమగ్నమై ఉండగా, దాదాపు 30 మందిని తీసుకుని గదేర్ అక్కడకు వెళ్లాడు. ఈ క్రమంలో ఇరువర్గాల మధ్య వాగ్వివాదం జరిగింది. ఇంతలో గదేర్, అతడి మనుషులు దళితులపై కాల్పులు జరిపారు. ఈ ఘటనలో నలుగురికి తీవ్ర గాయాలయ్యాయి. ప్రస్తుతం వారు జామ్నానగర్‌లోని జిజి ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. ఈ కేసులో నిందితులను అరెస్ట్ చేసినట్లు డిఎస్‌పి రమేశ్ పటేల్ వెల్లడించారు.

## ఢిల్లీ జంతర్ మంతర్‌లో తమిళ రైతుల ధర్నా

అన్న దాతలు కష్టాల కడలిలో ఈదుతుంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పట్టించుకోవడంలేదని తమిళ రైతులు జూలై 20న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద ధర్నా చేశారు. తమిళనాడులో ఎంఎల్‌ఏల జీతాలను నెలకు 55 వేల నుంచి 1.05 లక్షలకు పెంచుకున్నారని తమ సమస్యను పట్టించుకోవట్లేదని తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. జంతర్ మంతర్‌లో మలి దశ ఉద్యమం చేపట్టిన తమిళ రైతులు చెప్పులతో కొట్టుకొని వినూత్న పద్ధతిలో నిరసన తెలిపారు.

## యు.ఆర్. రావు మృతి

ప్రముఖ శాస్త్రవేత్త ప్రొఫెసర్ ఉడిపి రామచంద్రరావు జూలై 24న మృతిచెందారు. 1984-94 మధ్య ఆయన ఇస్రోకు చైర్మన్‌గా ఉన్నారు. ప్రస్తుతం ఫిజికల్ రిసెర్చ్ ల్యాబొరేటరీ పరిపాలనా విభాగం చైర్మన్‌గాను, తిరువనంతపురంలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీకి చాన్సలర్‌గా వ్యవహరిస్తున్నారు. శాస్త్రవేత్తగా ఆయన 10 అంతర్జాతీయ అవార్డులను అందుకున్నారు. 2017 జనవరిలో ఆయన పద్మ విభూషన్ అవార్డును అందుకున్నారు.

## రాష్ట్రపతిగా రామ్‌నాథ్ కోవింద్

భారత 14వ రాష్ట్రపతిగా ఎన్‌డిఏ అభ్యర్థి రామ్‌నాథ్ కోవింద్ ఎన్నికయ్యారు. జూలై 17న రాష్ట్రపతి ఎన్నికకు జరిగిన పోలింగ్‌లో కోవింద్‌కు 2930 ఓట్లు పోలవగా వాటి విలువ 7,02,044, మీరాకుమార్‌కు 1844 ఓట్లు పోలవగా వాటి విలువ 3,67,314 ఓట్లు. కోవింద్ 3.34 లక్షల ఓట్లతో గెలిచారు. జూలై 25న పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో జరిగిన కార్యక్రమంలో కోవింద్‌తో సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ జె.ఎస్. ఖేహార్ ప్రమాణస్వీకారం చేయించారు. ఈ కార్యక్రమానికి మాజీ రాష్ట్రపతి ప్రణబ్ ముఖర్జీ, ఉప రాష్ట్రపతి హమిద్ అన్సారీ, లోక్‌సభ స్పీకర్ సుమిత్రా మహాజన్, ప్రధాని నరేంద్రమోడీ, పలువురు కేంద్ర మంత్రులు హాజరయ్యారు.

## బీహార్‌లో మారిన రాజకీయ సమీకరణలు

బీహార్ ముఖ్యమంత్రి నితీష్ కుమార్ ఆర్‌జెడిల మధ్య ఏర్పడిన అవినీతి ఆరోపణల నేపథ్యంలో నితీష్ కుమార్ మహాకూటమి నుండి వైదొలిగి జూలై 26న ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. అదే రోజు బిజెపి రాష్ట్ర శాఖ అధ్యక్షుడు సుశీల్ కుమార్ మోదీ నితీష్ కుమార్‌కు మద్దతు తెలుపుతూ గవర్నర్‌కు లేఖ అందించారు. ఈ పరిణామాలన్నీ బిజెపి కుట్రేనని ఆర్‌జెడి నేత లాలూ ప్రసాద్ యాదవ్ విమర్శించారు. జూలై 27న రాజ్‌భవన్‌లో గవర్నర్ కేసరినాథ్ త్రిపాఠి నితీష్ కుమార్‌తో ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు. సుశీల్ కుమార్‌తో మంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు. వీ

## సిరియాలో బాంబు పేలుళ్లు

సిరియా రాజధాని డమాస్కస్‌లో జూలై 2న కారు బాంబు పేలుళ్లు జరిగాయి. ఈ పేలుళ్లలో పంతొమ్మిది మంది మరణించారు. కార్లలో వచ్చిన ఆత్మాహుతి బాంబర్లు భారీ పేలుడు సామగ్రితో గుంపులుగా ఉన్న ప్రాంతాలలో దాడిజరిపారు. రంజాన్ పండుగ సెలవులు ముగిసి ప్రభుత్వ, ప్రైవేట్ కార్యాలయాలు దేశవ్యాప్తంగా తెరుచుకోవడంతో జనసమ్మర్థంగా ఉన్న ప్రాంతాలను లక్ష్యంగా చేసుకొని తీవ్రవాదులు ఈ పేలుళ్లకు పాల్పడ్డారు.

## ఇయు - జపాన్ మధ్య వాణిజ్య ఒప్పందం

అతిపెద్ద ఆర్థిక వ్యవస్థల్ని కలిగిన యూరోపియన్ యూనియన్ (ఇయు), జపాన్‌ల మధ్య స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం కుదిరింది. జూలై 6న బ్రస్సెల్స్‌లో జరిగిన సమావేశంలో జపాన్ ప్రధాని షింజో అబబే, ఇయు అధ్యక్షుడు జీన్ క్లాడ్ జంకర్ మధ్య ప్రాథమిక అంశాలపై అవగాహన ఒప్పందంపై సంతకాలు చేశారు. ఈ ఒప్పందం ప్రకారం ఇయు-జపాన్ మధ్య ఎలాంటి అడ్డంకులు లేకుండా వస్తు సరఫరాకు, వాణిజ్య వ్యాపారాలకు అవకాశం ఉంటుంది. జపాన్ కార్లు యూరప్ మార్కెట్లో అమ్ముకోవడానికి, ఇయు వ్యవసాయ ఉత్పత్తులు జపాన్‌లో అమ్ముకోవడానికి అంగీకారం కుదిరింది.

## జి-20 సదస్సు

జి-20 దేశాల సదస్సు జర్మనీలోని హాంబర్గ్ నగరంలో జూలై 7-8 తేదీల్లో జరిగింది. ఈ సదస్సులో వాతావరణ మార్పు, తీవ్రవాదం, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ వృద్ధి, అంతర్జాతీయ వాణిజ్యం, ఆర్థిక మార్కెట్ నియంత్రణ, వలసలు, డిజిటైజేషన్, ఆరోగ్యం, మహిళల ఆర్థిక సాధికారత, అభివృద్ధి సహాయం వంటి అంశాలపై దృష్టి సారించారు. జూలై 7న టెర్రరిజం, పారిస్ ఒప్పందం నుంచి అమెరికా నిష్క్రమణ, స్వేచ్ఛా వాణిజ్యంపై చర్చలు జరుగగా, జూలై 8న ఆఫ్రికా దేశ పరిస్థితులపై చర్చ జరిగింది. ఈ సమావేశానికి అర్జెంటినా, ఆస్ట్రేలియా, కెనడా, చైనా, ఫ్రాన్స్, జర్మనీ, భారత్, ఇండోనేషియా, ఇటలీ, జపాన్, మెక్సికో, రష్యా, దక్షిణ ఆఫ్రికా, కొరియా, టర్కీ, యూనైటెడ్ కింగ్‌డమ్, అమెరికా దేశాల అధినేతలు, యూరోపియన్ యూనియన్ నేతలు హాజరయ్యారు. బ్రెజిల్ అధ్యక్షుడు మైకెల్ ట్రెమర్ ఈ సదస్సుకు హాజరు కాలేదు. సౌదీ అరేబియా నుంచి ఆ దేశ మంత్రి ఇబ్రహీం అబ్దుల్ అజీజ్ అల్ అసఫ్ హాజరయ్యారు. ఈ సదస్సుకు వ్యతిరేకంగా ప్రజలు తీవ్ర నిరసన తెలిపారు. ప్రపంచీకరణకు వ్యతిరేకంగా జూలై 7న జరిగిన ఈ సరసన ప్రదర్శనలో లక్షమందికి పైగా ప్రజలు పాల్గొన్నారు. ప్రదర్శనకారుల్ని చెదరగొట్టడానికి పోలీసులు తీవ్ర అణచివేతను ప్రయోగించారు.

## తైవాన్-అమెరికా ఆయుధ ఒప్పందం

అమెరికా - తైవాన్ మధ్య ఆయుధ ఒప్పందం కుదిరింది. ఇందులో భాగంగా అమెరికాతో 1.4 బిలియన్ డాలర్ల ఆయుధాల్ని అమెరికా తైవాన్‌కు అమ్మనున్నది. ఈ ఒప్పందంలో భాగంగా తైవాన్‌కు ముందస్తు హెచ్చరికలు చేసే రాడార్స్, రేడియేషన్‌ను అడ్డుకునే క్షిపణులు, టోర్నెండో, ఎస్ఎం-2 క్షిపణులు మొదలైనవి అందుతాయి. వాటికి సాంకేతిక సాయం, నిర్వహణ కూడా అమెరికానే భరిస్తుంది. తైవాన్ చైనా అంతర్భాగం అయినప్పటికీ స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉన్న దేశం. ఈ ఒప్పందంపై చైనా తీవ్ర అభ్యంతరాన్ని ప్రకటించింది.

## బ్రెగ్జిట్ చర్చలు ప్రారంభం

బ్రిటన్ - ఇయు కూటమి తుది చర్యలు జూలై 17న బ్రస్సెల్స్‌లో జరికాయి. ఈ చర్చలకు బ్రిటన్ మంత్రి డేవిడ్ డేవిస్, ఇయు ప్రధాన ప్రతినిధి మైఖేలే బార్నియర్ నేతృత్వం వహించారు. షెడ్యూర్ ప్రకారం 2019 నాటికి ఇయు నుంచి బ్రిటన్ అధికారికంగా వైదొలుగుతుంది. ఈ నేపథ్యంలో పౌరుల హక్కులు, ఎగ్జిట్ బిల్, వాణిజ్యం తదితర అంశాలపై ఇయుతో ఒప్పందం కుదుర్చుకోవాల్సి ఉంటుంది. వంద బిలియన్ యూరోలు ఇయుకు చెల్లించడం, ముప్పై లక్షల మంది ఇయు దేశాల పౌరుల హక్కులు, ఉత్తర ఐర్లాండ్‌తో సరిహద్దు అనేవి చర్చల్లో తేలాల్సిన కీలక అంశాలు.

## ఫిలిప్పైన్స్‌లో నిరసన ప్రదర్శనలు

ఫిలిప్పైన్స్ రాజధాని మనీలాలో అధ్యక్షుడు రోడ్రిగో డ్యుటెర్టేకు వ్యతిరేకంగా ప్రజలు జూలై 24న భారీ ప్రదర్శన నిర్వహించారు. రాజధాని వీధుల్లోకి వేలాదిగా ప్రజలు క్వేజాన్ నగరం నుంచి దిగువ సభ వరకు భారీ నిరసన ప్రదర్శనలు చేశారు. రోడ్రిగో ఏడాది పాలనలో మానవహక్కుల ఉల్లంఘనలు పెరిగిపోయాయనీ, అధ్యక్షుడిగా బాధ్యతలు చేపట్టినపుడు మార్క్సిస్ట్ గెరిల్లాలతో శాంతి చర్చలు జరుపుతానన్న మాటను నిలబెట్టుకోలైదనీ విమర్శించారు.

## పాకిస్తాన్‌లో ఆత్మాహుతి దాడి

పాకిస్తాన్‌లోని పంజాబ్ రాజధాని లాహోర్‌లో ముఖ్యమంత్రి షాబాజ్ షరీఫ్ నివాసానికి దగ్గరగా జూలై 24న ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో ఇరవై మంది చనిపోగా, ముప్పై మంది గాయపడ్డారు. షాబాజ్ నివాసానికి సమీపంలో ఉన్న రద్దీ మార్కెట్‌లో ఈ పేలుడు జరిగింది. పోలీసులే లక్ష్యంగా ఈ దాడి జరిగింది. భారీ పేలుడు సంభవించడం వల్ల ప్రాణ నష్టం అధికంగా జరిగింది.

## ఈజిప్ట్‌లో భీకర యుద్ధం

ఈజిప్ట్‌లో సైన్యానికి, ఐఎస్ఐఎస్ దళాలకు తీవ్ర పోరు నడుస్తోంది. ఉత్తర సినాయ్ ద్వీపకల్పంలో సైన్యం జరిపిన దాడుల్లో నలభై మంది వరకు ఇస్లామిక్ స్టేట్ సభ్యులు మరణించారు. దీనికి ప్రతికారంగా ఐసిస్ సభ్యులు కారు బాంబు దాడులతో దాడి చేశారు. ఈ దాడిలో ఇరవై ఐదు మందికి పైగా సైనికులు మృతిచెందారు.

## యెమెన్‌లో సంక్షోభం

యెమెన్ తీవ్ర సంక్షోభంతో కొట్టుమిట్టాడుతోంది. అంతర్యుద్ధం కారణంగా వేలాది మంది పౌరులు మరణిస్తున్నారు. లక్షలాదిగా వలసపోయారు. యెమెన్‌లో నివాసం ఉంటున్న వారి పరిస్థితి అతి దారుణంగా మారింది. దాదాపు మూడు లక్షల మందికి పైగా కలరా సోకిందని ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల విభాగం తెలిపింది. అమెరికా మద్దతుతో పనిచేస్తున్న సౌదీ అరేబియా దళాలు అక్కడ నౌకా, విమాన రాకపోకల్ని పూర్తిగా రద్దు చేశాయి. దీంతో విదేశాల నుంచి అందాల్సిన సహాయ కార్యక్రమాలకు తీవ్ర అంతరాయం కలుగుతోంది. బయటి నుంచి వచ్చి మానవతా సహాయ కార్యక్రమాలు నిర్వహించకుండా ప్రభుత్వం కఠినమైన నిర్బంధాలు ఏర్పరిచింది. ఈ నిర్బంధించిన ప్రజలను వెంటనే కలరా బారినుండి కాపాడుకోవాలని ఐక్యరాజ్య సమితి ప్రపంచ దేశాలకు విజ్ఞప్తి చేసింది.

## మోసుల్ స్వాధీనం

ఇరాక్ సంకీర్ణ దళాలు మోసుల్ నగరాన్ని తమ అదుపులోకి తీసుకున్నాయి. ఇది ఇస్లామిక్ స్టేట్ దళాలకు అత్యంత పట్టున్న నగరం. అయితే ఈ నగరాన్ని స్వాధీనం చేసుకోవడానికి అమెరికా, దాని మిత్రదేశాల సంకీర్ణ దళాలు భారీ ఎత్తున దాడులు నిర్వహించాయి. ఈ దాడుల వల్ల మోసూల్ నగరం అధిక శాతం ధ్వంసమైంది. భారీ సంఖ్యలో సామాన్య పౌరులు తమ ప్రాణాలు కోల్పోయారు. పెద్ద సంఖ్యలో ప్రజలు నివాసం ఉండే ప్రాంతాలపై సంకీర్ణ దళాలు భారీ బాంబు దాడులు చేశాయి. మోసూల్‌లోని అత్యధిక జనాభా ఉండే పాతబస్తీ పూర్తిగా ధ్వంసమైంది. వేల సంఖ్యలో ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. దానికి రెట్టింపు సంఖ్యలో తీవ్రంగా గాయపడ్డారు. భారీ ఆస్తి నష్టం జరిగింది. ఇరవై లక్షల మందికి పైగా తమ నివాస స్థలాలను వదిలి సురక్షిత ప్రాంతాలకు తరలిపోయారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జూన్ 1 నుండి జూన్ 30, 2017 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (961), ఆంధ్రప్రదేశ్‌లోని 12 జిల్లాలలో (785) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1746)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 2 | – | 24 | 30 | 12 | 9 | 4 | 3 | 2 | 1 | 2 | 2 | 3 | 32 | 29 | – | – | – | 4 | 2 |
| హైదరాబాద్ | – | – | – | 9 | 10 | 1 | 5 | 1 | 1 | 1 | 2 | 1 | 3 | 5 | 22 | 10 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 1 | 1 | 4 | 12 | 2 | 3 | 2 | – | – | 2 | 3 | 4 | 7 | 21 | 11 | – | – | – | – | 6 |
| ఖమ్మం | – | 3 | – | 6 | 6 | 1 | 4 | 3 | – | 1 | 2 | – | – | 2 | 20 | 13 | – | – | – | – | 1 |
| మహబూబ్‌నగర్ | – | 2 | – | 13 | 10 | 6 | 8 | 5 | 3 | 3 | 6 | 6 | 10 | 10 | 55 | 2 | – | – | – | – | 8 |
| మెదక్ | – | 24 | – | 6 | 9 | 4 | 9 | 3 | 13 | 12 | 12 | 14 | 26 | 29 | 42 | 22 | – | – | 1 | 4 | 2 |
| నల్గొండ | – | 4 | – | 2 | 3 | 1 | 4 | – | – | – | 3 | 1 | – | 3 | 18 | 14 | – | – | – | – | 4 |
| నిజామాబాద్ | – | – | – | 5 | 4 | – | 1 | 3 | – | 1 | 1 | 2 | – | 2 | 13 | 9 | – | – | – | – | 3 |
| వరంగల్ | – | 7 | – | 7 | 16 | – | 1 | 1 | – | 1 | 2 | 4 | – | 2 | 14 | 9 | – | – | – | – | 3 |
| వికారాబాద్ | – | 2 | – | 2 | 1 | 2 | 1 | 1 | – | – | – | – | – | 3 | 16 | 11 | – | – | – | – | 2 |
| **తెలంగాణ** | **-** | **45** | **1** | **78** | **101** | **29** | **45** | **23** | **20** | **21** | **31** | **33** | **45** | **66** | **253** | **130** | **-** | **-** | **1** | **8** | **31** |
| అనంతపురం | – | 5 | – | 15 | 23 | 4 | 3 | 2 | 1 | 3 | 7 | 3 | 5 | 6 | 40 | – | – | – | – | 1 | – |
| చిత్తూరు | – | – | – | 4 | 6 | 3 | 6 | – | 4 | 3 | 9 | 11 | 10 | 3 | 34 | – | – | – | – | – | – |
| కడప | – | 2 | – | 4 | 5 | – | – | – | 1 | 2 | 1 | – | – | 4 | 8 | 8 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 4 | 4 | 2 | 3 | – | 1 | 2 | 4 | 2 | – | 7 | 17 | 8 | – | – | – | – | 2 |
| కృష్ణా | – | 1 | – | 2 | 6 | – | – | – | – | 1 | 1 | 4 | – | 1 | 21 | 12 | – | – | – | – | – |
| కర్నూలు | | | | | | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | |
| తూర్పు గోదావరి | - | - | - | 1 | 4 | 1 | 2 | 2 | – | 6 | 3 | 3 | 3 | 2 | 20 | 23 | – | – | – | – | 5 |
| ప్రకాశం | – | 1 | – | 5 | 7 | – | 2 | – | – | 1 | 2 | 6 | – | 1 | 18 | 13 | – | – | – | – | 2 |
| శ్రీకాకుళం | – | – | – | 4 | 1 | 9 | 7 | 1 | – | 1 | 1 | 1 | 2 | 7 | 32 | 8 | – | – | – | – | 7 |
| పశ్చిమ గోదావరి | – | – | – | 4 | 4 | – | 1 | – | – | 1 | – | 1 | 1 | 8 | 22 | 7 | – | – | – | – | 1 |
| నెల్లూరు | – | – | – | 3 | 7 | – | 2 | – | – | 3 | 1 | – | 3 | 3 | 23 | 9 | – | – | – | – | 7 |
| విజయనగరం | – | – | – | 1 | 1 | 3 | 3 | 1 | – | 2 | 4 | – | 1 | 5 | 19 | 7 | – | – | – | – | 4 |
| విశాఖపట్నం | – | – | – | 5 | 10 | 4 | 2 | 2 | – | 3 | 1 | 1 | 2 | 5 | 10 | 9 | – | – | – | 3 | – |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **10** | **-** | **52** | **78** | **26** | **31** | **8** | **7** | **28** | **34** | **32** | **27** | **52** | **264** | **104** | **-** | **-** | **-** | **4** | **28** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 193 - August 2017 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482 • Published on 27/07/2017 • Postal Regn. No. L II/RNP/HD/1100/2017-19




# తెలంగాణ అభివృద్ధి ఫలాలు..
# ఇంటింటికి చేరే వెలుగు దివ్వెలు

## సంక్షేమంలో సువర్ణాధ్యాయం

శాంతియుత పోరాటం ద్వారా తెలంగాణ సాధించి, తొలి ముఖ్యమంత్రిగా
బాధ్యతలు చేపట్టిన శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు గారి
నాయకత్వంలో తెలంగాణ రాష్ట్రం ప్రగతిపథంలో పరుగులు తీస్తున్నది.
వినూత్న కార్యక్రమాలతో యావత్ దేశం దృష్టినీ ఆకర్షిస్తున్నది.




మాతా శిశు సంరక్షణకు
కేసీఆర్ కిట్స్


ఒంటరి మహిళలకు నెలకు
రూ.1000/- భృతి పంపిణీ కార్యక్రమం


ఎకరానికి రూ.8 వేల చొప్పున
వ్యవసాయ పెట్టుబడి


మిషన్ భగీరథ


కోటి ఎకరాలకు సాగునీరు
(మిషన్ కాకతీయ)


డబుల్ బెడ్ రూమ్ ఇండ్లు


నిరంతర విద్యుత్ సరఫరా


కళ్యాణలక్ష్మి


షాదీ ముబారక్


వరల్డ్ బెస్ట్ ఇండస్ట్రియల్ పాలసీ
ఐటీ రంగంలో అగ్రగామి


గ్రామీణ ఆర్థిక వ్యవస్థ పరిపుష్టం


తెలంగాణకు హరిత హారం


సమర్థ వంతంగా
శాంతి భద్రతల నిర్వహణ


ఎస్సి, ఎస్టీల కోసం ప్రగతి నిధి


మైనారిటీ సంక్షేమానికి
అత్యధిక ప్రాధాన్యం


అమరవీరుల కుటుంబాలకు
కుటుంబానికి 10 లక్షల సహాయం.
కుటుంబంలో ఒకరికి ఉద్యోగం.


కొత్తగా 510
రెసిడెన్షియల్ స్కూళ్ళు


తల్లి బిడ్డలకు ఆరోగ్య లక్ష్మి


ఉచిత ప్రమాద జీవిత బీమా
భవన నిర్మాణ కార్మికులకు, డ్రైవర్లకు, హోంగార్డులకు,
జర్నలిస్టులకు ఐదు లక్షల రూపాయల


చరిత్రలో లేని విధంగా
ఎం.బి.సి.ల కోసం
రూ.1000 కోట్లతో కార్పోరేషన్


కాంట్రాక్టు లెక్చరర్లు,
అంగన్వాడీ టీచర్లు, 108 ఉద్యోగుల,
ఉపాధి హామీ పథకం


బ్రాహ్మణుల, న్యాయవాదుల,
జర్నలిస్టుల సంక్షేమం


ప్రభుత్వ ఆసుపత్రుల నుంచి పేదల
మృత దేహాలను స్వస్థలాలకు చేర్చేందుకు
పరమపద వాహనాలు

**40 వేల కోట్లతో
35 సంక్షేమ
పథకాలు**

**మన తెలంగాణ - మన ప్రభుత్వం - మన పాలన**

Date of Posting : 29th, 30th
RO No. 2/Emp-Mag/Advt./2017-18/32

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao